# శ్రీరామకృష్ణుని జీవితచరిత్ర

(మూలవంగగ్రంథముల ననుసరించి రచితము)

## ఉపదేశ సహితము

...ఈ సచ్చరిత్ర చదువువారికెల్లరకును ఈయన దివ్యప్రేమ దివ్యాశయ ప్రేరకమై దీపించుఁగాక! (ఆంగ్లచరిత్రకు పీఠికలో)

—మహాత్మా గాంధి


రచయిత, ప్రకాశకుఁడును:

చిరంతనానందస్వామి

# శ్రీ రామకృష్ణుని జీవితచరిత్ర

(మూలవంగగ్రంథముల ననుసరించి రచితము)

## ఉపదేశ సహితము

రామకృష్ణుఁడు సజీవాకృతి దాల్చిన
దివ్యత్వము.... ఈ సచ్చరిత్ర చదువువారి
కెల్లరకును ఈయన దివ్యప్రేమ దివ్యాశయ
ప్రేరకమై దీపించుఁగాక!

(ఆంగ్లచరిత్రకు పీఠికలో)—మహాత్మాగాంధి



పీఠికారచయిత :

శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రి

గ్రంథరచయిత, ప్రకాశకుఁడును :

చిరంతనానందస్వామి

ఆంధ్ర విశ్వవిద్యాలయమున (1960-వ సం॥) బి.ఏ. పరీక్షకును, మద్రాసు, మైసూరు, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయములలో (వరుసగా '60, '61, '61-వ సం॥) మూఁడేండ్ల పట్టపరీక్షలకును ఉపపాఠ్యగ్రంథము

మలికూర్పు — 1958 — 3100 ప్రతులు — సర్వస్వామ్యసంకలితము

ప్రతులకు ఇట్లుః వ్రాయుఁడు :
చిరంతనానందస్వామి
శ్రీమవరము, పశ్చిమ గోదావరి జిల్లా
మరియు
(వెంకట్రామ అన్డ్ కంపెనివారి అన్నిశాఖలలోను, ఇతర పుస్తక విక్రేతల యొద్దను ఈ గ్రంథప్రతులు దొరకును.)

వెల : రూ. 2/75 మాత్రమే

ముద్రణ : లిబర్టీ ముద్రణాలయము, మద్రాసు - 1



శ్రీరామకృష్ణ పరమహంస (భావసమాధిస్థితిలో)

శ్లో. పవిత్రం చరితం యస్య పవిత్రం జీవనం తథా,

పవిత్రతా స్వరూపాయ నమస్తస్మై నమోనమః.

శ్రీ గదాధరుని (శ్రీరామకృష్ణుని) సంతకము—నకలు

(శ్రీ గదాధర చట్టోపాధ్యాయ, సాకిన్, కామార్పుకుర్)



శ్రీ విజ్ఞానానందస్వామి

శ్రీరామకృష్ణుల ప్రియశిష్యులు, ఏప్రిల్ 1937 నుండి ఏప్రిల్ 1938 వఱకు శ్రీరామకృష్ణమఠ సేవాసంఘాధ్యక్షులు, ఈ గ్రంథకర్తయొక్క గురువు

# సవరణలు

(వేఱుగా ౨౮-వ పుటలో నున్న సవరణపట్టిక యిందుఁ జేర్పఁబడినది.)

| పుట | పంక్తి | | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|---|
| 5 | 17,18 | | శుఖ | సుఖ |
| 263 | 5-6 | | ప్రయత్నంచి | ప్రయత్నించి |
| 291 | శీర్షిక | | కాంచనాది విషయ విముఖత్వము | సంకీర్తనానంద పారవశ్యము |
| 293 | 11 | | వేదాంతి | వేదాంతి; |
| 327 | 20 | | నుం: | నుండి |
| 365 | 16 | గైకొనుము, అనుమాట తరువాత ఇదిగో, నీ పుణ్యము;... అనియు, 16-17 పంక్తులలోని గైకొనుము, అనుమాట తరువాత ఇదిగో, నీ అధర్మము; అనియుఁ జేర్చుకోవలెను. | | |
| 366 | 19 | | దుస్సాధ్య | దుస్సాధ |
| 370 | 17 | | గోలాం | గోలాప్ |
| 373 | 4 | | దేవత | దేవర |
| 376 | 18 | | పరిపూర్ణైకా | పరిపూర్ణైక్య |
| 380 | 22 | | చున్నటు | చున్నట్టు |
| 391 | 24 | | సితుఁడై | స్థితుఁడై |
| 411 | 5 | | , | , నరేంద్రుఁడు |
| 433 | 1 | | $34^{1}$ | 34′. |
| 433 | 24 | (మొదటి వరుస) | 27 | 274 |
| 439 | 9 | ,, | 264 | 265 |
| ,, | 14 | ,, | 266 | 267 |
| ,, | 28 | ,, | 336 | 338 |
| ,, | 7 | (రెండవ వరుస) | 283 | 284 |
| ,, | 8 | ,, | 410 | 416 |
| 440 | 18 | ,, | 337 | 335,337,368-9 |
| 442 | 3,4 | (మొదటి వరుస) | మహాజనవాణి, ౨౦-౩౫ | వివేకానందవాణి, ౨౫-౭ |
| ,, | 11 | ,, | 290 | 290-2 |

| పుట | పంక్తి | | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|---|
| 442 | 24 | (మొదటి వరుస) | 394 | 390 |
| ,, | 8 | (రెండవ వరుస) | 384 | 390 |
| ,, | 28 | ,, | 287 | 288 |
| 443 | 14 | (మొదటి వరుస) | 397 | 403 |
| ,, | 20 | ,, | 23 | 22 |
| ,, | 11 | (రెండవ వరుస) | 265 | 265,364-5 పాదటీకలు |
| 444 | 22 | (మొదటి వరుస) | 362 | 366-7 |
| ,, | 3 | (రెండవ వరుస) | 368 | 367 |
| 445 | 4 | (మొదటి వరుస) | 265-278-9,356; | 265,278-9, 356, 364-5, పాదటీకలు |
| ,, | 7 | ,, | 363 | 368 |
| ,, | 9 | ,, | 379 | 380 |
| ,, | 23 | ,, | 378 | 379 |
| 446 | 7 | ,, | 281,291-3, 312-3 | 282-3,290, 293-5,314 |
| ,, | 15 | ,, | 376 | 375 |
| ,, | 22 | ,, | 92, | 92,138-9 |
| ,, | 27 | ,, | 23 | 22 |
| ,, | 6-7 | (రెండవ వరుస) | మహాజనవాణి, ౨౧,౨౬ | దీనినిగూర్చి వివేకానందవాణి, ౨౬ |
| ,, | 11-12 | ,, | ,, ౨౨ | ,, ౨౫-౭, పీఠిక, ౧౦ |
| ,, | 17 | ,, | 264 | 265 |
| 447 | 9 | (మొదటి వరుస) | 253- | 254- |
| 448 | 13 | ,, | 265 | 266 |
| ,, | 18 | (రెండవ వరుస) | 281-2 | 282-4 |
| ,, | 22 | ,, | 246-7 | 247 |
| 449 | 11 | ,, | 379 | 383 |

# ప్రస్తావన

శ్రీరామకృష్ణుని దివ్యజీవితచరిత్ర నెట్లు వ్రాయవలయునో తెలుపుచు, ఆతని శిష్యులలో అగ్రగణ్యుఁడగు శ్రీవివేకానందస్వామి లోకమునకు మేలుకొలుపు అనఁదగు తన లేఖలలో నిట్లు వ్రాసియున్నాఁడు: "శ్రీరామకృష్ణుఁడు లోకమున కేమి బోధించెనో, అందులకు నిదర్శనమగు నాతని చరిత్ర మెట్టిదో తెలుపుటయే (శ్రీరామకృష్ణ జీవితచరిత్ర రచనమున) నీ ముఖ్యాశయమై యుండవలయును. అనర్హుఁడనైనను నా యధీనమునం దుంపఁబడిన రత్నపేటికను వెలికిఁ గొనివచ్చి మీకు అందఁజేయుటయే నా కాతఁ డొసఁగిన యాజ్ఞ. పేరు ప్రతిష్ఠల నిమిత్తముకాక లోకకల్యాణమునకై శ్రీరామకృష్ణుఁడు ఆవిర్భవించెనని సదా జ్ఞప్తి నుంచుకొనుఁడు. ఆతఁడు దేనిని బోధింప నావిర్భవించెనో దానినే వ్యాప్తిచేయుఁడు. ఆయన పేరునుగూర్చి మీరు తాపత్రయపడ నక్కఱలేదు—దానంతట నదియే వ్యాపించును. మీ గురువును ప్రతివ్యక్తియు (భగవదవతారమని) అంగీకరింపవలయునని పట్టుదల చూప నారంభించినంతనే యొక శాఖను సృష్టించినవా రగుదురు—కావున జాగ్రత్త!" "రామకృష్ణపరమహంస అవతారమూర్తి యనియు మఱి యేమేమో అనియు మీరు ప్రచారము చేయనక్కఱ లేదు. లోకకల్యాణమునకై యాతఁడు ఆవిర్భవించెను—తనపేరు చాటుకొనుటకుఁ గాదు—ఈ సంగతి సదా మీరు జ్ఞప్తి నుంచుకొనవలయును. తమ గురుని బోధలను గంగలోఁ గలిపి శిష్యు లాతని పేరు నిలువఁబెట్టుటకై ప్రాఁకులాడుచుందురు—ఫలిత మేమి?—స్వమతదురభిమానములు." "ఆయన భక్తిజ్ఞానములను, ఆయన యుపదేశములను, సర్వమతములనుండియు పరమధర్మములను గ్రహించునట్టి యాయనతత్త్వము మున్నగు విషయములను అనువదింపఁదగును. విషయ మిది. శ్రీరామకృష్ణుని జీవితము దివ్యజ్యోతి, తదీయ తేజఃప్రసారమున సనాతనధర్మ పరమావధి నంతయు, సనాతన

ధర్మపరమాదర్శముల నన్నిఁటిని యథారూపమున గ్రహింపనగును. శాస్త్రములలోని ఔపపత్తిక జ్ఞానమున కంతకును అతఁడే ప్రత్యక్ష నిదర్శనము. ఋషులును అవతారమూర్తులును నిజముగా వేనిని బోధింప నెంచిరో ఆ తత్త్వముల నన్నిఁటిని ఈతఁడు తన జీవితముచేఁ బ్రకటించెను. మతగ్రంథములు వాదమాత్రములు. ఈతఁడో, తదీయాచరణము, అనుభవము. ఈ పురుషుఁడు తన యేఁబదియేండ్లలోనే పంచసహస్రవర్ష పర్యంతమగు భారతజాతీయ పారమార్థిక జీవితము నంతయు జీవించి భావిసంతతికి ఆదర్శమై యొప్పెను. ద్వైతము విశిష్టాద్వైతము, అద్వైతము ననునవి ఆత్మవికాసమున క్రమావస్థ లనెడి యీతని సిద్ధాంతమువలననే వేదములు అర్థవంతము లగును, శాస్త్రములకు సమన్వయ మేర్పడును. అన్యమతములయెడ సహనము నవలంబింపవలయు ననుటయే కాక, అన్యమతములును మోక్షమార్గములేయని మనఃపూర్వకముగా అంగీకరింపవలయు ననియు సత్యమే సర్వమతములకును మూలాధారమనియు నాతని యుపదేశము. ఈక్రమమున అత్యంతమనోజ్ఞము, హృదయోత్తేజకము నగురీతిని ఆతని జీవితము వ్రాయనగును....లోకమున కాతని జ్ఞానబోధ అపారమైయుండ, నిజముగా అనావశ్యకవిషయములగు యోగసిద్ధులను—అద్భుతములను (Miracles)—పట్టుకొని ప్రాఁకులాడ నేల? వానినిగూర్చి నొక్కి వక్కాణింపఁబూన నేల? వానివలన రుజువగున దేమియు లేదే! జడమువలన ఆత్మ నిరూపితము కాఁజాలదు. ఆత్మ యనుఁడు, పరమాత్మ యనుఁడు, అమృతత్వ మనుఁడు -వీని యునికికిని ఈ యద్భుతసంఘటనములకును ఏమియు సంబంధము లేదు.[1] శ్రీరామకృష్ణుని తత్త్వమునుగూర్చియు నాతని వ్యక్తిత్వమును

[1] యోగసిద్ధులవలని ప్రమాదములనుగూర్చి శిష్యులను హెచ్చరించుచు శ్రీరామకృష్ణుఁ డిట్లు ఉపదేశించును: "రోగనివారణచేయుట, వ్యాజ్యములు గెల్చుట, నీటిపై నడచుట—మున్నగు వానికై తోడ్పడు యోగసిద్ధులకై ప్రాఁకులాడువారు అల్పబుద్ధులు. భగవచ్చరణారవిందములను దక్క నిజమైన భక్తులు మఱిదేనిని ఆశ్రయింపరు.

గూర్చియు బోధింపుము. నీ పిపాసను దీర్చిన యమృతభాండము నొరులకు అందఁజేయుము.’’ [1]

శ్రీవివేకానందుల యీయుపదేశవాక్కులే యీ జీవితచరిత్రరచనమున మాకు ఒజ్జబంతులు.

శ్రీరామకృష్ణసంస్థనుండి ఆంధ్రవంగాంగ్లభాషలలో వెలువడి యున్న శ్రీరామకృష్ణసంబంధరచనలలో, మూలప్రామాణికగ్రంథములలో, ముఖ్యమైనవానిని బరిశీలించి విశేషప్రామాణికముగా నుండునట్లు ఈ మహనీయ జీవితచరిత్ర వ్రాయఁ బ్రయత్నించియున్నాము. వేనిని దెల్పినచో, లేదా, అంగీకరించినచో, తమ ఆరాధ్యవ్యక్తియొక్క ఆజన్మసిద్ధత్వమున కెక్కడ లోప మనిపించునో యని యనుయాయులు తెల్పుటకు సర్వసాధారణముగా వెనుదీయుచుందురో అట్టి కామము, అహంకారము మున్నగువానిని శ్రీ రామకృష్ణుఁడు ఎట్లు ఎదుర్కొనెనో,

“సిద్ధులను అశుద్ధమువలె త్యజింపవలయును. ఆధ్యాత్మిక సాధనల వలనను సంయమమువలనను సిద్ధులు వానియంతట నవియే కల్గుచుండును. కాని వానిపై మనసు నిల్పువారు వానియందుఁ దగుల్కొని యిఁక పురోవృద్ధి నొందఁ జాలకుందురు.’’ (చూ. ఈగ్రంథరచయిత అనువాదమగు ‘శ్రీరామకృష్ణ బోధామృతము’—సిద్ధులవలని ప్రమాదములు, పుట 132.)

యోగశాస్త్రజనకుఁ డనఁదగు పతంజలిమహర్షియు (‘స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం పునరనిష్టప్రసంగాత్’ అను సూత్రమున) యోగసిద్ధులవలని ప్రమాదములనుగూర్చి సాధకులను హెచ్చరించును. (చూ. ఈగ్రంథరచయిత అనువాదమగు ‘రాజయోగము’—పాతంజలయోగసూత్రములు, 3-52.)

[1] చూ. ఈగ్రంథరచయిత అనువాదమగు ‘శ్రీవివేకానందలేఖావళి’—తొలికూర్పు, మొదటి భాగము, పు. 204—5, 101—3; రెండవ భా., పు. 56—7.

Refer ‘Letters of Swami Vivekananda’—fourth edition, Pages 92, 131, 155 & 228.

ఎట్లు నిర్జించెనో తెలుపు సంఘటనలను—సత్యాన్వేషకులగు సాధకులకు అత్యంతోపయుక్తమగు నిట్టి విషయములను — మూలగ్రంథములనుండి ప్రత్యేకశ్రద్ధతో సేకరించి వ్రాసియున్నాము.[1] [ఉదాహరణమునకు 'సాధనానుభవవిశేషములు: సాధనాంతము' అను ప్రకరణము (పుం. 249—264) చూడుఁడు.] సందర్భానుసారముగ శ్రీరామకృష్ణుని యుపదేశములను ప్రసంగములను ఉదాహరించుటయే కాక మూలగ్రంథములనుండి—లబ్ధమైనంతవఱకు—జీవితసంఘటనములను విశేషప్రామా

---

[1] సాక్షాదవతారమూర్తులకు సైతము ఒక్కొక్కప్పుడు కామమోహాదులు కలుగుచుండును. కాని, వానిని నిర్జించి వారెల్లరకును మార్గదర్శకు లగుచుందురు. సీతాపహరణసందర్భమున, సీతావియోగమున, శ్రీరామచంద్రుని దుర్భరమనఃస్థితినిగూర్చి వాల్మీకిమహర్షి శ్రీమద్రామాయణమున వ్రాసియున్న యీ క్రింది వాక్యములను బరికింపుఁడు :

శ్లో. 'సీతా మపశ్య న్ధర్మాత్మా కామోపహతచేతసః,
విలలాప మహాబాహూ రామః కమలలోచనః.'

తా॥ ధర్మాత్ముఁడు, ఆజానుబాహువు, కమలలోచనుఁడును అగు రాముఁడు సీతాదేవి యగపడనందున కామోపహతమానసుఁడై యిట్లని విలపించెను.

శ్లో. 'పశ్యన్నివ చ తాం సీతా మపస్య న్మదనార్దితః,
ఉవాచ రాఘవో వాక్యం విలాపాశ్రయ దుర్వచమ్.'

తా॥ రాముఁడు తనయెదుట సీత లేకుండుటచే నామెను జూడకున్నను, మన్మథపరవశత్వమున నామెను జూచుచున్నవానివలె రోదనము చే, డగ్గుత్తికవలన శబ్దములు ఉచ్చరింపఁజాలకుండియు నిట్లో యీమాట చెప్పెను. (శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, 62-1, 2 చూ.)

అటులయ్యును శ్రీరామచంద్రుఁడు ఎట్లు ఏకపత్నీవ్రతుఁడై, 'నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ' యను నారద

# ప్రస్తావన

జికమైన యాయనవాక్కులలోనే తెల్పియున్నాము. పాఠకులలో వంగభాష తెలిసినవారికంటె ఆంగ్లభాష తెలిసినవారే యెక్కువమంది యుందురను కారణమున పాదటీకలలో ఆంగ్లానువాదగ్రంథములను సూచించియున్నను, శ్రీరామకృష్ణవచనామృతమును మూలవంగగ్రంథములనుండియే యాస్వాదించి, యానందించి, యథాసాధ్యముగ పస చెడకుండ అనువదించి యాంధ్రసోదరులకు అందజేయఁబూనితిమి.

శ్రీపరమహంస-జీవితోపదేశసంబంధమగు ననేకముఖ్యవిషయములను ఆయన సాక్షాత్ప్రియశిష్యులలో నొకరును, ప్రయాగ (అలహాబాదు) శ్రీ రామకృష్ణమఠసేవాశ్రమ సంస్థాపకులును, ఆంగ్ల వంగ భాషలలో సద్గ్రంథ కర్తయు, అంత్యదశలో శ్రీరామకృష్ణమఠసేవాసంఘ (The Ramakrishna Math and Mission) సర్వాధ్యక్షులును, మా గురువరేణ్యులును అగు శ్రీవిజ్ఞానానందస్వామివారివలన విను భాగ్యము నందియున్నాము.

పెక్కేండ్లమునుపే మాచే రచితమైయున్న శ్రీవివేకానంద జీవితచరిత్రాదులను ప్రశంసించుచు, "శ్రీరామకృష్ణజీవితచరిత్రను ఈగ్రంథకర్త రచించుచో మిక్కిలి సంతసింతుము" అని కవిసార్వభౌమేత్యాది బిరుదాంచితులు, ఆంధ్రరాష్ట్రప్రభుత్వాస్థాన కవులును అగు శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు, ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు, కీర్తిశేషులును అగు డాక్టర్, సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు మున్నగు కవిపండితవిమర్శకవరేణ్యులు మహోత్సాహముతో మమ్ము ప్రోత్సహించియున్నారు. ఆ ప్రోత్సాహము మా తరణోపాయము. భగవదనుగ్రహమున అది నేఁటికి సిద్ధించినది.

మహర్షి వాక్కులకు దివ్యనిదర్శనభూతుఁడై యొప్పెనో వాల్మీకిరామాయణము అద్భుతముగా నిరూపించుచున్నది. రామాయణమున శ్రీరామచంద్రుఁడు ఆదర్శమానవుఁడుగాఁ జిత్రింపఁబడియున్నాఁడనుట స్పష్టము.

"రామకృష్ణుఁడు సజీవాకృతిని దాల్చిన దివ్యత్వము......ఇదే (ఈ దివ్యపురుషుని జీవితమే) కనుక లభించియుండనిచో, వేలకొలఁది స్త్రీ పురుషులు మనశ్శాంతిరహితులై ఆధ్యాత్మికవికాస విరహితులై యుండెడివారు" అని గాంధిమహాత్ముఁడు వక్కాణించియుండెఁగదా! ఇట్టి శ్రీరామకృష్ణ జీవితోపదేశ వ్యాపనమే కర్తవ్యముగా గ్రహించి సాధ్యమైనంతవఱకు సరళశైలిలో రచించి పుస్తక మెల్లరకును అందుపాటున నుండుటకై వీలైనంత తక్కువ వెల నేర్పఱిచియున్నాము.

గ్రంథమందలి యేవిషయమునైనను పాఠకులు వెంటనే గుర్తింపననువగు రీతిని సమగ్రమైన విషయానుక్రమణిక గ్రంథాంతమునఁ బొందుపఱుపఁబడినది.

తప్పొప్పుల పట్టికను ముద్రింపక పాఠకుల సౌకర్యమునకై అచ్చుతప్పులు మున్నగువానిని ముద్రితప్రతులలో స్వయముగా దిద్దియున్నాము.

ఈ గ్రంథపీఠిక — గ్రంథకథితపరమపురుషపీఠిక — నిర్మించిన శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిమహోదయుల మనోభీష్టసిద్ధికై మనఃపూర్వకముగా భగవంతునిఁ బ్రార్థించుచున్నాము.

శ్రద్ధాభక్తులతో, సేవాదీక్షతో పుస్తకము చక్కఁగా 'బైన్డ్' చేయుచున్న శ్రీ అక్కుల వేంకటేశ్వర్లు, ఉచితముగా, మనోహరముగా 'జాకెట్' ముద్రించియున్న 'బి. ఎన్. కె. ప్రెస్' యజమానులు శ్రీ బొమ్మిరెడ్డి నాగిరెడ్డిగారును, ఈ గ్రంథప్రకటనమున బహువిధముల మాకుఁ దోడ్పడియున్న పెదపాలెము గ్రామవాసులును, అట్టి మఱి కొందఱును, తెనాలి శ్రీరామకృష్ణసేవాసమాజము[1] వారును భగవానుని విశేషానుగ్రహము నొందుదురుగాక!

రచయిత

1 ఇప్పుడీ సమాజము లేదు.

## ద్రవ్యదాతలు



శ్రీ వాసిరెడ్డి నాగయ్యగారి కుమారులగు
శ్రీ వా. వెంకటప్పయ్యగారు



కీ. శే. శ్రీ వాసిరెడ్డి
శక్తీశ్వరుడుగారు

ఆయన భార్య
శ్రీ వా. మంగమ్మగారు

ద్రవ్యదాతలు



శ్రీ వాసిరెడ్డి సుబ్బయ్యగారి కుమారులగు

శ్రీ వా. శక్తీశ్వరరావుగారు

# ద్రవ్యదానము

అఖండయశోధురీణులగు శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయఁడుగారి వంశీయులును, గుంటూరు జిల్లా, తెనాలితాలూకా, పెదపాలెము గ్రామవాస్తవ్యులైన శ్రీ వా. నాగయ్యగారి కుమారులును అగు శ్రీ వా. వెంకటప్పయ్యగారు తమ సోదరులును కీర్తిశేషులును అగు శ్రీ వా. మల్లయ్య, శ్రీ వా. సుబ్బయ్యగారల జ్ఞాపకార్థముగను, శ్రీ వా. సుబ్బయ్యగారి కుమారులగు శ్రీ వా. శక్తీశ్వరరావుగారు శ్రీ వా. మల్లయ్యగారి భార్యయు కీర్తిశేషురాలును అగు శ్రీ వా. గౌరీ సుబ్బమ్మగారి జ్ఞాపకార్థముగను, శ్రీ వా. మంగమ్మగారును ఆమె భర్త కీ. శే. శ్రీ వా. శక్తీశ్వరుఁడుగారును తమపేరను ఈ గ్రంథమునకును 'శ్రీ రామకృష్ణపరమహంస: మహోజనవాణి' యను పుస్తకమునకును ముద్రణ ప్రకటనార్థమైన వ్యయమును ఒసఁగి ఆర్థికభారమును పూర్తిగా వహించియున్నారు. ఈ దాతలును వీరికుటుంబములును భగవత్ పరిపూర్ణానుగ్రహము నొందుఁగాక!

రచయిత

# మలి కూర్పునకు మున్నుడి

యతి కవి పండిత వరేణ్యులును, ఢిల్లీ సాహిత్య అకాడమివారును, ఆంధ్ర మద్రాసు మైసూరు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయములవారును, ఆంధ్రప్రజానీకమును ఈ గ్రంథము నెడఁజూపిన, మఱియుఁ జూపుచున్న ఆదరాభిమానములు విశ్వకల్యాణ సాధనభూతమగు శ్రీరామకృష్ణజీవితోపదేశ వ్యాపనమున కెంతయు దోహదమై, అత్యంతముదావహమై, మా మహాభాగ్యమై వెలయుచున్నవి.

తొలికూర్పు చక్కఁగా ముద్రించిన తెనాలి, 'యూనివర్సిటి ప్రెస్'వారిని ఈ సందర్భమున స్మరించుచున్నాము.

గ్రంథవిస్తరభీతిచే తొలికూర్పులోని 'మహాజనవాణి' యందలి వివేకానందవాణినిమాత్రము ఇందుంచి, మిగిలిన ప్రశంసలలో అతిముఖ్యమైనవానిని సందర్భానుసారముగా జీవితచరిత్రలోఁ బొందుపఱిచియున్నాము.

కాకితములు మున్నగు ముద్రణపరికరముల వెల విపరీతముగాఁ బెరిగిపోవుటచే ఈ మలికూర్పు వెల కొంత హెచ్చింపవలసివచ్చినది.

ఈ మలికూర్పు వెలువరించునెడ మాకు నివాసాదుల నొసంగియున్న మద్రాసు, జార్జిటౌన్ నివాసులును సద్గృహస్థులును అగు శ్రీ ముత్యాల సుబ్బరంగయ్యశెట్టిగారును వారి కుటుంబమును, చిత్రప్రతులను శ్రద్ధాభక్తులతో దిద్దిన శ్రీ చిలువూరి మాధవకృష్ణగారును, పుస్తకము చక్కఁగా బైన్డ్ చేయుచున్న శ్రీ మన్నె బాలసుందరముగారును భగవద్విశేషానుగ్రహపాత్రు లగుదురుగాక!

ఆగస్టు, 1958
మద్రాసు—1.

రచయిత

# పీఠిక

శ్రీరామకృష్ణుఁడు జగద్గురువు. 'కామినీకాంచన త్యాగ ముపదేశింప అర్ధనారీశ్వరుఁ డిటులు విడివడెనా? సత్త్వైశ్వర్యము ప్రకటింప రామకృష్ణావతారములు రెండు నిటులు సమ్మేళన మొందెనా? శంకర చైతన్య రామానుజుల ప్రోవా?' అని తలఁపించు నితఁడు సర్వమతసమన్వయస్వరూపము. ఇతని చరిత్రము మన యిహాముత్రల కేకైకజ్యోతి. ఇతని శీలము అందఱకును ఒజ్జబంతి. నిగూఢముగా నవతరించిన యీ పరమపురుషునిలో మొదలునుండి తుదివఱకు బాలలీల యెటులు వికసించెనో చూతము.

గదాధరుఁ డను పంచొమ్మిదేండ్ల కుఱ్ఱఁడు దక్షిణేశ్వరమున రాసమణి కట్టించిన దేవళము ప్రవేశించి రెండుమూఁడేండ్లలో కాళికాలయార్చకుఁ డయ్యెను. ఆట నున్నవారందఱును కూడఁబడి గదాధరుఁడు పిచ్చివాఁడని అనుకొనిరి. పెచ్చురిల్లిన యీ పిచ్చిలో నతఁడు ఆలయములోని అమ్మవారి ఱాతి బొమ్మతో సంభాషించును. ఆబొమ్మచే అన్నము తినిపించును. గాలి యాడుచున్నదా లేదా యని ముకుపుటములముందు దూదిపింజ పట్టుకొని పరీక్షించును. దానికి ఫలితముగా—'ఱాతిరూపము కైవడిఁ జిత్తంబు కన్ను కదలకయుండెన్' (జ్ఞానవాసిష్ఠము—5-184) అనునటులు తాను ఱాబొమ్మ యాయెను. అతఁడు అమ్మఱాబొమ్మ చిన్మయ మనును; తనను మట్టిబొమ్మ యనును. ఇది చూచినవారు గదాధరునకు బ్రహ్మపిచ్చి యని ఉద్ఘోషించిరి. కాళీప్రతిష్ఠ రాసమణి చేసెనా, గదాధరుఁడు చేసెనా? కాళికాలయనిర్మాణము రామకృష్ణునిచే సఫలమని రాసమణి నమ్మెను.

ఈయెడ నిట్టి సంఘటన మొకటి గుఱుతు తగులుచున్నది. సదాశివేంద్రసరస్వతి కావేరీపులినములలో పిశాచమో యన తిరుగాడుచుండఁగా చూచినవారు పరమశివేంద్రయోగితో—'అయ్యా! తమ

శిష్యుఁడు పిచ్చివాఁడైపోయె' నని చెప్పిరి. అతఁడది విని, 'అయ్యో! నాకు అట్టి పిచ్చి యెత్తకపోయెనే!' యని పరితపించెను. శృంగేరి మఠాధిపతులు శ్రీ శివాభినవ నృసింహభారతు లాయీ సంగతిని తమ సదాశివేంద్రస్తుతిలో నిటులు శ్లోకీకరించిరి :

'ఉన్మత్తవ త్సంచర తీహ శిష్య
స్తవేతి లోకస్య వచాంసి శృణ్వన్
ఖిద్య న్నువా చాస్య గురుః 'పురాహో
ఉన్మత్తతా మే న హి తాదృశీతి.'

మన యీ దక్షిణేశ్వరపు పిచ్చివాఁడును ఇట్టి పిచ్చివాఁడే. ఈ పిచ్చివాఁడే ప్రపంచ మంతయు నిప్పు డవతారమని ఎఱిఁగిన శ్రీరామకృష్ణ పరమహంస!

రామకృష్ణునకు స్వగ్రామమునందును దక్షిణేశ్వరమునందును చదువు లెఱుఁగని సాధువులతోడను ఎఱిఁగిన సన్న్యాసులతోడను చాల సాంగత్యము కలిగెను. ఇటు లితఁడు మధ్యయుగమునందలి సాధువులకును ఆధునికులగు సన్న్యాసులకును కూడలి. కావుననే శ్రీరామకృష్ణుఁడు తత్త్వము లెన్నియో పాడును. 'గీత తత్త్వనవనీత' మని యనును.

సమాధిమేఘము శ్రీరామకృష్ణుఁడు.

అమ్మ-యాదేశముచే శ్రీరామకృష్ణుఁడు 'భావముఖము'న నుండెడివాఁడు. ఐనను ఆతఁడు తఱచు పొందుచుండెడి భావసమాధిస్థితిని జూచి కొందఱు మూర్ఛ యనియు మూర్ఛవంటి యేదో వ్యాధి యనియు ననిరి. ఇటులు చెప్పువారు మొనమొన్నటివఱకు ఉండిరి. యాథార్థ్య మెఱిఁగిన విజ్ఞులును నేఁటికినున్నారు. ఉరమరిక ముప్పదేండ్ల వెనుక నాకు హైదరాబాదులో శ్రీ దండిస్వాములవారి దర్శనము లభించెను. వారిది రాజపుత్రస్థానము. ప్రసంగవశమున వా రిటులు చెప్పిరి — 'నేను సన్న్యసించిన క్షేత్రములో దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణపరమహంసను జూచితిని.

అప్పుడు వారికి తఱచు చేతనసమాధి[1] కలుగుచుండెడిది. సమాహితమగు నా యవస్థ జగన్మోహనము. ఈశ్వరుఁడు వారి మోమునను వారు భూమి మీఁదను నృత్యము చేసెడివారు. ఆ సమాధిపట్టు భగవంతుని గుట్టుకు రట్టు. సాధకుల కది మార్గజ్యోతి. వారు కేలు వ్రేసి కెరలియాడు టొకయెత్తు, ఈ సమాధి యొక యెత్తు.'

'తాము ఆపట్టు ఏల పట్టుకొనకపోతిరి?' అని నే నడిగితిని; 'నీవే తెలిసికొనుము' అని వా రనిరి.

సమాధి చక్షుష్మంతులకు చాక్షుషబోధ: మనస్వులకు మానసబోధ. అది వేయి శ్రవణమననధ్యానముల పెట్టు.

శ్రీరామకృష్ణునకు శ్రీ తోతాపురి సన్న్యాస మిచ్చెను. అతఁడు గురువుకడ నుపదేశము గొని మూన్నాళ్లైడ తెగని సమాధిలో మునిఁగి పోయెను.

నలుబదేండ్లకుఁగాని ఆస్థితి శ్రీ తోతా భగవత్పాదులకు దొరకలేదు. అల్పకాలములో ఈ స్థితి చూరకొన్న శిష్యునిఁ జూచి ఆ మహాయోగి 'ఏ కేయాశే!' యని విస్తుపోయెను.

సమాధి యన నేమి? ఈ ప్రశ్నకు శ్రీరామకృష్ణులు పలుమాఱులు పలుచోటుల పెక్కు ఉపమానములతో సమాధానము చెప్పియున్నారు. వారి మాటలనే ఉదాహరింతును:

'ఒక చిన్న హాండిలో ఉండే చేపను గంగలో వదిల్తే ఎలా ఉంటుందో సమాధిలో అలా ఉంటుంది.'

[1] చేతనసమాధి యన్నను భావసమాధి యన్నను ఒకటే. 'భక్తిచేఁ గలుగు సమాధికి చేతనసమాధి యని పేరు.' — శ్రీరామకృష్ణకథామృత — 3-వ భాగము, 9-వ సంస్కరణము, పుట 90. భావ మహాభావ ప్రేమ భక్త్యాదులకు వంగభాషలోని చైతన్యచరితామృతము, రామకృష్ణలీలాప్రసంగము, సంస్కృతములోని చైతన్యచంద్రోదయ చైతన్యచరితామృతములఁ గాంచునది.

'మట్టమధ్యాహ్నం ఎండలో నిలబడితే నీడ కనబడకుండాపోయి నట్లు సమాధిలో 'నేను' కనబడకుండాపోతుంది.'

'భగవంతునికై వెంపర పెట్టితే దర్శనమౌతుంది. సమాధి సిద్ధిస్తుంది. ఏడిస్తే అమాంతంగా కుంభకం కుదురుతుంది. దాంతో సమాధి.'

'నాటకం చూడలేదా? చూడవచ్చినవారంతా కబుర్లు చెప్పుకుంటూ వుంటారు. అట్టి సమయంలో తెర పైకి పోతుంది, అప్పుడందరి మనస్సూ ఆటమీదికి పోతుంది. బాహ్యదృష్టి మరి ఉండదు—దీనిపేరే సమాధిలో ఉండడం.'

'విచారం చేస్తూపోతూవుంటే అహం నశించాక కలిగేది స్థిర సమాధి లేక నిర్వికల్పసమాధి.'

'సమాధి కలుగకపోతే సరియైన యోచన కలుగదు.'

అయిదు విధములైన సమాధులలో నేదో యొకటి యెడవిడకుండ కలుగుచుండుటచే శ్రీరామకృష్ణునకు 'పైనందిన మేడుమాలులు పుట్టి యేడు మాలులు గిట్టుచుండువాఁడు' అని పేరు వచ్చెను. వీరి యీసమాధియే ఆకాలమున శ్రీకేశవచంద్రసేన్ మొదలగు కొంతమంది ముఖ్యుల నాకర్షించియుండును. ఈయెడ వారికిని శ్రీ 'మ' కును జరిగిన ఈదిగువ సంభాషణము ఉదాహార్యము :

శ్రీరామ.—లోకులు ఏమనుకుంటారు? భావావస్థ చూస్తే ఎలా వుంటుంది?

మ.— ఈ అవస్థ చాలామందికి ఏమీ అర్థంకాదు, — ఎవరికో ముగ్గురు నలుగురికి తప్ప; ఐతే ఈ అవస్థే వాళ్ళ నాకర్షిస్తుంది.[1]

శ్రీ చిరంతనానందులు ఈ సమాధినిగూర్చి—'మల్లెపొదల యూకుల నడుమ వెల్గొందు పూవులవలె తత్త్వసంగమాలనడుమ నాతఁడు ప్రొందు దివ్యభావసమాధిస్థితులు శ్రోతలను అద్భుతరీతిని ఆకర్షించుచుండెను.' అని గద్యములో పద్యము వ్రాసిరి. (393 పుట చూ.)

---

[1] శ్రీరామకృష్ణ కథామృత—4-వ భా., 6-వ సం., పు. 140.

ఏగురువు పాదములముందో కూర్చుండి శ్రవణము చేయవచ్చును. మనస్సును మథించి మననము చేయవచ్చును. ఏ విక్షిప్తభూమికలోనో ధ్యానమును జేయవచ్చును. కాని యీ సమాధి? ఎవరికేని దీని జాడనేని సమకూరునా? కాళికాలయదాసివగు నో బృందా! నీ వెంతయు ధన్యురాలవు.

ఈ దేవ చైతన్యులు పాతిన భక్తివృక్షమునకును శంకరులు కాపాడిన జ్ఞానవృక్షమునకును తనకుం దా నంటుద్రొక్కుకొన్న మొక్క — శ్రీరామకృష్ణుఁడు!

సర్వమతైక్యద్రష్ట శ్రీరామకృష్ణుఁడు.

ఈ యెడ నీ సంశయ మొదవును,—'దార్శనికు లందఱును స్వమతమును స్థాపించుట, పరమతమును ఖండించుట అను వాదమును జల్పమును స్వీకరించిరి. వాద మనఁగా స్వపక్షస్థాపనము. జల్ప మనఁగా స్వపక్షస్థాపన పూర్వకమగు పరపక్షఖండనము. వితండ యనఁగా కేవల పరపక్షఖండనము. పరదుర్గమును భేదించుట వంటిది వితండ. దుర్గమును లోఁగొనుట వంటిది జల్పము. స్వరాజ్యము స్థాపించుట వంటిది వాదము. దర్శనముల కిది సామాన్యము. దర్శనము నొనరించినవా రందఱును ఇతర దార్శనికుఁ డెంత గొప్పవాఁ డయినను ఈ మూఁటిని వినియోగించుటలో వెనుదీయలేదు. — 'నామాట నమ్మురుగాని కపిలునకు వేదార్థము తెలియదు, సాంఖ్యాదిదర్శనములకంటె మా దర్శనము వేఱు' అనియు శ్రీ శంకరులు బ్రహ్మసూత్రభాష్యమున యోగప్రత్యుక్త్యధికరణమునఁ జెప్పిరి.—'నైకో ఋషిర్యస్య మతం న భిన్నమ్' కావున మతైక్య మెటులు? 'మత, ఐక్య' పదములకే పొందు లేదే!' అని.

ఇటు లగుచో మా దర్శనము వేఱనిన శ్రీశంకరులు షణ్మతస్థాపనాచార్యు లెటులైరి? కావున జిజ్ఞాసువులకును ముముక్షువులకును వైరుధ్యముతో పనిలేదు. మననమునకు దర్శనము. 'రుచిభేదమును బట్టి సాధకుఁడు షడ్దర్శనములలో నేదోయొకదర్శనము నవలంబించి బ్రహ్మవిచారము చేయునది' అని పెద్ద లందురు.

‘యుక్తిశాస్త్రమగు దర్శన మంతయు గ్రుడ్డిది’ అని కొందఱు యుక్తిచే సాధింపఁజూతురు కాని వీరు గురువెందఱు. అది యటు లుండె.

శ్రీరామకృష్ణు లిటులు సమన్వయింతురు: ‘మతము లెన్ని మార్గము లన్ని.[1] ధర్మాలన్నీ సత్యం. చాలా బాటలగుండా కాళీఘాట్ పోవచ్చు. ధర్మం ఏదీ (ఏదర్శనమూ) దేముడు కాదు. వేరువేరు ధర్మాలను పట్టుకొని దేముడుదగ్గరకు పోవచ్చు.

‘ఎన్నో ఉపాయాలతో మిద్దెపైకెక్కొచ్చు. రాతి మెట్లు, కఱ్ఱ మెట్లు—ఆఖరికి తాడువేసుకొనిగూడా ఎక్కొచ్చు. ఎక్కేటప్పుడు మాత్రం ఏదో ఒకరకం మెట్టుమీంచి ఎక్కాలిగాని రెండుమూడు మెట్లమీద కాలు పెట్టరాదు. కాని మిద్దె ఎక్కిన తరువాత అన్నిరకాల మెట్లమీంచీ దిగిరావచ్చు. మళ్లా ఎక్కనూ వచ్చు.’

ఒకరు—అయ్యా, అన్యధర్మంలో భ్రమ వుంటే?

శ్రీరామ.—ఏధర్మంలో లేదూ? నా గడియారమే సరిగా నడుస్తూందని ప్రతివాడూ అంటాడు. కాని ఏదీ సరిగా నడవదు. అన్నిగడియారాలనూ సూర్యునితో సరిపుచ్చాలి.

‘నేను ప్రతిధర్మాన్నీ ఒకొక్కసారి అవలంబించి చూచా,—ముసల్మాన్, కిరస్తాన్, శాక్తం, వేదాంతం....వీని అన్నిటిగుండా ఆ ఒక్కడే కనబడ్డాడు—అన్నీ వేరువేరు బాటలగుండా ఆ ఒక్కనిదగ్గరకే వస్తున్నయ్.’ ఇది శ్రీరామకృష్ణుని సమన్వయము.[2] అజ్ఞులకు అనులోమ మార్గము, విజ్ఞులకు విలోమమార్గము. ‘నేను సాక్షాత్తు చూస్తున్నాను,—

[1] Many faces, many theologies.

[2] ఈ గ్రంథమునందలి ‘సాధనానుభవ విశేషములు : సాధనాంతము’ అను ప్రకరణము (పు. 249—264) చూచునది. తర్కమునకు కుతిచేయఁదగని ఈ సమన్వితిని ఖండించినవారు లేకపోలేదు. చూ. The critical examination of the Philosophy of Religion by Sadhu Sri Santhinatha.

అతడే చతుర్వింశతి తత్త్వాలుగా అవుతున్నాడు. అతడు సాకారుడూ, నిరాకారుడూ, ఈ రెంటికీ కూడా అతీతుడు' అని శ్రీరామకృష్ణుఁ డనును.

శ్రీరామకృష్ణుఁడు కవి. — 'కవిం కవీనామ్.'

పరమహంస పలుకు తత్త్వదృష్టిలో నెట్లు గురువాక్యమో కావ్యదృష్టిలో నట్లు రసవాక్యము. అది చీకటికోణములో నెటులు వైద్యుతఘర్షమో జాగ్రత్ క్షేత్రములో నటులు ఆనందవర్షము. బుద్ధునిచందముగా నీతఁడు పదుగురభాషలో బోధించును. ఆభాషకు రెండువైపులను పదను. అది రెండుచేతులతోడను రెండుకత్తులతో సాముచేయును. అది యెంత తేట తెలుఁగో అంత లోఁతు వెలుఁగు. దాని మాహాత్మ్య మెఱిఁగియే శ్రీవివేకానందస్వామి కాదంబరి మొదలగు కావ్యములభాషను నిరసించి తత్త్వప్రకాశమునకు వాడుకమాటల అక్కఱను కన్నుపొడిచి చూపెను.[1]

శ్రీరామకృష్ణుని ఒక్కొక్క కథ ఒక్కొక్క కావ్యము. అతఁడు చేత్యములో మునిఁగియు చిత్తులో తేలి మెఱుపులఁ గ్రుమ్మరించును. మఱి చిత్తులో మునిఁగి చేత్యములో తేలి ఆనందమును దిమ్మరించును.

—'అమ్మా! నన్ను రసంలో ఉంచు, మరి వసంలో ఉంచు. అంతే. శుష్క సన్న్యాసిని మాత్రం చేయకు!' అని వారందురు. రసమునం దుంచనిచో ఎండక తప్పదు. వశమునం దుంచనిచో ఈ పంచదార-బొమ్మ రసములో ఐక్యమొందక తప్పదు.

ఈ మహాకవిది గద్యకవిత. అది వింటివలె ఝుంకరించును. తూపు వలె లక్ష్యమును భేదించును. దానికి ఉపమాదృష్టాంతములు రెండే రెండు కన్నులు. ఈ రెండును ఒకానొక అవ్యక్తమును ఒకానొక అవిజ్ఞాతమును ఒకానొక వాఙ్మనసాతీతమును నీ మనోదర్పణమున తళుక్కుమనిపించి కుంభక మొనఁగూర్చును. శ్రీరామకృష్ణుని ఉపమ వాల్మీకికాళిదాసులకు త్రోసిరాజు. యోగవాసిష్ఠమునందలి కొన్ని ఉపమల కితఁడు కథాశరీరము

1 శ్రీ వివేకానందస్వామివిరచితమగు 'భావ్ బార్ కథా' చూ.

సృజించెను.[1] 'ఉపమా కాళిదాసస్య' అను ఆభాణకము పూర్వకాలమున. ఇపుడో — 'ఉపమా రామకృష్ణస్య.'[2] శ్రీరామకృష్ణుని పలుకు ఆబాలగోపాలమునకు పిలుపు, ఆధ్యాశక్తికి మేలుకొలుపు! ఆతని ప్రతి మాటయు నవ్వుల యూట, ప్రతిబోధయు రసముపాట. 'జ్ఞాని యీశ్వరుడు తేజోమయుడు, భక్తుని యీశ్వరుడు రసమయుడు'[3] అని ఒకచోఁ జెప్పిరి. ఆతఁడెంత రసికుఁడో! మఱి ఆనందమయుఁడో!

శ్రీరామకృష్ణుఁడు భావనాసిద్ధుఁడు.

కవి ఒక వస్తువు నింకొక వస్తువుగా భావించును. మానసప్రపంచమున దాని కేదో యొక స్థానమును కల్పింపవచ్చును. కాని యీ భావకవి భావించెనా, అది సత్యము కావలసినదే.

అతఁడు దాస్యభావమున తన్ను హనుమగా భావించుకొనెను: తోఁక మొలచుకొనివచ్చెను. మాధుర్యమున తన్ను రాధగా తలఁచుకొనెను:

---

[1] యోగవా. ముముక్షుప్రకరణము — 18-50...67 వఱకు చూ.

'అంతరిక్షేఽపి జాయంతే ఆకాశవిహగాదయః
వనవీథిషు జాయంతే సింహవ్యాఘ్రమృగాదయః.'

—యోగవా. ఉపశమ. 14-31.

'ఆకాశవిహగాః క్షుద్రపక్షివిశేషా స్తే హి సదా భ్రమన్తోఽన్తరిక్ష ఏవ ప్రసూయన్తే ప్రసూతం చాండ మధః పాతాత్ ప్రాగేవ భిత్వా నిర్గతాః శావకా స్సద్యః సంజాతపక్షా అంతరిక్ష మేవోత్పత్య భ్రమన్తీతి లోకప్రవాదసిద్ధమ్'.

శ్రీరామకృష్ణులు హోమపక్షికథ వేదమునందలిదిగా చెప్పిరి. (కథామృత — 1-వ భా., 17-వ సం., పు. 36; 2-వ భా., 11-వ సం., పు. 28, 177 చూ.) ఉప్పుబొమ్మ - ఉపమకు యోగవాసిష్ఠమునందలి నిర్వాణ. పూర్వ. — 128-31.—'యథా వై లవణగ్రంథిః సముద్రే సైంధవోయథా.' ఈ మొ. చూ.

[2] శ్రీ అచింత్యకుమారసేన్‌గుప్త ప్రణీతమగు 'కవి రామకృష్ణ' చూ.

[3] శ్రీరామకృష్ణ కథామృత-2-వ భా., 11-వ సం., పు. 292 చూ.

తనలో స్త్రీత్వము వికసించెను. వత్సత్వము వరించెను : అటు జగదంబనే అంబగాఁ జేసికొనెను. శిశువై ఇటు 'గోపాలేర్ మా' (గోపాలుని తల్లి)ను ఆవహించెను. మరల తాను రామునకు, రాఖాల్‌కు తండ్రి! ఏమిటీ విచిత్రసృష్టి! యౌగికమగు ప్రకృత్యాపూరమా? ఏమో! వీరి భావనా లేశములలో ప్రాణమును, రూపమును జాగరణ మందుచున్నవి.

శ్రీరామకృష్ణుఁడు భగవత్ప్రతినిధి.

పందొమ్మిదవ శతాబ్ది పాశ్చాత్యుల తాఁకిడికి నాగరకులు తాలుమాలైపోవు తఱి. అట్టితఱిలో సనాతనధర్మ మీఁగకయే [1] పాశ్చాత్య సభ్యతను జీర్ణింపఁజేసికోఁగల శక్తి ననుగ్రహించిన శ్రీరామకృష్ణుఁడు భగవదవతారములలో ఒకానొక సాత్త్వికావతారము కాదా?

ఈ ప్రపంచము నేఁ డుండి ఱే పుడుగు బుడగయే. అటులయ్యు ఉన్నంతవట్టు ఇది ఉన్నదియే. మఱి యిది ఉత్తరోత్తరము ఉన్నతి గొను విరాడ్రూపము. జీవుఁడు అంశము. పూర్ణుఁ డయినను అంశమువంటి అతఁ డెల్లవెంట పూర్ణుఁ డగుట జీవితమున కొడ్డు. ఈ ప్రాఁజదువులకు సారమగు—'నేను పని చేయనిచో లోకులు చెడిపోదురు' [2] అను భగవదుపదేశమును మానవదృష్టికోణమునుండి చూచి—నిర్వికల్పస్థితినుండి సైతము దిగి రాఁగలిగి కొందఱు లోకశిక్షణమునకై లోకమునందే 'యాడుచుఁ బాడుచు నగుచు నేడ్చుచు నుందురు.' వారు సంసారుల దుఃఖములకు జాలిగొనక జ్ఞానోన్మాదముచే తమ తరణోపాయమే చూచుకొను లుబ్ధులు కారు. నారదుఁడు, ప్రహ్లాదుఁడు, శుకుఁడు, శంకరుఁడు, రామానుజుఁడు, చైతన్యుఁడు నట్టివారు. 'నేను మరను, అతడు మరకాడు' అని పరమహంస యనును. లోకులకు చైతన్యము కలిగించుటకీఘట్టమున ఈ హంస వాలెను. శ్రీ కేశవసేనాదులు శ్రీరామకృష్ణుని ప్రచారము చేయుమని చెప్పిరి. తా

---

1 శ్రీరామకృష్ణ కథామృత—2-వ భా., 6-వ సం., పు. 214 చూ.

2 'ఉత్సీదేయు రిమే లోకాః న కుర్యాం కర్మ చేదహమ్.'— గీత — 3-24.

వందులకు దిగలేదు కాని తగిన ప్రచారకులను సిద్ధపఱచుటకు నడుము కట్టెను. అతఁడు రామానుజులవలె గోపుర మెక్కి నరేంద్రాదులకై మొఱలిడెను. ఎట్టకేల కతని యాహ్వానము నరేంద్రాదులను బలిమితో నాకర్షించెను. సూదంటురాకొండకు నావ లంటుకొనిపోయెను.

కాని ప్రకృతిశాస్త్రప్రాభవములో భగవదేకవైభవ మెవరికి గోచరించును? శ్రీరామకృష్ణు లిటు లనిరి: "ఈశ్వరుడు ఉన్నాడని ఎవరయినా చెపితే లోకులు నమ్మరు. ఏమహాపురుషుడయినా 'నేను ఈశ్వరుణ్ణి చూచాను' అని అన్నా సామాన్యులు పాటించరు. 'ఆయన దేవుణ్ణి చూస్తే మాకు చూపించమను' అని అంటారు. కాని ఒకనాటి లోనే నాడి చూడడం తెలుస్తుందా? వైద్యునిచుట్టూ ఎన్నాళ్లో ప్రదక్షిణాలు చేయాలి. చేశాక శ్లేష్మనా డేదో, వాతనా డేదో, పిత్తనా డేదో తెలుస్తుంది. నాడి తెలుసుకోవాలంటే నాడితో ఆడే వానితో తిరగాలి."[1] "అవతారం వస్తే గోప్యంగా వస్తుంది. ముగ్గురు నల్గురు అంతరంగభక్తులు తప్ప సాధారణులు కనుక్కోలేరు. రాముడు పూర్ణబ్రహ్మం, పూర్ణావతార మనే సంగతి పన్నిద్దరు ఋషులకు మాత్రమే తెలుసు. ఇతరులకో, దశరథుని పిల్లకాయ అనిమాత్రమే తెలుసు."[2]

'ఎవడు రాముడో, ఎవడు కృష్ణుడో, ఆతడే ఈ శరీరంలో ఇపుడు రామకృష్ణుడు....'[3]

శ్రీరామకృష్ణ కథామృత—2-వ భా., 11-వ సం., పు. 53 చూ

శ్రీరామకృష్ణ కథామృత—2-వ భా., 11-వ సం., పు. 22 చూ. ఇంకను ఈ విషయమునకు కథామృత-ప్రథమ భాగము, 17-వ సం., పు. 247, 248 మొ. పట్టులు చూచునది. ఈ గ్రంథమున 'భైరవీ బ్రాహ్మణి' యను ప్రకరణము, పు. 145 చూ.

3 ఈ గ్రంథమున చూ. పు. 413.

లోకశిక్షణమునకు తా నేఱుకొనిన యిరువదిముప్పదిమందిలో శ్రీ పెట్టఁదగిన నరేంద్రుఁడే దొడ్డ సంశయాళువు. శ్రీరామకృష్ణుఁడు శక్తిపాతముచేసెను.[1] దానితో నరేంద్రునకు పునర్జన్మ. 'తమ కృపచే నాకు సమాధి కలుగుచున్న' దని యితఁ డనును.[2]

ఇది యిటు లుండఁగా శ్రీరామకృష్ణునకు వ్యాధి ముంచుకొని వచ్చెను. అది మందులమాట వినదు. అట్టిస్థితిలో ఈ సంభాషణము గమనింపఁదగినది :

శ్రీరాము.—'ఆయన ఇంతవాడు గదా! ఐతే ఈ జబ్బేమిటి?' అని లోకు లంటారు.

ఒక గోస్వామి — మీ వ్యాధి యితరుల నిమిత్తం. మీ సన్నిధికొచ్చేవారి పాపాల్ని మీరు తీసుకుంటున్నారు. ఆ పాపాలన్నిటినీ స్వీకరించడంవల్లనే మీకు వ్యాధి.

ఒక భక్తుఁడు—ఈవ్యాధి నివారింపమని మీరు అమ్మను అడిగితే, శీఘ్రంగా నివారణమైపోతుంది.

శ్రీరామ. — వ్యాధి నివారింపమని అమ్మను అడగలేను....[3]

ఈరీతిగా వారికి శరీర మత్యంతభిన్నముగా ననుభవమాయెను. 'ఇపుడు 'నే' ననేది వెతికినా దొరకటం లేదు' అని వా రనిరి.[4] వారు తమ అవతార సమాప్తికి ముందు కనఁబడినవారందఱకును శక్తిపాతము చేసి రుచి చూపించిరి. పిదప శరీర ముపసంహరించిరి. రుచిచూచిన భక్తులు ఆ రుచినెల్లపు డధీనములో నుంచుకొనుటకు ఎట్టిసాధన లొన

[1] శక్తిపాత ప్రభావమునకు యోగవా. నిర్వాణ ప్ర., పూర్వభా., 127—4; 128—60, 61 చూ.

[2] 'శ్రీరామకృష్ణ - ఆరాత్రిక' చూ.

[3] కథామృత — 5-వ భా., 5-వ సం., పు. 175 చూ.

[4] కథామృత — 5-వ భా., 5-వ సం., పు. 175 చూ.

శ్చిరో దేవునకే యెఱుక. వీరిలో అనక్షరాస్యుఁడు లాటూ ఒకఁడు. 'శ్రీరామకృష్ణుని అద్భుతసృష్టులలో లాటూ పరమాద్భుతసృష్టి' అని వివేకానందుఁ డనెను. శ్రీరామకృష్ణుల బోధ లోకకల్యాణమునకు వివేకానందాదులచే బరానగరమఠమే బీజముగా ప్రపంచమంతయు ప్రాఁకి ప్రాఁకిపోవుచునున్నది. సేవాలాభము వడసిన యేకొలఁదిమంది భక్తులకోకాని భగవదవతారమని తెలియని శ్రీరామకృష్ణుఁ డవతారమే యని వీరివలన ఇపుడు ప్రపంచమున కెల్ల విదితచరము.

ఈ రీతిగా సాధనలో, మతసమన్వితిలో, బోధలో, భావనలో శ్రీరామకృష్ణులు విజాతీయమగు నొక సౌందర్యమును చూచి చూపించిరి. శ్రీచైతన్యుఁడు, బుల్లా మొదలగు వారితోఁ బ్రవహించుచువచ్చిన సంస్కరణధారను అవిచ్ఛిన్నముగా పాఱఁజేసిరి. వీరి యీధారకు శ్రీ గాంధీ రెం డొడ్డులను తీసివేసిరి. ఇట్టి యీ యవతారపురుషుని వాణి ఒక భాషకు, ఒక జాతికి, ఒక మతమునకు, ఒక దేశమునకు మాత్రమే సంబంధించినది కాదు. అది సర్వ భాషలకు, సర్వజాతులకు, సర్వమతములకు, సర్వదేశములకు గాలివలె వలయునది. లీలకు జీవుఁడై పుట్టి దేవుఁడైపోయిన యీతని చరిత్ర శ్రీ చిరంతనానందస్వాములవారివలన నేఁటికి లభించుట తెలుఁగువారి సుకృతము, కల్యాణము.

శ్రీ చిరంతనానందులకు శ్రీరామకృష్ణులు పరమగురువులు. శ్రీవిజ్ఞానానందులకు శ్రీరామకృష్ణుఁడు గురువు. ఈ విజ్ఞానానందు లొకానొకపుడు వినోదమునకు శ్రీరామకృష్ణులతో కుస్తీపట్టి ఒక గోడ కడకు నెట్టిన జెట్టి. అట్టి జగజెట్టి శిష్యులు మన చిరంతనానందులు!

శ్రీరామకృష్ణుల మానసపుత్రులు బ్రహ్మానందస్వామివారు శ్రీ విజ్ఞానానందులను గుఱించి—'ఇతఁడు గుప్తబ్రహ్మజ్ఞుఁడు; తెలిసినటు లెవరికిని పట్టువడఁడు' అని చెప్పిరి. అట్టి గుప్తబ్రహ్మజ్ఞుల ఛాత్రులు మన చిరంతనానందులు!

శ్రీ విజ్ఞానానందులు నారదపాంచరాత్రమును దేవీభాగవతమును బృహజ్జాతకమును సూర్యసిద్ధాంతమును రామాయణమున కొంతవట్టును ఆంగ్లీకరించిరి. పాంచరాత్రమున వీరు వెల్లడించిన మంత్రతత్త్వము, దేవతాతత్త్వము, సాధనారహస్యము లోనగు విషయములు సాధకులకు అవశ్యావలోకనీయములు. దేవీభాగవతపీఠికలో వీరు చేసిన సూక్ష్మమీమాంస పాండితీస్ఫోరకము. ఇట్టి పండితస్వామి యంతేవాసులు మన చిరంతనానందులు !

కొందఱు భక్తులు శ్రీరామకృష్ణుల బోధలను సంభాషణములను ఇతర సంఘటనములను విన్నవి విన్నటులు, కన్నవి కన్నటులు దినచర్యలలో తిథివారపూర్వకముగా వ్రాసికొనిరి. వారిలో ముఖ్యులు శ్రీ మహేంద్రనాథ గుప్త (M.) అనువారు. శ్రీరామకృష్ణుల చరమజీవితమున రమారమి అయిదుసంవత్సరములు తమకు వీలైన వేళలందు వీరు శ్రీరామకృష్ణుల పాదములముందు కూర్చుండి విన్న మాటలు విన్నటులు వ్రాసి ప్రకటించిరి. మఱియు శ్రీరామకృష్ణుల సమకాలికులును భక్తులును మహాకవులును అగు శ్రీ అక్షయకుమారసేన్ అనువారు 'శ్రీరామకృష్ణపుంథి' అను మహాకావ్య మల్లిరి. శ్రీ శారదానందస్వామి శ్రీరామకృష్ణలీలాప్రసంగము రచించి గురుహృదయమును హృదయంగమ మొనరించిరి. శ్రీరామకృష్ణులే చెప్పిన కొన్ని అపూర్వవిషయములను వీరును వారును మఱికొందఱును గ్రంథస్థము చేసిరి. శ్రీరామకృష్ణులు శరీర ముపసంహరించి నేఁటికి డెబ్బదేండ్లు. ఈ డెబ్బదేండ్లలో వారి వాణి చాల వట్టు వెల్లడికి వచ్చెనని యనుకొందును. ఆంగ్లభాషయందును పరాసుభాషయందును శ్రీరామకృష్ణుని నిండు చరిత్రములు వెలువడియున్నవి. శ్రీ చిరంతనానందులు పలుపూవులనుండి తేనియను సేకరించు తుమ్మెదవలె ఈ గ్రంథసముదాయమునుండియు తమ గురువులు విజ్ఞానానందులనుండియు ఆయాయావిషయములను సేకరించి శ్రీరామకృష్ణుని జీవితచరిత్రమను మధుచక్రమును నేఁటికి తెలుఁగుబాసయందును నిర్మించిరి.

'శ్రీరామకృష్ణుఁడాపాదమస్తకము ఆత్మవైభవము' అని శ్రీ ప్రతాప చంద్రులును, 'దివ్యవైభవము' అని శ్రీ విజయగోస్వామియు అని నటులు ఈ చిరంతనానందుల శ్రీరామకృష్ణ జీవితచరిత్ర ఆద్యంతము ఆత్మవైభవమే, దివ్యవైభవమే. ఇది యొకదెస కావ్యము, ఇంకొకదెస చరిత్రము; వెరసి తత్త్వసంహిత, లేక దివ్యకావ్యము.

ఎంత వ్రాసినను, ఎంత చెప్పినను, శ్రీ రామకృష్ణులు మిగిలియే పోయినను, ఈ గ్రంథము ఓరపారలు లేక ఆ మిగులును సూచించుచునే యానందము ననుసంధానము చేయుచున్నది. ఇన్ని కొలఁది పుటలలో ఇంత నానైశ్వర్యముతో మిళితమైన మహానంద మిముడ్చుట శ్రీ చిరంతనానందుల శక్తిస్ఫూర్తియే. ఈ గ్రంథము చదువుటే నిదిధ్యాస. ఈ గ్రంథము చదువుకొనుచుఁబోదుమేని శ్రీరామకృష్ణులే తమ కథ తాము చెప్పుకొనిపోవుచుండఁగా మనము వినుచున్నటు లుండును.

ఐహికాముష్మికశ్రేయస్సాధనభూతమగు నేదేని ధార్మికవీరచరిత్రను ఉన్నతపాఠశాలలలోఁగాని కళాశాలలలోఁగాని మన బాలురచేఁ జదివింపఁదలఁచినచో శ్రీరామకృష్ణచరిత్రకంటె సర్వధర్మసమన్వితమగు గ్రంథ మింకొండు దొరకునా? ఆబాలగోపాలము తెలియుచు, మహావేగముతో ప్రవహించుచు, అదోషమగు భాషతో అందఱ నాకట్టు ఈ శ్రీరామకృష్ణ జీవితచరిత్ర శారదాకంఠమున ఓంకారఘంట! రోమాంచముల పంట!

ఈగ్రంథపురుషుఁడు, చరిత్ర, బోధ, గ్రంథకర్త, రచన, మధురము. సర్వము మధురము.

సబ్రహ్మచారీ! శ్రీ చిరంతనానందులు నీచేతి కందించిన యీ గ్రంథమునం దేపుట యెత్తినను అది నీయంతఃకరణమును కబళించును. భగవద్దర్శనమున కే వ్యాకులత కావలయునని శ్రీరామకృష్ణులు చెప్పిరో

యీ వ్యాకులత దీనివలన నీకు గలుగక తప్పదు. ఇందలి ప్రతిపుటయు నీ యానందాశ్రువులచే తడియకమానదు.

సతీర్థ్యుఁడా! భగవద్వ్యాకులత వలయునా, దీనిని జదువుము! మొఱయుఁ గూఁతయు నిడఁగోరుదువా, దీనిని జదువుము! రోమాంచ నేత్రములఁ దాల్పఁదలఁతువా, దీనిఁ జదువుము! బ్రహ్మవారి వర్షించు కెటులో నేర్చుకొందువా, శ్రీరామకృష్ణజీవితచరిత్ర చదువుము!

చిరివాడ, కృష్ణా
12–6–1956

వేలూరి శివరామశాస్త్రి
శతావధాని

## సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 5 | 17 | శుఖలాల్ | సుఖలాల్ |
| | 18 | | |
| 373 | 4 | దేవత | దేవర |

మిగిలిపోయిన మఱికొన్ని చిన్నచిన్న పొరపాట్లను పాఠకులే యథోచితముగా సవరించుకొందురు గాక!

# వివేకానందవాణి

శ్రీరామకృష్ణుని జీవితము ఆయన యుపదేశములకంటెను సహస్రగుణాధికముగా ఉపనిషత్తులపై సజీవభాష్యము; మానవరూపము దాల్చిన ఉపనిషత్సారమే యాతఁడనియుఁ జెప్పనొప్పును. అట్టి నిరుపమానపరిపూర్ణత, సర్వజీవులపైనను అవ్యాజముగాఁ బ్రసరించు నట్టి యద్భుతమైన దయ, సంసారబద్ధులగు మానవులయందు అట్టి గాఢ సానుభూతియు ఈ ప్రపంచమున మఱెచ్చటను గానరావు.... ప్రాచ్య పాశ్చాత్యనాగరికతా సమ్మేళనమును గొనివచ్చుటకై యాతఁడు ఆవిర్భవించెను. గతించిన అనేకశతాబ్దములుగా ఇంతటి మహనీయుని — ఇట్టి యద్భుతధర్మసమన్వయాచార్యుని — భారతమాత కనియుండలేదు.... ఈ నవ-యుగధర్మము ప్రపంచమున కంతకును — ముఖ్యముగా భారతదేశమునకు — విశేషకల్యాణహేతుభూతము ; ఈ నవ-యుగధర్మప్రవర్తకుఁడగు శ్రీరామకృష్ణభగవానుఁడు ప్రాచీనమతస్థాపనాచార్యుల పునస్సంస్కృతమూర్తి.

ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము అనునవి ఆత్మవికాసమున క్రమావస్థలనెడి యీతని సిద్ధాంతమువలననే వేదములు అర్థవంతములగును. శాస్త్రములకు సమన్వయ మేర్పడును. అన్యమతములయెడ సహనము నవలంబింపవలయు ననుటయేకాక, అన్యమతములును మోక్షమార్గములే యని మనఃపూర్వకముగా నంగీకరింపవలయుననియు సత్యమే సర్వమతములకును మూలాధార మనియు నాతని యుపదేశము.

భగవంతుఁడు సర్వవ్యాపియై యున్నను, మానవవ్యక్తిత్వశీలములందును, తన్మూలముననుమాత్రమే మనకు గ్రాహ్యుఁడు కాఁగలఁడు. రామకృష్ణునంతటి పరిపూర్ణమైన వ్యక్తియు రామకృష్ణుని శీల మంతటి పరిపూర్ణమైన శీలమును మున్నెన్నఁడును భాసించియుండలేదు — అట్టి యాతని శీలవ్యక్తిత్వములే మనకు ఆదర్శమై యుండవలయును : మఱియు

ప్రతివ్యక్తియు తన దృక్పథమును, తన యిచ్ఛను అనుసరించి భగవంతుఁడుగనో, రక్షకుఁడుగనో, ఆచార్యుఁడుగనో, ఆదర్శమూర్తిగనో, మహాపురుషుఁడుగనో ఆతనిఁ బరిగణింప మనము అంగీకరింపవలయును.

పూర్వాచార్యు లందఱి యుపదేశములకంటెను పరమహంసదేవుని యుపదేశములు విశేషముగా స్వతంత్రములు, ఉదారాశయసమంచితములు, క్రమవికాసహేతుభూతములు. పూర్వాచార్యుల భావములు ఒకవిధముగా పాక్షికములై యుండ, యోగ-జ్ఞాన-కర్మ-భక్తిమార్గములందలి ఉత్తమతత్త్వములు నూతనసమాజమును నిర్మించునటులు నేఁ డొండొంటితో సమ్మేళన మొందింపఁబడవలయునని యీ నూతనావతారమూర్తి, లేక నూతనాచార్యుఁడు మనకు ఉపదేశించుచున్నాఁడు. పూర్వసంప్రదాయములు మంచివే, కాని యోగ-జ్ఞాన-కర్మ-భక్తిసంయోగము-స్త్రీపురుషాదిభేదములను పాటింపక, ఆచండాలము భక్తిజ్ఞానముల నందఁజేయు ధర్మవ్యాపనము—వర్తమానయుగ నవీనధర్మము, నవీనమతము. పూర్వావతారపురుషులు తెల్పిన విషయములు మంచివే, కాని యవన్నియు రామకృష్ణుని వ్యక్తిత్వమున సమ్మేళన మందినవి.

శ్లో. ఆచణ్డాలాప్రతిహతరయో యస్య ప్రేమప్రవాహః
లోకాతీతోఽప్యహహ న జహౌ లోకకల్యాణమార్గమ్,
త్రైలోక్యేఽప్యప్రతిమమహిమా జానకీప్రాణబన్ధు
ర్భక్త్యా జ్ఞానం వృతవరవపుః సీతయా యో హి రామః.
స్తబ్ధీకృత్య ప్రలయకలితం వాహవోత్థం మహాన్తమ్
హిత్వా రాత్రిం ప్రకృతిసహజా మన్ధతామిస్ర మిశ్రామ్,
గీతం శాన్తం మధురమపి యః సింహనాదం జగర్జ
సోఽయం జాతః ప్రథితపురుషో రామకృష్ణ స్త్విదానీమ్.

[తా॥ ఎవ్వని ప్రేమవాహిని చండాలుర (హరిజనుల) పర్యంతము అప్రతిహతమై ప్రవహించెనో, ఎవఁడు లోకాతీతుఁ డయ్యు, లోక

కల్యాణమార్గమును వీడలేదో, ఎవఁడు ముల్లోకములయందును సాటిలేని మహిమాన్వితుఁడో, ఎవని విశుద్ధశరీరము సీతాస్వరూపమున భక్తిచే సమావృత మయ్యెనో, ఎవఁడు రాముఁడై జానకీప్రాణేశ్వరుఁడై వెల్గొం చెనో, ఎవఁడు కృష్ణుఁడై, ప్రశాంతము, మధురము నయ్యు, తోడ్తోడనే సింహనాదమువలె గంభీరమై ఘోరయుద్ధ సంకులధ్వని నణఁచివేసి ప్రకృతిసహజమగు నజ్ఞానాంధకారమును నశింపఁజేయఁజాలు గీతా గానము నొనరించెనో—ఆ నిత్యప్రసిద్ధపూరుషుఁడే ఇపుడు ఈ రామ కృష్ణుఁడై ఆవిర్భవించెను.]

ఎయ్యది యనంత వేదోదధిని మథించుటచే లభించెనో, హరిహర బ్రహ్మాదిదేవత లెందు తమ బలమును గ్రుమ్మరించియుండిరో, అవతార మూర్తుల ప్రాణసారముచే నెయ్యది పూరింపఁబడియెనో—అట్టి పరమా మృతము శ్రీరామకృష్ణుని వ్యక్తిత్వమున పరిపూర్ణమై యొప్పారుచున్నది.

(వేయేల,) అతఁడు ఆధ్యాత్మికసాగరము, అతని యాశయములు అనంతములు, బ్రహ్మజ్ఞానమునకైనను పరిమితి కనుఁగొనవచ్చునేమో కాని, అగాధమగు గురుమహాశయుని మన స్తత్త్వ మిట్టిదని నిర్ణయింపఁ జాలము. ఆ మహాత్ముని కరుణాకటాక్షవీక్షణ మొక్కటి ప్రసరించినఁ జాలును, లక్షమంది వివేకానందులు అరనిముసములో బయలుదేఱఁగలరు!

—శ్రీ వివేకానందస్వామి

[ఇందలి తుదిపరిచ్ఛేదము 'The Life of Swami Vivekananda by his Eastern and Western Disciples' ('శ్రీ వివేకా నంద జీవిత చరిత్ర') నుండియు మిగిలిన పైవాక్కులు The Complete Works of Swami Vivekananda—అందు ముఖ్యముగా 'Letters of Swami Vivekananda' ('శ్రీ వివేకానంద లేఖావళి') నుండియు క్రోడీకరింపఁబడినవి.]

# ప్రశంస

రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్, ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ మహాశయులు ఈ గ్రంథము నందుకొని తమ కార్యదర్శుల ద్వారా ధన్యవాదములను దెల్పియున్నారు. ఆ లేఖలతోఁబాటు శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి, శ్రీ మా. స. గోళ్వాల్కర్, శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ మహోదయులును, శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీ సి. పి. రామస్వామిఅయ్యర్, శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగారు, శ్రీ డి. ఎస్. శర్మ, శ్రీ కందుకూరు మల్లికార్జునం, శ్రీ కాశీ కృష్ణాచార్య, శ్రీ టి. ఎమ్. పి. మహాదేవన్ మున్నగు ప్రముఖులును, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు పలువురును, యతిపండితవరేణ్యాదు లనేకులును, 'ఆంధ్రపత్రిక', 'ఆంధ్రప్రభ', 'హిందు', 'త్రివేణి' మున్నగు పత్రికారాజములును, ఆలిండియా రేడియోవారును, ఈ గ్రంథమును గూర్చి యొనర్చిన దివ్య ప్రశంసలలో[1] అనేకము శ్రీ వివేకానంద ప్రోక్తమగు శ్రీరామకృష్ణ జీవిత సంగ్రహముతోఁ గూడిన 'శ్రీరామకృష్ణపరమహంస : మహాజనవాణి'[2] యను పొత్తమునఁ బొందుపఱుపఁబడియున్నవి.

---

[1] ఈ ప్రశంసలు కొన్ని చివరి అట్టమీఁదను 'జాకెట్' మీఁదను ముద్రింపఁబడియున్నవి.

[2] దీని వెల నాలుగణాలు; ఈ గ్రంథప్రతులు వెంకట్రామ అండ్ కంపెని, P. O. తెనాలి (R. S.) వారియొద్ద దొరకును.

# విషయసూచిక

## పటములు

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణుని జీవితచరిత్ర

## వంశచరిత

శ్రీ నిలయమగు కమలము అడుసునుండి వెలువడు చున్నను, దానిచే నిసుమంతయు మాలిన్యము నొందక, తన శిరమును జలములపై కెత్తి వినిర్మలవాతావరణమునఁ దేలియాడుచు, తన దివ్యసౌరభసౌందర్యములను నల్దిక్కులను వెలార్చుచుండును. రాయంచ జలసమ్మిశ్రితమగు పాలనుండి జలమును వేఱుపఱిచి పాలను గ్రోలును. ఇట్లే మహనీయులు సంసారమున మెలఁగుచుండియు, సంసారపంక నిమగ్నులుకాక నిర్లిప్తులై బ్రహ్మానందామృతమును గ్రోలుచు, పరమహంసలై వెలయుచుందురు. మానససరోవరములీల ప్రశాంతము, గంభీరము, మందాకినీతోయములవలె వినిర్మలము, సుమధురము, నవవికసితప్రసూనమువోలె మృదులము, మనోజ్ఞము, హిమాలయముపోల్కి సుస్థిరము, మహోన్నతము, అటు లయ్యును దివ్యఫలసంభరితతరుశాఖ చందమున వినమ్రము, విశ్వజనమహోపకారకము నగు శీలమున దీపించు వీరలే సర్వజనసన్మార్గదర్శకులు, విశ్వకల్యాణహేతుభూతులు. ఇట్టి మహనీయులలో ఉత్తమోత్తమ గణ్యుఁడగు శ్రీ రామకృష్ణ పరమహంసుని చరిత్ర మన కెంతయు పఠనీయము, స్మరణీయము, మననీయమునుగదా!

క్రీస్తుశకము పదునెనిమిదవ శతాబ్దమునడుమ వంగ దేశమున హుగ్లీ జిల్లాయందలి దేరేపుర్ (దేరేపురము) అను గ్రామమున పూర్వాచారపరాయణమగు నొక బ్రాహ్మణ వంశమున మాణిక్ రామ్ చట్టోపాధ్యాయ్ (మాణిక్యరామ చట్టోపాధ్యాయ) అను నొక సంపన్నగృహస్థుఁ డుండెను. చట్టోపాధ్యాయులు (చటర్జీ) అనఁబరఁగుచుండిన యీ వంశీయులు దైవభక్తిపరులు, ఋజుమార్గవర్తనులు నై పవిత్ర జీవనమునకు పేరుగాంచియుండిరి. ప్రాయికముగా ఈ వంశీయులందఱిపేర్లలోను వెలయు రామనామము శ్రీరామ చంద్రుఁడు వీరి కులదైవమని చెప్పక చెప్పుచుండును. ఇంచు మించుగా నేఁబది యెకరముల భూమికి అధిపతియు దయార్ద్రహృదయుఁడు నగు మాణిక్యరాముఁడు పేదసాదలకు తోడునీడయై వారల ప్రేమగౌరవములను జూఱకొను చుండెను. ఆతనికి ప్రాయికముగా 1775-వ సంవత్సరమున ఖుదిరామ్ (క్షుదిరామ్) అను పుత్త్రుఁడును కాలక్రమమున నిధిరామ్, కానాయ్ రామ్ అను కుమాళ్లును, రామశీల యను కుమార్తెయును గలిగిరి. మాణిక్యరాముఁడు గతించిన పిమ్మట కుటుంబసంరక్షణభారమంతయు బాల్యము దాఁటియు దాఁటని క్షుదిరామునిపైఁ బడెను.

క్షుదిరాముఁడు ఆదర్శశీలసంపన్నుఁడు; తన కెట్టి కష్టనష్టములు వాటిల్లినను న్యాయ్యమార్గమును అణుమాత్ర మును జవదాఁటియెఱుఁగని ధర్మతత్పరుఁడు; భక్తుల సమస్త భారములను శ్రీరాముఁడే వహించునను దృఢవిశ్వాసముతో అనన్యగతిగా నాతని సేవించుచుండిన మహాభక్తుఁడు. భగ

వానుని యనుంగుబిడ్డలలో మేటియగు మన కథానాయకుని పుత్త్రునిగాఁ బడయనున్న మహాభాగ్యశాలియగు సీతని సుగుణసంపదనుగూర్చి యాతఁడే—శ్రీరామకృష్ణుఁడే—శిష్యులతోడను భక్తులతోడను ఇట్లు ముచ్చటించును: "మా నాయనగారు పూజాజపధ్యానములతోడనే దినమున అధికభాగము గడపుచుండువారు. సంధ్యావందనసమయమున, 'ఆయాహి వరదే దేవి...'[1] యను మంత్రము నుచ్చరించుచు, గాయత్రిని ఆహ్వానించునపు డాయన వక్షఃస్థల మొకటికి యెఱ్ఱవాఱి అశ్రుధారలతోఁ దడిసిపోవుచుండెడిది. 'రఘుబీర్! రఘుబీర్!' అని యుచ్చరించునపుడును ఆయన వక్షము ఎఱ్ఱవాఱెడిది. పూజాదులలో నిమగ్నులు కాకుండునపు డాయన రఘువీరుని అలంకరించుటకై సూదిదారములతో పూలదండలు గ్రుచ్చుచు కాలము గడపువారు. కూటసాక్ష్యము చెప్ప వెఱచి పిత్రార్జితమైన నివేశనమును విడనాడివేసిరి. గ్రామస్థులు ఆయనను సాక్షాత్తు ఋషిగాఁ బూజించువారు. పాదుకలను దాల్చి, యూరిలోని చిఱువీథులలో ఆయన నడచునప్పుడు వర్తకులు, 'అదిగో, ఆయన వచ్చుచున్నారు!' అని చెప్పుకొనుచు లేచి నిలుచుండువారు. హాల్దార్ చెఱువులో ఆయన స్నానముచేయునపుడు గ్రామస్థు లెవ్వరును అం దడుగిడ సాహసించువారు కారు. తాము స్నానముచేయుటకుముందు వా రాయన స్నానమైనదా యని విచారణచేయువారు."

[1] "ఆయాతు వరదా దేవి..." అని దక్షిణదేశమున దీనికి మన్న పాఠాంతరము.

క్షుదిరామునిని సుశీలసంపదకుఁ దగిన స్వరూపసంపద. పొడవరి, బలిష్ఠుఁడు, పచ్చని శరీరచ్ఛాయ, చక్కని ముఖాకృతి. సనాతనబ్రాహ్మణత్వము ఆతనియం దుట్టిపడు చుండెడిది. శూద్రులవలన నాతఁడు దానములు పట్టువాఁడు కాఁడు. కన్యాదానముచేయక కన్యాశుల్కమును గ్రహించు నట్టి బ్రాహ్మణులు తాఁకిన జలమునుసైత మాతఁడు స్వీక రించువాఁడు కాఁడు.

ప్రథమభార్య బాల్యముననే చనిపోవ, క్షుదిరాముఁడు చంద్రమణీదేవియను కన్యను బెండ్లియాడెను. సర్వవిధము లను క్షుదిరామునకుఁ దగిన యిల్లాలగు నీమె యెల్లరయం దును ఆప్తప్రేమానురాగములు చూపుచుండెడిది. సహజ ముగా తల్లియే ప్రేమవల్లి యనఁదగియుండ, "ఒక్కజీవికి సాయముచేయఁగలుగుచో, సహస్రపర్యాయములు కుక్కనై పుట్టుటకైన సంసిద్ధుఁడను" అని వక్కాణించిన విశ్వమానవ ప్రేమమయునకు—సర్వభూతప్రేమపూరితునకు—తల్లియగు సాధ్వీమతల్లి ప్రేమంపుఁ బాలవెల్లియై యొప్పెనన్నచో, ఆశ్చర్యమేమి? సుందరాకృతితో, దానిని మించిన సుగుణ ములతో శోభిల్లుచుండిన యీయామెనుగూర్చి శ్రీరామ కృష్ణుఁడు భక్తులకును శిష్యులకును నిట్లు వచించును: "మా అమ్మ కల్లకపటము లెఱుఁగని శుద్ధసత్యకాలపుస్త్రీ. లౌకిక వ్యాపారజ్ఞాన మామెకు లేదు. డబ్బు లెక్కపెట్టఁజాలకుండె డిది. దాఁపఱికము నెఱుఁగని యామె తన కడుపులోని మాట నెవ్వరితోనైనను జెప్పివేయును. అందుచే లోకు లామెను 'వెఱ్ఱిబాగులమ్మ' అనువారు. ఎల్లరకును భోజన

మిడుట—అన్నదానము చేయుట—ఆమెకు పరమానందము.”

ధార్మికులకే ధర్మపరీక్షాసంఘటనములు. దేరేపుర గ్రామపు జమీందారుఁడు రామానందరాయ్ అతినిరంకుశుఁడు, కుటిలుఁడు. ఈతఁ డొకనిపై నొక దొంగవ్యాజ్యేము తెచ్చి తనపక్షమున సాక్ష్యమిమ్మని క్షుదిరాముని నిర్బంధింపసాగెను. పితృసత్యపరిపాలనమునకై సర్వము త్యజించిన శ్రీరామచంద్రుని మహాభక్తుఁడగు క్షుదిరాముఁడు అందులకు అంగీకరింపమిచే రామానందరాయ్ పగపట్టి యాతనిపై మఱియొక అసత్యపువ్యాజ్యేము దెచ్చి పిత్రార్జితమైన యాతని భూవసతులనేకాక, వంశానుగతముగా నాతనికి నిలువ నీడ నిచ్చుచుండిన కుటీరములనుసైతము హరించెను. ఎంతటి బలవంతుఁడగు దుర్మార్గుఁడైనను మహాత్ముల భూధనాదిసంపదలను హరింపఁగలఁడేమో కాని వారల ధైర్యస్థైర్యాది సుగుణసంపదను హరింపఁజాలఁడుకదా! క్షుదిరాముఁ డిసుమంతయుఁ జలింపలేదు. సమీపగ్రామమగు కామార్పుకుర్ నందలి తన మిత్రుఁడు, జమీందారుఁడును నగు శుఖలాల్ గోస్వామి తన్ను ఆహ్వానింప, నివాసార్థము క్షుదిరాముఁ డచటికి వెడలెను. శుఖలాలు తన నివేశనమునకు సంబంధించిన కొన్ని కుటీరములను, 'లక్ష్మీజల' యను మహాసంపన్నిలయమగు నరయెకరము పొలమును క్షుదిరామునకు ఉచితముగా నొసఁగెను.

క్షుదిరాముని నూతననివాసమగు కామార్పుకుర్ (కమ్మరిచెఱువని శబ్దార్థము) హుగ్లీజిల్లా పశ్చిమోత్తరపు సరిహద్దు మిట్టను, బాంకురా మేదినీపురముల సమీపమున

వెలయు నొక పల్లెటూరు. బంగారము పండు వంగదేశము నందలి గ్రామములు అప్పటికి మన్నెపుజ్వరముల బారిపడక, ఆరోగ్యైశ్వర్యవంతములై యలరారుచుండెడివి. అభివృద్ధి నొందిన వడ్రంగము, కలకత్తాబజారులలోసైతము పేరు పొందిన దోవతులకును చీరలకును మూలమగు చేనేతపరి శ్రమ మున్నగు విశేషములతో, పాఁడిపంటలతో, ప్రాయిక ముగా సంవత్సరము పొడవునను జరుపఁబడు నానాదేవతో త్సవములతో కామార్పుకుర్ కలకలలాడుచుండెడిది.

భార్యతోడను, పదేండ్లయీడు గల రామకుమార్ అను ప్రథమపుత్త్రునితోడను, నాలుగేండ్ల యీడుగల కాత్యాయని యను కుమార్తెతోడను క్షుదిరాముఁడు తన ముప్పదితొమ్మిదవయేట నూతనగృహప్రవేశ మొనర్చెను. ఆకస్మికముగా నొక జమీందారునివలన భరింపరాని యిక్కట్టు వాటిల్లుటయు, ఈ విపత్కాలమున మఱియొక జమీందారుని చేయూఁతరూపమున భగవదనుగ్రహము తనపై నద్భుతముగాఁ బ్రసరించుటయు నాతని విషయవిర క్తిని, భగవదనురక్తిని ఇనుమడింపఁజేసెను. కులదైవము, తన యిష్టదైవమునగు శ్రీరామచంద్రుని ధ్యానప్రార్థనాదుల తోడనే యాతఁ డించుమించుగా దినమంతయుఁ గడప సాగెను. పొలములో నాఱు నాటు సమయమున క్షుది రాముఁడు స్వయముగాఁ గొన్ని వరిమొలకలను గైకొని రఘువీరజయజయధ్వానములతో నాట, మిగిలిన కృషిని పాలికాఁపులు పూర్తిచేయువారు. సార్థకనామధేయయగు 'లక్ష్మీజల' వలన నాతని కుటుంబమునకు వలసినంత గ్రాసము

లభించుటయేకాక, యాచకులకును అతిథులకును అన్నప్రదానమునకు వలయు ధాన్యముసైతము మిగులుచుండెను.

ఒకనాఁడు క్షుదిరాముఁడు గ్రామాంతరము వెడలి తిరిగివచ్చుచు, అలసటచెంది యొక వరిపొలముప్రక్కనున్న చెట్టునీడను గూర్చుండి, యంతలో నిద్రితుఁడై దివ్యస్వప్నము గాంచెను. తన యిష్టదైవమగు శ్రీరామచంద్రుఁడు లేలేత గఱికపోచచాయను బోలు మేనిచాయతో నొప్పు బాలకుని రూపమున ప్రత్యక్షమై యిట్లు పల్కెను: "అలక్షితుఁడనై అనేకదినములుగా నిరాహారినై యిచటఁ బడియున్నాను. నీ సేవలను బొందవలయునని నా గాఢాభిలాష. నన్ను మీ యింటికిఁ దీసికొని పొమ్ము." దివ్యానందపరవశుఁడై క్షుదిరాముఁడు ఆ భక్తవత్సలునకుఁ బదేపదే ప్రణమిల్లి, "ప్రభూ! భక్తిహీనుఁడను, నిఱుపేదను. నా కుటీరమున మీకుఁ దగు సపర్యలను నేనెట్లు చేయఁగలను?..." అని విన్నవింప, బాలరామచంద్రుఁడు అభయ మొసఁగుచు, "నీసేవలచే సంతుష్టుఁడనై యుందును" అని వచించెను. క్షుదిరాముఁడు మేల్కొని, స్వప్నమనికాని, యథార్థజాగ్రదనుభూతియనికాని నిర్ణయింపఁజాలని విచిత్రమానసికస్థితిలో నలువైపులను గలయఁ జూచుసరికి, సరిగా కలలో సూచింపఁబడిన తావు గోచరింప, దడదడలాడు నెడఁదతో, తడఁబడుచుండిన యడుగులతో నచటి కేఁగునుగదా, యొక త్రాఁచుపడగనీడ నొక సాలగ్రామము కనుపించెను! భయాశ్చర్యానందములు ముప్పిరిగొని భక్తిభావమున లయింప, ఆ సాలగ్రామమును గ్రహించుటకై యాతఁడు చేయి చాఁచినంతనే సర్పము అంతర్ధాన

మయ్యెను. ముక్తకంఠమున రఘువీరజయజయనినాదము లొనరించుచు, దానిని కన్నుల కద్దుకొని, కౌఁగిటఁ జేర్చుకొని, మనసార, కన్నులారఁ దిలకింప, నిజముగా అది దివ్యలక్షణ లక్షితమగు 'రఘువీరసాలగ్రామశిల' యే! ఆ సాలగ్రామము నాతఁ డింటికిఁ గైకొనిపోయి తన యిష్టదైవముగాఁ బూజింప సాగెను.

పూజకై క్షుదిరాముఁడు పూలు సేకరించునపుడు శీతలాదేవి—అతని ఆరాధ్యదేవత—కెంజాయవలువలతో, రంగారు బంగారు నగలతో, చిఱునవ్వువెన్నెలలు గాయు మోముచందురునితో కన్యకారూపమునఁ దనయెదుట నడ యాడుచు, చెట్లకొమ్మలను వంచి పూలు గోయుటలోఁ దనకు సాయపడుచున్నట్లు ఆతఁడు ఒక్కొక్కప్పుడు దివ్య దర్శనము నొందుచుండువాఁడు.

క్షుదిరాముని అపారదైవభక్తివిశ్వాసములకు మఱి యొక నిదర్శనము. మేదినీపురమను నలుబదిమైళ్లదూర మున నున్న యొక గ్రామమునకు ఆతఁ డొకనాఁడు నడచి పోవుచు, మార్గమధ్యమున మారేడుచెట్లు నిగనిగలాడు నూతన దళములతో మనోహరమై యొప్పుచుండుటఁ గాంచెను. ఇఁకఁ గావలసినదేమి? శివప్రీతికరమైన యా బిల్వపత్త్రిములను సేకరించి శివపూజ గావింపవచ్చునుగదా యను భక్తిభావమున పరవశుఁడయ్యెను. జీవయాత్రాపరమ గమ్యదృష్టిని తాత్కాలికయాత్రాగమ్యము అంతర్ధాన మైనది! వలసినన్ని బిల్వపత్త్రములను సేకరించి యాతఁడు అపరాహ్ణము మూఁడుగంట లగునప్పటికిఁ దిరిగి యిల్లు చేరి,

స్నానమొనర్చి, వానితో ఆదిదేవుఁడగు శివుని, జగజ్జనని యగు శీతలాదేవిని మనసారఁ బూజించెను. మేదినీపుర ప్రయాణము ఆ మఱునాఁడు సంఘటిల్లెను.

భగవద్భక్తివిశ్వాసనిలయమగు ఈ మహనీయుని వంశమునందు అనేకులం దిట్టి తన్మయత గోచరించును. తన పినతండ్రియగు కానాయ్‌రాముని పారమార్థిక శీలవైభవ మును గొనియాడుచు శ్రీరామకృష్ణుఁ డిట్లు తెలుపును: "ఒకప్పు డొక వీథినాటకబృందము రామచంద్రనాటకము నాడుచుండెను. వనవాసమునకుఁ బొమ్మని కైకేయి శ్రీరాము నకుఁ జెప్పుచుండ, ప్రేక్షకులలో నొకఁడగు హలధారి తండ్రి (అనఁగాఁ దన పినతండ్రి) తటాలున లేచి, 'ఓ దుర్మతీ!' యని యఱచుచు, కైకేయివేషధారిని సమీపించి, వాని మొగము కాగడాతోఁ దగులఁబెట్టఁబోయెను! ఆయన పరమపావనాత్ముఁడు. స్నానానంతరము నీటిలో నిలిచి, 'రక్తవర్ణం చతుర్ముఖమ్'—ఇత్యాదికమంత్రము పఠించి ధ్యానించుచుండ, అశ్రుధారలు ఆయన చెక్కిళ్లపై జాలు వాఱుచుండెడివి."

ఇఁక మన ప్రధానకథ. క్షుదిరాముని కుమారుఁడగు రామకుమారుఁడు వివాహితుఁ డయ్యెను. బహుశాస్త్రపండి తుఁడై యాతఁడు తండ్రికి చేదోడు, వాదోడునై కుటుంబ నిర్వహణభారమును తగ్గింపసాగెను. శక్తిపూజాధురంధరుఁడై యాతఁడు దేవివిశేషానుగ్రహమును బడసెను. తదనుగ్రహ ప్రభావమున నాతఁడు చెప్పు జోస్యము అమోఘముగా ఫలించుచుండె ననుటకు అనేక నిదర్శనములు కలవు.

రామకుమారుఁడు కార్యవశమున నొకప్పుడు కలకత్తా కేఁగి స్నానార్థము గంగకు వెడలియుండ, శ్రీమంతురాలగు నొక యంతఃపురకాంత పాలకి నెక్కి యచటికి వచ్చి యందుండియే పరమగోప్యముగా స్నానమాచరించుచుండెను. అనతిదూరమున నిలిచియున్న రామకుమారున కామె వదనాంబుజము తటాలునఁ గనుపించెను. అంత నాతఁడు నిట్టూర్పు నిగిడ్చి, "ఆహా! ఒరుల కంటఁ బడకుండ, ఇంత గోప్యముగాఁ గాపాడఁబడుచున్న యీ శరీరము రేపు ఉదయము నిర్జీవకళేబరముగా ఎల్లరయెదుటను ఈ గంగయందే విసర్జింపఁబడనున్నదికదా!" యని పలికెను. సమీపస్థుఁడై యీ వాక్కులను విని విషాదాశ్చర్యచకితుఁడైన యామెభర్త యీ పలుకు లెంతవఱకు నిజమో పరీక్షింపవలయుననియు, కల్ల లగుచో నాతని శిక్షింపవలయుననియు నెంచి తన యింటికి ఆహ్వానించెను. కాని రామకుమారుని జోస్యము 'తు, చ' తప్పకుండ జరిగెను.

తన భార్య యెల్లరచే శుభలక్షణోపేతయని భావింపఁబడుచున్నను, తొలికానుపునకుఁ బిమ్మట నామె జీవింపదని రామకుమారుఁడు చెప్పివేయ నదియు సరిగా అట్లే జరిగెను. ఆమె తన ముప్పదియైదవయేటఁ జక్కని యొకమగశిశువును గని మరణించెను.

రామకుమారుఁడు కుటుంబసంరక్షణ మొనర్చుచుండ, క్షుదిరాముఁడు విశేషముగా భగవదాయత్తచిత్తుఁడై కాలము గడపుచు, ప్రాయికముగా 1824–వ సంవత్సరమున రామేశ్వరతీర్థయాత్రకు వెడలెను. క్యమునకు పట్టు

కొమ్మలు, జ్ఞానవిజ్ఞానములకు ఆలవాలములు, పుణ్యక్షేత్ర లక్ష్మికి నేత్రాంబుజములును నగు కాశీరామేశ్వరములకు ఏ సనాతనభారతపుత్రుఁడు యాత్రల నొనరింపకుండును? ఇంచు మించు పదునైదువందలమైళ్ల దూరమున నున్న రామేశ్వర మునకు క్షుదిరాముఁడు యథార్థయాత్రికధర్మము ననుసరించి పాదచారియై పయనించెను. దారిలో నున్న వివిధ పుణ్య క్షేత్రములను దర్శించుచు, తుదకు గమ్యమును జేరి శ్రీరామ లింగేశ్వరుని సేవించి కాలినడక నింటికిఁ దిరిగివచ్చునప్పటికి సుమా రొక సంవత్సర మైనది. మఱియొక సంవత్సరమున కాతనికి రెండవకుమారుఁడు కలుగ నాతనికి 'రామేశ్వర్' అని పేరిడెను.

ఇంచుమించుగాఁ బదునొకండేండ్లు అయినపిమ్మట— ఇపుడును పాదచారిగనే—క్షుదిరాముఁడు సుప్రసిద్ధమగు కాశీగయాక్షేత్రములకు యాత్ర నొనరించెను

# జననము

ఖుదిరాముఁడు కాశిలో విశ్వనాథుని సేవించి, యటనుండి బయలుదేఱి గయ చేరి, యథావిధిగా పితృకర్మల నాచరించి, యచటి గదాధరాలయమందలి గదాధర పాద కమలములందు అఖండ శ్రద్ధాభక్తులతో పితరులకు పిండ ప్రదాన మొనరించెను. గయలో ఖుదిరామునకుఁ గలిగిన అద్భుతానుభూతినిగూర్చి కాలక్రమమున శ్రీరామకృష్ణుఁడే శిష్యుల కిట్లు తెల్పును : "మా నాయనగారు గయ వెళ్లిరి. అచట రఘువీరుఁడు ఆయనకు స్వప్నమున సాక్షాత్కరించి, 'నేను నీ బిడ్డ నగుదును' అని పలికెను. అంతట నాయన గారు, 'ప్రభూ! పేదబ్రాహ్మణుఁడను, నేను మిమ్ము ఎట్లు సేవింపఁగలను?' అనిరి. 'ఆందోళన పడకు, అది నిర్వహింపఁబడును లెమ్ము' అని రఘువీరుఁడు సమాధానించెను."

గయాక్షేత్రవిధుల నన్నిఁటిని సావధానముగా నిర్వర్తించి ఖుదిరాముఁడు ఇంటికి వచ్చెను.

ఇంతలో చంద్రాదేవియు అద్భుతానుభూతుల నొందుచుండెను. ఎవ్వరో దివ్యతేజోమయ పురుషుఁడు—సరిగాఁ దన భర్తను బోలు నాతఁడు—తనప్రక్కను బండుకొనినట్లు ఒకరేయి యామె కలగాంచెను. అలౌకికరీతి నామె గర్భము దాల్చినట్లు ఈక్రిందిగాథ వినవచ్చుచున్నది : ఒకనాఁ డామె తమ యింటిసరస నున్న శివాలయము మ్రోల, తన నెచ్చెలియుఁ బొరుగింటి కమ్మరస్త్రీయు నగు

ధనితోఁగూడ నిలిచియుండ, శివవిగ్రహమునుండి దివ్యతేజః ప్రవాహము వెలువడి—దానినిగూర్చి నెచ్చెలితోఁ జెప్పఁ బోవునంతలో—తన శరీరమునఁ బ్రవేశింప, పరవశురాలై శరీరస్మృతి గోల్పోయెను. ధని యామెను సేదదేర్చి, జరిగిన కథ విని యబ్బురపడి, యది నరముల బలహీనతచేఁ గలిగిన మూర్ఛ యనుకొనెను. కాని చంద్రాదేవికిఁ దాను గర్భము దాల్చినట్లు తోఁపసాగెనఁట.

అప్రాకృత చరిత్రు లగువారి జననముసైతము అప్రాకృతమై యుండవచ్చుననుటకు పురాణేతిహాసనిదర్శనములనేకము లున్నను, అది విశేషము విశ్వాసముమీఁదను జనశ్రుతిమీఁదను ఆధారపడియున్న విషయము.

ఏమైనను, చంద్రాదేవి తన అద్భుతానుభవములను భర్తకుఁ దెలుప, నాతఁడు గయలోఁ దన కొనఁగూడిన దివ్యస్వప్నమునుగూర్చి ముచ్చటించి, అంతయు భక్తవత్సలుఁడగు రఘువీరుని వాత్సల్యవిశేషమనియు, దివ్యపుత్త్రజననమునఁ దమ జన్మము ధన్యము, తమ గృహము పావనముఁ గానున్నవనియు నామెకు విశ్వాసము గలుగ సమన్వయించెనని విందుము.

చంద్రాదేవి సహజప్రేమానురాగములు శతగుణాధికమై యెల్లరయందును బ్రసరింపసాగెను. ఆమె ప్రవర్తనమందలి యీ విశేషపరిణామమే గయనుండి తిరిగివచ్చిన క్షుదిరాముని మొట్టమొదట ఆకర్షించిన విషయము. తన కష్టసుఖముల నిసుమంతయుఁ బాటింపక, రాత్రియనక, పగలనక, స్వయముగా వెడలి కనుఁగొని యిరుగుపొరుగువారల కామె

మహోత్సాహముతో నానావిధములఁ దోడ్పడుచుండును. ఆవశ్యకమగుచోఁ దాను బస్తుండియైనను వారికి అన్నాదులను బెట్టును.

చంద్రాదేవి యీ కాలమున నించుమించుగా ప్రతిదినమేదియో యొక దివ్యదృశ్యము గాంచుటయో, దివ్య వాణిని ఆలకించుటయో, మఱి యే దివ్యానుభవము నందుటయో జరుగుచుండెడిదఁట. ఒక్కొక్కప్పు డామె దేవతలతో మంతనములాడుచుండును. ఒకనాఁ డామెకుఁ దన గదిలోఁ దానుదక్క మఱెవ్వరును లేకుండినను, ఘల్లు ఘల్లు మన చిందులుత్రొక్కుచు నడయాడు బిడ్డ గజ్జెలమ్రోఁత వినవచ్చెను. కాని యీ విచిత్రానుభవములు ఏ దయ్యాల దుండగములో, మఱి యేవ్యాధిచిహ్నములో యని యామె యొక్కొక్కప్పుడు ఆందోళనచెంది భర్తకుఁ దెలుపును. ఆతఁ డామెకు గయలోని తన దివ్యానుభూతిని జ్ఞప్తికిఁదెచ్చి యివన్నియు పరమశుభసూచకములు కాని భయకారణములు కావని యామె నూఱడించును.

చంద్రమణీదేవికి పుత్త్రోదయసమయ మాసన్నమైనది. అది మన్మథనామసంవత్సర ఫాల్గున శుక్ల ద్వితీయా బుధవారమున సుప్రభాతము—క్రీ. శ. 1836–వ సం. ఫెబ్రువరి 18–వ తేదీ.[1] సూర్యోదయమునకు సరిగా అరగడియ పూర్వము పరమశుభముహూర్తమున ఆమె పుత్త్రునిఁ గాంచెను. పుత్త్రి

1 శ్రీ శారదానందస్వామి విరచిత 'శ్రీ శ్రీరామకృష్ణ లీలాప్రసంగ(ము)'న శ్రీరామకృష్ణుని జననము క్రీ. శ. 17-2-1836 అని వేయఁబడియున్నను, ఇతరప్రామాణిక గ్రంథములలో తేది 18 గాఁ దెలుపఁ

జననమహోత్సాహసూచకములై క్షుదిరాముని గృహము నుండి గంభీరశంఖారావములు చెలరేఁగెను.

అది వసంతర్తునవోదయము. అంతవఱకును విపరీతమైన శీతయాతనచేఁ గొఱడుపాఱి, ముడుచుకొనిపోయి, కొనయూపిరితో నున్న ప్రకృతికాంత ప్రియవసంతాగమనప్రభావమున పునర్జీవితయై పులకితగాత్రియై లేఁజివురాకు జిలుగు వలువలను, రంగురంగుల పూలనగలను దాల్చి కలకలలాడుచు, ఎల్లెడలను కన్నులపండువు చేయుచుండెను. సర్వధర్మసమన్వయమూర్తియై తన యనంతప్రేమానురాగహస్తములతో విశ్వమానవకోటి నాలింగన మొనరించుకొనుటకై, తాపత్రయపరిపీడితలోకమునకు శాంతిదూతయై, ఆశాజ్యోతియై సంతతానందదాయకవసంతునితో విచ్చేసిన లోకోత్తర బాలునకు శకుంతముల కలకలారావములే సుస్వాగత గీతములై, క్షుదిరామకుటీరనిర్గత శంఖధ్వానములే జయజయ ధ్వానములై, నవవికసిత సుగంధ కుసుమసందోహములే గంధమాల్యములై యుగపురుషు నావిర్భావమును లోకమునకుఁ బ్రకటించి మించెను.

చంద్రాదేవికి మంత్రసానియగు ధని తల్లికి వలయు

బడియున్నది. ఆంగ్లపరిగణనము ననుసరించి రాత్రి పండ్రెండు గంటల తరువాత మందటి తేది మాఱును; సూర్యోదయమునకు అరగడియ ముందే ఈ జననమై, నాఁడు బుధవారముగా 'లీలాప్రసంగ(ము)'నఁ బేర్కొనఁబడియున్నది; ఇత్యాదికారణములను బట్టి తేదిని వారమును పరిచూచి, నాఁడు 18-వ తేదిగా మేము వ్రాసియున్నా మని పాఠకులు గు రింతురుగాక.

పాయ మొనర్చి బిడ్డ నరయ, తా నుంచినచోట లేఁడు! ప్రక్క నున్న పొయ్యిలోనికిఁ బొరలి భావిమహత్తర వివేక వైరాగ్య విభూతులను సూచించుటకో యన, బూడిదచే సగము కప్పఁ బడి యేడుపుకూడ లేకుండఁ బరుండియుండెను.

చేతులలో నిడుకొనిచూడ, ఆఱునెలల బిడ్డయంతటి పరిమాణము గలిగియుండి యామెకు ఆశ్చర్యము గొల్పెను. పుత్త్రజననశుభవార్తను విని యిరుగుపొరుగువా రందఱును మహానందము నందిరి. జ్యోతిషవేత్తయగు క్షుదిరాముఁడు జాతకగణన మొనర్చి శిశువునకు మహోన్నతభావిదశ కలదని గ్రహించెను. కాలక్రమమున సుప్రసిద్ధ జ్యోతిష పండితులు దానిని స్థిరీకరించుచు, పరమశుభలగ్నమున మహోత్తమ గ్రహసంయోగములందు ఉదయించిన యాబాలకుఁడు ఆచంద్రతారార్కయశస్సాంద్రుఁడగు మహనీయుఁడై వెలయు నని వక్కాణించిరి.[1]

క్షుదిరాముఁడు గయయందలి తన దివ్యానుభూతి ననుసరించి బాలకునకు 'గదాధర్' అని నామకరణ మొన ర్చెను. అతని ముద్దుపేరు 'గదాయ్'.

[1] అనుబంధమున జాతకము చూడనగును.

# బాల్యము

ఆర్థికస్థితిని పేదలయ్యు, పారమార్థికసంస్థితిని మహాభాగ్యవంతులగు చంద్రమణీక్షుదిరాముల పరిపోషణమున బాల గదాధరుఁడు దినదినప్రవర్ధమానుఁ డగుచుండెను. గదాధరుఁడు ఉదయించిన నాఁటినుండియు క్షుదిరాముని ఆర్థిక పరిస్థితి అభివృద్ధి నొందసాగెను. రామకుమారుఁడు శాంతిస్వస్త్యయనాది కర్మలను పూజలను విధ్యుక్తముగా జరిపించుటయందు మంచి పేరుప్రతిష్ఠల నొంద, ప్రస్తుత కుటుంబ పరిస్థితులలో వ్యయమునకుఁ దగురీతిని ఆదాయమును హెచ్చెను. మఱియు క్షుదిరాముని మేనల్లుఁడును సంపన్నుఁడును నగు రామచంద్రుఁడు గదాధరజనన శుభవార్తను విని, యింతవఱకు ప్రతిమాసము దాను బంపుచుండిన పదునైదు రూకలతోఁబాటిపుడొక పాఁడియావును బంపెను.

ఐదాఱునెలలైనవి, అన్నప్రాశనసమయము వచ్చినది. మొదట క్షుదిరాముఁడు తన స్థితికిఁ దగురీతిని దానిని సామాన్యముగా, సంస్కారమాత్రముగా జరుపనెంచెను. కాని యూరిలోని బ్రాహ్మణులు క్షుదిరాముని మిత్రుఁడును, శ్రీమంతుఁడును నగు ధర్మదాస్‌లాహా రహస్యముగాఁ దమ్ముఁ బ్రోత్సహింప, దానిని వైభవోపేతముగా జరుపుఁడని క్షుదిరామునిఁ గోరిరి. విత్తముకొలఁదియు వైభవము— తన కంత విత్త మెక్కడిది? క్షుదిరాముఁడు తుదకుఁ దన మిత్రునితో సంప్రతించి యాతని తోడ్పాటున నెల్లరకును

మహాసంబరముగా అన్నప్రాశనమహోత్సవము జరిపెను. బ్రాహ్మణులకేకాక యితరజాతులకును, భిక్షుకులకును సంతర్పణ జరుగ వారందఱును బిడ్డను దీవించిరి.

ఏపునకుఁ దగిన యందచందములతో అలరారుచుండిన బాలగదాధరుఁడనిన, ఎల్లరకును అల్లారుముద్దు. ఇరుగు పొరుగమ్మలక్కలందఱును ఏదియో నెపమునఁ బనికట్టుకొనియైనను వచ్చి, "చంద్రమ్మగారి కొడుకు చంద్రుఁడేనమ్మా" యనుచు, నాతని నెత్తుకొని ముద్దాడి మురిసిపోవుచుండువారు. ఇది యిట్లుండ, చంద్రాదేవికి అత్యంతభయహేతువులైన వివిధాద్భుతసంఘటనలు గదాధరుఁడు జన్మించినప్పటి నుండియు జరుగుచుండినట్లు కొన్ని యితిహాసములు వినవచ్చుచున్నవి. శిశువు కొన్నివేళలఁ దా నెత్తుకొనఁజాలనంతటి భారముగాఁ దోఁపఁ దనకు సాయమొనర్పుటకై యామె తన భర్తను బిలుచును. మఱుక్షణము గదాధరుఁడు పూర్వమువలెనే తేలికగా నుండును. ఒకనాఁ డామె బిడ్డను మంచముపైఁ బండుకొనఁబెట్టి, దోమతెర కట్టి, కార్యాంతరమున బైటికి వెడలి వచ్చి చూడ, తన బిడ్డకు మాఱుగా ఆజానుబాహువగు నొక నూతనపురుషుఁడు శయనించియున్నట్లు కనఁబడెను. క్షుదిరాముఁ డేమి చెప్పినను, వేయి కన్నులతోఁ దన బిడ్డ సేమ మరయు నామె మాతృహృదయము కుదుటఁ బడదయ్యె. ఆ విచిత్రచర్యలు భూతముల యాగడములు కాఁబోలునని యింకను భీతిల్లుచు, పిల్లవానికేముప్పును బాటిల్లకుండుఁగాతమని పలుదేవతల కాతల్లి మ్రొక్కుకొనుచుండుచు.

కాలవాహిని చయ్యనఁ బ్రవహించెను; సంవత్సరములు గడచెను. రూపరేఖావిలాసములతో ముద్దులు మూటగట్టుచుండిన గదాధరుఁడు ఏదేండ్ల బాలుఁడయ్యెను. అంతటి చిన్ననాఁడే యాతఁడు చూపుచుండిన అసాధారణమగు ధారణాశక్తిని, బుద్ధికౌశలమును గని క్షుదిరాముఁడు ఆశ్చర్యానందభరితుఁ డగుచుండెను. ప్రియనందనుని కాతఁడు తమ పూర్వవంశీయనామావళిని, దేవతాస్తోత్రములను, రామాయణమహాభారత కథలను జెప్పుచుండును. గదాధరుఁడు ఏకసంధాగ్రాహి. ఒక్కసారి యాలకించిన విషయములను మరల నెంతకాలమునకైనను నిర్దుష్టముగ నొప్పఁజెప్పఁగలుగువాఁడు. సకాలమున క్షుదిరాముఁ డాతనికి అక్షరాభ్యాససంస్కారము జరిపించి పాఠశాలకుఁ బంపెను. అనతికాలముననే గదాధరుఁడు ఉపాధ్యాయులకును తోడిబాలురకును ప్రియతముఁ డయ్యెను.

గదాధరుఁడు అసాధారణుఁడని మొట్టమొదటి నుండియు గ్రహించిన క్షుదిరాముఁ డాతనియెడ ప్రత్యేకాదరాభిమానములను జూపుచు, ఆతని స్వేచ్ఛాప్రవర్తనము నరికట్టక, తోడ్తోడనే జాగరూకతతో నాతని మనస్తత్త్వానుగుణమగు శిక్షణ గఱపుచుండెను. దండనభయము గొల్పి గదాధరుని బాల్యచేష్టలను మాన్పించుట కెవ్వరికైనను అసాధ్యము. శాంతముగా, ప్రేమతో నచ్చఁజెప్పిననో, వినయవిధేయతలను జూపును. మహనీయులకు స్వాతంత్త్య ప్రవృత్తి పూవుతో ట పరిమళము గదా!

పాఠశాలలో గదాధరుఁడు చదువుటయు వ్రాయు

టయు నేర్చెను. ఐనను, కాలక్రమమునఁ దన శిష్యాగ్రగణ్యుఁడై వివేకానందనామమున జగద్విఖ్యాతుఁడై వజలిన నరేంద్రునకువలెనే గదాధరునకును గణితమనిన విముఖత. పరమార్థపరిగణనమున లెక్క లోక లెక్కలోనివి కావను కొనిరేమో ఆ భావిగురుశిష్య వరేణ్యులు! రామాయణాది పురాణపఠన మెక్కడ జరిగినను, తాను వెళ్లి శ్రద్ధగా విను వాఁడనని కాలక్రమమున నాతఁడు తెలుపును. (పురాణ కథలను బ్రదర్శించు యాత్ర లనఁబడు నొక విధమైన) వీధినాటకము లనిన గదాధరునకు అమితప్రీతి. ఊరిలో నెచట వీధినాటకము జరిగినను గదాధరుఁ డచట నుండ వలసినదే. కన్నులను చెవులను అప్పగించి నటకుల కీర్తనాభినయాదులను హృదయస్థ మొనర్చుకొని తఱచుగా నాతఁ డా నాటకములను దన చెలికాండ్రయెదుట నొక్క మాటయైనను పొల్లుపోకుండ మరలఁ బ్రదర్శించును. అనుకరణమున నాతఁడు అతి సమర్థుఁడు. నడక, సంభాషణ మున్నగు వానియందలి జనుల వైచిత్ర్యముల నాతఁడు అద్భుతరీతి ననుకరింపఁ గలుగువాఁడు. ఊరిలోని కుమ్మరుల యొద్దనుండి యాతఁడు దేవతావిగ్రహములను జేయుట నేర్చి జీవకళలతో దీపించు బొమ్మలు చేయును. చిత్రకారుల యొద్దనుండి యట్టి దేవతల బొమ్మలు చిత్రించుటయు నేర్చెను.

పురాణ ప్రసిద్ధులగు ధార్మికమహావీరుల చరిత్రలం దిట్లు బాల్యమునుండియు పరమానురక్తుఁడగు గదాధరుఁడు ముద్రిత గ్రంథములనుండి కాని, వ్రాఁతప్రతులనుండి కాని తనకు అత్యంత మనోరంజకమగు ఘట్టములను ముత్యాల

కోవలను బోలు తన యక్షరపంక్తులతోఁ దఱచు నకలు వ్రాసియుంచుకొనును. ఇట్టివానిలోఁ గొన్ని నేఁటికిని కలకత్తా యందలి బేలూర్ మఠమున భద్రపఱుపఁబడియున్నవి.

గదాధరుని గుణసంపద కాలక్రమమున సువ్యక్తము కాసాగెను. ఆతని ధైర్యమునుగూర్చి సూచించియున్నాము. దయ్యాలు తిరుగాడు తావులని యితరులు తలఁచు నిజముగా భయపిశాచగ్రస్తులై విడనాడు చోటుల కాతఁడు నిర్భయముగాఁ బోవును. ఉత్తమభక్తురాలును దన మేనత్తయు నగు రామశీల యొకప్పుడు దేవతావేశము నొందియుండ, ఇంటిలోనివా రెల్లరును అపు డామెయెడ విశేషభయభక్తులను జూపుచుండ, నిదంతయుఁ దిలకించుచుండిన బాలగదాధరుఁడు ఆసంఘటనానంతరము చిఱునవ్వుతో నిట్లు పలికెను: "అత్త నావేశించిన దేవత నన్ను ఆవేశించినచో, చాల చిత్రముగా నుండెడిది!"

గదాధరునిఁ గాంచి, యాతని పలుకులను విని, యెవ్వరైనను ముగ్ధు లగుచుండెడివారు. తోడిబాలురు ఆతని యెడఁబాటున కోర్వఁజాలకుండెడివారు. ఒక్కసారి కాంచిన వారుసైతము పండ్లను, మిఠాయులను గైకొని మరల మరల నాతనిఁ జూడవచ్చుచుందురు. సహజసిద్ధమైన యీ యాకర్షణ శక్తియే కాలక్రమమున ముముక్షు జనసహస్రముల నాతని సన్నిధికిఁ గొనివచ్చిన మహాప్రభావమై ప్రకాశించెను.

తల్లిదండ్రుల లాలనపాలనములతో, బాల్యకేళీ విలాసములతో నిర్విచారముగా కాలము గడపుచుండిన గదాధరుఁడు ఏడేండ్ల బాలుఁడై యుండ, (1843-వ సం॥న) కుటుంబ

మున కొకగొప్ప యిక్కట్టు వాటిల్లెను. అస్వస్థుఁడై యుండియు, క్షుదిరాముఁడు మేదినీపురమందలి తన మేనల్లుఁడగు రామచంద్రు నింటికి దుర్గాపూజలను గాంచుటకై ఆహూతుఁడై వెళ్లెను. విజయదశమినాఁటికి పూజలు నిర్విఘ్నముగా పరిసమాప్తమైనవి. క్షుదిరామునకు అవసాన సమయము వచ్చెను. ముమ్మాఱు రఘువీరనామమును గంభీరముగా నుచ్చరించి యా మహాభక్తుఁడు ప్రాణములు విడిచెను. ఈ విషాదవార్తను విని కామార్పుకర్ నందలి క్షుదిరాముని కుటుంబమును, ఆప్తులును, ఎల్లరును మహా దుఃఖాక్రాంతులైరి. జ్యేష్ఠపుత్త్రుఁడగు రామకుమారుఁడు ఉత్తరక్రియలు విధ్యుక్తముగా జరిపెను.

పితృవియోగము గదాధరుని మృదుల బాలహృదయమున కెంతయో సంతాపకర మయ్యెను. శైశవమున తల్లిని, బాల్యమున తండ్రిని, యౌవనమున భార్యను గోల్పోవుట తీఱని లోపము, మహాదుఃఖకరము ననుట లోకానుభవ సిద్ధము. బాల్యమునుండియు మననశీలుఁడగు నాతఁడీ సమయమున గంభీరాలోచనాపరుఁ డగుచు శ్మశానమునకో, గ్రామజన వినియోగార్థము మాణిక్యరాజ ప్రదత్తమైన మామిడితోఁపునకో వెళ్లి యేకాంతముగా నచటఁ జాలసేపు గడపుచుండును. ఇది యిట్లుండ, మురిపెంపు బిడ్డఁడగు తన్నుఁ గాంచుచుఁ జాలవఱకుఁ దన దుఃఖమును మఱచి పారమార్థికచింతతో ప్రొద్దులు పుచ్చుచున్న తల్లికి గృహకృత్యములందును, ఇంట జరుగు దేవతార్చనమునను గదాధరుఁడు తోడ్పడుచుండెను.

ఈసమయమున గదాధరునకు మఱియొక ఆకర్షణ మేర్పడసాగెను. జగన్నాథమునకుఁ బోవు యాత్రికజన సమ్మర్దమైన మార్గమున కామార్పుకుర్ నెలకొనియున్నది. బాటసారుల సౌకర్యమునకై కామార్పుకుర్‌న నొక సత్ర మేర్పడియుండ, నచటికి యాత్రికులగు బైరాగులును సన్న్యాసులును అనేకులు వచ్చుచుండెడివారు. వారివలన యోగుల కథలేమి, పుణ్యతీర్థచరిత్రలేమి, భగవన్నామ సంకీర్తనలేమి, ఆలకించుచుండిన గదాధరునకు వారల సాంగత్యము అపూర్వానందహేతు వగుచుండెను. త్యాగ వైరాగ్యములతో, తపోధ్యానాదికములతో, అఖండానంద స్వాతంత్ర్యములతో విహరించు సాధుపుంగవుల మహనీయ జీవితముగూర్చి భావనాసౌధములను నిర్మించుకొని ముగ్ధుఁడగుచు, బాలగదాధరుఁడు వారల సంసర్గమున గంటలు గడపసాగెను. తమ ధార్మికచర్చలను, ప్రసంగములను విశేషశ్రద్ధతో వినుచు, ప్రార్థనాదులలోఁ బాల్గొనుచు, కీర్తనలను నేర్చికొనుచు, సీదు, వంటచెఱకు మున్నగువానిని సమకూర్చుకొనుటఁ దోడ్పడుచు, సర్వవిధములను దమకు చేదోడు, వాదోడు నగుచుండిన గదాధరునియం దాసాధువు లును అత్యంతానురక్తులై యాతని యెడఁబాటున కోర్వఁ జాలకుండెడివారు. అప్పుడప్పు డాతఁడు వారియొద్దనే భుజించు చుండును. కాని గదాధరుఁ డొకనాఁడు ఒడలినిండ భస్మము నలఁదికొని, వస్త్రమును జింపి కౌపీనము దాల్చి, చిఱు నగవుతో తల్లిని సమీపించి, "చూడు, అమ్మా, నేను సాధువనైనాను" అని పలుక, నామె యా బైరాగులు

తనకుఁ దన పుత్త్రు నెత్తుకపోవుదురేమోయని యాందోళన మొంది, “వారియొద్దకుఁ బోను”మని వారించెను. గదాధరుని వలన ఈ సంగతి విని యా సాధువులు వచ్చి తమ సద్భావమును గూర్చి యామెకు నచ్చఁజెప్పిరి.

గదాధరునకు తొమ్మిదవయేట ఉపనయనసంస్కారము విధ్యుక్తముగా జరిగెను. ఈ సందర్భమున నాతని భిక్షాగ్రహణ వృత్తాంతము అత్యంతస్మరణీయము. భక్తురాలును, పురిటిలో గదాధరునకు మంత్రసానియైన నాఁటి నుండియు నాతనియందు అత్యంతప్రేమబద్ధురాలునై యుండిన ధని యాతని యుపనయనసమయమున ప్రథమభిక్ష తనవలన గ్రహింపవలయునని యింతకు ముందే కోరి యాతని సమ్మతి నొందియుండెను. ఈ సంగతి విని యది వంశసంప్రదాయ విరుద్ధమని రామకుమారుఁడు అభ్యంతరము వెలిపుచ్చెను. కాని వాగ్దానమును ఉల్లంఘించుట అసత్యదోషమున కొడిగట్టుకొనుటయని వక్కాణించి గదాధరుఁడు తన వాగ్దానము నెఱవేర్చుకొనవలయునని పట్టుపట్టెను. ఆచారసంప్రదాయములు ఎట్టకేలకు దృఢనిశ్చయసత్యసంకల్పములకు తలయొగ్గ, ధనియొద్దనుండియే యాతఁడు తన ప్రథమభిక్షను గ్రహించెను.

మాతా! ధనీ! ముముక్షుజనసహస్రములకు జ్ఞానభిక్షా ప్రదాతయైన మహనీయునకు ప్రథమభిక్ష నిడ నోచుకొనిన నీవు నిక్కముగా ధన్యురాలవు!

తాను నమ్మిన విషయములం దిట్టి గట్టి నమ్మకమే, పూనిన కార్యములం దిట్టి పట్టుదలయే గదాధరుని భావి

మహత్తరకార్యముల కన్నిఁటికిని మూలము. వంశాను గతమో, పూర్వాచారమో ఐనంతమాత్రమున దేనినైనను తలఁ దాల్చుట ఆతని స్వభావమునకు వ్యతిరేకము.

ఉపనయనానంతరము గదాధరుఁడు రఘువీరాది దేవతార్చన మొనర్ప సమ్మతి నొంది మహానందముతో నొనరింపసాగెను.

గదాధరుఁ డిపుడు డింభమించు పదేండ్ల బాలుఁడు. శ్రీమంతుఁడగు ధర్మదాస్ లాహా యింట నొక పితృకార్యము జరుగ, అనేక బ్రాహ్మణపండితులు ఆహూతులై వచ్చి యేదియో సూక్ష్మమగు శాస్త్రవిషయమునుగూర్చి చర్చింప నారంభించిరి. గంటలు గడచుచుండెను. ఆవేశపూరితమగు వారల కంఠధ్వనులచే గ్రామవాసు లనేకు లాకృష్టులై వచ్చిరి. గదాధరుఁడును వచ్చెను. ఆ వచ్చినవారిలో పిల్లలు వాదోపవాదనిమగ్నులగు పండితుల నేత్రహస్తాద్యభినయము లను చిత్రవిచిత్రరీతుల ననుకరించుచు, ముచ్చటలాడు కొనుచు, ఆ స్థలమునకు మఱింత యాకర్షణము, కలకలముఁ గలుగఁజేయుచుండ, బాలగదాధరుఁడు నిశ్శబ్దముగా అతి శ్రద్ధతో చర్చ నాలకించుచుండెను. తుద కాతఁ డొక పండితుని చెవిలో నేదియో చెప్పి, "ఇది సరియైన సమాధానము కాదా?" యనెను. దానినిగూర్చి వినినంతనే త మ్మంత వఱకుఁ గలవరపఱచుచుండిన విషమసమస్య కంతకంటె సమాధానాంతరము—పరిష్కారాంతరము—లేదని పండితులు ఏకగ్రీవముగా అంగీకరించిరి. బాలగదాధరుని ప్రజ్ఞావైభవమున కెల్లరును ఆశ్చర్యచకితులైరి.

లోకకల్యాణార్థము ఆవిర్భవించు మహనీయుల చరిత్రలు బాల్యమునుండియు నిట్టి యద్భుతధీవైభవాదులతో విరాజిల్లుచుండుట పురాణేతిహాసప్రసిద్ధము. పసితనముననే పండితులకు ధర్మసూక్ష్మములను దెలిపి వారలను ఆశ్చర్యచకితుల నొనర్చిన గదాధరు నేపాఠశాలయుఁ దనయందిముడ్చుకొనఁజాలకపోవుట అబ్బురము కానేరదు. ఈ విధముగా బాల్యముననే "చదువులలో మర్మమెల్లఁ" జదివి, పవిత్రమనోవాక్కర్మములచే జీవితమును జాజ్వల్యమానమొనర్చు నిట్టి మహనీయులకంటె లోకమునకు ధర్మోపదేశకులు, స్వయముగా ధర్మమార్గప్రదీపకులు, మఱెవ్వరు?

గదాధరుని నిర్మలకోమలబాలహృదయమును ధార్మికగ్రంథము లెట్లు ఆకర్షించుచుండెనో గమనించియున్నాము. అట్టిగ్రంథములందలి విశేషాసక్తిచే నాతఁడు వానిని—ముఖ్యముగాఁ దన్ను ఆకర్షించిన ఘట్టములను—గ్రామవాసులకుఁ గూడఁ జదివి వినిపించుచుండును. ఆతని పఠనవిధానము అద్భుతము. ఆ ఘట్టములందలి మహత్తరవిషయములతో ఐక్యము నొంది యాతఁడు పొందు భావోద్రేకము—భావపారవశ్యము—శరీరమున మూర్తీభవింప నాతఁడు కేవలము వేఱొకవ్యక్తియై మఱియొక లోకమున నున్నట్లు గోచరించును. అట్టి యాతని భావపారవశ్య ప్రభావమున శ్రోతలు మంత్రముగ్ధులో యన నిశ్చేష్టు లగుచుందురు. గదాధరుని ధోరణిని, ఆతని మనస్తత్త్వమును గ్రహింపఁజాలకుండిన బంధువు లిదంతయు నాడీదౌర్బల్యమో, అపస్మారమో యనుకొనిరి. శారీరమానసిక పరిపూర్ణారోగ్య

వంతుఁడగు గదాధరుని మృదుల బాలహృదయమునందలి యపురూపమగు రసజ్ఞత వారి కెఱుకపడదయ్యె! ప్రకృతి శోభాస్పదమైన యాయూర మృదుపవన తరంగడోలికలం దూఁగాడు పచ్చని పైరులను, శతపత్త్రి కమల సందీపిత కాసారములను, నానావిధ సుగంధపుష్ప ఫల సంభరిత వనములను, మానసాంబరమున భావములవోలె విసిలాకాశమున యథేచ్ఛముగా విహరించు పలురంగుల విహంగములను, మేఘములను గాంచుచు, నాతఁడు తఱచు ముగ్ధుఁడై నిశ్చేష్టితుఁ డగుచుండును. అంతరవలోకనాయత్తమగు నాతని చిత్తమునకు అవి యే అద్భుత ప్రకృతిరహస్యములను విప్పి చెప్పుచుండెనో, యే అమరసందేశముల నందించుచుండెనో, యెవరు చెప్పఁగలరు? ఈ విధముగా గ్రంథములేకాక, గ్రంథములను దన వర్ణనాదులచే రమణీయమొనర్చెడి యే రమణీయ ప్రకృతి దృశ్యమైనను, హృదయమును స్పృశించు నే సంఘటన మైనను ఆతనికి పూర్ణమగు మైమఱపు గల్గింపఁ గల్గుచుండెనని యచిరకాలముననే యెల్లరకును వెల్లడియైనది. ఈ సమయమునఁ దన యాప్తుల కెంతయో యలజడి కలిగించిన యిట్టి యొక సంఘటనమును గూర్చి కాలాంతరమున శ్రీ రామకృష్ణుఁడు భక్తులకును శిష్యులకును నిట్లు తెలిపెను:

"...నాయొద్దఁ బుట్టికలో నుండిన మరమరాలు తినుచు, ఒకనాఁడు ఉదయము వరిపొలముల గట్లమీఁదుగా నడచుచుంటిని. అది జ్యేష్ఠమో, ఆషాఢమాసమో ఐయుండును. ఆకాశమున నొకవైపునఁ ఒక్కని యొక

కాలమేఘము కనుపించెను. దానిని దిలకించుచు మరమరాలు తినుచుంటిని. అట్టెయట్టె యా మేఘము ఆకసమునంతయుఁ గ్రమ్ముకొనుచుండ, పాలవలె తెల్లనైన కొంగలబారు ఆ కాలమేఘమున కెదురుగా నెగురసాగెను. (విలక్షణమైన తారతమ్యముచే) ఇంతింతనరాని సుందరమై భాసించినది ఆ దృశ్యము! ఆ మనోహరదృశ్యమును అవలోకించుచు, అపూర్వభావమున తన్మయుఁడ నైతిని. బాహ్యస్మృతి తప్పి పోయినది. క్రిందఁ బడిపోతిని. మరమరాలు నల్దిక్కులను చెదరిపోయినవి. ఆ యవస్థలో నన్నుఁ గొందఱు కనుఁగొని యెత్తుకొని యింటికిఁ జేర్చిరి. భావసమాధిస్థితిచే బాహ్యస్మృతి గోల్పోవుట కదియే నాకు మొదటిసారి.”[1]

ఆ మనోహరదృశ్యము ప్రకృతిసీమంతిని తనగళమునఁ దాల్చిన ముత్యాలసరమువోలె గదాధరుని మనోవీథిని భాసించెనేమో! ఏమైనను, బాలకుఁ డేమి! సుందర ప్రకృతి సన్నివేశమును గాంచి యిట్లు భావసమాధిస్థితి నందుటేమి! ఏ ప్రత్యేక శిక్షణమును బడసియెఱుఁగని బాలకుఁ డిట్లు

---

[1] ఈ సంఘటనసమయమున గదాధరుఁడు ఆఱేడేండ్ల ప్రాయమున నున్నట్లు ‘శ్రీ శ్రీరామకృష్ణ లీలాప్రసంగ (ము)’ చెప్పుచున్నను, శ్రీరామకృష్ణుని దైనందిన సంభాషణలు యథాతథముగా క్రోడీకరింపఁ బడియున్న ‘శ్రీ శ్రీరామకృష్ణ కథామృత (ము)’ అతఁడు తనకపుడు పదిపదునొకండేండ్లుండెనని వచించియున్నట్లు రెండుచోట్ల వెల్లడించుచున్నది. (Refer The Gospel of Sri Ramakrishna, pp. 85, 820.) పూర్వాపరసంఘటనలు దీని కెంతయు అనుగుణముగా నున్నవి.

ప్రకృతి సౌందర్యానుభవ పరవశుఁడై అతీంద్రియావస్థను జూఁడుకొనుట ఆధ్యాత్మిక చరిత్రమున ప్రాయికముగా అద్వితీయ సంఘటనము. ఇది యెట్లు సాధ్య మయ్యెనో యెవరు నిరూపింపఁగలరు? "త్రుళ్లింతలాడుచు, ఉల్లాసముతో నవ్వుచుండెడి యీ బాలకుని శరీరమున నెంతటి గంభీర భావములు, ఎంతటి మహోన్నతభూమికలును అణఁగిమణఁగియుండెనో యెవ్వరును—తుదకా బాలకుఁడు సైతము—ఊహించి యుండలేదు" అని జగద్విఖ్యాత రచయితయైన రొమే రోలా (Romain Rolland) తన శ్రీరామకృష్ణ చరిత్రమున వ్రాసి యున్న వాక్యాలు అత్యంత సమీచీనములుగదా? గదాధరుఁడు నవీన మనస్తత్త్వశాస్త్రీయ చికిత్సకు (Psycho-therapy) లోనై యుండినచో, ఆతనియందలి ఆధ్యాత్మిక తేజము అణఁగారిపోయియుండెడిదనియు, లోకము భావి శ్రీరామకృష్ణుని మహోపకారములను గోల్పోయియుండెడి దనియు నొక యూరపుదేశీయ పండితుఁడు వాపోయి యున్నాఁడు గాని, అట్టి చికిత్స గదాధరుని ఆధ్యాత్మిక జీవితమును జెఱుపఁగలిగియుండుటకు బదులు యోగుల అప్రాకృతానుభూతికి సంబంధించిన మూలసూత్రములను వేని నైనను గొన్నిఁటిని గనుఁగొని, కేవల పరిశోధనాత్మకములు (Experimental) అగు నవీన మనస్తత్త్వశాస్త్రమునకును, తదీయచికిత్సావిధానములకును మహత్తర ప్రబోధకమై పరిణమించియుండెడిదని చెప్పనొప్పును.

దేహస్మృతి నొందిన వెనుక గదాధరుఁడు ఎప్పటి వలెనే ఆరోగ్యోల్లాసవంతుఁడై యుండినను, తల్లియు నిత

రా ప్తబంధువులును అది మూర్ఛారోగ సంబంధమో, మఱి యే పీడయో యని మహాందోళన మొంది దాని నట్టుపై నివారించుటకై యుపాయముల నరయసాగిరి. కాని గదాధరుఁడు తనకు ఆ స్థితిలో ఆనందపరవశత్వము కలిగెననియు, శరీరస్మృతి తప్పినంతమాత్రమున భయపడవలసిన దేమియు లేదనియు నచ్చఁజెప్పఁబూనెను. ఏమైనను గొన్ని దినముల వఱకును వా రాతనిని బడికి వెడలనీయ లేదు.

కామార్పుకుర్ సమీపమున నున్న ఆనుర్ అను గ్రామమందలి విశాలాక్షీదేవియను ప్రసిద్ధదేవతను గొలుచుటకై ధర్మదాస్ లాహా కుమార్తెయు మహాభక్తురాలును నగు ప్రసన్నయు, మఱికొందఱు స్త్రీలును ఒకనాఁడు గదాధరుని దమ వెంటనిడుకొని బయలుదేఱిరి. దారిలో గదాధరుఁడు తన కోమలమధురస్వరమున విశాలాక్షీదేవికీర్తనలను మనోహరముగాఁ బాడుచుండెను. భక్త్యావేశపారవశ్యమున అకస్మాత్తుగా నాతని శరీరము నిశ్చేష్టితమై కొయ్యబాఱెను; చెక్కిళ్లపై అశ్రువులు జాలువాఱెను. ఎంత బిగ్గఱగాఁ బిలిచినను బదులు లేదు. పిల్లవానికి వడగొట్టినదికాఁబోలు ననుకొని వా రొనర్చిన శైత్యోపచారములన్నియు నిష్ఫలములయ్యెను. దిక్కు తోఁపక ప్రసన్న తుదకు విశాలాక్షీదేవినిఁ బ్రార్థింపసాగెను. విశాలాక్షీనామము కొలఁదిసార్లు ఉచ్చరింపఁబడఁగనే స్మృతిచిహ్నములు గోచరింపసాగ, కొంచెము సేపటికే పూర్తిగా బాహ్యస్మృతి నొందెను. ఏ దార్బల్యము నను బొడకట్టలేదు; సరికదా, అపూర్వానందోత్సాహములు మోమునఁ జిందులాడుచుండెను.

ఈ భావసమాధిస్థితినిగూర్చియే కాలాంతరమున శ్రీరామకృష్ణుఁడు 'మ' (మహేంద్రనాథగుప్త) యను శిష్యునకిట్లు తెలిపెను: "నాకపుడు పదిపదునొకండేండ్ల ప్రాయము. ఒక మైదానముమీఁదుగా విశాలాక్షీదేవిగుడికి వెడలుచుంటిని. అపుడు సంఘటిల్లినది నా ప్రారంభభావసమాధిస్థితులలో నొకటి. ఏమి దివ్యదర్శనము!"

ఒక మహాశివరాత్రినాఁడు గదాధరుఁడు ఉపవసించియుండి, రాత్రి శివపూజాసంకీర్తనాదులతో జాగరణమొనర్పఁబూనెను. తొలియామము గడచెను. ప్రథమపూజయైనది. ఇంతలో గ్రామమున సీతానాథపాయిన్ అను భక్తునింటఁ బ్రదర్శింపఁబడనున్న శివలీలానాటకమున శివవేషధారికి అకస్మాత్తుగా జబ్బుచేయ, ప్రధానశివపాత్రధారణమునకు గదాధరుఁడే సమర్థుఁడని గ్రామమందలి పెద్దలెల్లరును ఒనరించిన నిర్ణయమును దెలిపి యాతని నందుల కియ్యకొనఁజేయుటకై గయావిష్ణువు మున్నగు నాప్తమిత్రులు ఆతనికడకు వచ్చిరి. ఆ పుణ్యరాత్రమునఁ దన పూజాదికములను విడువఁజాలనని తెలుపుచు, గదాధరుఁ డందులకు మొదట నిరాకరించియు, ప్రేక్షకభక్తజనసమూహముల పవిత్రోత్సాహమును బాటించియైననేమి, శివపాత్రధారణమున నిరంతరశివచింతావకాశము లభింపఁగలదను మిత్రులసమాలోచనము నామోదించియైననేమి, తుదకు సమ్మతించెను. మిత్రులాతనిని నాటకప్రదేశమునకుఁ గైకొనివెడలి భస్మజటారుద్రాక్షమాలాదికములతో నలంకరించుచుండ, నాతని మానసము బాహ్యప్రపంచస్మృతి నతిక్రమించి యున్నత

భూమికల నెగయుచుండెను. యథాయోగ్యమగు సమయమున మిత్రుల తోడ్పాటున మెల్లఁగా నడుగులిడుచు, బాలచంద్రాలంకృత జటాజూటాదికములతో, ప్రశాంతగంభీర వదనముతో, దివ్యానందస్ఫోరకములగు నర్ధనిమీలితనేత్రములతో నాతఁడు రంగస్థలమునఁ బ్రవేశించెను. ఏమి శివస్వరూపసాక్షాత్కారము! అపరిమితోత్సాహమున ప్రేక్షకు లాతనిని ఱెప్ప వాల్పక చూచుచుండిరి. గదాధరుఁ డంతలో ధ్యానమున పూర్తిగా మైమఱచెను. విషయప్రపంచాతీతమై యాతని మానసము అచంచలశాంత్యానందమయలోకమున రమించుచుండెను. సచ్చిదానందస్వరూపుఁడగు మహేశ్వరుని—దేవదేవుఁడగు మహాదేవుని—సమస్తలోకకల్యాణకరుఁడగు శంకరుని మహావైభవలీలావిలాసములను అంతరవలోకనమున సందర్శించుచు, నిశ్చలుఁడై నిలిచియున్న యాతని కన్నులనుండి అశ్రుధారలు ప్రవహించుచుండ, ముఖమండలము దివ్యతేజోవంతమై దీపించుచుండెను. కాని యా భావపారవశ్యస్థితితత్త్వము బోధపడని నాటకనిర్వాహకులును, మిత్రులును, ఆతనిని సమీపించిన తదితరులును పొందిన యాందోళన మింతింత కాదు. శరీరస్మృతి కలిగించుటకై యెంతయో ప్రయత్నించిరి. కాని ఫలము లేదయ్యె. ఆస్థితియందాతని నింటికిఁ గైకొనిపోయిరి. గదాధరుని దివ్యభావప్రకటనమే నాటకమునకు నాందియు భరతవాక్యము నైనవి. మఱునాఁటి యుదయమువఱకును నాతనికి స్మృతి రాలేదు.

ఇంతటినుండియు నిట్టి భావపారవశ్యస్థితులు మెండుకొనసాగెను. ధ్యానించునపుడు కాని, భక్తిసంభరితమైన

కీర్తనము నాలించునపుడుకాని యాతనిమానసము బాహ్య విషయములనుండి విడివడి యెంతయో సేపు అంతర్లీనమై యుండును. ఇవ్విషయమై యాతనిఁ బ్రశ్నింపఁ, దానే దేవతను ధ్యానించుచుండునో ఆ దేవతాస్వరూపము తన మనస్సునఁ బ్రకాశించుననియు, తన్మూలమునఁ గలుగు భావావేశముచే బాహ్యస్మృతి నశించిపోవుననియు నాతఁడు పలుకును. ఈ పారవశ్యస్థితులను మూర్ఛలుగా భావించి తల్లియు నితరాప్తులును మొదటఁ జాల భయపడినను, చెక్కుచెదరని యాతని శరీరారోగ్యమును గాంచి క్రమముగా వారు స్తిమితపడసాగిరి. ఎట్టి భేదభావమునకును మనసున నెడమీయక, యాతఁడు ఊరిలో జరుగు నానాదేవతోత్సవములందును సమానోత్సాహముతోఁ బాల్గొనుచుండును. ఈసమదృష్టియే, ఈ నిష్పాక్షికభక్తియే, కాలక్రమమున సర్వమతములందును ఆతనిని అద్వితీయబ్రహ్మసాక్షాత్కారము నొందించి, యాతని జీవితమును సర్వమతసమన్వయజ్యోతి నొనరించెనని చెప్పనొప్పును.

పూవు పుట్టఁగనే పరిమళము తెలియును. బాలగదాధరుని మహనీయతను గుర్తించి స్వయముగా నాతని నారాధింపఁగలిగిన ధన్యజీవులలో శ్రీనివాస్ అను నాతఁడు సుస్మరణీయుఁడు. శంఖపుగాజులను జేయుచు జీవనోపాధి నార్జించుచుండిన యాతఁ డొక నిమ్నకులమునకుఁ జెందిన వ్యక్తి. విశేషప్రశంసనీయమగు నీతని పవిత్రశీలమును, పారమార్థిక జీవితమునుగూర్చి శ్రీరామకృష్ణుఁడు తఱచు ముచ్చటించువాఁడు. గదాధరునియందు అత్యంతానురక్తుఁడగు నీతఁడు

భాగవతమునందలి మహత్తరవిషయములనుగూర్చి యాతనితో దివ్యోత్సాహముతోఁ జర్చించును. ఒకనాఁ డాతఁడు గదాధరు నేకాంతప్రదేశమునకుఁ గైకొనివెడలి, పుష్పమాలాలంకృతునిఁ గావించి, మిఠాయిలను దినిపించి, పూజించుచు, బాష్పపూరితనేత్రుఁడై, గద్గదకంఠుఁడై యిట్లు వచించెను: "నాయనా! నేను ముసలివాఁడ నైతిని. నా అవసానకాలము సమీపించుచున్నది. లోకమున నీ వొనరింపఁబోవు మహాద్భుతకార్యములను కన్నులారఁ గాంచు మహాభాగ్యము నాకుఁ గలుగదు. నీదాసుఁ డనిపించుకొనుటకై నను దగని యీ దీనుని సదా దయఁజూచుచుండుము. ఇదియే నా ప్రార్థన."

చెలికాండ్రు తన్ను వెంబడింప గదాధరుఁడు పాఠశాలకు వెడలుట తఱచు మానివేయుచుఁ దన క్రీడావినోదములతో హాయిగా కాలక్షేపము చేయుచుండును. జనోపయోగార్థము మాణిక్యరాజప్రదత్తమైన మామిడితోఁపు వారల యభిమానవిహారస్థలము. పాడఁగలిగిన బాలురను గొందఱనెన్నుకొని గదాధరుఁ డొకవిధమైన నాటకసమాజము నేర్పఱిచెను. ప్రతినటునకును దగిన పాత్ర నాతఁడే నిర్ణయించి స్వయముగా నాయకపాత్రను ధరించును. శ్రీకృష్ణలీలలు—అందు ముఖ్యముగా వ్రజలీల—బృందావనగోపగోపికలతో శ్రీకృష్ణలీల—వారల యభిమానప్రదర్శనకథ. అద్భుతధారణాశక్తిసంపన్నుఁడగు గదాధరున కా యా నాటకభాగములు కంఠస్థములు. నందనందనుని మహాద్భుతకృత్యముల నభివర్ణించు జానపదగీతములనో, రాధావిరహ

గీతములనో, సముచితహావభావములతో గదాధరుఁడు తన కోమల మధురకంఠమునఁ బాడుచుండునపుడు ప్రదర్శనము మహోచ్ఛ్రస్థాయి నందుకొనుచుండును. ఇతరబాలురు సుబల శ్రీదామాది శ్రీకృష్ణసఖపాత్రలు ధరించువారు. గదాధరుఁడు తన సహజసుందరాకృతితో, దీర్ఘశిరోజములతో, వనమాలాలంకృతకంఠుఁడై వేణువు నూఁదుచు, శృంగారరస స్వరూపుఁడగు శ్రీకృష్ణుఁడై రంగస్థలమునఁ బ్రవేశించును. మఱి యొకప్పుడు శ్రీకృష్ణవిరహసంతాపమున కరుణరసస్వరూపిణి యగు రాధికయై యభినయించును. ఈ లోకోత్తర పాత్రలను ధరించి వారల దివ్యభావములను బ్రదర్శించునప్పు డాతఁడు తన్మయుఁడై అతీంద్రియావస్థల నందుచుండును. ఒక్కొక్క తఱి బాలకులందఱును గలసి యొనరించెడి సంకీర్తనలతో ఆ మామిడితోఁపంతయు మాఱుమ్రోఁగుచుండును. క్రీడావినోదములతో హాయిగా నిట్లు కాలము గడపుటకై బాలకులు బడికి వచ్చుట మానివేయుచుండిరని అచిరకాలముననే ఉపాధ్యాయుఁడు తెలిసికొని యొకనాఁడు వారి నందఱను బిలిపించి తన సమక్షమున నిలువఁబనిచి, "మీ నాయకుఁ డెవ్వఁడో చెప్పుఁ" డనెను. గదాధరుఁడు పేర్కొనఁబడ నుపాధ్యాయుఁడు, "'ధర్మమామిడితోఁపు'లో నీ జతగాండ్రతో నేమి చేయుచుందువో చూపు" మనెను. అదరు బెదరును లేకుండ గదాధరుఁడు వెంటనే యొకకీర్తన మనోహరముగాఁ బాడ నారంభించుటయు నంతవఱకును క్రుద్ధుఁడై యుండిన యుపాధ్యాయుఁ డది విని ముగ్ధుఁడై వారలను శిక్షింప నెంచిన సంగతియే మఱచిపోయెను!

ఇది యిట్లుండ, కుటుంబపోషకుఁడగు రామకుమారుఁడు, తాను కలకత్తావంటి మహాపట్టణమున నివసించుచో, తన శక్తిసామర్థ్యములను వినియోగించి యార్థికపరిస్థితిని జక్కఁబఱచుకోవచ్చునని యచటికి వెళ్లి యొక పాఠశాలను —ఇంచుమించుగా ఉచిత పాఠశాలయే— నెలకొల్పెను.

సుగుణాభిరాముఁడగు గదాధరునియందలి అపరిమిత ప్రీతిచే నిరుగుపొరుగు స్త్రీలు తఱచు చంద్రాదేవి యింటికి వచ్చుచు, నాతని చుట్టును గుమికూడుచుండువారు. వారల కోరికలను మన్నించి తన గ్రంథపఠనసంకీర్తనాదులతో వారిని సంతృప్తి నొందించుట ఆతనికి విధాయకమగు నిత్యకృత్యమైనది. ఒక్కొక్కప్పు డాతఁడు యాత్రలనఁబడు వీథినాటకములను—అందలి వివిధపాత్రలను తానే వేర్వేఱు కంఠధ్వనులతో ధరించి—ప్రదర్శించుచు వారలను వినోదింపఁజేయుచు. కంఠస్వరములను, అందు ముఖ్యముగా స్త్రీకంఠమును అనుకరించుటలో ఆతని సామర్థ్యము అద్భుతము. జనుల మాటలలో, చూపులలో, నడకలలోఁ గల వైచిత్ర్యముల నాతఁడు మహాద్భుతరీతి ననుకరించుచు నెవ్వరినైనను ప్రక్కలుపడ నవ్వించును. కాలక్రమమున నాతని యీ అనుకరణమునకును హాస్యమునకును శిష్యులు మున్నగువారు క్రిందఁ బడి దొరలిపోవుచు నవ్వువారని విందుము.[1]

వైష్ణవసంప్రదాయములలోఁ బుట్టిపెరిగిన యీ పల్లె

[1] నర్తకియగు నొక వేశ్యయొక్క నటనను శ్రీరామకృష్ణుఁ డొకప్పుడు అతిచాతుర్యముతో అనుకరించుట తాను గాంచితినని శ్రీ విజ్ఞానానందస్వామి మాకుఁ దెలిపిరి.

టూరి స్త్రీలు అనేకులు దివ్యలక్షణోపేతుఁడగు గదాధరుని గోపాలునిగా భావించుచు, ఆతని నెపుడు కలసికొందుమా యని సదా ఉవ్విళులూరుచుండువారు. దుచ్యములు నాహార ములను వా రాతనికి దాఁచి పెట్టుచుందురు; అరమరిక యనునది లేక తమ రహస్యముల నాతనితోఁ జెప్పు చుందురు. బృందావన గోపగోపికలతో శ్రీకృష్ణుని సన్ని హితసంబంధమును బ్రదర్శించు జానపదనాటకములను గాంచుచు, వైష్ణవగీతములను, పురాణగాథలను వినుచు, పఠించుచు, తదీయభావసామ్రపంచమున మసలుచుండిన గదాధరుని స్వభావము ఈ కాలమున ఆశ్చర్యకరమగు రీతిని స్త్రీస్వభావముగా మాఱఁజొచ్చెను. ఇందువలన నాతఁడును భక్తురాండ్రగు ఆ నారీమణులతో అపురూప మగు చనవుతో మెలఁగుచుండును.

మధురాతిమధురమగు గోపికల శ్రీకృష్ణప్రేమ, వారల మహావిరహపరితాపము, శ్రీకృష్ణపునస్సమాగమ పరమానందము, అందలి దివ్యశృంగారరసోత్కర్ష, రాస లీలాపరమార్థము—ఇవన్నియు గదాధరుని హృదయక్షేత్ర మున సుస్థిరముగా నాటుకొనియెను. భగవత్పరితాపమున నాతఁడు తఱచు తన వ్యక్తిత్వమునే మఱచి తా నొక గోపికనని భావించుకొనుచుండును. స్త్రీలై యుండుట చేతనే కదా, గోపికలు శ్రీకృష్ణునిఁ దమ భర్తగా భావించి యాతని శాశ్వతసమాగమసౌఖ్యము ననుభవింపఁగలిగిరని సమాలోచించి యా యాదర్శసిద్ధిని దానును బడయవలయు ననెడి మహాపరితాపమున నాతఁడు, "అయ్యో, పురుషుఁ

డనై జన్మించితినే! ఈ పురుషజన్మముగదా ప్రాణప్రియునిఁ బ్రాపించుటకు నాకు మహావరోధమును గల్పించుచున్నది!" అని విచారించును. తాను మరల జన్మించుచో, పవిత్ర బ్రాహ్మణకుటుంబమున బాలవితంతువై యుండఁగోరును. నెఱికురులతో, సుందరరూపముతో, దివ్య గుణములతో నొప్పుచుండు నామె శ్రీకృష్ణునే తన ప్రాణేశ్వరునిగా ధ్యానించుచు ప్రొద్దులు పుచ్చుచుండును. ఒక పాఁడియావు, నూలు వడకుటకు రాట్నము, కాయగూరలు పండించుకొనుటకు కుటీరసమీపమున తుండెఁడు నేల—ఇవియే యామె యాస్తిపాస్తులు. ఒక వృద్ధురాలామెకు తోడునీడ. భక్తురాలైన యా బాలవితంతువు ఆవుపాలతో వివిధమధురాహారములను జేసి మనోహరునికై దాఁచియుంచును. గృహకృత్యములను ముగించుకొని రాట్నముకడఁ గూర్చుండి నూలు తీయుచు, దివ్యగంభీరభావపూరితములగు శ్రీకృష్ణ కీర్తనలను బాడుచుండును. అంతట మనోహరుఁడు ప్రసన్నుఁడై, గోపాలరూపమున సంజలేఁజీఁకటులలో రహస్యముగా కుటీరమునఁ బ్రవేశించి భక్ష్యముల నారగించును. ఇట్లు ఆతఁడు భావనాసౌధములను నిర్మించుకొని శ్రీకృష్ణ సంసర్గానుసంధానమున రమించుచుండును.

బాలగదాధరుని యీ యపురూపమైన ఆదర్శము ఈ రూపమున సిద్ధించినట్లు కనఁబడకున్నను, ప్రస్తుతజన్మముననే కాలాంతరమున శ్రీకృష్ణసాక్షాత్కారము నాతఁ డెట్లు పొందెనో కనుఁగొనఁగలము. స్త్రీపాత్రలను దాల్చునపుడు అత్యంతము స్త్రీస్వభావానుగుణములగు తన వేష

భాషాభినయముల మూలమున అచ్చముగా స్త్రీవలెనే భాసించును. జానపదస్త్రీలవలెనే బిందె చంకఁ బెట్టుకొని, తఱచుగా వినోదార్థము యువతీవేషమున హాల్దార్ చెఱువునకు వెడలును; పుట్టిన నాఁటినుండియుఁ దన్నెఱింగిన వ్యక్తులకుసైతమపు డాతఁడు గదాధరుఁడని పోల్చుకొనుటకే వీలు గాకుండెడిదఁట!

క్షుదిరాముని యింటి పొరుగుననే యుండిన దుర్గాదాస్ పాయిన్ అనునాతనికి 'ఘోషాపద్ధతి' యెడ మహాభిమానము. తన యింటిస్త్రీలు అసూర్యంపశ్యలనియు, వారల యంతఃపుర నివాసమునుగూర్చి యన్యులెవ్వరికిని ఎంతమాత్రము తెలియదనియు, మఱి యేమేమో ఆతఁడు అట్టహాసముగాఁ జెప్పుచుండును. గదాధరుఁ డొకనాఁ డాతని దంభోక్తులను విని, స్త్రీలను అంతఃపురముననో, తెరమఱుఁగుననో, బంధించు టెన్నఁటికిని వారల శీలమును పాతివ్రత్యమును గాపాడు మార్గము కానేరదనియు, నందులకు సద్విద్యయు భగవద్భక్తియునే సాధనభూతములనియు వక్కాణించుటయేకాక, యాతని 'అంతఃపురము'నఁ దాను అవలీలగాఁ బ్రవేశింపఁ గలనని పలికెను! 'ఏదీ, చేసి చూపు'మని దుర్గాదాసు సవాలు చేయ, 'సరే, చూచెదముగాక!' అని నవ్వుచు, గదాధరుఁడు సమాధానించి వెడలిపోయెను.

ఒకనాఁడు సాయంకాలము దుర్గాదాసు కొంతమంది మిత్రులతో సల్లాపము లాడుచుండఁగా, ఒక పేదరాలు చంక నొక పుటికతో, మోము నాచ్ఛాదించియుండిన మేలి ముసుఁగుతో, వచ్చి యెదుట నిలిచి, తాను పొరుగూరి సాలెదాన

ననియు, నూ లమ్ముకొనుటకై సంతకు వచ్చి, తోడివారం దఱు నిండ్లకుఁ బోవుటచే, ఆ సంజచీఁకటివేళఁ దా నొంటరిగాఁ బోఁజాలకున్నాననియుఁ జెప్పి యారాత్రి కాతని యాఁడువారితో నుండనిండని వేఁడుకొనెను. దుర్గాదాసు ఆమెను గొన్ని ప్రశ్న లడిగి, "సరే, లోనికిఁబోయి స్త్రీల నడుగు" మనెను. 'చిత్తము' అని యామె లోనికి వెడలి తన సమాచారము స్త్రీలకుఁ దెలుప, వా రా యెలప్రాయమున నామె నిస్సహాయతకు నొచ్చుకొని,సరళస్వభావవర్తనములకు మెచ్చుకొని, రాత్రి తమ యింట నుండ సమ్మతించుటయేకాక, యామెకుఁ గొన్ని తినుబండారముల నొసఁగిరి. సమీపమునఁ గూర్చుండి తినుచు, ఇంటిలో ప్రతిగదిని బరిశీలించుచు, అపుడపు డామె వారల సంభాషణమునఁ బాల్గొనుచుండెను. ఈ విధముగా జాముసేపు గడచెను. ఇంట నంతవఱకు గదాధరుఁడు కాన్పింపమికి ఆందోళితమానసయైన చంద్రాదేవి పనుపున రామేశ్వరుఁ డాతనికై యిందందు వెదకులాడుచు, బిగ్గఱగా పేరఁ బిలుచుచుండ, దుర్గాదాసు నింటినుండి, "అన్నా! ఇదిగో, వచ్చుచున్నాను" అని సమాధానము వెలువడెను. మాఱువేసమునఁ దమ్మంతవఱకుఁ గనుఁగప్పిన యా సాలెపడుచు గదాధరుఁడేయని గ్రహించి యా స్త్రీలందఱును ఆశ్చర్యచకితలై బుగ్గపై వేలిడుకొనిరి. తన్ను వలలో వేసికొని యీవిధముగాఁ దన గర్వభంగ మొనర్చిన గదాధరునియెడ దుర్గాదాసు మొదటఁ గొంచెము కుపితుఁడైనను, వెనువెంటనే యీ మహాచమత్కారమునకుఁ దానును సంతసించుచు, బాలుని సామర్థ్యము నెంతయో కొనియాడెను.

గదాధరుఁడు తమయింటి సమీపమున నుండిన సీతానాథపాయిన్ అను భక్తునింట విశేషముగ చనవుతో నించుమించుగా ప్రతిదినము కొంతకాలము గడపుచు, ఆతనిఁ గాంచుటయందేమి, ఆతని పురాణకథాభగవత్సంకీర్తనాదుల నాలించుటయందేమి, అపరిమితాసక్తిచే నిరుగు పొరుగు స్త్రీలనేకులు అచటికి వచ్చుచుండఁ, బైని దెల్పిన 'సాలెపడుచు కథ' జరిగిన నాఁటినుండియు దుర్గాదాసునింటి యంతఃపుర స్త్రీలును 'ఘోషా'వలని ప్రతిబంధములను 'ఘోషా' కల్పించి యచట సమావేశమగుచుండువారు. సంకీర్తనసమయమున నాతఁడు భావసమాధిస్థితి నొందుచునెడ, ఆ పరమపవిత్రశరీరమున శ్రీకృష్ణుఁడో, గౌరాంగుఁడో ఆవిర్భావము నొంది యున్నట్లు తోఁప, వా రాతని నారాధించువారు. కాలక్రమమున వా రాతని కొక బంగారు మురళిని, స్త్రీపురుషపాత్రధారణమునకు వలయు దుస్తులను అలంకారములను బహూకరించిరి. శ్రీరామకృష్ణుని సాక్షాత్ శిష్యులగు యతివరేణ్యులు కొందఱు 1893-వ సంవత్సరమున కామార్పుకుర్ వెడల, సీతానాథుని కుమార్తెలలో నొక తెయగు అఱువదేండ్ల వయసు గల రుక్మిణియను మహాశయురాలు గదాధరునకుఁ దమ కుటుంబముతో నుండెడి చనవునుగూర్చి యీక్రింది మహత్తరవిషయములను దెల్పెను: "నా కపుడు పదునేడు పదునెనిమిదేండ్ల ప్రాయము. మా కుటుంబ మపుడు సిరిసంపదలతో, పిల్లలతో, పాపలతో, కలకలలాడుచుండెడిది. సీతానాథపాయిన్ మాతండ్రి. తోఁబుట్టువులము, దాయాదురాండ్రము కలసి మొత్తముమీఁద మేమందఱము పదునేడు,

పడు నెనమండుగురము; ఇంచుమించు ఒకే యీడువారము. చిన్ననాఁటినుండియు గదాధరుఁడు మాతో ఆడుచుండెడి వాఁడు. అందుచే మా కతనితో ఎంతో చనవు. మాకు పెండ్లిండ్లై యీడు వచ్చినతరువాతఁగూడ అతఁడు మాయింటికి వచ్చుచుండువాఁడు. అతఁడును ప్రాయము నొందినవాఁడైనను మేము నివసించు లోపలిగదులలోనికి యథేచ్ఛగా వచ్చుట కే యభ్యంతరమును లేకుండెడిది. నాయనగా రతని నెంతో ప్రేమించువారు. సాక్షాత్తు తన యిష్టదేవతవలెఁ జూచుకొనుచు, అతనియెడ శ్రద్ధాభక్తులు చూపువారు. 'ప్రాయమువచ్చిన ఆఁడుపిల్లలు మీయింట నెందఱో ఉన్నారు. గదాధరుఁ డేమంత కుఱ్ఱవాఁడు కాఁడుగదా? అతని నెందుకు మీకుటుంబములోని కంత తఱచుగా రానిచ్చెదరు?' అని యిరుగుపొరుగు వ్యక్తులు కొందఱు నాయనగారితో మొఱ పెట్టిరి. అందుల కాయన, 'మీ కెందు కీ లేనిపోని చిత్తక్షోభ? గదాధరుఁ డెట్టివాఁడో నాకు బాగుగాఁ దెలియును' అని సమాధానించువారు. ఇఁక వారు కిక్కురుమన సాహసించువారు కారు. ఆహా! గదాధరుఁడు మా కెన్ని పురాణకథలు చెప్పువాఁడు! ఎన్ని చమత్కారములు చేయువాఁడు! ఇంచుమించుగా ప్రతిదినము ఆ కథల నాలకించుచు మేము ఆనందముగా గృహకృత్యములు చేసికొనువారము. అతని సాహచర్యమున మేము పొందుచుండెడి యానందము ఈ యొక్కనాలుకతో నే నెట్లు వర్ణింపఁగలను! ఒక్కనాఁ డాతఁ డెందుచేనైన రాకుండినచో, అతని కేమైనను అస్వస్థతగా నున్నదేమో యని మేము పొందుచుండెడి

యాందోళనమునకు మేరయే లేదు. ఏదో మిష పెట్టుకొని మాలో నెవరో యొకరు బ్రాహ్మణమ్మ (చంద్రాదేవి) గారి యింటికిఁ బోవలసినదే. అతని క్షేమవార్తకై మిగిలినవా రందఱము కాచుకొనియుండువారము. అతని ప్రతివాక్కును మాకు అమృతప్రాయమై యుండెడిది. అతఁడు మా యింటికి విధివశమున రాఁజాలని దినములలో అతనిఁగూర్చిన ప్రసంగములతో ప్రొద్దుపుచ్చువారము."

తన బాల్యమున ఊరిలోని స్త్రీపురుషు లెల్లరును దన్నుఁ బ్రేమించువారనియు, ప్రతివారును తమకుటుంబమునఁ దనొక వ్యక్తిగాఁ జూచువారనియు, తా నపుడు ఆనందమయమైన యొక పావురమువలె కాలము గడపువాఁడ ననియు కాలక్రమమున శ్రీరామకృష్ణుఁడు భక్తులకుఁ దెలుపును.

ఇంచుమించుగా ప్రతిసాయంకాలము ఆ యూరి రచ్చలు మున్నగు తావులలోఁ జేరుచుండు గ్రామస్థులకు గదాధరుఁడు ఏ భాగవతమునుండియో భక్తిరసభరితమైన ఘట్టములను శ్రావ్యముగాఁ బఠించి యందలి భావములను అరఁటిపం డొలిచినట్లు విప్పిచెప్పుచుండును. అతని దివ్యోత్సాహము, హాస్యచమత్కృతులు, ఆనందపారవశ్యము, మృదుమధురస్వరము, రమణీయనృత్యము—ఇవన్నియు గ్రామస్థులకు గగుర్పాటు గలిగించి వారల దృక్పథమున దివ్యభావజ్యోతులను ప్రదర్శించుచుండును.

ఈ సమయమున గ్రామమందలి కొందఱు బాలు రేర్పఱిచిన యొక నాటకసమాజమున గదాధరుఁడు తన

మిత్రులలో నొకని ప్రేరణమునఁ జేరి, ప్రధానపాత్రలను స్వయముగా ధరించుటయేకాక, యితరనటకులకు శిక్షణ గఱపుచు, లలితకళోపాసనమున దివ్యానందానుభూతులనందుచు, పాఠశాలయందలి విద్యాభ్యాసమునకు స్వస్తిచెప్పెను.

ప్రత్యేకమగు నేశిక్షణము లేకుండినను, విగ్రహనిర్మాణమునను చిత్రలేఖనమునను గదాధరుని కౌశలము అభివృద్ధి గాంచెను. తీవ్రమగు నాతని యేకాగ్రతయు స్వతస్సిద్ధమగు దివ్యాదర్శపరతయు నాతని కిందు ప్రబల సాహాయ్యకరములై యొప్పెను. ఆరితేఱిన శిల్పులకు సైతమాతఁడు విగ్రహమునందలి భావప్రదర్శకాంగములగు నేకన్నులయందో కల సూక్ష్మమగు లోటుపాటులను, వానిని సవరించుకొను విధానమును దెలిపి వారలను ఆశ్చర్యచకితులనొనర్చుచుండును. దివ్యభావావస్థలలోఁ దాను గాంచు దేవతారూపములు తన పరిశీలనశక్తిని బెంపొందింప, దివ్యసుందరము, జీవకళాప్రదీప్తమునగు విగ్రహములను నిర్మింపఁగలుగుచుండువాఁడు.

చెల్లెలగు సర్వమంగళను జూచుటకై గదాధరుఁ డొకనాఁ డామెయొక్క యత్తవారింటికి వెడలిన సమయమున నామె తన భర్తను సేవించుచు మహోల్లాసమూర్తియై యుండిన సర్వమంగళదృశ్యము గాంచెను. ఆ మనోహరదృశ్యము తన లలిత కళాదృష్టిని ఆకర్షింప, అనంతరము ఇంటికి వచ్చిన కొలఁది దినములకు ఆ పుణ్యదంపతులను సరిగాఁ దాను గాంచిన రీతిని చిత్తరువు రచించి, యింటిలోనివారి కెల్లరకును మహాశ్చర్యానందములు గొల్పెను.

గదాధరుఁ డిపుడు పదునేడేండ్ల ప్రాయమువాఁ డాయెను. అట కాళీఘట్ట (కలకత్తా) మహాపట్టణమున ఝామాపుకర్ అను పేటలో తన పాఠశాలానిర్వహణమునకుఁ దోడు కొన్ని యిండ్లలో నిత్యదేవతార్చన జరుపుట నొంటరిగా నున్న రామకుమారుని కార్యభారము అతిశయించుచుండెను. అతఁ డొకనాఁడు కామార్పుకుర్ వచ్చి, గదాధరుఁడు బడిచదువు మానివేసెనని తెలిసికొని, తల్లితోడను రామేశ్వరునితోడను సమాలోచించి, తనశిష్యులతోఁ గా బాలుఁడు తనయొద్ద విద్య నభ్యసించుటకే కాక, గృహకృత్యనిర్వహణమునఁ దా నాతని తోడ్పాటు నొందుటకును అనువగునని తనతోఁ గైకొనివెడల నిశ్చయించెను. 'జ్యేష్ఠభ్రాతా పితృసమ' యనునట్లు పెద్దన్నగారియెడ పితృభావము కలిగియుండిన గదాధరుఁడు తనచదువుమాట యెట్లున్నను, తా నాతనికిఁ దోడ్పడవచ్చునుగదా యను భావమున మాఱుమాటాడక వెంటనే సమ్మతించెను. ఒక శుభదినమున రామకుమార గదాధరు లిరువురును రఘువీరుని సేవించి, మాతృదేవి పాదరజమును శిరమునఁ దాల్చి, యాశీస్సుల నందుకొని, కలకత్తాకు బయలుదేఱిరి.

"ప్రభాతమందమారుతమువలె స్వేచ్ఛామయమై, అప్పుడప్పుడే విరిసిన పూవువలె సుకోమలమై, మంచుబిందువు చందమున స్వచ్ఛమై యలరారు బాల్యము ఆజన్మాంత మెవ్వనియందు శోభిల్లునో వాఁడే ధన్యాత్ముఁడు" అని శ్రీరామకృష్ణుఁడు పలుకు దివ్యవాక్కులు సర్వవిధములను ఆతనియందే సార్థకములై భాసించుచున్నవని చెప్పనొప్పును.

సదా బాల్యోత్సాహపూరితుఁడై, ఆత్మీయులకు అల్లారు ముద్దుబిడ్డఁడై, బాలబాలికలకు నెచ్చెలియై, తోడివారలకు నాయకుఁడై, గ్రామజనసామాన్యమునకు బోధకుఁడై, లలిత కళారాధకులకు ఆచార్యస్థానీయుఁడై, పారమార్థికచింతా పరాయణులకు ఆరాధ్యుఁడై, యెల్లరకును ప్రేమానురాగ పాత్రుఁడై, స్త్రీ పురుష హృదయములం దాతఁడు తన వ్యక్తిత్వమును స్థిరముద్రిత మొనరించెను. గదాధర బాల్య జీవనవాహిని యిఁకఁ దనజన్మస్థానము నతిక్రమించి శ్రీరామ కృష్ణజీవన దివ్యగంగా ప్రవాహమై తన మహోపదేశామృత వాహినులను మానవకోటికి అందింపవలదా? ప్రపంచశాంతి మార్గదర్శకమగు తన యపూర్వసాధనానుభవములకై విశే షానుకూల ప్రదేశము నాతఁడు ప్రాపింపవలసియున్నది. అట్టిచోఁ దన యెడఁబాటున జన్మగ్రామమున నెందఱు తపించు చున్నను, పరితపించుచున్నను, చంద్రాదేవి మున్నగు నాత్మీ యులయు, ఆప్తసఖీసఖులయు నెడఁబాటు స్వయముగాఁ దన కెంతటి పరితాపకరమైనను, తన మహాజీవితోద్యమసాధన రంగమును బ్రాపింప జగజ్జననీచోదితుఁడై యాతఁడు పురో గమించెను.

# దక్షిణేశ్వరనివాస ప్రారంభము

"ఓ సంసారులారా! ఒక చేతితో మీ గృహకృత్యములను నిర్వర్తించుకొనుచు, రెండవ చేతితో భగవానుని పాదారవిందములను బట్టుకొనుఁడు; గృహకృత్యములు మీకు లేకుండునప్పుడు రెండు చేతులతోడను వాని పాదపద్మములను బట్టుకొని మీ హృదయమునకు అద్దుకొనుఁడు" అని కాలక్రమమున శ్రీరామకృష్ణుఁడై లోకమునకు బోధించు గదాధరుఁడు కలకత్తాలో ఝామాపుకుర్ నందలి తన నివాసమున రామకుమారునకు గృహకృత్యములలోఁ దోడ్పడుచు, నిర్ణీతగృహములందలి దేవతార్చన నాతఁడు తన కొప్పగింప, మహానందముతో నిర్వర్తింపసాగెను. ఆ కుటుంబములలోని పెద్దలు, ముఖ్యముగా స్త్రీలు, పూజావిషయమున గదాధరునకును పూర్వార్చకులకునుగల యపారభేదమును గుర్తింపసాగిరి. హడావుడిగా, ఏదో తంతు జరిపెనని పించుటకుబదు లాతఁడు విశేషశ్రద్ధాభక్తులతో దేవతార్చన మొనర్చును. ఆతని వినిర్మలహృదయము, సరళవర్తనము, భక్తిప్రపత్తులును ఆతని సాహచర్యము నొందినవారి నెల్లరను ముగ్ధుల నొనర్చును. వారల కోరికల ననుసరించి తన యభిమానకీర్తనములను బాడుచు, చిన్నచిన్న సాయము లొనర్చుచు, ఆయిండ్లలో నాతఁడు గంటలకొలఁది గడపును. చదువుకొనుట కాతనికి తీఱికగాని, చదువుపై నాస్థగాని యెంతమాత్రము గోచరింపకుండెను. గదాధరుఁడు విద్యా

వంతుఁడై, ప్రయోజకుఁడై కుటుంబాదాయమును బెంపొందించునని గంపెఁడాశ పెట్టుకొనియున్న రామకుమారుఁడు ఆతని యీ ధోరణిఁ జూచి, యిఁకఁ గలుగఁజేసికొననిచో సుఖించునని తలఁచి, యొకనాఁ డాతనిఁ జేరఁబిలిచి మృదువాక్యాలతో మందలించెను.

సోదరుని మందలింపులకు గదాధరుఁడు, "అన్నా! బియ్యమును, అరఁటిపండ్లను మూటకట్టుకొను విద్య నాకు వలదు. దేనివలన యథార్థజ్ఞానము కలుగునో ఆ విద్యనే ర్తును" అని నిర్భయముగా, నిష్కపటముగా బదులు చెప్పెను. సోదరుని మనస్తత్త్వమును గ్రహింపని రామకుమారునకు ఈ 'బ్రహ్మసూత్రప్రాయమైన' సమాధానమునకు సమగ్ర తాత్పర్యము అవగతము కాలేదు.

గదాధరుని నిశితపరిశీలనదృష్టికి లోకుల పోకడలును లక్ష్యములును తేటతెల్లమై యున్నవి. తుచ్ఛసాంసారికవిషయములకై వారు ప్రాఁకులాడుచున్నారు. క్షణభంగురమగు పేరుప్రతిష్ఠలకై పరితపించుచున్నారు. ఐహికచింత, స్వార్థపరత—ఇవియే యించుమించుగా లోకుల ధర్మసూత్రములై యున్నవి. పాఠశాలయందలి విద్యావిధానము భగవదనురక్తికిఁ గాక భోగానురక్తికే దారితీయుచున్నది. పరమ పురుషార్థసాధనము కాని యట్టి విద్య సహజముగా పారమార్థికశీలుఁడగు గదాధరుని యంతరాత్మ కెట్లు సంతృప్తికరము కాఁగలదు? గ్రుడ్డెద్దు చేనఁ బడినట్లు సంచరించు సామాన్యమానవులవలెఁ గాక, మహత్తరప్రయోజనములను సాధించుటకై జన్మించిన వ్యక్తియని నానాఁటి కాతనికి విస్పష్టము కాఁజొచ్చెను.

"దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి, హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి!"

అని పరమభాగవతోత్తముఁడగు ప్రహ్లాదుఁడు ప్రకటించిన చందమున, పట్టె పొట్టకూటి నీచవిద్య తన కక్కఱలేదనియు భగవత్సాక్షాత్కారహేతుభూతము, శాశ్వతానందదాయకమునగు బ్రహ్మవిద్యయే తనకు పరమావలంబనీయమనియు గదాధరుఁడు నిశ్చయించెను.

గదాధరుని సమాధానము విని రామకుమారపండితుఁడు 'నిర్ఘాంతపడెను.' ఏమి చేయుటకును ఆతనికిఁ దోఁప లేదు. విద్యాప్రయోజనములను దెలుపుచు, విద్యావంతుఁడగు నాగరకుని సుఖమయజీవితము నాతఁడు కన్నులకుఁ గట్టినట్లు వర్ణించి యాబాలునకు నచ్చఁజెప్పఁజూచెను. కాని యాతని లౌకిక సుఖాభినుతు లన్నియు గదాధరుని పరమార్థాసక్త చిత్తము నించుకంతయు ఆకర్షింపఁజాలకపోయెను.

రెండేండ్లు గడచెను. ఎయ్యది తన నివాసక్షేత్రమై మహాపుణ్యక్షేత్రప్రసిద్ధి గాంచనున్నదో, అట్టి దక్షిణేశ్వరమును గదాధరుఁడు చేరుటకు హేతుభూతమగు నొక విశేష సంఘటనము జరిగెను.

కలకత్తాయందలి జాన్ బజార్ అనుపేటలో నివసించుచుండిన రాణి రాస్మణి (రాసమణి) మహాభక్తురాలు. "జగజ్జననికి పార్శ్వచారిణులైన యెనమండుగురు నాయికలలో నొకతెయగు నామె దేవీపూజను వ్యాప్తిచేయుటకై ఆవిర్భ

వించిన వ్యక్తి. తన జమీందారీకి సంబంధించిన పత్రాములలో వేయఁబడు నామె మొహరుపైన 'కాళీపదాభిలాషిణి శ్రీమతి రాసమణిదాసి' యను పదములు చెక్కఁబడియుండెను. ఆమె ప్రతికార్యమునను జగన్మాతయెడ నచంచలభక్తి ప్రకాశమాన మగుచుండెడిది'' అని స్వయముగా శ్రీరామకృష్ణుఁడే ప్రశంసించెనన్నచో, ఆమె భక్తిప్రపత్తు లెట్టివో యూహింప నగును. భర్తృమరణానంతరము తనకు సంక్రమించిన జమీందారి నామె విశేషశక్తిసామర్థ్యములతోఁ బరిపాలించుచుండెను. పేదసాదలయెడ నామె ప్రేమసానుభూతులకు కలకత్తాయందును పరిసరములందును ఆమెచేఁ బ్రతిష్ఠితమై నేఁటికిని నిలిచియున్న యనేకధర్మసంస్థలే తార్కాణములు.

రాసమణిరాణి స్వప్నమున కాళీదేవి తన కొసఁగిన యాదేశము ననుసరించి దక్షిణేశ్వరమున, గంగాతీరమున కాళికాలయమును నెలకొల్పెను. దక్షిణేశ్వరము కలకత్తా కేంద్రస్థానమునకు ఉత్తరమున నాలుగుమైళ్ల దూరమున నున్న యొక పేట. ఇందలి కాళికాలయమునకు పడమట గంగానది ప్రవహించుచుండును. నావపై వచ్చు యాత్రికులచట నిర్మితమైయున్న స్నానఘట్టసోపానముల నెక్కి యుత్తరమునను దక్షిణమునను గల చెరియాఱు శివాలయముల నడుమ నున్న ద్వారమంటపమునఁ బ్రవేశింతురు. దానికి తూర్పున విశాలప్రాంగణమునడుమ కాళికాలయమును, ఈయాలయము నానుకొనియున్న రాధాగోవిందాలయమును ఎల్లర నాకర్షించుచుండును. తొమ్మిది విమానములతో వెలయు నీకాళికాలయముమ్రోల విశాలమైన నాట్ మందిర్ అను

నుత్సవ మండపము కలదు. ఆలయావరణమునకు పడమటి వైపు విడిచి మిగిలిన మూఁడువైపులను గల గదులు ఆలయోద్యోగుల నివాసములు, అతిథినివాసములు, ఉగ్రాణ ములు మున్నగునవి. ఆవరణవాయవ్యభాగమున శివాలయ శ్రేణి నానుకొని, దానికి ఉత్తరమున నున్న గది శ్రీరామ కృష్ణునకు నివాసస్థానమై పరమపావనమై ప్రత్యేక ప్రాము ఖ్యము నొందియున్న మందిరము. దీనికి వెనుకతట్టున నున్నది పూలవనము. వనముప్రక్కనే దిగువ గంగానదీ ప్రవాహము. ఆలయావరణమునకు వెలుపల ఉత్తరదిక్కున నున్న భవనము రాసమణి కుటుంబమువారి తాత్కాలిక నివాసస్థానము. ఆలయప్రాంగణమునకు సమీపమున నైరృతి దిశ నొకటియు వాయవ్య దిశను మఱొకటియు నహబత్ఖానా లనెడి వాద్యమందిరములు కాననగును. రెండు చెఱువులును అనేక మహావృక్షములును వనశోభను బెంపొందించుచుండును. శ్రీరామకృష్ణుని దివ్యసాధన లనేకములు ఈవనమున నేఁటి కిని సురక్షితమై యున్న విశాలవటవృక్షముక్రిందను, గొన్ని వనమునకు ఉత్తరపుఁ గొన నున్న మారేడుచెట్టుక్రిందను జరిగినవి.

కాళికాలయమున సంప్రోక్షణమునకు సర్వము ఆయిత్తమై యుండఁగా నొక విషమసమస్య వెలువడెను. మందిరమున దేవికి నిత్యము పంచభక్ష్యపరమాన్నములతోఁ గూడిన యన్నము సమర్పించు నేర్పాటు గావింపవలయునని రాసమణిరాణి గాఢాభిలాష. కాని, యాచారసంప్రదాయ ములనుబట్టి చూచినచో, దేవికి అన్నపునైవేద్యము నర్పింప

బ్రాహ్మణుఁడే, లేదా, బ్రాహ్మణుఁడగు నర్చకుఁడుమాత్రమే అధికారియైయుండ, శూద్రస్త్రీ, అందును పల్లెకులస్త్రీయగు తాను గట్టించిన యాలయమున పూర్వాచారపరాయణుఁడగు నేబ్రాహ్మణుఁడు అర్చకుఁడై యుండనంగీకరించును? అన్న ప్రసాదమును గ్రహింపనొడంబడును? సమయస్ఫూర్తితో నామె యివ్విషయమున శాస్త్రనిశ్చితాభిప్రాయము నరయుచు అనేక పండితులకు లేఖలు వ్రాయించెను. కాని యెవ్వరును అనుకూలసమాధానము నొసఁగరైరి. ఆలయనిర్వహణార్థము తగినంత యాస్తితో కాళికాలయమును రాణి యొక బ్రాహ్మణునకు దాన మొనరించినచో, బ్రాహ్మణుఁ డందు పూజారిగా నుండుటకైనను, అన్నాదికప్రసాదమును గ్రహించుటకైనను శాస్త్రసమ్మతమగునని యెట్టకేలకు రామకుమారపండితునియొద్దనుండి సమాధానము లభించెను. ఇది సుసాధ్యమే కదా? రాణి తన గురువర్యునకు అట్లు దాన మొనర్చి యా ప్రతిబంధమును దొలఁగించుకొనెను. కాళికాలయార్చకుఁడుగా నుండుటకై యామె రామకుమారునే కోర నాతఁ డంగీకరించెను. స్నానయాత్రాదినమనెడి శుభదినమున (1855-వ సం॥ మే 31-వ తేదిని) అఖండశ్రద్ధాభక్తిపూర్వకముగా, మహావైభవాన్వితముగా సంప్రోక్షణ జరిగెను.

గదాధరుఁడు ఈదివ్యోత్సవమును గాంచి పరమానందభరితుఁ డయ్యెను. ఐనను, శూద్రప్రతిష్ఠితాలయసంబంధమగు నన్నము దినుట నాఁటి శిష్టాచారవ్యతిరిక్త మగుటచే నందులకొల్లక, యొక కాని పెట్టి మరమరాలు గొని భుజించెను.

పరమనిష్ఠాపరుఁడగు తమ తండ్రి శూద్రులయొద్ద నెన్నఁడును దానములకు చేయి చాఁపని వ్యక్తియైయుండ, రామకుమారుఁడు శూద్రులయొద్ద కొలువున కొడంబడుటయు, శూద్రస్త్రీ ప్రతిష్ఠితాలయార్చకుఁ డగుటయు గదాధరునకు మనస్కరింప దయ్యె. ఇవ్విషయమై సోదరు లిరువురకును ఎంతయో ధార్మిక చర్చ జరిగెను. కర్తవ్యనిర్ణయార్థము తుదకు 'ధర్మపత్రము' అను విధానము ననుసరించి చీట్లు వేసికొనిచూడ, రామకుమారుని పక్షము నెగ్గెను. గదాధరుఁడు ఆలయమందలి యుగ్రాణము నుండి బియ్యము, కూరగాయలను గ్రహించి గంగాతీరమున స్వయంపాక మొనర్చుకొని భుజించుచు సోదరునితో నివసింప సాగెను. "పల్లెకోలస్థుల యన్నము తినవలసిన విధి యేర్పడు చున్నదే దైవమా! యని నాకపుడు దారుణమనోవ్యథ కలుగుచుండెడిది" యని కాలక్రమమున నాతఁడు శిష్యులకుఁ దెల్పును.

పావనగంగాతీరమున, దక్షిణేశ్వరపుణ్యక్షేత్రమున, ఏకాంతప్రదేశమున, దేవాలయావరణమున నివాసము, సోదరుని విశేషప్రేమానురాగములు, రాసమణిరాణియు నామె యల్లుఁడగు మథురానాథవిశ్వాస్[1] యును తనయెడఁ జూపుచుండిన ప్రేమగౌరవాభిమానములు, ఆలయమున శ్రీభవతారిణీకాళీదేవి నిక్కముగా అవతరించియున్నదను తన దృఢవిశ్వాసము—ఇవన్నియు నూతననివాసమున నాతని హృదయమును బాదుకొల్పెను.

[1] మథురామోహన విశ్వాస్ అని యీతని నామాంతరము. 'మథురానాథ్' లేక 'మథుర్ నాథ్' అని వాడుక పేరు.

విశేషప్రసిద్ధమగు శ్రీరామకృష్ణనామమున నిఁక గదాధరునిఁ బేర్కొందము.[1] యావజ్జీవితము శ్రీరామకృష్ణుఁడు గంగాభవానియెడ అఖండభక్తిభావముఁ జూపుచుండువాఁడు. "గంగాజలము సామాన్యజలముగా భావింపరాదు, అది పరమపవిత్రము, బ్రహ్మస్వరూపము. గంగాతీరమున నివసించుచో, నాస్తికులు సైతము ఆస్తికులై భక్తులగుదురు. గంగానదీతుషారభరితమైన గాలి ప్రసరించు ప్రదేశమంతయు పవిత్రము. అచట నివసించువారు అప్రయత్నముగా ఆత్మప్రబోధము నొందుదురు" అని యాతఁడు వచించును. భక్తుఁడెవ్వఁడైనను లౌకికసహవాసము చేసినను, చాలసేపు లౌకికప్రసంగము చేసినను గంగాజల మొకింత పానము చేయుమని చెప్పును. ఏస్థలమైనను విషయలంపటుఁ డగువాని స్పర్శచే కలుషితమైనచో, తద్దోషపరిహారార్థ మాతఁ డచట గంగాజలము ప్రోక్షింపఁజేయును. చిన్ననాఁటి నుండియు నిట్లు గంగాభక్తిపూరితుఁడగు నాతఁడు స్వయముగాఁ బర్యాలోచించియైననేమి, "గంగాజలములతోఁ బచనమైన దేవీనివేదితాన్నము శూద్రస్త్రీప్రతిష్ఠితాలయ

[1] గదాధరునకు శ్రీరామకృష్ణనామము ఎట్లు కలిగెనో ఇదమిత్థముగాఁ జెప్పఁజాలము. ఆలయనిర్వాహకుఁడగు మథురానాథుఁడు తనకీ పేరిడెనని తనపినతండ్రియే—శ్రీరామకృష్ణుఁడే—తనతోఁ జెప్పినట్లు రామలాల్ మహాశయుఁడు తెలిపెను. సన్న్యాసదీక్షాసమయమున గదాధరునకు ఆతని గురువరేణ్యుఁడగు శ్రీతోతాపురి శ్రీరామకృష్ణనామము నిడియుండవచ్చునని శ్రీరామకృష్ణుని శిష్యుఁడు శ్రీశారదానందస్వామి 'శ్రీరామకృష్ణ లీలాప్రసంగ(ము)'నఁ దెలుపుచున్నాఁడు.

సంబంధ మైనంతమాత్రమున స్వీకరించకుండుట పాడి గాదు" అని పెద్దన్న సోదరప్రేమతో హెచ్చరించుటచే నైననేమి, శ్రీరామకృష్ణుఁడు అచిరకాలముననే సంకోచవిరహితుఁడై మహానందముతో దేవీప్రసాదాన్నము భుజింపనాగెను. క్రమమనోవికాసమునఁగాని సంస్కారములు మాఱవుగదా?

జాతిభేదాదులనుగూర్చి శ్రీరామకృష్ణుఁడు కాలక్రమమున లోకమున కొసఁగిన యీక్రింది యుపదేశములు ఈసందర్భమున ముఖ్యముగా గమనింపఁదగియున్నవి. "జాతిభేదబుద్ధి తొలఁగించుకొనుటకు ఒక్కటే ఉపాయము. భక్తియే ఆ ఉపాయము. భక్తులు ఏజాతికిని జెందరు. భగవద్భక్తిలేని బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడుకాఁడు; భగవద్భక్తుఁడగు చండాలుఁడు చండాలుఁడు కాఁడు. అస్పృశ్యుఁడు భక్తిమూలమున శుద్ధుఁడు, పవిత్రుఁడును అగుచున్నాఁడు.

"కొబ్బరిచెట్లును తాటిచెట్లును ఎదిగినకొలఁదియు ప్రాఁతమట్టలు తమంతఁ దామే రాలిపోవునట్లు, ఆత్మవికాసము నొందినకొలఁదియు జాతిభేదాదులు తమంతఁ దామే రాలిపోవును. కాని వానిని బలాత్కారముగాఁ బరిత్యజింపఁదగదు.

"ముక్తిమార్గమున ఆరూఢుఁడైనవాఁడు ఆచారములు మొదలైనవాని నంతగాఁ బాటింపనక్కఱలేదు. పుండు మానిపోయినతరువాత పక్కు దానంతటదే రాలిపోవును. కాని అంతవఱకు ఆఁగక పక్కును బలాత్కారముగా లాగివేసితిమా, పుండునుండి నెత్తురు కాఱనారంభించును."

# దేవీసాన్నిధ్య సాక్షాత్కారములు

త్రీవ నిష్ఠానియమములతో, సాధనానుభవములతో, అత్యంతనిరాడంబరముగా మనుచుండిన శ్రీరామకృష్ణుని యునికి యచిరకాలముననే మథురానాథుని అనిర్వచనీయ రీతిని ఆకర్షింపసాగెను. రాసమణిరాణికి సర్వవిధములను చేదోడువాదోడునై యుండిన యాతఁడు కాళికాలయమున శ్రీరామకృష్ణు నెట్టైనను ఏదియో యొక సేవయందు నియోగింప నభిలషించి రామకుమారునితోఁ బ్రస్తావించెను. కాని తన సోదరుని చిత్తవృత్తి అపూర్వమైనట్టిదనియు, అత్యంత స్వాతంత్ర్యప్రియుఁడగు నాతఁడు కొలువుచే బద్ధుఁడై యుండ నిచ్ఛగింపఁడనియు రామకుమారుఁడు చల్లగా విశదపఱిచెను. ఇట్లు ప్రతికూలసమాధానము నొంది మథురుఁడు కేవల తాత్కాలికముగాఁ దన యుద్దేశమును, లేదా, ప్రయత్నమును విరమించినను, తన యభిలాషను నెఱవేర్చుకొనుటకుఁ దగిన యవకాశమునకై వేచియుండెను.

కాళికాలయావరణమున శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు తనచే నిర్మితమైన శివవిగ్రహమును తన్మయుఁడై యారాధించుచుండ, మథురుఁడు సమీపస్థుఁడై విగ్రహదివ్యసౌందర్యమున కేకాక, ఆరాధకుని తన్మయత్వమునకును ఆశ్చర్యచకితుఁ డయ్యెను. శ్రీరామకృష్ణుఁడే యావిగ్రహనిర్మాతయని యనంతరము మథురుఁడు తెలిసికొని దానిని దన కిమ్మని ప్రార్థించి యాతనివలనఁ బడసెను. కాళికాలయమున శ్రీరామ

కృష్ణుని సేవల నేదియో యొకరూపమునఁ బడయవలయు ననెడి విశేషాభిలాషతో మథురుఁడు మరల రామకృష్ణుని సమీపించెను గాని, మరల వ్యతిరేకసమాధానమే యయ్యెను. శ్రీరామకృష్ణునియెడ గాఢాసక్తచిత్తుఁడగు నాతని యభిలాష మఱింత ప్రబల మయ్యెను.

కాళికాలయమునఁ దన్ను సహాయార్చకునిగా నొనరించుటకై మథురుఁడు తనపై కన్నువేసియుండెనని శ్రీరామకృష్ణుఁ డెట్లో గ్రహించి సాధ్యమైనంతవఱ కాతనికంటఁ బడకుండఁ దప్పించుకొని మెలఁగుచుండెను. అఖండత్యాగవైరాగ్యములను బూని స్వీయమార్గమున భగవత్సాక్షాత్కారమును బడయుటకంటె కర్తవ్య మొండులేదను దృఢనిశ్చయమే యాతని యీ కార్యవిముఖతకు ప్రధానకారణము. కాని కాళికాలయావరణమున నివసించుచుండిన యాతఁ డెంతకాలము మథురుని కంటఁ బడకుండ, ఎదురుపడకుండ, మనఁగలఁడు? తన మేనత్త (తండ్రిచెల్లెలి) దౌహిత్రుఁడును, ఆలయమున నేదేని యుద్యోగమును సంపాదించు నిమిత్త మచటికి వచ్చియున్నవాఁడును, తన కిటుపై పాతికసంవత్సరములపర్యంతము తోడునీడయై వర్తింపనున్నవాఁడును నగు హృదయ్ (హృదయరామ ముఖోపాధ్యాయ) అనునాతనితో శ్రీరామకృష్ణుఁడు కాళికాలయమున సంభాషించుచుండ, మథురుఁడు కనుఁగొని, శ్రీరామకృష్ణుఁడు తొలఁగిపోఁగలుగుటకుముందే యాతనికిఁ గబురంపెను. మథురునిఁ గలసికొనునాతఁడు సందేహించుచుండ, హృదయుఁడు కారణ మరయ నాతఁ డిట్లు పల్కెను: "కలసికొంటినా, ఆలయమున న

న్నాతఁడు కొలువుచేయుమనును.” అందులకు హృదయుఁడు, “కానిమ్ము. అందు బాధ యేమున్నది? సౌమ్యుఁడు, పుణ్యాత్ముఁడు నగు నాతనిక్రింద (ఆలయమున) కొలువుచేయుట వలని అగౌరవ మేమి?” అని ప్రశ్నింప, శ్రీరామకృష్ణుఁడు మెల్లఁగా నిట్లు సమాధానించెను: “పరాధీనుఁడనై జీవింప నొల్లను. అదిగాక, దేవి యమూల్యాభరణములను భద్రపఱచుచు, స్వాధీనమున నుంచుకొనుటయనిన, పెద్దపూచీ కదా! అది నాకు మనోవ్యాకులహేతు వగును. ఆ బాధ్యతను నీవు వహింపనంగీకరించిన పక్షమున మథురుని కోరికకు ఒడంబడఁగలుగుదునేమో.” ఆడఁబోయిన తీర్థ మెదురైన దన్నట్లు, ఉద్యోగార్థమే యచటికి వచ్చియుండిన హృదయుఁడు వెనువెంటనే యందులకు అంగీకరించెను. శ్రీరామకృష్ణుని సమ్మతికి మథురుఁడు పరమానందభరితుఁ డయ్యెనని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. రామకుమార శ్రీరామకృష్ణులకు హృదయుఁడు సహకారిగా నియమితుఁ డయ్యెను. శ్రీరామకృష్ణుఁడు దేవీ భూషణాద్యలంకరణోద్యోగము గైకొనెను.

శ్రీరామకృష్ణుఁ డిట్లు కాళీకాలయసేవానియుక్తుఁడైన పిమ్మట రాసమణి రాణికిని మథురునకును ఆతనియెడ గౌరవము ఇనుమడించుటకు సాధనభూతమైన యొక సంఘటనము జరిగెను. రాధాగోవిందాలయార్చకుఁడైన క్షేత్రనాథ్ అనునాతఁడు శ్రీకృష్ణవిగ్రహమును పవళింపు మందిరమునకుఁ గైకొని వెడలుచు, చలువఱాతితిన్నెపై కాలు జాఱి పడుట తటస్థింప, విగ్రహమున కొక కాలు విఱిగెను. వెంటనే, పాపము, ఆతఁడు అర్చకత్వమునుండి తొలఁగింపఁబడెను. విగ్రహము

విఱిగిపోవుట అపశకునము కాఁబోలునని రాణి యెంతయో వ్యాకులపడి, కర్తవ్యనిర్ణయార్థము పండితసమావేశము నొనఁగూర్ప, భగ్నవిగ్రహమును అర్చించుట శాస్త్రవిరుద్ధమనియు, దానిని గంగార్పితమొనర్చి నూతన విగ్రహమును ప్రతిష్ఠింప వలయుననియు పండితులు తీర్మానించిరి. నూతనవిగ్రహ నిర్మాణార్థము వెంటనే ఉత్తరు వొసఁగఁబడెను. కాని తా నంతవఱకుఁ బూజించుచుండిన విగ్రహమును గంగపాలు చేయుటకు భక్తురాలైన యామెమనసు ఒప్పదయ్యె. ఇవ్విష యమై మథురుని ప్రేరణమున నామె శ్రీరామకృష్ణుని యభి ప్రాయము నరయ, వృత్తాంతమునంతయు విని శ్రీరామ కృష్ణుఁడు అతీంద్రియావస్థయం దిట్లు పలికెను: "పండితుల నిర్ణయము హాస్యాస్పదము. ప్రమాదవశమున రాణిగారి యల్లుని కాలు విఱిగిన పక్షమున, ఆతని విడనాడి యాతని స్థానమున మఱియొకరి నుంచునా? చికిత్స చేయించునా? ఇందును అదియే విధానము అవలంబనీయము. విగ్రహమును బాగుచేయించి యథాప్రకారము పూజింపనగును." ఈ యద్భుతపరిష్కారవిధానమును విని పండితులు దిగ్భ్రాంతు లైరి. ఎన్ని శాస్త్రములు తలక్రిందుగా నొప్పఁజెప్పఁగలిగినను, ఎన్ని ధర్మము లేకరువు పెట్టఁగలిగినను, శాస్త్రహృదయమును, ధర్మమునందలి మర్మమును గ్రహింపఁగల పండితు లెందఱు? ధర్మసూక్ష్మమును తన వినిర్మలాంతఃకరణమనెడి సూక్ష్మ దర్శనియందుండి పరిశీలించిన శ్రీరామకృష్ణుని సరళాతి సరళమైన యీసమాధానమునకు పండితులు మొదట పెదవి విఱిచినను, తుద కదియే సరియైనదని శిరసావహింప

వలసినవారైరి. రాణీ యానందమునకు మేర లేదు. ఇదివఱకే శ్రీరామకృష్ణుని శిల్పనైపుణ్యమునకు నిదర్శనముఁ గాంచి యుండిన యామె విగ్రహమును బాగుచేయుఁడని యాతనినే కోరెను. ఎందఱెందఱో ఘోరసంసార దుఃఖభగ్నహృదయ ములనో తన యుపదేశామృతసేచనమునఁ జక్కఁబఱుప నున్న యాదివ్యశిల్పి సమ్మతించి, విగ్రహమునకు విఱు పెచ్చట నేర్పడెనో తెలియరాకుండునట్లు అతిచమత్కార ముగా కాలు అతికెను!

మథురుని కోరికపై రామకుమారుఁడు ప్రేరేపింప, శ్రీరామకృష్ణుఁడు సమ్మతించి రాధాగోవిందాలయార్చకుఁ డయ్యెను.

ఏకొలువున కొడంబడ శ్రీరామకృష్ణుఁ డిదివఱ కెంతయో సంకోచించియుండెనో, ఆకొలువే యాతని ఆత్మ సామ్రాజ్యలక్ష్మీమందిరద్వార మయ్యెను. పూజార్థము ఆసీనుఁడైనంతనే బాహ్యలోకమును మఱచును. పూజాదులను దర్శింపవచ్చువారల యునికియే యాతనికిఁ దెలియదు. అంగ న్యాసకరన్యాసము లాచరించునపుడు శరీరమందలి ఆయా భాగములందు దివ్యకాంతులలో మంత్రాక్షరములను దర్శించు వాఁడనని కాలాంతరమున నాతఁడు శిష్యులకుఁ దెలుపును. నియమితవిధానము ననుసరించి 'రం' అను అగ్నిబీజమంత్రము నుచ్చరించుచు, చుట్టును జలము ప్రోక్షించుకొనుచు, జ్వాలా వలయ మేర్పడియున్నట్లు భావించునపు డాతనికిఁ దాను నిజముగా జ్వాలావలయమునడుమ నున్నట్లును, ఆజ్వాల తనను, పూజాస్థలమును సమస్తదుష్టసంపర్కములనుండియు

సంరక్షించుచున్నట్లును అనుభూతి పడెను. యోగశాస్త్రోక్త మగు కుండలినీవిజృంభణముసైత మాతనికి అనుభూతము కాఁజొచ్చెను. పూజాసమయమున నాతని ముఖమండలమున వెల్గొందుచుండెడి యలౌకిక తేజము, ఆతని ధ్యాననిమగ్నత, ఆదివ్యవ్యక్తిత్వముచే నిర్మితమై పవిత్రతతో స్పందించుచుండెడి యా వాతావరణము—ఇవన్నియు వేదశాస్త్రవర్ణిత మైన సనాతనబ్రాహ్మణత్వ మచట మూర్తీభవించియున్నట్లు ప్రేక్షకులకుఁ దోఁచుచుండెను.

ఈవిధముగా శ్రీరామకృష్ణుఁడు అర్చకత్వమును ఒండొరులను వరించియున్నట్లు ఎల్లరకును భాసింప, నాతఁడు తన నూతనోద్యోగమున కలవడి మిగిలినవిషయము లన్నియు మఱచిపోయెను. సోదరుఁడు మనఃపరివర్తనము నొందెనని రామకుమారుఁడు మొదట సంతృప్తి నొందియు, క్రమముగా శ్రీరామకృష్ణుని యేకాంతవాసానురక్తిని, అభివృద్ధిగాంచుచుండిన యాతని సంసారవిరక్తిని గని యాందోళనము నొందసాగెను. సమయము వచ్చినంతనే కాళికార్చనమును సోదరుఁడు స్వయముగా నిర్వహింపఁగలుగుటకై సాంగోపాంగముగా నాతనికి నేర్పవలయునని రామకుమారుఁడు సమకట్టెను. శ్రీరామకృష్ణుఁడు సమ్మతించి యందులకై మంత్రోపదేశము నొందనిశ్చయించుకొని, శక్త్యుపాసనాధురీణుఁడనియు మహనీయుఁడనియు ప్రసిద్ధి గాంచిన శ్రీకేనారాం భట్టాచార్యునియొద్ద నుపదేశమునొందెను. మంత్రము చెవినిఁ బడినంతనే భక్తిపరవశుఁడై యొక కేక వేసి గాఢధ్యానమున మునిఁగిపోవ, గురు వది గాంచి నిశ్చేష్టుఁ డయ్యెనఁట! మహా

నీయగురుశిష్యమంత్రసంయోగమునఁ గలుగని మహాఫలము లెవ్వి? తొలఁగని భవబంధనము లెవ్వి?

ఇంతటినుండియు రామకుమారుఁ డప్పుడప్పుడు కాళీకార్చనమును సోదరునిచే నిర్వర్తింపఁజేయుచు, రాధాకృష్ణార్చనము తాను జేయసాగెను. "శ్రీకాళికార్చనమును మీరే సాగించుచుండుఁడు" అని మథురుఁ డొకనాఁడు శ్రీరామకృష్ణు నెంతయో వేఁడుకొన నాతఁడు సమ్మతించెను. వృద్ధుఁడగుచుండిన రామకుమారుని యారోగ్యము క్షీణింపసాగెను. కొంతకాలమువఱకును దన పని హృదయుని కొప్పగించి, విశ్రాంతినిమిత్తము రామకుమారుఁ డింటికి వెడలఁబూనియు, కార్యవశమున సమీపగ్రామమున కేఁగి యచటనే పరమపదించెను.

రామకుమారుని మరణము శ్రీరామకృష్ణునకు మహావిషాదకర మయ్యెను. తనకు అతిబాల్యముననే తండ్రి గతింప, నాతని పితృప్రేమాదులు పెద్దన్నయగు రామకుమారునియందు లగ్నమై యున్నవి. తనయం దాతనికి అఖండవాత్సల్యము. అట్టి పరమాప్తసోదరుని యాకస్మికమరణము ప్రబలఘాతమై యాతనిహృదయమును సోకెను. కాని యీవిషాదసంఘటనమే యాతనిమానసమున మహత్తర పరిణామముఁ గల్గింపసాగెను. మరణాదివిషాదసంఘటనములను గాంచియే కదా గౌతమబుద్ధుఁడు మహావిరక్తుఁడై తత్త్వాన్వేషణమున నిమగ్నుఁ డయ్యెను? సంసారసారహీనతను శ్రీరామకృష్ణుఁ డిదివఱకే గ్రహించి సత్యాన్వేషణమున మహాసంక్షోభము నందుచుండెను.

ఈ మహామనఃపరివర్తనసమయమున కాళికాలయ సేవ యాతని నిత్యకృత్యముగా నేర్పడినది. ఏశుభముహూర్తమున శ్రీరామకృష్ణుఁడు మంత్రోపదేశము నొందెనో, ఆసుముహూర్తమునుండియు కాళీమాతయే యాతని యభీష్టదైవతము. వస్త్రాభరణమాల్యాదులతో ప్రతిదిన మాతఁడామె మూర్తి నలంకరించును. అతని కామె సాక్షాజ్జగజ్జనని, సచ్చిదానందస్వరూపిణి. దివ్యకళావిలాసములతో విరాజిల్లుచున్న యీ మనోహరప్రతిమ అపూర్వశిల్పనిదర్శనమని తన్మూర్తిని సందర్శించినవా రెల్లరును వక్కాణించుచుందురు. దేవి మేలిమి కాశీపట్టుచీరతో, ఆపాదమస్తకము దివ్యాభరణములతో సమలంకృతయై సొంపునింపుచుండును. సహస్రదళాన్వితరజతకమలమున యోగనిద్రితుఁడై యుండు పరమశివుని ధవళవక్షఃస్థలమున నామె కాళమూర్తి నిలిచి యుండును. ఆతీరు అనిర్వచనీయము. ప్రళయరౌద్రాకారమును ప్రేమామృతమయమాతృస్వరూపమును అందు అద్భుతరీతిని సమ్మేళన మొందియుండును. ఆమె మహాశక్తిస్వరూపిణి, సృష్టిస్థితిలయకారిణి. సృజనసంరక్షణముల నొనర్చు శాంతమూర్తియు సర్వవినాశన మొనర్చు భయానకమూర్తియు నామెయే. ఆమె గళమునఁ దాల్చినది కపాలహారము. మొలచుట్టును వ్రేలాడుచుండు ఖండితమానవహస్తములే యామె యొడ్డాణము. క్రింది యెడమచేతితో ఖండితమానవశిరస్సు పట్టుకొనియుండును. (ఈశిరస్సును, పైని దెల్పిన యొడ్డాణమును, హారమును సువర్ణనిర్మితములు.) పై యెడమచేతిలో రక్తలిప్తమైన ఖడ్గము. క్రింది కుడిచేతితో

నామె భక్తులకు వరప్రదాన మొనర్చుచుండ, పైకడిచేతితో అభయ మొసంగుచుండును. ఆమె నేత్రత్రయము దుష్టులకు మహాభయంకర మయ్యును, శిష్టులకు—భక్తులకు—ప్రేమ కటాక్షసమంచితము. ఖడ్గకపాలాదు లామె రౌద్రస్వభావమును బ్రకటించుచుండ, వరదాభయహస్తములు దయాస్వభావమును వ్యక్తీకరించుచుండును. ఇట్లు దయారౌద్రసమ్మిళితదివ్యమూర్తియగు నామెయే శ్రీరామకృష్ణుడు అనుదినము అర్చించు భవతారిణీకాళీదేవి.[1] ఆతని కామె సర్వదా వర్ణనాతీతప్రేమస్వరూపిణియగు తల్లి; ఆనందమయి; సమస్తశక్తిస్వరూపిణి; అభయప్రదాయిని. ఆతఁ డామె చరణారవిందాశ్రితుఁడు.

ఆతని విషయవిరక్తి అఖండవైరాగ్యముగాఁ బరిణమించెను. లౌకికసంసర్గమే కాక, లౌకికసంపర్కము సైతము ఆతనికి అత్యంతదుర్భర మయ్యెను. అపరాహ్ణకాలమంతయు నేకాంతముగాఁ గడపును. రాత్రి యెల్లరును నిదురించుచుండునపు డాతఁడు శయ్య విడిచి నిశ్శబ్దముగా బయటకు వెడలును. తెల్లవాఱునపుడు తిరిగి వచ్చును. విశేషవిలాపముననో, దీర్ఘకాలపర్యంతధ్యానముననో కన్నులు వాఁచి

[1] కాళీమూర్తితత్త్వమును దెలుపుచు శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించును : "కాళీపాదపద్మములక్రింద శివుఁడు శవప్రాయముగాఁ బడియుండును. కాళి శివుని అవలోకించుచుండును. ప్రకృతిపురుషసంయోగమే యిందలి తాత్పర్యము. పురుషుఁడు అకర్త, కావున నాతఁడు శవప్రాయముగాఁ బడియుండును. పురుషునితోఁ జేరియుండుటవలననే ప్రకృతి—జగన్మాత—తన సృష్టిస్థితిలయకార్యముల నొనర్చుచున్నది."

యుండును. ఎచటికి వెడలుచుండునదియు నెవ్వ రడిగినను జెప్పక తప్పించుకొనును. హృదయుఁడు ఈ రహస్యమును గనుఁగొన నిశ్చయించెను.

శ్రీరామకృష్ణుని బహుసంవత్సరపర్యంతమగు తీవ్ర తపోధ్యాననిష్ఠలకు నిలయమై నేఁడు పంచవటీక్షేత్రనామమున ప్రసిద్ధమై ఆలయమునకు ఉత్తరమున నున్న ప్రదేశము నాఁడు దట్టమైన చిట్టడవి. గుబురుకొనిన పొదలతోడను ముండ్ల చెట్లతోడను నిండియుండిన యెగుడుదిగుడు నేల. ప్రాయికముగా సూర్యరశ్మియే చొరని చీఁకటికోన. దీనికి తోడది పూర్వము శ్మశానవాటికయై యుండినందున జను లెవ్వరును అచటికిఁ బోవ సాహసించువారు కారు. తన యాధ్యాత్మికసాధనలకు శ్రీరామకృష్ణుఁ డీస్థలము నెన్నుకొని, యందలి యొక విశాలమైన యుసిరిక చెట్టుక్రిఁద రాత్రులను, అపరాహ్ణములను ధ్యాననిమగ్నుఁడై కడపువాఁడు.

హృదయుఁ డొకరేయి నిశ్శబ్దముగా శ్రీరామకృష్ణుని వెంబడించెను. కాని యా నిశీథమున నాతఁ డా కీకారణ్యమును బ్రవేశించుటఁ జూడ నాతని గుండె జల్లుమనెను! ఆతనికి భయము గొల్పుటకై ఱాళ్లు ఱువ్వఁజూచెను గాని నిష్ఫలమయ్యెను. అడవిలో నేమి చేయుచుంటివని మఱునాఁడు హృదయుఁ డడుగ, శ్రీరామకృష్ణుఁడు మెల్లఁగా నిట్లు సమాధానించెను : "అచట నొక పెద్ద యుసిరికచెట్టుక్రింద ధ్యానించుచుందును. ఉసిరికచెట్టుక్రింద నెవ రేకోర్కెతో ధ్యానింతురో వారి కాకోర్కె సిద్ధించుననునది శాస్త్రవచనము." హృదయుఁ డీ సమాధానముతో తృప్తి నొందక, తన చర్య మఱింత

విశేషముగా సాగించియు ప్రయోజనము గానక, యొకరేయి నెట్లో సాహసించి యడవిలోఁ జొరఁబాఱి తన బాబును గాంచి మహాశ్చర్యచకితుఁ డయ్యెను. ఆతఁ డేమి చేయు చుండెను? యజ్ఞోపవీతమైనను లేక కేవల దిగంబరుఁడై యా యుసిరిక చెట్టుక్రింద ధ్యాననిమగ్నుఁడై యుండెను. 'బాబూ! ఏమిది? కట్టుబట్టను, యజ్ఞోపవీతమునుగూడ తీసి వేసితివేమి?' అని కొన్ని సార్లు కేకలిడుచుఁ బ్రశ్నింప, నాతఁడు మెల్ల మెల్లఁగా బాహ్యప్రజ్ఞ నొంది, హృదయుని ప్రశ్న విని యిట్లు సమాధా నించెను: "తెలియదా? ఈ విధముగా పాశముక్తుఁడై సాధకుఁడు ధ్యానింపవలయును. పుట్టినది లగాయతు మానవుఁడు ఘృణ (అనఁగా రోఁత), లజ్జ, కులము, శీలము (అనఁగా స్వభావము), భయము, మానము (అనఁగా ప్రతిష్ఠ), జాతి, అభిమానము ననునట్టి యెనిమిది పాశములచే బద్ధుఁ డగుచున్నాఁడు.[1] 'నేను బ్రాహ్మణుఁడను, అందఱికంటెను అధికుఁడను' అనునట్టి అభిమానమునకు చిహ్నమై జందెముకూడ పాశమగుచున్నది. అమ్మను (జగజ్జననిని) ప్రార్థించుచో, ఈపాశముల నన్నిఁటిని తొలఁగఁద్రోసి యేకాగ్రచిత్తుఁడై ప్రార్థింపవలయును, ధ్యానింపవలయును. అందుచే వీనిని (బట్టను

[1] ఈ సందర్భమున 'శ్రీరామకృష్ణలీలాప్రసంగ(ము)'నఁ బేర్కొనఁబడియున్న సంస్కృతనామములనే యిట నుల్లేఖించియున్నాము. ఈయష్టపాశములును అత్యల్పభేదముతో కులార్ణవతంత్ర(శాస్త్ర)మున నిట్లు పేర్కొనఁబడి యున్నవి:

శ్లో. 'ఘృణా శంకా భయం లజ్జా జుగుప్సా చేతి పంచమీ,
కులం శీలం చ జాతిశ్చే త్యష్టౌ పాశాః ప్రకీర్తితాః.'

జందెమును) తీసివేసితిని, ధ్యానానంతరము మరల ధరింతును.”
హృదయుఁడు ఆలకించి మెల్లఁగా అటనుండి వెడలెను.

'సాక్షాత్కారము నాకెపుడు లభించును? అమ్మను (జగజ్జనని) ఎపుడు దర్శింతును?'— ఇదియే ఉచ్ఛ్వాస నిశ్వాసములతోఁబాటు, హృదయస్పందనములతోఁబాటు నిరంతరమై శ్రీరామకృష్ణుని యంతరంగమునఁ జెలరేఁగ సాగిన మహావాంఛ. రామప్రసాదు, కమలాకాంతుఁడు మున్నగు మహాభక్తులు రచించిన భక్తిప్రపూరితకీర్తనముల నాతఁడు తన్మయుఁడై పాడుచు, దేవినిఁ బ్రార్థించుచుండును. ఆకీర్తనలచే నాతని హృదయమందలి భగవద్ధ్యానము లుబికి పొరలిపాఱ, తల్లి నెడఁబాసిన బిడ్డవలె అఖండవేదనతో వెక్కి వెక్కి యేడ్చుచు నిట్లు మొఱలిడుచుండును: “అమ్మా! అమ్మా! ఎక్కడ ఉన్నావు? నాకు సాక్షాత్కరింపుము. రామప్రసాదు నిన్నుఁ గాంచి నీ యనుగ్రహము నొంది ధన్యుఁడై యుండెఁగదా? నాకుఁ గానరావా? నే నంతటి నిర్భాగ్యుఁడనా? సౌఖ్యము, సంపద, సఖులు, భోగములు— ఇవేవియు నాకు వలదు. అమ్మా! నిన్నుఁ గాంచుటయే నా కోరిక.” ఆతని కన్నీరు సంతతధారగాఁ బ్రవహించుచుండును. ఇట్టి సమయములలోఁ దఱచుగా నాతఁడు కేవలము 'అమ్మా! అమ్మా!' యని విలపించుచుండ, ఆవిలాపములు జనసమూహముల నాకర్షింప, వా రాతనిఁ గాంచి, “పాపము, ఈయువకుని తల్లి చనిపోయెనుగాఁబోలును, ఎంత దీనముగా విలపించుచున్నాఁడు!” అని తమ సానుభూతిని వెల్లడించువారు.

ఇట్లు తీవ్రభగవత్పరితాపమునఁ గడచిన యాదినములనుగూర్చి కాలక్రమమున శ్రీరామకృష్ణుఁడే శిష్యుల కిట్లు వచించును: "ఒక్కొక్కప్పుడు తీవ్రభగవద్విరహావేదనచే మొగము నేలను బెట్టి రాచుకొన, గాయములై రక్తము వచ్చెడిది. ధ్యానములతో, ప్రార్థనలతో, భక్తిసాధనలతో దినము లట్టె నిమిషములవలెఁ గడచిపోవ, నాకపుడు వానిని గూర్చిన యెఱుకయే లేకుండెడిది. సంధ్యాసమయమున ఆలయమునుండి శంఖఘంటారావములు ఘోషింప, పగలు గడచి రాత్రి యగుచున్నదని నా కపుడు స్మరణకు వచ్చెడిది. ఆయెఱుకతోఁబాటు నిరాశాదుఃఖము నన్ను అలముకొన, నేలపైఁ బడి పొరలాడుచు, మొగము నేలను రాచుకొని యిట్లు బొబ్బలుపెట్టువాఁడను: 'ఓతల్లీ! మఱియొక దినము నిరర్థకముగాఁ గడచిపోయినది. నా కింకను నీవు ప్రసన్నవు గావైతివికదా!' హృదయము అంపములతోఁ గోయఁబడినట్లు తోఁప, నేలపైఁ బొరలాడుచు, నేను బడు వేదనను గాంచిన జనులు, 'అయ్యో! పాపము! ఈతఁ డేదియో శూలచే బాధపడుచున్నాఁడుకాఁబోలును!' అనుకొనెడివారు."

ఒక్కొక్కప్పు డాతఁడు కాళీమూర్తి ముందుఁ గూర్చుండి యిట్లు పలుకును: "అమ్మా! నీ వుండుట నిజమేనా? కాక ఇదంతయు కేవలచిత్తవిభ్రాంతియా? ఉత్త కవితాకల్పనయా? ఉన్నచో, ఎందుకు నిన్నుఁ జూడఁ జాలకున్నాను? పరమార్థము అభూతకల్పనయేనా? గగన కుసుమమేనా?" కాని వెనువెంటనే యాతఁడు దైవసాక్షాత్కారము నొందిన రామప్రసాదాదిమహనీయుల దివ్య

జీవితములను స్మరించి, వారివలె సాక్షాత్కారము నొందిననే జీవితము అర్థవంతమై, రసవంతమై, బ్రహ్మానందమయమై విరాజిల్లుననియు, లేనిచో రసాభాసమై, హాస్యాస్పదమై, నిరర్థకమై, దుర్భరమైపోవుననియు నిశ్చయించి, భగవత్సందర్శనార్థము తీవ్రతరపరితాపముతో, తన సాధనలను మహత్తరదీక్షతో సాగింపఁబూనును.

లోభికిఁ దాను గూడఁబెట్టుకొనిన ధనమునందుండు మక్కువ, పతివ్రతకు భర్తయందలి ప్రణయము, తలిదండ్రులకుఁ దమ యేకైకపుత్త్రునందుండు ననురాగము—ఇవి ముప్పిరిగొనినప్పు డేర్పడు గాఢప్రేమానురాగములును, పరితాపమును ఎట్టివో ఊహించినయెడల, తన భగవదనురాగమును, భగవత్పరితాపమును ఒకించుక గ్రహింపనగునని కాలక్రమమున నాతఁడు శిష్యులకుఁ దెలుపును. శ్రీరామకృష్ణుని అఖండ భగవత్పరితాపమును, భగవదున్మత్తతను గూర్చి My Master (నాగురుదేవుఁడు) అను తన మహోపన్యాసమున శ్రీవివేకానందస్వామి యిట్లు చాటియున్నాఁడు: "ఆమహనీయుఁడే నా కిట్లు తెల్పెను: 'నాయనా! ఒక గదిలో కాసులసంచియు, ప్రక్కగదిలో నొక దొంగయు ఉన్నారనుకొనుము. దొంగ నిశ్చింతగా నిద్రపోఁగలఁడా? ఎట్లు ఆగదిలోఁ జొరఁబడి కాసులసంచి చేపట్టుదునాయని తల్లడిల్లిపోవుచుండునుగదా? అట్లే యీ దృశ్యప్రపంచమునకు ఆధారభూతమైన పరతత్త్వ మొకటి కలదని, దేవుఁడనువాఁ డొకఁ డున్నాఁడని, ఆతఁడు అమృతానందస్వరూపుఁడని, ఆ యానందముతోఁ బోల్చిచూచినచో, విషయసుఖము

లన్నియు తుచ్ఛములని—స్థిరవిశ్వాసము గలవాఁడు దానికై తీవ్రప్రయత్న మొనరింపకుండ నుండఁగలఁడా? నిమిషమైనను ప్రయత్నహీనుఁడై మనఁగలఁడా? మనఁజాలఁడు. ఈ పరితాపము వానిని ఉన్మత్తునిఁ జేసివేయును.' ఈదివ్యోన్మాదమే ఆయనకు నావేశించెను. ఈసమయమున ఆయనకు గురువనువాఁ డెవ్వఁడును, ఏవిషయమును జెప్పువాఁడును లేఁడు. ఎల్లరును ఆయనకు మతిపోయినదని తలఁచిరి. ఇదియే కదా లోకస్వభావము? లౌకికవిషయముల నెవ్వఁడైనను ఉజ్జగించినచో, లోకము వానిని పిచ్చివాఁడనును; కాని యీ పిచ్చివాండ్రే లోకమున ఉత్తమోత్తమగణ్యులు. లోకాభ్యుదయమునకు వీరే మూలకారణభూతులు. ఇట్టి యున్మాదమునుండియే మన జగత్తును ఉత్క్రాంత లూఁగింపఁగలిగిన శక్తులు ఉద్భవించినవి; ఇట్టి యున్మాదమునుండియే లోకమున మహాపరివర్తనము గల్గింపఁగల శక్తులు ఉద్భవింపఁగలవు.''

ఇంతటినుండియు యథాక్రమమున పూజచేయుట ఆతనికి అసాధ్య మయ్యెను. ఏవిధమైన చలనము లేకుండ శిలాప్రతిమవోల నాతఁడు మఱియొక శిలాప్రతిమవలెఁ గూర్చుండును. ఒకప్పు డాతఁడు పిచ్చివానివలె సంచరించును; మఱుక్షణమున పసిబిడ్డవలె నేడ్చును. పూజారంభ విహిత ధ్యానసందర్భమున తలపై పుష్పము నిడుకొని యేరెండు గంటలసేపో నిశ్శబ్దముగా అట్లే కూర్చుండును. నైవేద్యము నర్పించి దేవి ప్రత్యక్షముగా ఆరగించుచుండినట్లు తదేక దృష్టితో నామె కేసిచూచుచుండును. ఉదయము పూలు కోసి మాలలు కట్టి గంటలతరబడిని దేవి నలంకరించుచుండును.

# దేవీసాన్నిధ్య సాక్షాత్కారములు

సాయంసంధ్యాసమయము హారతుల నిచ్చుచు, వాని ముగించు మాటయే మఱచిపోవును. ఆలయోద్యోగులు ఎవ్వ రేమనినను, అనుకొనినను, మథురుఁడుమాత్రము ఆతని తన్మయత్వమునకు ముగ్ధుఁ డగుచుండెను. తన మహాలక్ష్య సాధనయందు నిమగ్నుఁడై యుండిన శ్రీరామకృష్ణునకు ఒరులు తన చర్యలను గాంచి ముగ్ధులైన నేమి? క్రుద్ధులైన నేమి? భూషించిన నేమి? దూషించిన నేమి? ఆతనికి సమానమే. మహావిరక్తుఁ డగు నాతని నిద్రాహారములు విశేషముగా క్షీణించెను. వక్షము, ముఖమును భావోద్రేకముచే సదా ఎఱ్ఱవాఱియుండును. కన్నులు తఱచు బాష్పపూరితములై యుండును.

ఆ మహాహృదయమథనము బ్రహ్మానందామృతఫల ప్రాప్తిని గాంచు సమయ మాసన్న మైనది. ఆశానైరాశ్య తరంగడోలాందోళిత మగుచున్న యా మానసము సాక్షాత్కారమహాప్రశాంతస్థితి నందు తరుణము ఇంక క్షణములో నున్నది. అనిర్వచనీయార్తితో నాతఁ డొకనాఁడు, "అమ్మా! నిన్ను నే నెంతగా ప్రార్థించుచున్నను, కొంచెమైనను నా మొఱ ఆలకింపవా? రామప్రసాదుని ధన్యునిఁ జేసితివిక దా? నన్నును ఏల ధన్యునిఁ జేయవు?" అని మొఱలిడుచు, నిరాశాసంజనితదుఃఖము హృదయము నలముకొన, జీవితము నంత మొందించుకొనఁ బ్రయత్నించునంతలో అద్భుతరీతిని సాక్షాత్కారము లభించెను. ఈ మహాసంఘటనమునుగూర్చి యాతని వాక్కులనే క్రోడీకరించుచున్నాము:

"అమ్మ సందర్శనము నొందనైతినిగదాయని మహా

తీవ్రబాధ పడుచుంటిని. ఆ దారుణవ్యథ మెలిపెట్టి తడిబట్టను పిండునట్లు నా హృదయమును పిండివేయుచుండెను. ఈ జన్మమున నా కామె సాక్షాత్కారభాగ్యము లభింపదేమో యను ఘోరమైన అశాంతియు భయమును నన్ను ఆవేశించెను. వియోగతాపము దుర్భర మయ్యెను. ఎందుకీ బ్రతు కనిపించెను. అకస్మాత్తుగా నా దృష్టి అమ్మగుడిలో నున్న ఖడ్గము పైఁ బడెను. జీవితము తుదముట్టింప నిశ్చయించుకొని, పిచ్చివానివలె అచటికిఁ బరుగెత్తి తటాలున ఖడ్గము పట్టుకొంటిని. అకస్మాత్తుగా 'అమ్మయొక్క అద్భుతదర్శనము' లభించెను. దేహస్మృతి గోల్పోయి నేలపైఁ బడిపోయితిని. అటుపై బాహ్యలోకమున నేమి జరుగుచుండెనో నాకు స్ఫురణయే లేదు—నాఁడును మఱునాఁడును ఎట్లు కడచెనో ఎఱుకయే లేదు. కాని అంతరంగమున అనిర్వచనీయానందవాహిని—అంతకుముందు నే నెన్నఁడును అనుభవింపని దివ్యానందము—ప్రవహించుచుండెను; మఱియు అమ్మ (జగదంబ) ఉనికి భాసించెను."

ఈ యనుభూతినిగూర్చియే మఱియొకప్పు డాతఁ డిట్లు వివరించెను: "నానాభాగములతోసహా భవనములును, ఆలయమును, నా చుట్టు నుండిన సమస్తము క్షణములో అదృశ్య మయ్యెను; ఇఁక నేమియు లేనట్లు తోఁచెను! దేదీప్యమానమగు అనంతచైతన్యసాగరముమాత్రమే నాకు గోచరింపసాగెను. ఏవైపు చూచినను—అన్ని దిశలనుండియు—ఆదివ్యసాగరతరంగములు గంభీరఘోషతో నావైపు ఉవ్వెతుగ వచ్చుచుండెను. రెప్పపాటులో అవి నాపైఁ

ప్రసరించి నన్ను ముంచివేసెను. ఉక్కిరిబిక్కిరినై, స్మృతి తప్పిపోవ, క్రిందఁ బడిపోతిని!"

ఈ చిద్రూప తేజస్సాగరమున శ్రీరామకృష్ణుఁడు తన యభీష్టదైవతమగు కాళీమాతను సందర్శించెనా? సందర్శించియేయున్నట్లు ఊహింపనగును. ఏలన, బాహ్యస్మృతి నొందినంతనే, 'అమ్మా!' యని దీనస్వరమున నాతఁడు ఉచ్చరించుచుండెను.

జగజ్జననీసందర్శనమును అవిచ్ఛిన్నముగాఁ బొందవలయు ననునదియే యిఁక నాతని నిరంతరమహావాంఛ.[1] భగవదనుభవము కొల్లగొని కరతలామలకము గావించుకొను పర్యంతము తృప్తినొందఁజాలని ఆధ్యాత్మిక యోధాగ్రేసరుఁడు శ్రీరామకృష్ణుఁడు. కాని జగజ్జనని కాతఁడు ముద్దుబిడ్డఁడు. తన మహాభిలాషను నెఱవేర్పుమని యాతఁ డామెను నానావిధములుగా బతిమాలుకొనును, ప్రార్థించును, విలపించును. "అమ్మా! నన్ను అనుగ్రహించి సాక్షాత్కరింపుము" అని యాతఁడు మహాపరితప్తహృదయుఁడై, యొకొక్క సమయమున నేలపైఁ బడి పొరలాడుచు బాష్పధారలచే నేల తడిసిపోవునట్లు రోదనముచేయును. ఈ సమయమందలి తన మనఃస్థితినిగూర్చి కాలాంతరమున శిష్యుల కాతఁ డిట్లు

---

[1] ఈసమయమున శ్రీరామకృష్ణుఁడు కేవలము మఱియొక సారి దేవీసందర్శనము నొందఁగోరెనని కొందఱి యభిప్రాయము. కాని యాతఁ డింతటినుండియు, అవిచ్ఛిన్నసందర్శనవాంఛ నొందసాగెనని 'శ్రీ శ్రీరామకృష్ణ లీలాప్రసంగము' స్పష్టీకరించుచున్నది. (Refer Sri Ramakrishna The Great Master, p. 143.)

తెలుపును: "జనులు నా చుట్టును (రోదనచేతను, ప్రార్థనల చేతను ఆకృష్టులై) మూఁగినయెడల, వారు కేవలము నీడల వలెను, తెరపై వేయఁబడిన బొమ్మలవలెను—అంతటి కల్పితవ్యక్తులుగాఁ— దోఁచెడివారు: అందుచే వారియెదుట నా భావోద్రేకమును గనఁబఱుప లజ్జకాని, సంకోచముకాని కలిగెడిది కాదు. కాని అమ్మయెడఁ బాటువలని దుర్భరావేదనచే బాహ్యస్మృతి కోల్పోయినపుడెల్ల, ఉత్తరక్షణముననే నిరుపమాన తేజోమయస్వరూపమున వరదాభయహస్తములతో ప్రత్యక్షమయ్యెడిది. ఆ భవ్యరూపము నవ్వుచు, సంభాషించుచు, బుజ్జగించుచు, నానాప్రకారములుగా బోధించుచు, సాక్షాత్కరించెడిది."

# దివ్యోన్మాదము

“యా ప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ, త్వాం అనుస్మరత స్సామే హృదయా న్మాపసర్పతు” (క్షణికములగు విషయసుఖములయందు అవివేకుల కెట్టి ప్రీతి యుండునో, ఓ సర్వేశ్వరా! నిన్ను ధ్యానించునపుడు నీయం దట్టి గాఢమగు ప్రీతి నా హృదయమునుండి తొలఁగిపోకుండుఁ గాక!) అని భక్తాగ్రేసరుఁడగు ప్రహ్లాదుఁడు ప్రార్థించును. విషయసుఖము లనిన లోకుల కెంత యుబలాటము! ఎంత యాందోళన! ఎంత గగుర్పాటు! వాని నిమిత్త మెంత కష్టమైన నోర్తురే! ఎంత యవమానమైన సహింతురే! విషయసుఖాన్వేషణమున తుదకు నిజముగా పిచ్చివారైపోవుచుందురే! ఈ యున్మత్తలోకమున కొందఱకు డబ్బు పిచ్చి, కొందఱకు సంతానపుఁబిచ్చి, కొందఱకు భోగముల పిచ్చి, మఱికొందఱకు పేరుప్రతిష్ఠలపిచ్చి—ఇం దనేకులకు తామితరుల నణఁగఁద్రొక్కి యెట్లైనను పైకి రావలయునను పిచ్చి. ఇఁక నెవరి పిచ్చి వారి కానందము! ప్రపంచమను ఉన్మత్తశరణాలయమున లోకు లిట్లు నానావిధములుగా ఉన్మత్తులై యుండ, తాను భగవత్ప్రాప్తి నిమిత్తము ఉన్మత్తుఁడనైతినని కాలాంతరమున శ్రీరామకృష్ణుఁడే వచించును. అఖండసచ్చిదానందమూర్తి, అనంతకల్యాణగుణాకరుఁడు, పరమప్రేమాస్పదుఁడును నగు భగవంతునిఁ బొందనైతినిగదా యను దివ్యవిరహోన్మాదమును, తదుపరి అవిచ్ఛిన్నసాక్షా

త్కారమున బ్రహ్మానందానుభవోన్మాదమును బొందఁ గలుగు టెంతటి మహాభాగ్యము!

జేవీసాక్షాత్కారము శ్రీరామకృష్ణ దివ్యజీవితో ద్యానమునకు వసంతోదయము. ఇంతటినుండియు అపూర్వా శయములతో, అపూర్వసాధనలతో, అపూర్వదివ్యానుభవ ములతో విరాజిల్లనున్న యాతని ఆధ్యాత్మిక సార్వభౌమస్థితికి ప్రారంభోత్సవము. ఈసమయమున నించుమించుగా ప్రతి దినము ఆతఁడు అసాధారణ దివ్యదర్శనములను బడయ సాగెను. ఇందుఁ గొన్ని ధ్యాననిమగ్నావస్థయందు—సమా ధ్యవస్థయందుఁ—గలుగ, కొన్ని బాహ్యప్రజ్ఞావస్థయందే కలుగుచుండెను. బాహ్యప్రజ్ఞావస్థయం దిట్లు దివ్యదర్శనము లను బడయఁగల్గెనన్నచో, ఆతని యంతఃకరణ మెంతటి పవిత్రమై యుండియుండవలయునో, ఉన్నతాధ్యాత్మికభూమిక లాతని కెంతటి స్వాధీనములై యుండవలయునో ఊహింప నగును. ఈ లోకముననే మసలుచుండినను, నిజముగా మఱియొక లోకమునకుఁ జెందిన వ్యక్తియగు నాతఁడు ఇతరు లకు అదృశ్యులగు నే దేవతలతోడనో తఱచు సంభాషించు చుండును. కాళీప్రతిమతో మంతనములాడుచుండును, సల్లా పించుచుండును, సంభాషించుచుండును. కాళికాలయమునకు సంబంధించిన జనుల కిదంతయు కేవలము పిచ్చిధోరణిగాఁ దోఁచెననుటకు సందియము లేదు. తీవ్ర సాధనలవలన నాడీ కోశము దుర్బలమై మెదడు చెడెనని హృదయుఁడు—ఆతని సన్నిహితుఁడు—నిశ్చయించెను. భూకైలాసపాలకుల సంస్థాన వైద్యునితో సంప్రతించి యాతనిచే చికిత్స చేయింపసాగిరి.

కాని శ్రీరామకృష్ణుని మనఃస్థితిని గ్రహించుపట్ల మందులనఁదగు వారి మందులచే, చికిత్సలచేఁ గుదురు పిచ్చియాయది? గుణ మేమియుఁ గనఁబడనందున చికిత్స విరమింప వలసివచ్చెను.

దేవీసాక్షాత్కార సంజనితానందోద్వేగముచేఁ గొన్నాళ్లవఱకును పూజాదికార్యములను నిర్వహించుటాతనికి అసాధ్య మయ్యెను. అయ్యెడ హృదయుఁడు వానిని జరుపువాఁడు. తదనంతరము అవిచ్ఛిన్నసాక్షాత్కారమునకై దుర్భరపరితాపము నందుచుండియు, మనస్సు కొంత శాంతస్థితిలో నున్న దినములలో శ్రీరామకృష్ణుఁడు పూజచేయఁ బూనును. ఈ సమయమందలి తన ధ్యానానుభవములను గూర్చియు మనఃస్థితినిగూర్చియు కాలక్రమమున నాతఁ డిట్లు వివరించును: "ఆలయమున కెదుటి మంటపపుఁబిట్టగోడపై నున్న భైరవ(శిలా)విగ్రహమును గనఁబఱచుచు, 'నీ వట్లు నిశ్చలముగా, నిశ్శబ్దముగా నుండి అమ్మపాదారవిందములను ధ్యానింపవలయును' అని మనస్సును శాసించుకొనువాఁడను. ధ్యాన మారంభించినంతనే, చీలమండలనుండి మీఁదికి కీళ్లను ఒకదానివెంబడినొకటిగా నెవ్వరో లోనుండి తాళము వేయుచుండిరా యనునట్లు చిత్రమైన శబ్దములు స్పష్టముగా వినిపించెడివి. అటుపై లేశమును గదలఁజాలను, మెదలఁ జాలను. ధ్యానము సాంతమగువఱకు నిర్బంధముననో యనునట్లు అదే స్థితిలో నుండువాఁడను. ధ్యానానంతరము తలక్రిందు వరుసలో కీళ్లకు వేయఁబడిన తాళము లొకటొకటిగాఁ దీయఁబడు శబ్దములు వినఁబడును. అప్పుడే మెదలఁగలుగుట.

ధ్యానారంభమున మిణుఁగురుఁబురుగుల గుంపులవలె తేజఃకణములు కనఁబడుచుండును. ఒక్కొక్కప్పుడు దేదీప్యమానమైన మంచుతెర నానాదిశలను ఆవరించియున్నట్లు గోచరించును. ఇంకొకప్పుడు కరఁగిన వెండివలె ధగధగలాడు తరంగములు సర్వత్ర వ్యాపించియున్నట్లు కనిపించును. కన్నులు మూసికొనియున్నను, తెఱచికొనియున్నను గూడ ఈ దృశ్యములు గోచరించుచుండును. వీని యర్థమేమో, నా ఆత్మోన్నతికి ఇవి సాధకములో, బాధకములో గ్రహింపఁజాలక, అత్యంతార్తితో అమ్మ నిట్లు ప్రార్థించువాఁడను: 'అమ్మా! వీని యర్థమేమో ఎఱుఁగను. నీ సాక్షాత్కారమునకు వలయు మంత్రాదు లేవియు నాకుఁ దెలియవు. అమ్మా, నిన్ను దర్శించు టెట్లో నాకు బోధింపుము. నీవు గాక నాకు దిక్కెవ్వరు? గురు వెవ్వరు?' అహర్నిశము ఇదియే నేఁ జేయుచుండెడి ప్రార్థన. దుఃఖము మితిమీఱినప్పుడు వెక్కి వెక్కి యేడ్చువాఁడను."

జగజ్జనని నుద్దేశించి యొక్కొక్కప్పు డాతఁడు, "అమ్మా, వినోదార్థము తల్లి తన బిడ్డకుఁ గానరాకుండ దాఁగియుండునుగదా? అట్లే నాతో దాఁగుడుమూఁతలాడుచుంటివా?" అని కొంత మనశ్శాంతి నొందుచుండును. ఆతని చర్యలనుగూర్చి లోకుల—అందు ముఖ్యముగా ఆలయోద్యోగుల—గుసగుసలు నానావిధనిందలుగాఁ బరిణమించి చెవినిఁ బడుచుండెను. కాని యవి యాతని నిరంతర దేవీ చింతాప్రపూరిత మానసమునఁ బ్రవేశింపఁజాలక పోయెను.

ఏమహోత్తమదివ్యానుభూతికై యాతఁడు అనవరతము దేవిని ప్రార్థించుచు పరితపించుచుండెనో, అట్టి అవిచ్ఛిన్న సాక్షాత్కారము క్రమక్రమముగాఁ గలుగ నారంభించెను. పూర్వము పూజాధ్యానసమయములం దాకొకప్పు డామె రమణీయహస్తమునో, పాదపద్మములనో, దివ్యప్రేమ విలసితముఖారవిందమునో ఒకించుక దర్శింపఁగలుగువాఁడు; ఇపు డామె దివ్యసుందర తేజోమయమూర్తి మందహాస మొనర్చుచు, తనతో సంభాషించుచు, 'ఇది చేయు మిది చేయకు' మని యుపదేశించుచున్నటు లాతనికిఁ దఱచు ప్రత్యక్ష మగుచుండును. ఇదివఱకు నైవేద్యము సమర్పింపఁ బడునపుడు ఆమె నేత్రములనుండి యొక తేజఃకిరణము వెలువడి నైవేద్యమును స్పృశించి యందలి సారమును మాత్రము గ్రహించునట్లు కానవచ్చెడిది. ఇపుడో, విధ్యుక్త సమర్పణమునకుముందే యామె నైవేద్యము నారగించుటకు ఆత్రము చూపుచు, ఆసీనయైయున్నట్లు ఆతఁడు కనుఁగొనును.

పూర్వము కాళీశిలాప్రతిమ చైతన్యమయమైయున్నటు లాతఁడు పరిగణించువాఁడు; ఇపుడు శిలాప్రతిమ అంతర్ధానమైపోయి యా స్థానమున దివ్యప్రేమానురాగవీక్షణములను దనపైఁ బఱపుచున్న జగన్మాత ప్రత్యక్ష మగుచుండును. కాలాంతరమున నాతఁ డిట్లు వచించును: "దేవినాసిక యొద్ద చేయి పెట్టి చూతునుగదా, ప్రత్యక్షముగా ఆమె శ్వాసలు నాచేతిపైఁ బడుచుండెడివి. రాత్రి ఆలయమున దీపారాధన జరిగినవెనుక, ఎంత నిశితముగాఁ బరిశీలింతును గాక, గోడలపై ఆమె దివ్యశరీరచ్ఛాయ పడినట్లు నా

కెన్నఁడును గనఁబడలేదు. బాలికవలె నామె మహోల్లాసముతో గంతులిడుచు, ఆలయపు మీఁదియంతస్తునకుఁ బోవుచుండ, ఆమె పాదభూషణముల గలగలలు నా గదిలోనికి విని పించెడివి. భ్రమపడితినేమో యని చట్టున బయటికి వచ్చిచూడ, విరియఁబోసికొనిన కేశపాశములతో ఆమె పైయంతస్తువసారాలో నిలుచుండి కలకత్తానో, గంగానదినో తిలకించుచుండును."

శ్రీరామకృష్ణ పారమార్థికజీవితలత మహత్తర వికాసము గాంచెను. ఆరాధనసంబంధములగు శాస్త్రోక్త విధానములకును, ఆచారములకును, నియమములకును ఇఁక నాతఁడు అతీతుఁడు. జగజ్జననీసాక్షాత్కారసల్లాపలాలనాదిక మహాభాగ్యములను గొల్లగొనఁగలుగుచుండిన యాతని కిఁక ఆచారాదిలాంఛనము లేల? కర్మకలాపము లేల? నియమబంధనము లేల? సాష్టాంగప్రణామములతో నాతఁడు ఆలయమును బ్రవేశింపఁడు. భీతహృదయముతో, బేలచూపులతో దేవీప్రతిమను సమీపింపఁడు. దూరదూరముగా నిలువఁడు, నుతులను స్తోత్రములను జేయఁడు, పఠింపఁడు. కన్నతల్లియొద్ద నటు లేబిడ్డ వర్తించును? తల్లియొద్ద బిడ్డకు భయమా? తల్లి కంటె ప్రియతరవస్తువు, ప్రియతరవ్యక్తి, బిడ్డకు మఱేమికలదు? తన్నొకవేళఁ జీకొట్టుచున్నను, కొట్టుచున్నను, 'అమ్మా! అమ్మా!' యని విలపించుచు, తల్లిని మఱింత గాఢముగా బిడ్డ యంటిపట్టుకొనియుండునుగదా? 'అమ్మ' యనుమాట కంటె ప్రేమకుఁ బట్టుకొమ్మయగు మాట మఱేమి కలదు? దేవి సమస్తనామములలో జగదంబ యను నామ మెంత

మనోహరము! దేవీభావములలో మాతృభావము అత్యంత సహజముకదా! ఆత్మోద్ధారకముకదా! దేవీసాక్షాత్కార దివ్యసాధనభూతమై విరాజిల్లు ప్రేమామృతవాహినికదా మాతృభావము! ప్రళయతాండవ మొనర్చు మహారౌద్ర మూర్తియు కరాళియునగు నామెయే, "సైషా ప్రసన్నా వరదా నృణాం భవతి ముక్తయే—వరప్రదాయినియైన యా దేవియే ప్రసన్నయైనపుడు నరులను సంసారబంధ విముక్తులను జేయుచున్నది" అని దేవీమాహాత్మ్యము వక్కాణించురీతిని, తన భక్తులపై కరుణాకటాక్షవీక్షణములను బఱుపు భద్రకాళీ, భవతారిణీమహాకాళీ, జగన్మాత.

శ్రీరామకృష్ణుని దివ్యానందానుభవోన్మత్తతనుగూర్చి హృదయంగమమగు ననేకవిషయములను హృదయుఁడు తెల్పియున్నాఁడు. అతఁ డిట్లు వచించును: "ఆలయమున—ముఖ్యముగా ఠాకుర్ (శ్రీరామకృష్ణుఁడు) పూజచేయుచుండునప్పుడు—ప్రవేశించుచో, అనిర్వచనీయమైన యొకానొక దివ్యావేశము గలుగ శరీరము పులకరించును. పూజాకాలమున ఆయన యెట్లు వర్తించునో చూడవలయుననెడి ప్రబలాసక్తికి లోనై అనేకసమయములలో, అకస్మాత్తుగా నే నచటికి వెళ్లి చూచుచుండెడి సంఘటనములు నన్ను ఆశ్చర్యచకితుని, భక్తిపులకితాంగునిఁ జేయుచుండెడివి. కాని బయటికి వచ్చినప్పుడు మనస్సున సందేహము కలుగుచుండెడిది. 'బాబుకు నిజముగా పిచ్చియెత్తినదా? కానిచో పూజాకాలమున అట్లేల అశాస్త్రీయకృత్యములను జేయును?' అనుకొనువాఁడను. శాస్త్రికిని, మథురాబాబునకును ఈ

పూజాసమాచారము తెలిసినచో, వా రేమనుకొందురో, ఏమందురోయని నా భీతి. కాని ఆయన ఈ విషయములపట్ల పూర్తిగా ఉదాసీనుఁడు. నే నేమైనను జెప్పినను వినిపించుకొనువాఁడు కాఁడు. ఇట్టివిషయములనుగూర్చి పూర్వమువలె ఆయనతో అంతగాఁ బ్రస్తావింపను సాహసింపఁజాలకపోవు వాఁడను. ఏదో అనిర్వచనీయమైన భయమును సంకోచమును నా వాగ్బంధన చేయుచుండెడివి. ఆయనకును నాకును హస్తిమశకాంతర మున్నట్లు తోఁచును. అందుచే నిశ్శబ్దముగా నా శక్తికొలఁదియు పరిచర్యచేయుచుంటినన్న మాటయేకాని, ఆయన అసాధారణవైఖరివలన ఏదియో ముప్పువచ్చునని మాత్రము భయపడుచునేయుంటిని."

శ్రీరామకృష్ణుని పూజాపద్ధతినిగూర్చి హృదయుఁడిట్లు పలుకును : "పూవులను, మారేడుదళములను గైకొని, ఆయన తన తలకును, రొమ్మునకును, శరీరమున కంతకును—తుదకు పాదములకుసైతము—అద్దుకొని, పిమ్మట వానిని కాళీచరణారవిందములకు సమర్పించును. మఱియొకప్పుడాయన యెఱ్ఱవాఱిన కన్నులతోడను, వక్షముతోడను, త్రాగియున్నవానివలెఁ దూలుచుఁ దన యాసనము వీడి, దేవీపీఠము నెక్కి, ప్రీతిపూర్వకముగా నామె చుబుకము తాఁకి బుజ్జగించుచుఁ బాడును, సల్లాపించును, పరిహాసము చేయును, నవ్వును ; దేవిచేతులను బట్టుకొని నృత్యముచేయ నారంభించును! నైవేద్యసమయమున నొక కబళము చేతఁ బట్టుకొని త్వరితగతిని వెళ్లి దేవిమూర్తియొద్దఁ బెట్టి తినుమని బతిమాలును. అపు డీ మనోహరసంభాషణ జరుగును :

'నన్ను ముందుఁ దినుమందువా? సరే తిందును!' అని కొంత తాను దిని, మిగిలినది దేవినోటఁ బెట్టి, నేను దిన్నానుగదా! ఇపుడు నీవంతు, తిను'మనును! ఒకనాఁడు నైవేద్యసమర్పణ సమయమున, 'మ్యావు, మ్యావు' మని యఱచుచు, ఆలయములోనికి వచ్చియుండిన యొకపిల్లిని జూచి, 'అమ్మా, తినుటకుఁ దొందరపడుచున్నావా? ఇదిగో, తిను, అమ్మా, తిను!' మనుచు, నైవేద్యము పిల్లికిఁ బెట్టెను. రాత్రి పవళింపుసేవాసమయమున దేవినిఁ బరుండఁబెట్టుచు, ఒక్కొక్కప్పుడాతఁడు, 'నన్ను దగ్గఱ పండుకొనుమను చుంటివా? సరే పండుకొందును' అనుచుఁ గొంతతడ వామెవెండిమంచముపైఁ బరుండును. ఇది యిట్లుండ, పూజకై కూర్చుండి, గాఢధ్యానమున మునిఁగిపోవ, బాహ్య స్మృతిచిహ్నము లెంతమాత్రము కానరాకుండ నెంతయో సేపు అట్లు కడచిపోవును. ఉదయమున దేవిమాలలనిమిత్తము పూలు కోయునప్పుడును ఆయన ఎవరినో ముద్దులాడును, ఎవరితోడనో సంభాషించును, పరిహాసములాడును, ఉల్ల సించును, ఎవరియొద్దనో గారముగుడుచును. రాత్రులు కనులు మూయఁడు. నే నెప్పుడు మేల్కొని చూచినను, దివ్యభావ పరవశుఁడై సంభాషించుచుండును, లేక పాడుచుండును, లేదా, ఇప్పుడు పంచవటి యున్నతావున ధ్యాననిమగ్నుఁడై యుండును."

ఇట్టివన్నియు ఉన్మాదలక్షణములుగా భావించుట లోకులకు పరిపాటియేకదా! భట్టాచార్యునకు (అనఁగా శ్రీరామకృష్ణునకు) మతిపోయినదని స్థానికాధికారు లిపుడు

నిశ్చయించుకొనిరి. ఏడ్చుట, నవ్వుట, విగ్రహముతో ముచ్చటలాడుట__యనువానిమాట యటుండ—పూవులతోఁ దన పాదములను దాఁకి వానిని దేవికి అర్పించుటా! నైవేద్యమును దేవికి సమర్పించుటకుముందుఁగనే తాను దినుచుండుటయా! దేవీసింహాసనము నెక్కి తన యెంగిలిని దేవినోటఁబెట్టుటయా! దేవీతల్పమున స్వయముగాఁ దాను శయనించుటయా! ఎంతటి మహాపచారములు! దారుణకృత్యములు! ఇట్టిపనులు చేయువాఁడు 'పూజారి'[1] కాని 'పూజారి' కాఁడే! మతియున్నవాఁ డెవఁడైనను ఇట్టి ఘోరాపచారములకు ఒడికట్టుకొనునా?—ఇదియే వారల యభిప్రాయము. ఇట్టి వానిని దేవాలయమున నుండనిచ్చుట యుక్తము కాదనియు, అమంగళకరమనియు నెంచియు, స్వయముగా నేమియుఁ జేయఁజాలక, విషయములను సవివరముగా మథురునకుఁ దెలియఁబఱచిరి. మథురుఁ డొకనాఁడు అకస్మాత్తుగా వచ్చి, నిశ్శబ్దముగా ఆలయమునఁ బ్రవేశించి, శ్రీరామకృష్ణుని పూజావిధానమును బరిశీలింపసాగెను. రసజ్ఞుఁడు, పరిశీలనదక్షుఁడు నగు నాతనికి విషయము విస్పష్టమైనది. "నేఁటికి ఆలయప్రతిష్ఠ సార్థకమైనదికదా! దేవీపూజ సుసంపన్నమైనదికదా! జగన్మాత నేఁటికి ఆలయమున ఆవిర్భావము నొంది ప్రకాశించుచున్నదికదా!" యని యాతఁడు భక్తిపులకితాంగుఁడై, పరమానందభరితుఁడయ్యెను. ఇంటికి వెళ్లి, మఱునాఁ డాతఁడు, భట్టాచార్యమహాశయులు(అనఁగా శ్రీరామకృష్ణుఁడు) తమ యిచ్చవచ్చినరీతిని పూజచేయవచ్చు

---

1 పూజా + అరి = పూజారి, అనఁగా పూజకు శత్రువు.

ననియు, ఆయన కెవ్వరు నట్టియాటంకమును గల్పింపరాదని యు ఆలయపర్యవేక్షణాధికారికి తనయాజ్ఞాపత్రము పంపెను.

భక్తివికాస క్రమమునుగూర్చి (కాలక్రమమున) శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించును: "శాస్త్రవిధుల ననుసరించునది 'వైధభక్తి'. నియమితవిధుల ననుసరించి నామ జపముచేయుట, ఏకాదశ్యాదిపుణ్యతిథులందు ఉపవసించుట, తీర్థయాత్రలుచేయుట, శాస్త్రోక్తమైన పూజాద్రవ్యములతో భగవంతు నర్చించుట—ఇట్టి నియమములన్నియు వైధభక్తికి లక్షణములు. 'శాస్త్రములు ఈకర్మములను విధించుచున్నవి, కావున నేను జేయుచున్నాను' అను భావనతోఁ గూడినది ఈ వైధభక్తి. ప్రహ్లాదునకువలె అఖండమైన భగవత్ప్రేమచే లభించు మఱియొకవిధమైన భక్తి కలదు: అదియే 'రాగభక్తి'. గాలి వీచకుండునంతవఱకు విసనకఱ్ఱతో విసరుకొందుము. వైధభక్తి యిటువంటిది. స్వయముగా మలయమారుతము వీచునపుడు విసనకఱ్ఱను ఆవలఁబెట్టెదము. ఇట్లే రాగభక్తి కలుగునపుడు శాస్త్రవిహితక్రియాకలాపములను ఆచరించుట అనావశ్యకము. స్వయముగా భగవత్ప్రేమోన్మత్తత కలుగు నపుడు వాని నెవరు ఆచరింతురు? భక్తుఁడు పిచ్చివానివలె ఒకప్పుడు నవ్వును, మఱియొకప్పుడు ఏడ్చును. ఆతఁడు ఇంద్రియములను పూర్తిగా జయించియుండును. లోకులకు అత్యంతప్రియమగు శరీరమునే మఱచును. చాలకాలము వైధభక్తిసాధన చేసినయెడల, ఉత్తమమగు రాగభక్తి— ప్రేమభక్తి—లభించును."

అత్యంతసహజముగా శ్రీరామకృష్ణుఁడు వడసిన యీ

దివ్యప్రేమోన్మాదము పరమభాగవతోత్తమస్థితి యనుట స్పష్టము. కాని యీ మహత్తరపరిణామము ఇపు డాతని కైనను ఇదమిత్థముగాఁ దెలియకుండెననుటకు క్రమముగా మన కనేకనిదర్శనములు కానవచ్చును.

శ్రీరామకృష్ణునకు ఈ సమయమున శరీరమందంతటను కారము నూఁటిపూసినట్లు దుర్భరమైన మంట కలుగసాగెను. కాలాంతరమున దీని నాతఁ డిట్లు వివరించెను: "సంధ్యా వందనము, పూజ మొదలగువాని నాచరించునపుడు, శాస్త్ర విహితవిధానము ననుసరించి, శరీరమునందలి పాపపురుషుఁడు దగ్ధమైపోయెనని భావించువాఁడను. శరీరమున నిజముగా పాపపురుషుఁడనువాఁ డుండుననియు వానిని వినాశము చేయ వచ్చుననియు అపు డెవ రెఱుఁగుదురు! సాధనప్రారంభము నుండియు శరీరము మంటలెత్తసాగెను. అదేదియో వ్యాధి యనుకొంటిని. క్రమముగా అది వృద్ధియై దుర్భరమైనది. వైద్యులు చెప్పిన నానావిధతైలములు మర్దనము చేయఁ బడినవి. కాని మంట లెంతమాత్రము తగ్గలేదు. ఒకనాఁడు పంచవటిక్రిందఁ గూర్చుండియుండఁగా, కాఱునల్లనిశరీరముతో, చింతనిప్పులవంటి కన్నులతో, భయంకరాకారుఁడైన యొకపురుషుఁడు తాగినవానివలెఁ దూలుచు, (తన శరీరము చూపుచు) ఇందుండి వెలువడి నాయెదుట నడయాడసాగెను. చూతునుగదా, ఉత్తరక్షణముననే, సౌమ్యమూర్తియు, కాషాయాంబరధారియు, త్రిశూలపాణియు నగు మఱియొక పురుషుఁడు అట్లే (యీ శరీరము) లోనుండి బయల్వెడలి, ముందుఁ జెప్పిన భీషణాకారుని ప్రచండరీతి నెదుర్కొని చంపి

వేసెను. నాఁటినుండియు మంట తగ్గిపోసాగెను! ఈ సంఘటనకు ముందు ఆఱునెలల పర్యంతము ఆ మంటతో బాధపడితిని.''

శ్రీరామకృష్ణుఁ డీఁక దాస్యాదిభక్తిభావముల నవలంబించి యం దెట్లు చరితార్థత గాంచెనో ఆచరిత్రయంతయు అత్యంతరమణీయము. కాళీసాక్షాత్కారానంతరము కొలఁది కాలమైనంతనే శ్రీరామకృష్ణుఁడు దాస్యభక్తిసాధనయందు నిమగ్నుఁడయ్యెను. ఈదివ్యసాధనానుభవములనుగూర్చి కాలక్రమమున నాతఁ డిట్లు తెలుపుచు: ''నిరంతరము హనుమంతుని దివ్యశీలమునుగూర్చి చింతించుచు నా వ్యక్తిత్వమును పూర్తిగా మఱచిపోయితిని. ఆసమయమున ఆహారవిహారాది నిత్యకృత్యముల నన్నింటిని హనుమంతునివలెనే చేయవలసి వచ్చెను—చేయవలయునని అట్లు చేయుచుంటినా? కాదు, దానంతటదే అట్లు ఏర్పడెను. కొంతభాగము తోఁకవలె వ్రేలాడునట్లు కట్టుబట్టను మొలకు దట్టివలెఁ గట్టుకొని, యొక చోటినుండి మఱియొక చోటికి నడచుటకుబదులు దుముకుచుఁ బోవువాఁడను. పండ్లు, దుంపలు మొదలగునవియే ఆహారము; అవైనను ఒలువకయే తినుట ఇష్టముగానుండెడిది. చాల కాలము చెట్లపైఁ గడపుచు, 'రఘువీరా! రఘువీరా!' యని గంభీరస్వరమున ఉచ్చరించువాఁడను. కన్నులును కోతికనుల వలె చంచలము లయ్యెను. అన్నిఁటికంటెను ఆశ్చర్యము, వెన్నెముకతుదిభాగము ఒక యంగుళము పెరిగి పైకిఁ బొడుచుకొనివచ్చెను! ఆ సాధన పరిసమాప్తమై యా చిత్తవృత్తి అంతరించినపిమ్మట, క్రమముగా అది యథాస్థితి పొందెను.

"ఈసాధనకాలమున, ఒకనాఁడు పంచవటీతలమున —ధ్యానించుచునా? కాదు, ఊరకయే—కూర్చుండియుండఁగా, అకస్మాత్తుగా నిరుపమాన తేజోమయమగు నొక స్త్రీమూ_ర్తి ప్రత్యక్షమై ఆ స్థలమంతయుఁ దన తేజముతో నింపివేసెను. ఆ మూ_ర్తినేకాక, పంచవటీప్రదేశమందలి వృక్షసమూహ మును, గంగానదిని, సర్వము కనుఁగొంటిని. ఆమెకు నేత్ర త్రయము మొదలైన దేవీచిహ్నములేవియు లేవు, మానవ స్వరూపమే. కాని ప్రేమను, దయను, దుఃఖమును, సహన మును ఒక్కుమ్మడి విరజిమ్ముచుండిన యా మహనీయ ముఖా కృతి దేవీమూర్తులలో నైనను అరుదుగాఁగాని కానరాదు. నాపై ప్రసన్నవీక్షణములను బఱపుచు, ఆ 'దేవమానవి' ఉ_త్తరమునుండి దక్షిణమునకు మెల్లఁగా అడుగులిడుచు నా వైపునకు వచ్చుచుండెను. ఆశ్చర్యపరవశుఁడనై, 'ఎవరా యీామె?' యనుకొనుచుండఁగా, ఎచ్చటినుండియో ఒక కొండముచ్చు అచటికి దుమికి, కిచకిచలాడుచు, ఆమె పాద ములచెంతఁ గూర్చుండెను. 'సీత; యావజ్జీవితము దుఃఖము లనుభవించిన సీత; జనకమహారాజసుతయైన సీత; రామ మయజీవితయైన సీత!' యని అంతర్వాణి పలికెను. 'అమ్మా! అమ్మా!' యనుచు, త్వరితముగా లేచి యామెపాదములపైఁ బడఁబోవుచుండఁగా, ఆమె తన చిఱునగవు నా కిచ్చుచున్నా నని పలికి (శరీరమును జూపుచు) ఇందుఁ బ్రవేశించెను. ఆశ్చర్యానందపరవశుఁడనై బాహ్యస్మృతిఁ గోల్పోయి క్రిందఁ బడిపోతిని. ఏ ధ్యానాదులను జేయుచుండని స్థితిలోఁ గలిగిన మొట్టమొదటి దివ్యదర్శన మిదియే. జననమునుండియు

దుఃఖము లనుభవించిన సీతను మొట్టమొదటఁ జూచుటచేఁ గాఁబోలు, యావజ్జీవితము ఆమెవలె దుఃఖములు అనుభవించు చున్నాను!"

శ్రీరామకృష్ణునియెడ రాసమణిరాణికిఁ గల విశేష గౌరవమును గమనించియుంటిమి. తాత్కాలికముగా దేవాలయవసభవనమున నివసించుచుండిన యామె యొక నాఁడు గంగాస్నానానంతరము ఆలయమును జొచ్చి, దేవికిఁ బ్రణమిల్లి, పూజాధ్యానార్థము సన్నిధిని ఆసీనయై దేవీ సంకీర్తన మొనరింపుమని శ్రీరామకృష్ణునిఁ గోరెను. అతఁడు సమ్మతించి తన మహాభక్త్యానందసౌరభము తన మనోహర గానమారుతముతో సమ్మిళితమై యా ప్రదేశమం దంతటను వ్యాపింప దేవీకీర్తనముఁ బాడసాగెను. కొంతసేపటి కామె పూజకై పువ్వులను సర్దుచు—పరధ్యానముగా—పరతత్త్వధ్యానముననా? కాదు, అన్యవిషయచింతచే పరధ్యానముగా—నుండు టాతఁడు కనుఁగొని, "ఇక్కడను అదే గొడవా!" యని కఠినముగాఁ బలికి యామెను రెండు లెంపకాయలు వేసెను. ఆలయసేవకులును, రాణీపరిజనమును ఈసంఘటనమును గనుఁగొని దిగ్భ్రాంతులైరి, కోపావిష్టులైరి. అందోళనతో అనేకు లిటునటు తిరుగాడఁజొచ్చిరి. వారి దృష్టి కిపు డాతఁడు క్షమింపరాని మహాపరాధి. కాని యాతని నెవ్వరును శిక్షింపసాహసింపలేదు. ఇఁకను ఆ మహాందోళన పరిస్థితిలో శ్రీరామకృష్ణుఁడు, రాసమణిరాణియునే ప్రశాంత ముగాఁ గూర్చుండియుండిన వ్యక్తులు. వాత్సల్యపూరితుఁ డయ్యు, తప్పుచేసిన తనబిడ్డను శిక్షింపవలసివచ్చిన తండ్రి

వైఖరి యాతనియందుఁ దోఁప, ఏదియో అనుచితకార్యముఁ జేయుచుఁ బట్టువడినట్లు ఆమె లజ్జావినయవిధేయతలతో చేతులు జోడించుకొని కూర్చుండియుండెను. భక్తికీర్తన శ్రవణాయత్తమై యుండుటకుబదులు తన మనస్సు అపుడు న్యాయస్థానమున జరుగుచుండిన యొక వ్యాజ్యెముమీఁదికిఁ బోయినట్లు ఆతఁ డెట్లు కనుఁగొనఁగల్గెనాయని యామె యాశ్చర్యచకితయయ్యెను. దండనాధికారము నారోపించుకొని యాలయసేవకులు శ్రీరామకృష్ణునిపై దౌర్జన్యము ప్రయోగింతురేమోయని—మహాభాగవతాపచారము సంభవించునేమోయని—భీతిలి, జరిగిన సంఘటనముఁ గూర్చి యాతనితో ప్రస్తావమైనను జేయవలదని రాణి కఠినశాసన మొనరించెను.

ఆమె తన మందిరమునకు వచ్చిన పిమ్మట, పరిచారకులు శ్రీరామకృష్ణుని ప్రవర్తనమును నిరసించుచు, ఆమె సహించిన యవమానమును గూర్చి తమ రోషమును వెలిపుచ్చుచు, మొఱలిడఁగా, శాంతముగా నామె యిట్లు సమాధానించెను : “విషయము మీకు బోధపడలేదు. అమ్మయే—భవతారిణీ దేవియే—నన్ను శిక్షించి నా భ్రాంతులను నిర్మూలించినది.”

పరిశీలించినచో, పైని దెల్పిన సంఘటనమున సాధనసంబంధమైన యొక మహారహస్యము ఇమిడియున్నట్లు గ్రహింపనగును. మనస్సంయమమును మించిన ఘనతర కార్యము—మహత్తరవిజయము—లేదు. మనస్సంయమము నొంది ధ్యానసిద్ధుఁడగువానికి మోక్షము కరతలామలకము.

కాని యదెప్పుడు ప్రాప్తింపవలయునో అప్పుడే ప్రాప్తించు ననుచు, కర్మసిద్ధాంతమునకు విపరీతార్థములు కల్పించుచు, ప్రయత్నహీనులై యనేకులు మెట్టవేదాంతులై మను చుందురు. నిజముగా పురుషప్రయత్నమునకు—మానవ ప్రయత్నమునకు—వేదాంతమునఁ గల ప్రాముఖ్యము మఱెం దును గానరాదు. పురుషప్రయత్నవిహీనునకు పరమేశ్వ రానుగ్రహము లభించుట కల్లయని వేదాంతకేసరియు, శ్రీరామకృష్ణశిష్యాగ్రగణ్యుఁడు నగు శ్రీవివేకానందస్వామి ఘోషించును. విషయవాసనాప్రాబల్యమున పలువిషయ ములమీఁదికి మనస్సు పరుగులెత్తుచుండునపుడు ప్రయత్న పూర్వకముగా, సామోపాయములచే, దాని నరికట్టఁ బూనుటయే మన కర్తవ్యము. ఆత్మసంయమయోగమున నిదియే భగవద్గీతోపదేశము.

రాసమణిని శిక్షించినరీతినే శ్రీరామకృష్ణుఁడు ఈ సమయమున మఱియొకరిని శిక్షించుట తటస్థించెను. ఈ సంఘటనములనుగూర్చి కాలక్రమమున నాతఁడే యిట్లు తెలిపెను: "ఆ దివ్యోన్మత్తావస్థలో ఒకనాఁడు బరా(వరాహ) నగరమందలి గంగాస్నానఘట్టమునకు వెళ్లినాను. అచట జయముఖర్జీ (జయముఖోపాధ్యాయ) భగవన్నామజపము చేయుచుండెను. కాని, 'చిత్తము శివునిమీఁద, భక్తి చెప్పుల మీఁదను' అన్నట్లు, అతని మనస్సు అన్యవిషయాక్రాంతమై యుండెను. అతనిని రెండుచెంపకాయలు గొట్టినాను.

"...(రాసమణిని చెంపపైఁ గొట్టఁగా) ఆమె కలవర పడి చేతులు జోడించుకొని కూర్చుండెను.

"ఈ నా మనఃస్థితినిగూర్చి, యిదియేమి దైవమాయని యెంతో దిగులుపడి సోదరుడగు హలధారితో నిట్లంటిని: 'చూడు నా స్వభావము! దీనిని తొలఁగించుకొను టెట్లు?' మహాపరితాపముతో అమ్మను (దేవిని) గొంతసేపు ప్రార్థించి యీ యలవాటు తప్పించుకొంటిని."

ఎట్టి మృదులబాలహృదయము శ్రీరామకృష్ణుని యీ వాక్కులలో స్పందించుచున్నదో!

ఇది యిట్లుండ, దెబ్బలను దేవీప్రసాదముగా భావింపఁ గలిగిన [illegible] మణి ఆత్మసమర్పణమును, సర్వా[illegible] తన్ను, ఏ కారణముచేనైన నేమి, కొట్టిన వ్యక్తియెడల ఆగ్రహము చెందుటకుబదులు విశేషగౌరవము చూపఁగలిగిన యామె వినయశీలమును ఆదర్శప్రాయము లనుటకు సంశయము లేదు.

శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు భావసమాధిస్థితిలో మథురుని యెదుట కాళికార్చకస్థానమున హృదయు నుంచి, యంతటినుండి యాతఁడు పూజ సాగించుచో, దేవి సంతుష్టురాలగునని వచించెను. మథురుఁడు అది దేవీసంకల్పముగా భావించి వెంటనే సమ్మతించెను.

శ్రీరామకృష్ణుని తపమునకు ఆలవాలమైయున్న పంచవటీక్షేత్రముఁగూర్చి ముచ్చటించియుంటిమి. పవిత్రమగు వట–బిల్వ–అశ్వత్థ–అశోక–ఆమలక నామకమగు పంచవృక్ష సముదాయమే పంచవటియనియు, పంచవటిక్రింద తప మాచరించినచో, త్వరితముగా సిద్ధించుననియు శాస్త్ర వచనము. ఇం దొకటియై శ్రీరామకృష్ణుని జపధ్యానాదులకు

ఆలవాలమై జన్మసార్థకత గాంచిన ఉసిరిక చెట్టు కారణాంత రమునఁ గొట్టివేయఁబడుట తటస్థించెను. అంతటఁ దనసాధన లకు మఱియొక తావు నేర్పాటుచేయుమని శ్రీరామకృష్ణుఁడు హృదయునితోఁ జెప్పెను. హృదయుఁడు పూర్వసాధనస్థల సమీపముననే యొక తావును సంసిద్ధమొనర్ప, శ్రీరామ కృష్ణుఁడు స్వయముగా అచట నొక రావి మొక్క నాటి, మిగిలిన నాలుగుమొక్కలను హృదయునిచే నాటించెను. విశేషయోగ్యక్షేత్రమున ఈవిధముగా పంచవటి వెలసెను. తులసి మొక్కలతోడను అపరాజితాపుష్పలతలతోడను దాని కొక చక్కని కంచె నిర్మింపఁబడె. అవి చక్కఁగాఁ బెరుగ సాగెను. కాని యొకనాఁడు పశువులు ఆ కంచెను హాని చేయుటచే, శ్రీరామకృష్ణుఁడు గట్టికంచెవేసి మొక్కలను సురక్షిత మొనర్ప సంకల్పించెను. ఆశ్చర్యకరముగా త్వర లోనే రాటలు, త్రాడు, కొడవలి–కంచెకుఁగావలసిన సామగ్రి అంతయు—గంగాప్రవాహ మెటనుండియో తీసికొనివచ్చి, 'ఇదిగో, గైకొను' మనుచందమున, గట్టున వైచెను!

ఈకాలమునఁ దనసాధనలనుగూర్చి శ్రీరామకృష్ణుఁ డిట్లు తెలుపును: "పంచవటియందు తులసీవనము పెంచి యందుఁ గూర్చుండి ధ్యానించువాఁడను. హృదయపరితాప ముతో ఒక్కొక్కప్పుడు 'అమ్మా! అమ్మా!' యనియు మఱియొక్కొక్కప్పుడు 'రామా! రామా!' యనియు ఉచ్చరించువాఁడను....ఆ కాలమున పట్టుబట్ట ధరించి పూజ చేయువాఁడను. ఆహా! ఆపూజలో ఏమి యానందము నొందువాఁడను!"

శ్రీరామకృష్ణునియెడ మథురుని కెట్టి లక్ష్య మమరి యున్నదో గమనించియున్నాము. అట్టి మథురుఁడును శ్రీరామ కృష్ణున కేమైనను చిత్తచాంచల్యము కలిగెనేమోయనియు, రాణిని, జయముఖోపాధ్యాయుని ఆతఁడు చెంపదెబ్బలు గొట్టుట కిదియే కారణము కాఁబోలుననియు అనుమానించి యొక సుప్రసిద్ధాయుర్వేదవైద్యునిచేఁ గొంతకాలము చికిత్స చేయించెను, గాని యది నిరర్థకమని తేలెను. భగవద్భక్తి సైతము మితిమీఱరాదనియు, మితిమీఱినచో ఉన్మాద మునకు దారితీయుచుండుననియు నింకను ఏమేమో తనకుఁ దెలిసియుఁ దెలియని పరమార్థతత్త్వములను—పాపము— మథురుఁడు శ్రీరామకృష్ణునకుఁ దెలుపఁబూనుచు, నిర్ణీత సూత్రముల ననుసరించి జీవితమును క్రమపఱుచుకొనఁదగు నని హితోపదేశము చేయఁబూనెను! మథురున కెట్లు మనః పరివర్తనము కలిగెనో తెలుపుచు, కాలక్రమమున శ్రీరామ కృష్ణుఁడు శిష్యుల కిట్లు వచించెను: "భగవంతుఁడు సైతము తన నియమములకు అధీనుఁడని, స్వయంకృతమైన ప్రకృతి నియమముల నతిక్రమించుటకు అశక్తుఁడని, మథురుని యభి ప్రాయము. నే నిట్లంటిని: 'ఎంత అసంగతమైన భావము! నియమకర్తయైనవాఁడు తన చిత్తానుసారము ఆ నియమమును రద్దుచేయఁగలఁడు, దానితావున వేఱొకనియమమైనను జేయఁ గలఁడు.' దీని కాతఁ డెంతమాత్రము అంగీకరింపఁడయ్యె. ఆతఁ డిట్లనెను: 'ఎఱ్ఱపూవులు పూచు చెట్టెప్పుడును ఎఱ్ఱ పువ్వులేకాని తెల్లపువ్వులు పూయదు—ఏలన, అది భగవ న్నియమము. ఏదీ, చూతము, ఎఱ్ఱపువ్వులు పూచు చెట్టున

భగవంతుఁడు తెల్లపువ్వు పుట్టింపఁగలఁడేమో!' నే నందుకు, 'భగవంతుఁడు సంకల్పించెనా, సర్వము చేయఁగలఁడు; అదియుఁ జేయఁగలఁడు'అంటిని. కాని యాతఁడొప్పుకోలేదు. మఱునాఁడు నేను పక్కెపొదలవైపు బహిర్భూమికి వెళ్లఁగా అచట నొక మందారవృక్షమున ఒకే కొమ్మను రెండు రెమ్మలందు ఎఱ్ఱని దొకటియు, ఇసుమంతయు ఎఱ్ఱమచ్చ లేకుండ, ధగధగలాడుచున్న తెల్లనిదొకటియు రెండు పువ్వులు కనఁబడినవి. వెంటనే పువ్వులతోఁ గూడిన యా కొమ్మవిఱిచి, తీసికొనివచ్చి మథురుని యెదుటఁ బెట్టి, 'ఇదిగో, చూడవోయి' యంటిని. 'బాబా! నిజమే, మీరు వక్కాణించిన మాట. నేను పరాజితుఁడనైతిని' అన్నాఁడు మథురుఁడు."

మాయాతీతులై భగవదానందప్రమత్తులై యుండు మహనీయుల మానసికస్థితిని గ్రహించుట సహృదయులగు సన్నిహితులకునైత మెంతయు దుర్లభము. కఠోరబ్రహ్మచర్యమువలన శ్రీరామకృష్ణునకు నాడీదౌర్బల్యమును, చిత్తచాంచల్యమును గలిగియుండవచ్చుననియు, అవియే నానావిధ భావావేశములుగా వ్యక్తమగుచున్నవి కాఁబోలు ననియు నాతని సాధనదశయందలి తొలినాలుగు (1855—1858) సంవత్సరములలో నొకానొకప్పుడు మథురుఁడును రాసమణి రాణియు అనుమానించిరి! బ్రహ్మచర్యము నొకించుక సడలించినచో, స్వస్థత కలుగవచ్చునని యోచించి—శాంతం పాపమ్—అందులకై మోహనాంగులగు వ్యభిచారిణులను రహస్యముగా నేర్పాటుచేయుటకును, విశేష మాతని మనో

నైర్మల్యమును బరీక్షించుటకును గూడ సమకట్టిరి.[1] ఇందు మొదట దక్షిణేశ్వరమున జరిగిన సంఘటనమునుగూర్చి కాలక్రమమున శ్రీరామకృష్ణుఁడు భక్తులతో నిట్లు వచించెను: "నేనపుడు ఆ స్థితిలో (దివ్యప్రేమోన్మత్తస్థితిలో) నుండఁగా, నన్నుఁ బరీక్షించుటకును, నా ఉన్మాదమును నివారించుటకునుగూడ నుద్దేశించి యొకరు నాగదిలోని కొక వ్యభిచారిణిని దీసికొనివచ్చిరి. సుందరనేత్రములతోఁ గూడిన యందకత్తె యామె. 'అమ్మా! అమ్మా!' యని కేకవేసి, త్వరితముగా ఈవలకు వచ్చివేసితిని. (వరుసకు సోదరుఁడగు) హాలధారియొద్దకు పరుగునఁ బోయి, 'హాలధారీ! హాలధారీ! నాగదిలో ఎవరు ప్రవేశించినారో వచ్చిచూడు!' మంటిని. ఆస్త్రీనిగూర్చి యతనితోను, మిగిలినవారందఱితోనుగూడఁ జెప్పినాను. (ఆ దినములలో) ఆ స్థితిలో (భగవత్ప్రేమోన్మత్తస్థితిలో) దేవీనామము నుచ్చరించుచు, విలపించువాఁడను. 'అమ్మా! రక్షింపుము! సదా అమలచరిత్రుఁడనై యుండునట్లు అనుగ్రహింపుము! సద్వస్తువునుండి అసద్విషయములవైపు నామనస్సు ఎన్నఁడును మఱలకుండునట్లు కటాక్షింపుము!' అని మొఱలిడువాఁడను."

1 "ఒకవైపున మధురుఁడు శ్రీరామకృష్ణున కొనర్చుచుండిన యద్భుతసేవలనుగూర్చియేకాక, మఱియొకవైపున ఆయన మనోనైర్మల్యమును బరీక్షించుటకై వ్యభిచారిణుల నేర్పాటుచేయుటనుగూర్చియు స్వయముగా ఠాకురువలననే వినియున్నాము" అని శ్రీశారదానంద స్వామి 'శ్రీ శ్రీ రామకృష్ణలీలాప్రసంగము'న వ్రాసియున్నాఁడు. (See Sri Ramakrishna The Great Master, pp. 175 & 439.)

ఆపరమభాగవతోత్తమునివైఖరినిఁ గాంచి యాకలట పశ్చాత్తప్తయై పలాయనమయ్యెనని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు. ఇంకను గుణపాఠము గ్రహింపని మథురుఁడు మఱియొక నాఁడు శ్రీరామకృష్ణునిఁ దన గుఱ్ఱపుసారటులో నెక్కించుకొని, కలకత్తాలోని మెఛువాబజారను పేటలోని యొక భవనమునకుఁ దీసికొని పెడలెను. అచట విలాసినులగు యువతులు పలువురు తుచ్ఛసంకల్పముతో వేచియుండిరి. మదుకటాదులగు వారికడ శ్రీరామకృష్ణుని దిగవిడిచి మథురుఁడటనుండి తొలఁగెను. జగజ్జననీప్రియతనూజుఁడగు శ్రీరామకృష్ణుఁడు తత్క్షణమే శిశుభావము నొంది, యా పతితస్త్రీలయందు జగజ్జననినిఁ గాంచి, 'అమ్మా! అమ్మా!' యని యుచ్చరించుచు, బాహ్యస్మృతిరహితుఁడై, మనస్సంయమ మనోనైర్మల్య మూర్తిభావమై భాసించెను.[1] శ్రీరామకృష్ణుని నిరుపమాన విరక్తికిని, అఖండభక్తిపారవశ్యమునకును నిశ్చేష్టితలై యా భోగకాంతలు తమ బుద్ధిహీనతను గుర్తించి, ఋషీశ్వరుని మోహితుని జేయనుద్యమించిన తమకు ఏ ఘోర నరకము ప్రాప్తించునోయని భీతిలి, క్షమింపుఁడని యేడ్చుచు, పదేపదే ప్రణమిల్లుచు, నాతనిఁ బ్రార్థింపసాగిరి. ఈ కల్లోలముచే ఆకృష్టుఁడై మథురుఁడాగదిలోఁ బ్రవేశించి సర్వజనాదర్శమగు శ్రీరామకృష్ణుని జితేంద్రియత్వమునకు నిశ్చేష్టుఁడయ్యెను. అట్టి ఋషీశ్వరునిఁ బరీక్షింపఁబూనినందులకే కాక,

1 ఆ సమయమునఁ దన మర్మావయవము ముడుచుకొనిపోయి తాఁబేటియవయవములవలె పూర్తిగా శరీరమునఁ జొచ్చెనని కాలక్రమమున శ్రీరామకృష్ణుఁడు శిష్యులకుఁ దెల్పెను.

ఆ యువతులు తనపైఁ గురిపింపసాగిన నిందాలాపములకును సిగ్గుచే తల వంచుకొని, శీఘ్రముగా నాతఁ డా తావునుండి శ్రీరామకృష్ణునిఁ దోడ్కొనిపోయెను.

ఈ విధముగాఁ దన సంశయములు తొలఁగిపోవ, మథురుఁడు శ్రీరామకృష్ణుని యెడ గురుభావము నందసాగెను.

పరమవిరక్తుఁడగు శ్రీరామకృష్ణునకు భక్తజనసంసర్గ మనిన, వారలొనర్చు పూజాసంకీర్తనలందుఁ బాల్గొనుటనిన, పరమప్రీతి. అందులకై ఆత్రము చూపుచు. దశమహావిద్య లనెడి దేవీదశావతారమూర్తులను సందర్శించుటకై కలకత్తా లోని బరా (వరాహ) నగరమునకును, కాళీసందర్శనార్థము కాళీఘట్టమునకును వెడలును. దక్షిణేశ్వరమునకుఁ గొలఁది మైళ్ల దూరముననున్న పాణిహాటియందు జరుగు దేవతా మహోత్సవమున నించుమించుగా ప్రతిసంవత్సరము వెడలి పాల్గొనును. ప్రసిద్ధవైష్ణవభక్తుఁడగు వైష్ణవచరణుఁడు ఈ పుణ్యక్షేత్రముననే ప్రప్రథమమున (1858–వ సం॥న) శ్రీ రామకృష్ణసమావేశము నందెను. శ్రీరామకృష్ణునిఁ గాంచి నంతనే యాతఁడు అసాధారణపారమార్థిక ప్రతిభావంతుఁడని గ్రహింపఁగలిగిన మహనీయుఁడు వైష్ణవచరణుఁడు. భక్త బృందము శ్రీరామకృష్ణునిఁ బరివేష్టించి నృత్యముచేయుచు హరినామసంకీర్తనము చేయసాగెను. భక్తిపరవశుఁడైన యాతని నోట వైష్ణవచరణుఁడొకించుక నైవేద్యమునుంచెను, కాని యాతఁ డా స్థితిలోఁ దినఁజాలకపోయెను; మిగిలిన దానిని వైష్ణవచరణుఁడును భక్తులెల్లరును పరమపవిత్ర ప్రసాదముగా స్వీకరించిరి.

# హాలధారి

సమస్తభోగవాంఛలను వీడి, మనఃపూర్వకముగా భగవంతునే ఆశ్రయించి తత్పరిపూర్ణానుగ్రహపాత్రులగువారు అత్యల్పసంఖ్యాకులు. కాని, 'అవ్వా కావలె, బువ్వా కావలె' ననునట్లు, యోగము కావలయును, భోగమును గావలయు ననువా రనేకులు. రాముని, కామునిఁ గూడ వీరు సేవింపఁ జూచుచుందురు. వీరల మనోవాక్కర్మములందుఁ దఱచుగా సామరస్యమనునది కానరాదు. ఏ రెంతటి పాండిత్యము సంపాదించినను, ఎంతటి జపతపములు చేయుచుండినను, ఒక్కొక్కప్పు డేవో కొన్ని యద్భుతశక్తులను బడసినను, నిజమైన ఆధ్యాత్మికవికాసము నొందకుండుటకు త్రికరణశుద్ధి—అందు ప్రప్రథమమగు చిత్తశుద్ధి—లేకుండుటయే, లేదా, కొఱఁతగా నుండుటయే ముఖ్యకారణము. హాలధారి యిట్టి వ్యక్తులకు ప్రతినిధియని చెప్పవచ్చును

శ్రీరామకృష్ణుని పినతండ్రికుమారుఁడగు నితని పుట్టు పేరు రామతారక్, కాని హాలధారియను పెట్టుపేరే యెక్కువ వాడుక. శ్రీరామకృష్ణుఁడు దివ్యోన్మత్తావస్థయం దుండఁగా, ఉద్యోగార్థము దక్షిణేశ్వరము వచ్చిన యీతఁడు ఇంచుమించుగా నెనిమిదేండ్లు (1858—1866) ఆతని సన్నిధి నుండెను. ఈతఁడు వేదాంతశాస్త్రపండితుఁడు. స్వయముగా వైష్ణవుఁడయ్యు, మథురుని కోరిక ననుసరించి కాళికార్చకుఁ డయ్యెను. కాని యందలి పశుబలి కొల్లక, పూజను మనః

పూర్వకముగాఁ జేయుచుండెను. ఒకనాఁ డీతఁడు ధ్యానస్థుఁడై యుండ, కాళీదేవి కనఁబడి, తన యాలయమును వీడుమనియు, హృదయపూర్వకముకాని పూజకుఫలితముగా నీతని పుత్త్రుఁడు చనిపోవునని శపించెననియు, ఆశాపము వెనువెంటనే ఫలించెననియు విందుము. జరిగినసంగతి శ్రీరామకృష్ణునకుఁ దెలిపి హాలధారి రాధాగోవిందాలయార్చకుఁడయ్యెను.

హాలధారి పగటిపూట భగవంతుని సాకారునిగను, రాత్రి నిరాకారునిగను ధ్యానించువాఁడని శ్రీరామకృష్ణుఁడు తెలుపును.

కామినీకాముకప్రేమానురాగానుబంధమును ఎందు భక్తుఁడు భగవంతునియందుఁ బడసియుండునో అట్టి దివ్య మధురభావమును విధ్యుక్తధ్యానమార్గమునను భావనా మార్గమునను గాక, నిజముగా ఏ స్త్రీతోడనో రహస్య సంబంధము నేర్పఱుచుకొని సాధింపఁబూను నొక పతితవైష్ణవ సంప్రదాయమునకుఁ జెందినవాఁడు హాలధారి. పలువురి నోళ్లలోఁ బడిన యివ్విషయమునుగూర్చి శ్రీరామకృష్ణుఁడు విని, యాతని విపరీతసాధనలనుగూర్చి జను లేమనుకొను చుండిరో పరమహితవాక్కులతో, సహజనిష్కపటరీతి నాతనికిఁ దెల్పెను. సిగ్గుపడి పశ్చాత్తప్తుఁడగుటకు బదులు దురభిమానపూరితుఁడు, ఆగ్రహపరవశుఁడునై, హాలధారి, "నీవు నా తమ్ముఁడవైయుండియు నన్నిట్లు అవమానింప సాహసించెదవుగా! ఇందుకు శాస్తిగా నీనోటినుండి రక్తము కాఱుఁగాక!" యని శపించెను. సంగతిసందర్భముల నాతనికిఁ

దేటుపుటలోని తన సముద్దేశమును వివరించి, శ్రీరామకృష్ణుం డాతనిని శాంతింపఁజేయఁ బ్రయత్నించినను, ఆతఁడు తన శాపము నుపసంహరించుకోలేదు.

శ్రీరామకృష్ణుఁడు ఈసమయమున నచటికి రాసాగిన పరివ్రాజకులలో ఏ హఠయోగిపుంగవునియొద్దనో తద్రహస్య ములను గ్రహించి హఠయోగము నభ్యసించినట్లు కానవచ్చు చున్నది. పైని దెల్పిన సంఘటనము జరిగిన కొలఁదికాలమున కొకనాఁటిసాయంకాలము ఆతనికి అంగిలియం దొక విధమైన గులగుల కలుగ, నొకక్షణములో నటనుండి నెత్తురు కాఱ సాగెను. ఈ సంఘటనమునుగూర్చి యాతఁడే యిట్లు వివరిం చెను: "ఆ రక్తము చిక్కుడాకులపసరువలె నల్లగానుండెను. చాల చిక్కగా నుండుటచే ఒక లేశమే నేలపైఁబడి, మిగిలి నది ముద్దకట్టి మఱ్ఱియూడలాగున పండ్లనుండి వ్రేలాడ సాగెను. రక్తము కాఱకుండుటకుఁగాను బట్టకొంగుతో అంగిలిని అదిమిపట్టితిని గాని లాభము లేకపోయెను. చాల కలవర పడితిని. ఇంతలో అనేకులు నా చుట్టును జేరిరి. ఆలయమున సేవచేయుచుండిన హలధారికూడ ఆందోళనతోఁ బరుగెత్తు కొని వచ్చెను. ఆతనిఁ జూచి, కన్నుల నీరు గ్రమ్మ నిట్లంటిని: 'అన్నా! నీ శాపముచే నా కెట్టి యవస్థ దెచ్చిపెట్టితివో చూడు!' నా స్థితి చూచి యాతఁడును ఏడ్చెను.

"నాఁ డొక మహావిజ్ఞానియగు సాధువు ఆలయమునకు వచ్చియుండెను. గందరగోళము విని యాతఁడును వచ్చి, రక్తపురంగును, నోటినుండి యది సరిగా ఏతావునుండి వచ్చు చున్నదియుఁ బరిశీలించి యిట్లు పలికెను: 'భయము లేదు.

ఈ నెత్తురు వెలువడుటయే మేలైనది. నీవు యోగసాధన చేసితివి. హఠయోగచరమావస్థయందు జడసమాధి [1] కలుగును. ప్రస్తుత విషయమును అట్టిదే. సుషుమ్నాద్వారము తెఱచుకొన, శరీరమునందలి రక్తము తల కెక్కుచుండెను. అది తలలోనికిఁ బోవుటకు బదులు, స్వయముగా నోటినుండి యొకమార్గము కల్పించుకొని బయటికివచ్చివేసినది. ఈ రక్తమే కనుక నీ శిరస్సులోనికిఁ బోయియుండెనా, ఇఁక మరల తెలివి కలుగని జడసమాధిస్థితి నొందియుండెడివాఁడవు నీ శరీరమూలమున జగజ్జనని సాధింప సంకల్పించిన విశేషకార్యమేదియో యున్నది. అందుచేతనే ఆమె నిన్నిట్లు రక్షించినది.' ఆ సాధువు చెప్పిన యీవాక్యములను విని, బ్రతుకు జీవుఁడా యనుకొంటిని.''

హలధారిశాపము ఇట్లు వరముగా—శ్రీరామకృష్ణోత్తరజీవితమహాలాభప్రాప్తిమూలమున—లోకమునకు మహావరప్రసాదముగా మాఱిపోయినది! తా నొకటి తలఁచిన, దైవ మొకటి తలఁచును!

శ్రీరామకృష్ణుని మానసికస్థితినిగూర్చి హలధారి యొకప్పుడు విస్మయము, మఱియొకప్పుడు నిరసన, వేఱొకప్పుడు జాలియుఁ బొందుచు, సంశయాందోళితచిత్తుఁడై యుండెను. "తామసికమూర్తియగు కాళిని బూజించుటచే నెవ్వరికైనను ఆత్మవికాసము కలుగునా?" యని యొకప్పు డాతఁడు శ్రీరామకృష్ణుని నిరసించెను. అనంతర మాతని శరీరస్పర్శప్రభావమునకు వివశుఁడై పూవులతో నాతనిఁ బూజించెను.

1 అనఁగా నిర్వికల్పసమాధి.

ఏమైనను, తన వేదాంతగ్రంథములకడఁ గూర్చుండి, జోరుగా పాడుముపట్టు పీల్చి, వ్యాఖ్యాన మారంభించినంతనే 'పునర్మూషికకథ' చందమున పాండిత్యాహంకార పిశాచ మాతని నావేశించుచుండును!

"గ్రంథములు గ్రంథులు—మనలను బంధించు ముడులు; తెలుచుగా ఈయర్థమే వానికిఁ జెల్లును. గర్వము నంతయు విడిచి, సత్యము గ్రహింపవలయునను తీవ్ర వాంఛతో నొనరించిన నేకాని గ్రంథపఠనము దుష్పాండిత్యము, అహంభావము మొదలగువానిని బెంచును. హృదయమున నివి యనేకగ్రంథులై బాధించును" అని కాలక్రమమున శ్రీరామకృష్ణుడు సాధకలోకమున కొసఁగుచు మహోపదేశమునందలి యథార్థమునకు హలధారి వర్తనమే ప్రబల నిదర్శనము.

కాళికాలయమున భిక్షుకులకు అన్నప్రదాన మొనర్పఁబడుచుండెడిది. శ్రీరామకృష్ణుడు వారిని సాక్షాన్నారాయణ స్వరూపులుగాఁ బరిగణించి వారి యుచ్ఛిష్టము నొకనాఁడొక లేశము తినెను. ఇది గని హలధారి శ్రీరామకృష్ణునిఁ జూచి, "కులభ్రష్టుఁడ వైతివి. నీ కుమార్తెలకు పెండ్లి యెట్లగునో చూతునుగాక!" అని తన కులాచారాభిమానపిరావేశమును బ్రకటించుచు అధిక్షేపింప, శ్రీరామకృష్ణుఁడిట్లు సమాధానించెను: "ఓ ధూర్తుఁడా! జగత్తు మిథ్యయనియు, సమస్తభూతములయందును బ్రహ్మదృష్టిని అవలంబింపవలయు ననియు నీవేమేమో శాస్త్రవచనములను ఏకరువు పెట్టుచుందువే! నీవలెనే నేను జగత్తు మిథ్యయనుచు దానితోఁ

బోటు పిల్లలను గందునడుకొనుచుంటివా? ఛీ ఛీ! ఇదేనా నీ శాస్త్రజ్ఞానము!"

హాలధారి యొకనాఁడు శ్రీరామకృష్ణుని దివ్యాను భూతులనుగూర్చి విమర్శించుచు, భగవంతుఁడు అవాఙ్మానస గోచరుఁడనియు, భావాభావములకు, లేదా, అస్తిత్వ నాస్తిత్వములకు రెంటికినిగూడ అతీతుఁడనియు శాస్త్రప్రమా ణములతో వ్యాఖ్యానించుచు, ఆతని దైవదర్శనములు మిథ్యా భూతములని నిరూపింపఁబూనెను. అందలి సత్యాసత్యములను గూర్చి శ్రీరామకృష్ణుఁడు తన బాలహృదయమెంతయో కలఁత నొంద, దేవి తన్ను మోసగించెనాయని సంశయించి దేవినిఁ దలంచి విలపింపసాగెను. అనంతరము తనకుఁ గలిగిన దివ్యానుభూతినిగూర్చి కాలాంతరమున నొక శిష్యున కిట్లు తెల్పెను: "...పొగమంచువంటి ఆవరణమున సువర్ణ తేజో మయమైన యొక సౌమ్యవదనము వక్షమువఱకుఁ గల గడ్డ ముతో ప్రత్యక్షమయ్యెను! ఆమూర్తి తదేకదృష్టితో నన్నుఁ జూచుచు, గంభీరస్వరమున, 'నాయనా! భావముఖమున నుండుము!'[1] అని ముమ్మాఱుపలికి, వెంటనే యా పొగ మంచులో లీనమైపోవ, ఆ పొగమంచును అంతర్ధానమ య్యెను. ఈ దివ్యదర్శనము నొంది మనశ్శాంతి పొందితిని."

సంశయనిర్మూలనార్థమై మఱియొకప్పుడు దేవినిఁ బ్రార్థింప, ఒకానొక స్త్రీరూపమున దేవి ప్రత్యక్షమై,

[1] సమస్తప్రపంచము భగవత్స్వరూపమే యనెడి యొఱుకతో ద్వంద్వ ప్రపంచపుఁబొలిమేరను — సమాధిద్వారమున — వెలకొని యుండుమని భావము.

'భావముఖముననే యుండు'మని పలికెనని శ్రీరామకృష్ణుఁడు తెలిపెను. కాలక్రమమున సన్న్యాసస్వీకారానంతరము ఆతఁడు ఆఱునెలలపర్యంతము ఎడతెగని నిర్వికల్పసమాధి స్థితియందు నెలకొనియుండిన సందర్భమున నిదే భగవదాదేశమును మూఁడవసారి వినెను.

తన జ్ఞానోన్మత్తావస్థలో నొకానొక పూర్ణిమనాఁటి రాత్రి, "అన్నా! నేఁడు అమావాస్యయా?" అని తాను హలధారిని అడుగ నాతఁడు, "ఏమి ఘోరకలి! పూర్ణిమకును అమావాస్యకును ఇతనికి భేదము తెలియకున్నదఁట! ఐనను లోకు లితనిని గౌరవించుచున్నారు!" అని పలికెనని శ్రీరామకృష్ణుఁడు తెలుపును.

# వివాహము

ఆశైన వివాహసంఘటనమునుగూర్చి చిఱునగవుతో శ్రీరామకృష్ణుఁడు భక్తులతో నిట్లు ముచ్చటించును: "శాస్త్రవిహిత సంస్కారమునిమిత్తము వివాహము ఆవశ్యకము. కాని లౌకిక జీవితము గడుపుట నా కెట్లు సాధ్యపడును! నిగ్రహింపరాని దివ్యభావావేశమువలన జంధెము మెడలో వేయఁబడినపుడెల్ల జాఱిపడిపోవుచుండెడిది!"

కామవాసనావిరహితమగు తన వినిర్మలగార్హస్థ్యజీవితమున లోకమునకు మహోన్నతాదర్శము చూపిన యాతని వివాహము ఎట్లు సంఘటిల్లెనో ఆముచ్చటలను జూతము.

దక్షిణేశ్వరమందలి శ్రీరామకృష్ణుని మానసికస్థితిని గూర్చి చంద్రాదేవియు రామేశ్వరుఁడును ఏమేమో విని, యెంతయో వ్యాకులపడి, యాతనికి ఆరోగ్యము నొనఁగూర్పవలయునను తలంపున నెన్నియో లేఖలు వ్రాసి యాతనిని జన్మగ్రామమునకు రావించిరి. ఒకవైపున నాతఁ డెల్లరియెడలను సహజప్రేమానురాగములతో మెలఁగుచుండినను, మఱియొకవైపున అంతర్ముఖుఁడై సర్వవిషయములయెడలను ఉపేక్షాభావము నొందసాగెను. ఏదియో అపూర్వవేదన నొందుచు, జగన్మాతను స్మరించుచుఁ దలఁచుగా, 'అమ్మా! అమ్మా!' యని పిలచుచుండును. పూర్వమువలెనే శరీరము మరల మంటలెత్తసాగెను. ఔషధచికిత్సలతోఁ బాటు మాంత్రిక చికిత్సలను, శాంతిస్వస్త్యయనాదిక్రియలను జరుపసాగిరి.

ఏనివారణోపాయములకును లొంగని యిది యే భూతా వేశపీడయోయని చంద్రాదేవి మహాందోళిత మానసయై భూతమాంత్రికులచే చికిత్సచేయింపఁబూనెను. ఇవ్విషయమై యనంతరము శ్రీరామకృష్ణుఁ డిట్లు తెలిపెను: "ఒకనాఁ డొక భూతమాంత్రికుఁడు వచ్చి, మంత్రించిన యొక వత్తిని గాల్చి, నన్ను దానిని వాసనచూడఁజేసి, 'భూతావేశమైతే భూతము వెంటనే పాఱిపోవు'ననెను. కాని యది కేవలము నిష్ప్రయోజన మయ్యెను. అనంతర మొకరాత్రి కొందఱు ప్రసిద్ధభూతమాంత్రికులు ఏకమై, పూజాదిక్రియలు జరిపి, 'చండ' (ఒక ఉగ్రగక్షుద్రదేవత)ను ఆవాహనచేసిరి. పూజా బలులను స్వీకరించి ప్రసన్నయై చండ యా మాంత్రికులతో, 'వీనికి భూతావేశముకాని, మఱియేవ్యాధిగాని లేదు.' అని పలికెను. పిమ్మట నన్ను సంబోధించుచు, అందఱియెదుటను ఇట్లనెను: 'ఓ గదాయ్! నీవు సాధువవు (సన్న్యాసివి) కాఁగోరుచున్నావు. ఐతే నీ వంతగా పోకచెక్కలు తిను చున్నావేమి? అది కామమును వృద్ధిచేయునని తెలియదా నీకు?' నిజముగా నాకు వక్క లనిన చాల ఇష్టము. తఱచు తినుచుండువాఁడను. చండ మాట విని యా యలవాటు నంతటినుండి విడిచిపెట్టినాను."

భోగానురక్తులకు భయాస్పదము, భగవదనురక్తులకు ధ్యానాస్పదమును నగు శ్మశానవాటికను శ్రీరామకృష్ణుఁడు తన తీవ్రతపమునకు సముచితస్థానముగా నెన్నుకొని, అహర్నిశము విశేషభాగము అచట పూజాజపధ్యానాదు లలోఁ గడపసాగెను.

కొలఁది నెలలిట్లు కడచెను. మనోవ్యాకుల మణఁగెను. విలాపము లంతరించెను.

శ్రీరామకృష్ణుఁ డిపు డిరువదిమూఁడేండ్ల యువకుఁడు. శారీరసుఖములయెడ, ఇంద్రియభోగములయెడ, మహా విరక్తుఁడు; సాంసారికవిషయములయెడ నెప్పటివలెనే కేవలము ఉదాసీనుఁడు. వివాహయోగ్యమగు ప్రాయమున భోగమనక, భాగ్యమనక, ఇల్లనక, వాకిలియనక, ఎంత సేపు శ్మశానములనో ఆశ్రయించుచుండుట ఆప్తబంధు వర్గమునకు దురవగాహనమగుటయేకాక, దుర్భరమయ్యెను. ఇది యిట్లుండ నాతఁడు సన్న్యాసి కాఁగోరుచుండినట్లు చండ—మాంత్రికులచే ఆవాహనచేయఁబడిన ఉపదేవత—చెప్పియుండెనుగదా? ఇట్టి స్థితిలో సాంసారికవిషయముల యం దీతనికి ఆసక్తి కలిగించు టెట్లని వారు యోచింప సాగిరి. అనుకూలురాలైన కన్యను దెచ్చి పెండ్లిచేసినచో, ఆమెయందు అనురాగమున మనస్సు కుదురుకొనుననియు, సర్వవిషయములును జక్కఁబడుననియు వారికిఁ దోఁచెను. ఆశ్చర్య మేమి? లోకస్థితిని అరయుచో, సమస్తబాధ్యతలను గుర్తింపఁ జేయునదియు సమస్తబాధ్యతలను గల్పించునదియు వివాహబంధమేకదా!

చుట్టుపట్ల గ్రామములలో కన్యాన్వేషణచేయసాగిరి, కాని వారి ప్రయత్నములు సఫలము కాకుండెను. నాఁటి సాంఘికాచారముల ననుసరించి తగినంత శుల్క మీయనిదే మంచి సంబంధము దొరకుట దుర్లభమైయుండ, అంతటి సమర్థత రామేశ్వరునకు లేదయ్యె. ఇది యిట్లుండ వివాహ-

సంబంధమగు తమ సంప్రతింపులును, కన్యాన్వేషణమును దెలిసినచో, గదాయి సర్వము పాడుచేయునను భయమున రహస్యముగా సాగించుచుండిరి. కాని నిశితపరిశీలనాదక్షుం డగు నాతఁడు పన్నఁబడుచున్న వ్యూహమంతయు అచిర కాలముననే కనుఁగొని, ప్రతిఘటించుటకు బదులు, పెండ్లి వేడుక కెదురుచూచు బాలకునివలె ఉల్లాసము ప్రకటింప సాగెను. జగన్మాతృసంకల్ప మిట్లుండెనని గ్రహించి యుండుట కిట్లు అతఁడు మహోల్లాసపూర్వకముగా సంసిద్ధుఁ డయ్యె ననియే భావింపనొప్పును.

ఎంత ప్రయత్నించినను తగిన సంబంధము దొరకక నందున, తల్లియు అన్నయు చింతాక్రాంతులై యుండుట కనుఁగొని, భావసమాధిస్థితిలో శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించెను: "ఎక్కడెక్కడనో ప్రయత్నించిన, ఏమి లాభము? జయరాంబాటి (జయరామవాటి) కిఁ[1] బోయి చూడుఁడు, అచట రామచంద్ర ముఖోపాధ్యాయు నింట నాకై నిర్ణీతయైయున్న వధువు కలదు."[2] ఈపలుకులను వారంతగాఁ బాటింపకపోయినను, 'పోనీ, చూత'మని

[1] జయరామవాటి కామార్పుకుర్ నకు వాయవ్యదిశగా (అనఁగా పశ్చిమోత్తరదిక్కున) మూఁడుమైళ్ళలో నున్న పల్లెటూరు.

[2] సహజసరళమనోహరభాషలో నాతఁ డీ సందర్భమున నొక చక్కని జాతీయము నుపయోగించెను: అది యిది: "(గుర్తుగా) గడ్డిపోఁచతోఁ జుట్టఁబడి భద్రపఱుపఁబడియున్నది." చెట్టుననున్న ఉత్తమ ఫలమును దేవుని కర్పించుటకై గుర్తుగా నిట్లు గడ్డిపోఁచతోఁ జుట్టి భద్రపఱుచుచుండుట వ్యవసాయులగు (నచటి) గ్రామవాసుల యాచారము.

యుపచారి గొనికొని యంపిరి. అతండు తిరిగివచ్చి, రామచంద్రునకు కన్యాప్తి యుండుట నిజమేయనియు, సంబంధము చాల మంచిదైనను, పిల్లకైదేండ్లమాత్రమే యగుటచే ఈడు తక్కువగనే యున్నదనియుం జెప్పెను. కాని విశేషానుకూల మఱి సంబంధము దొరకునట్లు కాన్పింపకుండుటచేత నేకాక, తలనని తలంపుగాఁ బ్రాప్తించిన యీ సంబంధము దైవసంకల్పితమనియు, వధువునకు ఈడు చాలకున్నను, వంశసంప్రదాయాదులచేఁ దమ కది యీడైన సంబంధమేకదాయనియు మనస్సమాధానము నొంది చంద్రాదేవి దీనికే యంగీకరించెను. శారదామణీదేవియను ఆకన్యకకును శ్రీరామకృష్ణునకును శుభముహూర్తమున జయరామవాటిలో సిద్ధార్థినామ సంవత్సర వైశాఖమాసమున (1859–వ సం॥ మే నెలలో) వివాహము జరిగెను. రామేశ్వరుఁడు మూఁడువందల రూపాయల శుల్కము నీయవలసివచ్చెను.

వివాహము సక్రమముగా జరిగెననియుఁ దమ గదాయికిది విశేషశ్రేయస్కరమగుననియు చంద్రాదేవి యెంతయో సంతసించెను. వివాహసమయమున నామె పొరుగున నున్న ధనవంతమగు లాహాకుటుంబమునుండి నగల నెరువు తెచ్చి పెండ్లికూఁతునకుఁ బెట్టియుండెను. తన చిన్నికోడలితో స్వగృహమునకు వచ్చిన యనతికాలముననే నగల నిచ్చి వేయవలసిన సమయమును వచ్చెను. కాని యా నగలను దన ముద్దుకోడలును, అమాయికురాలును నగు నా బాలికయొద్ద నుండి తీసికొనుటకు చంద్రాదేవికి చేతులు రావయ్యె! ఇది గని శ్రీరామకృష్ణుఁడు బాలిక నిద్రపోవుచుండఁగా నిపుణ

ముగా నగల నన్నిఁటిని దీసివేసి లాహాకుటుంబమునకుఁ బంపి వేసెను. బాలిక లేచి చూచుకొనునుగదా, నగ లేవి? తన నగలు పోయినవని ప్రాయశః కన్నుల నీరు పెట్టుకొని యామె యందఱితోఁ జెప్పనారంభించెను. చంద్రాదేవి యామెను కౌఁగిలించుకొని, "చిట్టితల్లీ! విచారింపకు. గదాయ్ నీ కింతకంటె మంచినగలను జేయించిపెట్టునులే" [1]అని యో దార్చెను. నాఁడచటికి వచ్చియుండిన శ్రీశారదాదేవి పిన తండ్రి యీ సంఘటనఁ జూచి కోపించి వెంటనే పిల్ల నింటికిఁ దీసికొని పోయెను. కాని శ్రీరామకృష్ణుఁడు నర్మగర్భితముగా నవ్వి, "ఇప్పు డెవ రేమి చెప్పినను, చేసినను, పెండ్లి మాత్రము రద్దుచేయలేరుకదా!" యని తల్లి మనస్సు నూఱడించెను.

తన వివాహానంతరమానసికస్థితినిగూర్చి ముచ్చటించుచు, కాలాంతరమున శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించెను: "నా భార్యనుగుఱించి మొదట వ్యాకులపడితిని. పిమ్మట ఆమెయు నావలెనే అన్నపానములను బొందుచుండునుగదా యని మనస్సమాధానము నొందితిని."

వివాహానంతరము శ్రీరామకృష్ణుఁడు కామార్పుకుర్న నించుమించుగా రెండు సంవత్సరము లుండెను. ఆచారము ననుసరించి యాతఁ డీ సమయమున నొకసారి యత్తవారింటికి వెళ్లి కొన్ని దినములు గడపెను. ఆ సమయమున

[1] నిజముగా శ్రీరామకృష్ణుఁడు కాలక్రమమున నామెకు మూఁడు వందల రూపాయలను బెట్టి చక్కని నగలను జేయించెను. ఆమె వానిలోఁ గొన్నిఁటిని తుదివఱకును ధరించెడిది.

మాతృదేవి (శ్రీశారదాదేవి) తా నేడేండ్ల బాలికయనియు, పతికి ప్రణమిల్లి, పాదములను గడిగి, ఆయనకు విసనతో విసరితిననియు, అపు డచట నున్నవారందఱును అది గని (సంతోషాతిశయమున) నవ్విరనియు కాలక్రమమున స్మరించెడిది.

ఆటలలో మైమఱచియుండు పసితనముననే తన హృదయసింహాసనము నీ విధముగా ప్రాణేశ్వరునకు సమర్పించిన పరమసాధ్వీమణి శ్రీశారదామణీదేవి!

అనతికాలముననే శ్రీరామకృష్ణుఁడు కామార్పుకూర్ వచ్చి కొన్ని దినము లుండి, తల్లియొద్దను, అన్నయొద్దను సెలవు గైకొని దక్షిణేశ్వర కాళికాలయమునకు మఱలెను.

# తన్మయత్వము

దక్షిణేశ్వరమునకు వచ్చినంతనే శ్రీరామకృష్ణుఁడు మరల కాళీపూజను నిర్వహింపసాగెను. కాళికాదేవి యాతని నావేశించుటకై వేచియుండెనో యనునట్లు కొలఁదిదినముల లోనే యాతఁడు దివ్యోన్మత్తుఁ డయ్యెను. వృద్ధురాలగు తల్లి, సంసారనిర్వహణబాధలు పడుచున్న సోదరుఁడు, బాలభార్య—సర్వము ఆతని దేవీనిరంతరసందర్శనమహావాంఛలో విస్మృతమైపోయెను. పూర్వమువలెనే అహర్నిశము ఒకటే ప్రార్థన, ఒకటే ధ్యానము! అఖండభావావేశమున వక్షః స్థలము ఎఱ్ఱవాఱుట, శరీరమం దంతటను మంటలు, ప్రాపంచికవిషయమైముఖ్యము, క్షణమైనను నిద్రింపకుండుట, లేదా, నిద్ర పట్టకుండుట—ఇవన్నియు మరల గోచరింపసాగెను. చికిత్సలవలన శారీరబాధలు ఉపశమించుటకు బదులు హెచ్చుచుండెను.

క్రమముగా ఈ వార్తలు చెవినిఁ బడ, చంద్రాదేవి పొందసాగిన పరితాపము వర్ణనాతీతము. భగవదనుగ్రహము నర్థించుటకంటె నుపాయాంతరము లేదని, యా భక్తవత్సలుఁడు పుత్త్రరక్షోపాయము దెలుపనిచో నామె ప్రాయోపవేశముచేయ సమకట్టెను. ఇట్టి మహాదీక్షతో నామె కామార్పుకుర్ నందలి 'వృద్ధశివాలయము'నకు వెడలి ప్రణమిల్లియుండెను. ప్రసన్నుఁడైన శివుని పనుపున నామె ముకుంద పురమందలి శివాలయమున కేఁగి రెండుదినము లుపవసించి

యుండ, స్వప్నమున పరమశివుఁడు ప్రత్యక్షమై యిట్లు అభయ ప్రదానమొసఁగెను: "భయము లేదు, నీ పుత్త్రుఁడు పిచ్చివాఁడు కాఁడు; కేవలము ఈశ్వరావేశమున నిట్టి స్థితిలో నున్నాఁడు." మనస్సు కుదుటఁ బడ, దేవదేవునికృపకు కన్నీరు విడిచి యామె యింటికి మఱలెను.

తన ప్రస్తుతదివ్యానుభూతులనుగూర్చి యనంతరము శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించును: "ఒక స్థితి గడచినంతనే మఱియొక స్థితి గలుగుచుండెను. ఆ ఝంఝామారుతమున యజ్ఞోపవీతము ఎగిరిపోయినది. కట్టుకొన్న బట్టయైనను సరిగా నిలువకుండెను. పల్లెవాండ్రు వల విసరి అమాంతముగా చేఁపలను బట్టునట్లు జగన్మాతను బట్టుకొనవలయునను సంకల్పమున, దాడలు ఆకాశపాతాళములను దాఁటుచుండెనో యనురీతిని, నోరు తెఱచి, 'అమ్మా!' యని బిగ్గఱగా అఱచి పిలుచువాఁడను.

"ఆహా! ఏమి తన్మయావస్థ యది! బాహ్యలోకమునందలి యే అల్పకారణమైనను ఈశ్వరజ్ఞానమును రగుల్కొల్పుచుండెడిది...నీలిచీర దాల్చిన యొక స్త్రీ యొకనాఁడు పొగడచెట్టుకడ నిలిచియుండుట చూచితిని. ఆమె యొక వేశ్య. కాని తత్‌క్షణమే యామె నా యంతరంగమున సీతాదర్శనమును రగుల్కొల్పెను. ఆ స్త్రీని మఱచిపోతిని. రావణుని బారి నుండి రక్షితయై విజయాభిరాముఁడగు రామునిఁ గలిసికొన వెడలుచున్న సాక్షాత్ సీతగా ఆమె కనిపించెను. బాహ్య ప్రపంచస్మృతిని గోల్పోయి చాలసేపు సమాధిస్థితిలో నుంటిని ...మఱియొకనాఁ డొక ఆంగ్లేయబాలుఁడు (కాలుపై కాలు

వేసికొని) ఒక చెట్టు నానుకొని నిలుచుండియుండ, వాని శరీరము మూఁడు తావులందు వంగియుండెను. తటాలున కృష్ణభావము[1] స్ఫురింప సమాధిస్థితి నొందితిని. ఒకప్పుడు బుజమున వెదురుకఱ్ఱతో దేవాలయావరణమున సంచరించు వాఁడను. ఒక్కొక్కప్పుడు కుక్కపై నెక్కి కూర్చుండి, దానిచే లూచి (ఒకవిధమైన పూరీ) తినిపించుచు, నేనును దినువాఁడను. 'సర్వం విష్ణుమయం జగత్.' మట్టిగుంట లలో నిలిచియుండు నీటిని ఆచమనము చేయువాఁడను. ఆ దివ్యోన్మత్తావస్థలో జాతిభేదము కొంతమాత్రము పాటింపఁ గల్గువాఁడను గాను. ఒక హీనకులస్థుని భార్య తాను వండిన కూరలను బంప, ప్రీతితోఁ దినువాఁడను. ప్రపంచస్మృతిని గోల్పోయి, నిశ్చలశరీరమున, గాఢధ్యాననిమగ్నుఁడనై పంచవటియందుఁ గూర్చుండువాఁడను. తల జడలుకట్టుకొని పోయెను. పక్షులు తలపై వ్రాలి పూజాక్షతల నేరికొని తినును. నిశ్చలమై కొయ్యవలెనున్న శరీరమున పాములు ప్రాఁకును—పాములకుఁగాని, నాకుఁగాని యీ యెఱుకయే లేకుండెడిది. ఆహా! అహర్నిశము ఏమి దివ్య దర్శనములు గలుగుచుండెడివి!"

నాఁటి తన విచిత్రానుభవములనుగూర్చి యీతఁ

[1] ఉ. "మూఁపున వామకుండలము, మోవి నొకించుక మోడ్చు నందమున్
జూపెడు నోరచూపు, సొగసుంబొమ యొక్కట నిక్క గన్పడన్
గ్రేపులు సొక్కఁ గల్పకముక్రిందఁ ద్రిభంగిగ నిల్చి యంగుళీ
వ్యాపితవంశపూరితయి వర్తిలు మోహనమూర్తి గొల్చెదన్."
—కృష్ణకర్ణామృతము.

డిట్లు వచించును : "ధ్యానమునకుఁ గూర్చుండినంతనే త్రిశూలపాణియగు నొక సన్న్యాసి యీ శరీరమునుండి వెలువడి, 'ఇతరచింతల నన్నింటిని విడిచి భగవంతునియందే మనసు లగ్నముచేయుము' అని నన్ను ఆజ్ఞాపించును. అట్లు చేయని యెడల త్రిశూలమును శరీరమున గ్రుచ్చెదనని బెదరించును. నాలోనుండి వెలువడిన పాపపురుషునిఁ జంపిన దీ యతియే. దూరస్థులగు దేవతలను జూడఁగోరినను, దూరప్రదేశము లందలి సంకీర్తనము వినఁగోరినను, ఈ తేజోమూర్తియే లోనుండి బయల్వెడలి, తేజోమయమార్గమున ఆ తావులకుఁ బోయి, నాకోరిక తీర్చినపిమ్మట మరల శరీరమునఁ బ్రవేశించును."

కాలక్రమమున శిష్యులతో నాతఁ డిట్లు తెలుపును : "సరిగా నావలెనే యుండు నొక యువసన్న్యాసి నాలో నుండి వచ్చి సర్వవిషయములను నాకు బోధించువాఁడు. ఒక్కొక్కప్పుడు బాహ్యప్రజ్ఞ కొంచె ముండెడిది. మఱి యొక్కొక్కప్పు డాతని చేష్టలను గమనించుచు, వాక్కులను వినుచు, బాహ్యస్మృతి పూర్తిగాఁ గోల్పోయి జడునివలెఁ బడియుండువాఁడను. ఆతఁ డీశరీరమునఁ బ్రవేశించినపిమ్మటనే యథాస్థితి నొందువాఁడను. పూర్వ మాతనివలన ఏ తత్త్వ విషయములను వినియుంటినో, వానినే తిరిగి బ్రాహ్మణి, దిగంబరుఁడు (శ్రీతోతాపురి) మొదలగువారు వచ్చి బోధించిరి —ఇదివఱకు (నేను) తెలిసికొనియుండిన తత్త్వములనే వారు ఉపదేశించిరి. శాస్త్రవిధిని మన్నించి శాస్త్ర ప్రామాణ్యమును బాటించుటకై (నా) యీ జీవితమున వారు

గురువులుగా ఏర్పడినట్లు తోఁచుచున్నది. వారిని గురువులుగా గ్రహించుట కింతకంటె నజ్జిదొక కారణము గోచరింపదు.”

“అట్టి భావావేశమును గొంచెమైనను సామాన్యులగు లోకులు భరింపఁజాలరు; దానిలో నాల్గవవంతునకే శరీరము తుత్తునియలై పోవును. ఆ దశలో అహర్నిశము విశేషకాలము ఏదియో యొక రూపమున అమ్మదర్శనము నొందుచు, అనిర్వచనీయమైన నా పరితాపమును మఱవఁగల్గువాఁడను. అట్లు లభింపకుండినచో, ఈ శరీరము నిలిచి యుండెడిది కాదు. ఆ రెండ్లపర్యంతము కంటికి రెప్పకూడ నిద్ర రాలేదు—ఎంత ప్రయత్నించినను రెప్పలు మూఁతపడెడివే కావు. కాలమే అపుడు స్ఫురించెడిది కాదు, శరీరస్మృతి నశించిపోయెను. అరుదుగా ఒకానొకప్పుడు లేశము శరీరము వైపునకు దృష్టి మఱలుట సంభవింప, పిచ్చివాఁడనై పోవుచున్నానేమోయను ఘోరభయము ఆవహించెడిది. అద్దము నెదుట నిలిచి, రెప్పలు మూఁతపడునేమోయని కన్నులలో వేలు పెట్టుకొందునుగదా, మూఁతపడవే! ఈ స్థితిని గాంచి భయభ్రాంతుఁడనై విలపించుచు, అమ్మ నిట్లు ప్రార్థించువాఁడను: ‘అమ్మా! కేవలము నిన్నే నమ్మి యుండుటకును నా ప్రార్థన లన్నిఁటికిని ఇదియా ఫలము! శరీరమునకీ విషమవ్యాధి తెచ్చిపెట్టితివా?’ కాని మఱు క్షణముననే, ‘అమ్మా, ఈ శరీరమునకు ఏగతి పట్టినను సరే, నీవుమాత్రము నన్ను విడనాడకుము! కృపాకటాక్షము చూపుము! ప్రత్యక్షమగుము! తల్లీ! నీ దివ్యపాదార

వింపములనే అనన్యగతిని నమ్మియున్నానుగదా! నీకంటె నాకు దిక్కెవ్వరు?' అని బాష్పము లొలుక వేఁడికొన, మనస్సునకు వచల అవ్యక్తోత్సాహమును ఉత్తేజమును గలిగించెడివి. శరీరము తృణప్రాయముగాఁ దోఁచెడిది. అపుడు అమ్మ—దయామయి—ప్రత్యక్షమై తన అభయవాణిచే నన్ను ఊరడించును.''

ఆఱు సంవత్సరములపర్యంతము శ్రీరామకృష్ణునకు కంటికి కునుకే పట్టలేదన్నచో, ఱెప్పలు మూఁతపడెడివే కావన్నచో, అదెంతటి తీవ్రభగవత్పరితాపమో, తన్మయావస్థయో, ఊహింపనగును. ఆఱు సంవత్సరములపాటు కాదుగదా, ఆఱుదినముల పర్యంతము నిద్ర యనునది లేకపోయినచో, లోకుల గతి యేమగునో వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. కొలఁది క్షణములపాటి భగవదనుభవ లేశముచే నైనను గలుగు మహావిశ్రాంతియు ప్రశాంతియు నెంతటి నిద్రాదులచేనైనను గలుగఁజాలవన్నచో, ఇంచు మించుగా అహోరాత్రము ఏదియోయొక రూపమునఁ దాను భగవద్దర్శనము నొందుచుండువాఁడననియు, లేనిచో శరీరము నిలిచియుండెడిది కాదనియు—ఇందలి కీలకమును—శ్రీరామ కృష్ణుఁడే వెల్లడించియున్నాఁడుకదా! తత్త్వానుభూతి కెవ్వరును పరిమితి నేర్పఱుపఁజాలరనియు, నీవొక దివ్యానుభూతిని బొందినచో, దానిని మించినది మఱొకటియు దానికి అతీతమైనది వేఱొకటియు నుండవచ్చుననియు నాతఁడు వచించును. ఆధ్యాత్మికసాధనప్రభావమున మనస్సు తగినంత నైర్మల్యము నొందునపుడు అదియే సాధకునకు గురువై

వ_ర్తించునని యాతఁడు తెలుపును. తనలోనుండి తన్నుఁబోలు పురుషుఁడు వెలువడి సర్వవిషయములను దనకు బోధించు చుండినట్లు శ్రీరామకృష్ణుఁడు స్వయముగా దివ్యానుభూతి నందియుండెనుగదా? ధ్యానసిద్ధులగు మహాయోగుల వినిర్మ లాంతఃకరణమున వేదవేదాంతతత్త్వరహస్యములును, భూత భవిష్యత్తులును సైతము అప్రయత్నముగా భాసించుననుటకు శ్రీరామకృష్ణుని యీ దివ్యానుభూతులే తార్కాణములు. ధ్యానప్రభావముననేకదా ఋషులు స్వయముగా మంత్ర ద్రష్టలై ప్రకాశించుచున్నారు? ఈశ్వరవాణిని వినిపించు దివ్యమైన రేడియో (Radio) కీలకముగదా ధ్యానము!

తన మహోన్నతాదర్శసిద్ధిని గాంచి యందు సుప్ర తిష్ఠితుఁడగుటకై శ్రీరామకృష్ణుఁడు ఆచరించిన సాధనలు అనుపమానములు. కాంచనాసక్తి—ధనాసక్తి—తన మన సున లేశమైనను నుండరాదని, కలనైనను గలుగరాదని, నిశ్చయించుకొని యాతఁ డీ సమయమున నొక యపూర్వ సాధన నాచరించెను. గంగాతీరమునఁ గూర్చుండి, యొకచేతఁ గొంత మట్టిని, రెండవచేతఁ గొన్ని రూపాయలను గ్రహించి వాని విలువలను మనస్సున నెంచుకొనుచు, నొక చేతినుండి మఱియొక చేతిలోనికి మార్చుకొనుచు, భగవత్సాక్షాత్కార మునకు అవి రెండును నిరర్థకములేకదా యని నిశ్చయించు కొని వానిని గంగలోఁ బాఱవేయును. ఈసాధననుగూర్చియే కాలక్రమమున నాతఁడు భక్తులతోడను శిష్యులతోడను నిట్లు వచించెను: "భగవంతుని బొందినచో, సమస్తము పొందిన వాఁడనే. 'ఇది రూపాయ, ఇది మట్టి; మట్టి—బంగారము;

బంగారము—మట్టి' యనుచు రెంటిని బంగారములను త్యజించితిని. ధనమును మట్టిని గంగలోఁ బాఱవేసినాను. అంతట శ్రీమహాలక్ష్మి తన్ను నిరసించితినని నాపైఁ గోపగించునేమో యని, నాకు అన్నము దొరకకుండఁ జేసినను జేయునేమో యని, భయపడి యిట్లు ప్రార్థించినాను: 'అమ్మా! నీవు నా హృదయమున నెలకొనియుండుము, నాకు మఱేమియు అక్కఱలేదు.' ఆమెను సాక్షాత్కరించుకొనుటచే సమస్తము పొందుదునని నాకుఁ దెలియును!"

సర్వసమభావమున సుప్రతిష్ఠితుఁడగుటకై యాతఁడు చందనమును మలమును సమభావముతో స్పృశించును. మలమును నాలుకతోఁ దాఁకిన సంఘటనములు సైతము కలవు.

అహంకారనిర్మూలనకై శ్రీరామకృష్ణుఁడు ఆచరించిన సాధనలు అపూర్వములు. పేదలకును బిచ్చగాండ్రకును ఆలయమున సంతర్పణచేయఁబడునపు డాతఁడు వారల యెంగిలి ఆకులను తలపై నిడుకొని మోసికొని వెడలి, యవ్వల విసర్జించి, వారు తినిన తావును స్వయముగా శుభ్రపఱిచిన సమయములు కలవు. వారును సాక్షాన్నారాయణస్వరూపులేయను దివ్యభావమున వారల యుచ్ఛిష్టము నాతఁడొకప్పు డొకించుక భుజించియున్న సంగతి గమనించితిమికదా? ఆలయ సేవకులు మలవిసర్జనచేయు ప్రదేశము నాతఁడు జడలు కట్టిన తన శిరోజములనే చీఁపురుగా గ్రహించి వానితో నూడ్చి, కడిగి, జగజ్జననిని, "అమ్మా! వీరికంటె నే నధికుఁడనను భావము నామనసున నెన్నఁడును గలుగకుండునట్లు నన్ను

అనుగ్రహింపుము!" అని ప్రార్థించెనని 'శ్రీ శ్రీరామకృష్ణ లీలాప్రసంగము' తెలుపుచున్నది. 'చెప్పరానివాండ్రు', 'అంటరానివాండ్రు', 'చండాలురు'నని నిరసింపఁబడుచుండిన హరిజనులయెడ సైత మాతఁడు ఎట్టి పరమాదర్శ సేవకభావము చూపెనో శ్రీ వివేకానందస్వామి My Master (నా గురుదేవుఁడు) అను తన మహోపన్యాసమున నిట్లు ప్రకటించి యున్నాఁడు: "ఈ బ్రాహ్మణోత్తముఁడు (పొరుగున నివసించుచుండిన) నొక పంచముని సమీపించి, తన్ను వాని యింట నీచసేవల నొనరింపనిమ్మని కోరెను—కాని యాతఁడు అందులకు అంగీకరించునా? అంగీకరింపలేదు. అందుచే అర్ధరాత్రమున, ఎల్లరును గాఢనిద్రలోనుండఁగా శ్రీరామకృష్ణుఁడు ఆ పంచమునింటఁ బ్రవేశించి, 'అమ్మా! జగజ్జననీ! నన్ను మాలమాదిగల సేవకునిగాఁ జేయుము! మాలవానికంటెను అల్పుఁడనను భావము నాకుఁ గలిగింపుము!' అని ప్రార్థించుచుఁ దన దీర్ఘశిరోజములతో వాని దొడ్డి నూడ్చును."

ఇట్టి నిరహంకారమున సహస్రాంశమైనను ఎవ్వని కబ్బునో వాఁడేకదా ధన్యాత్ముఁడు!

కాళీదేవి తన యభీష్టదైవతమైయున్నను, భగవానుని నానారూపములయెడ సమభావమునను, అభేదదర్శనమునను శ్రీరామకృష్ణుఁడు నెలకొనియుండెననుటకు అనేక నిదర్శనములను గనుఁగొనియున్నాము. ఇందులకు మఱియొక ప్రబల నిదర్శన మీ సమయమున సంఘటిల్లెను. ఒకనాఁ డాతఁడచటి ద్వాదశశివాలయములలో నొకదానియందుఁ బ్రవేశించి, యఖండభక్తిపూర్వకముగా శివమహిమ్నస్తోత్రమును

పారాయణ మొనర్పసాగెను. అతులితభక్తిభావసంభరితమైన యా స్తోత్రరాజమునందలి "అసితగిరిసమంస్యాత్కజ్జలం..."[1] అను నత్యంతరమణీయశ్లోకమునకు వచ్చినంతనే భావావేశము మహోన్నతస్థితి నంద, నాతఁడు పరమశివసాక్షాత్కారము నందుచుండెనో యనునట్లుండెను. అట్టి తన్మయావస్థలో యథాతథముగా శ్లోకము నుచ్చరించుటకు అవకాశ మెక్కడిది! పాదములవరుసయు శ్లోకశబ్దములు సైతము విస్మృతమై పోయెను. "ఓ మహాదేవా! నీ మహిమాతిశయము నే నెట్లు వర్ణింపఁగలను?" అను మాటలు మాత్రము నోటినుండి వెలువడెను. కన్నీరు ధారాపాతముగాఁ బ్రవహించుచుండెను. ఇంతలో జను లనేకులు చుట్టును మూఁగిరి. ఆ సమయమున కాళికాలయమునకు వచ్చియుండిన మథురుఁడును శీఘ్రముగా అచటికి వచ్చెను. కాని శ్రీరామకృష్ణునకు శరీరస్మృతియే లేదు. లేనిపోని పెత్తనము చలాయింపఁజూచు నాలయోద్యోగి యొకఁడు, "ఈ పిచ్చివానిని స్వామిసన్నిధినుండి నెట్టివేయవలెను" అని పలుక, "తల మెడపై నుండఁజూచు

---

1 "అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రే
సురతరువరశాఖా లేఖినీ పత్త్రముర్వీ;
లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం
తదపి తవ గుణానా మీశ పారం న యాతి."

(ఓ మహేశ్వరా! నల్లని కొండయే సిరాయు, సముద్రమే సిరాపాత్రయు, కల్పతరుశాఖయే కలమును, భూమియే పత్త్రమునునై, స్వయముగా వాగ్దేవియగు సరస్వతి వీనిని గ్రహించి సర్వకాలము వ్రాయఁబూనినను, నీ యనంతకల్యాణగుణపారమును బొందఁజాలదు.)

కోనివాఁ డెవఁడైనను భట్టాచార్య మహాశయునిఁ దాఁక వచ్చును" అని మథురుఁడు హెచ్చరించెను. కొంత సేపటికి శ్రీరామకృష్ణుఁడు మెల్లఁగా బాహ్యప్రజ్ఞ నొంది, అనేకులు తన్ను అవలోకించుచుండుట గని, "వివశుఁడనై యున్న స్థితిలో ఏమైనను అనుచితకార్యము చేసియుంటినా?" యని బాలకునివలె మథురు నడిగెను. మథురుఁడు బద్ధాంజలియై యిట్లు విన్నవించెను: "లేదు, బాబా! మీరు స్తవపఠనము చేయుచుండిరి. మీ ధ్యానప్రార్థనల కెవ్వరును భంగము కలిగింపకుండుటకై నేనిచట నిలిచియుంటిని."

ఈ విధముగా శ్రీరామకృష్ణునియెడ నానాఁటికి అతిశయించుచుండిన మథురుని గౌరవము మహత్తరభక్తి భావముగాఁ బరిణమించుటకు హేతుభూతమైన యొక అద్భుత సంఘటనము అచిరకాలముననే జరిగెను. తన గదికి తూర్పు తట్టున నున్న వసారాలో శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు గంభీర భావనిమగ్నుఁడై పచారుచేయుచుండెను. అపు డొంటరిగాఁ దన గదిలోఁ గూర్చుండియుండిన మథురుఁడు ఆతనివైపే శిలకించుచుండెను. కాని శ్రీరామకృష్ణున కా విషయమే తెలియదు. అకస్మాత్తుగా మథురుఁడు పరుగున వెళ్లి శ్రీరామకృష్ణునకుఁ బ్రణమిల్లి, బాలకునివలె విలపింప సాగెను. శ్రీరామకృష్ణుఁడు అబ్బురపడుచు, "ఏమిది? రాసమణిరాణి యల్లుఁడవగు నీ విట్లు ప్రవర్తించిన, లోకు లేమనుకొందురు? లెమ్ము, మనస్సు కుదుటఁబఱుచుకొనుము" అని పలికెను. కాని మథురుఁ డింకను విలపించుచునేయుండెను. భావావేశము కొంచె ముపశమింప నాతఁడు ఇట్లు విశద

పలికెను : "[illegible] విహారు పచారు చేయుచుండఁగాఁ

పు[illegible] [illegible] ఆనందమయు యగు

[illegible]. [illegible] పురుషుఁ [illegible]

నన్నెఱిఁగి నా [illegible] పవిత్రదివ్యస్వరూపమును దాల్చితిరి! మొదట భ్రమయేమో యనుకొంటిని. కన్నులు నులిమి కొని మరలఁ జూతునుగదా, ప్రతిపర్యాయము ఆ యద్భుత దృశ్యమే గోచరించెను." ఇట్లు పలుకుచు నాతఁడు మరల భావావేశమున విలపింపసాగెను. "నే నేమియు ఎఱుఁగను బాబా!" అని సహజసరళశైలిని శ్రీరామకృష్ణుఁడు సకా–[illegible]ంచెను. ఈ సంఘటనమునుగూర్చి [illegible] కాలాంతరమున నాతఁ డిట్లు తెలుపును : "మథురుఁడు [illegible]సిల్లఁడయ్యె. రాసమణిరాణి యీ సంగతి వినిన నేమనుకొనునోయని— అతనికి కేమా [illegible]మంత్రమో పెట్టితిననుకోవచ్చునని— భయపడితిని. [illegible]ముల [illegible]ంపఁగా అతఁడు ఊరట పొందెను. మథురుఁడు నాకెంతెంతగా ఉపచరించెనో? అంతగా ప్రేమించెనో? (తన శరీరమును జూపి తన్నుద్దేశించుచు) దీనినిగూర్చి యెన్నో దర్శనములను, అనుభూతులను అమ్మ యాతనికిఁ గలిగించెను..

ఇఁకటినుండియు శ్రీరామకృష్ణునకు ఏ యల్పసేవ చేయఁగల్గినను, అది అనన్యసామాన్యమగు తన మహా భాగ్యముగా మథురుఁడు పరిగణింపసాగెను.

రాసమణిరాణి రక్తగ్రహణీవ్యాధిపీడితురాలయ్యెను. అవసానసమయము సమీపించెను. గంగాతీరమునకుఁ గొని పోఁబడిన యీ మహాభక్తురాలు తన యెదుట నున్న దీప

ములను గని, "వీనిని కసివేయుఁడు. ఇపు డీని యొంటి నెల వెలఁబోవుచున్నవో! ఆహా! అదిగో, నా తల్లి (జగజ్జనని) వచ్చుచున్నది—ఆమె దివ్యశరీరప్రభచే నల్దిక్కులును ప్రకాశించుచున్నవి!" అని తుది మాటాడుచుండి, "అమ్మా! వచ్చితివా!..." అనుచు, (1861-వ సం॥ ఫెబ్రువరి 19-వ తేదిని) భౌతిక దేహము వీడి దేవీసాయుజ్యము గాంచెను.

రాసమణిరాణి యనంతరము మథురుఁడు జమీందారి కంతటను వ్యవహారనిర్వాహకర్త యయ్యె, సర్వవిధములను శ్రీరామకృష్ణునకు దాసవర్తియై నడచుకొనఁ బ్రయత్నించుచుండెను. శ్రీరామకృష్ణుఁడు ఏ యాత్రకైనను, పర్యటనమునైనను చేయఁగోరినపుడు మథురుఁడు వలయు నేర్పాటులన్నియుఁ జేయుటయేకాక, పాణిహాటియందలి దేవతోత్సవమువంటి మహోత్సవములకు వెడలు సందర్భమున జనసమ్మర్దమువలన నాతని కెట్టి యిబ్బందియుఁ గలుగనీయకుండుటకై తఱచు కొంతమంది పరిచారకులతో స్వయముగా మాఱువేసమున వెంబడించును.

సాధనసమయమున ఆయా సాధనలకు వలయుసామగ్రి తనకుఁ జేకూర్పఁగల యొకవ్యక్తి ప్రాపు తన కొసఁగుమని శ్రీరామకృష్ణుఁడు దేవిని ప్రార్థించియుండెను. తనకై దేవిచే నియమితులైన నైదుగురు 'రసద్దారు' (సరఫరాదారు)లలో మథురుఁడు మొదటివాఁడని యాతఁడు తెలుపును. ఐనను మథురునకు విధ్యుక్తధర్మమును దెలుపుట కాతఁ డెన్నఁడును వెనుదీయువాఁడు కాఁడు. బంగారమును మట్టిపెళ్లను సమదృష్టితోఁ జూడఁగల్గిన ధీరుఁడు ధనికుని కేల లోఁబడును? తన

స్వాతంత్ర్యప్రవృత్తినిగూర్చి యాతఁడే యొకప్పు డిట్లు చెప్పెను : "మథురబాబుతో నొకప్పు డిట్లంటిని : 'నీ వంటి ధనిక గొప్పవాఁడు నన్ను గౌరవించుచున్నందువలన నేను కృతార్థుఁడనైతి ననుకొనఁబోకుము. నీవు నాకు విధేయుఁడవై యున్నను, కాకున్నను నా కొక్కటియే.'" మథురుని యెడ నాతఁడు విశేషదాక్షిణ్యవంతుఁడై యుండియు, నిష్కర్షగా నాతనికి ధర్మమును దెలిపి, ఆవశ్యకమగుచో, కఠినముగా మందలించువాఁడనుట కొక నిదర్శనము నాతనివాక్కులలోనే తెలిపెదము : "రాధాకాంతాలయమున నొకప్పుడు విగ్రహాభరణములను దొంగ లెత్తుకొనిపోవుట తటస్థింప, సంగతిసందర్భములను గనుఁగొనుటకై మథురుఁడును నేనును ఆలయమునకు వెళ్లితిమి. ప్రతిమను సంబోధించుచు మథురుఁ డిట్లు ఆక్రోశించెను : 'సిగ్గుచేటు! ఓ దేవుఁడా! నీవు అసమర్థుఁడవు! నీ యాభరణముల నన్నిఁటిని దొంగ లెత్తుకొనిపోవ నీవేమియుఁ జేయఁజాలవైతివి.' అపుడు మథురునితో నిట్లంటిని : 'ఛీ ఛీ! ఏమి అసంబద్ధప్రలాపము! నీ వేదో మహార్ఘ్యానిగాఁ జెప్పుచున్న నగలు జగదీశ్వరునకు మట్టిపెళ్లలపాటి చేయవుసుమీ! సాక్షాద్భాగ్యదేవతయగు శ్రీమహాలక్ష్మి వాని సతి, వాని దాసి. దొంగ లెత్తుకొనిపోయిన నీ యీరూకల కోసము—ఈ మట్టి పెళ్లలకోసము—భగవంతుఁడు కలవరించు ననుకొనుచుంటివా? నీ విట్లు ఎన్నఁడును అనరాదు!'"

సిరిసంపదలయెడ శ్రీరామకృష్ణుని అనాసక్తి యెట్టిదో గమనించియున్నాము. ఇందులకు మఱియొక ప్రబలనిదర్శనము ఈ సమయముననే సంఘటిల్లెను. దీనినిగూర్చి యనంతర

మాతఁడు భక్తులతో ప్రసంగవశమున నిట్లు తెలిపెను: "ఒకప్పుడు మథురుఁడు నాకు (పెద్ద)భూవసతి నీయఁగోరి— నాపేర వ్రాయఁదలఁచి — హృదయునితో సంప్రశించుచుండెను. కాళికాలయమునుండి యీ విషయమంతయు విని వెళ్లి మథురునితో నిట్లంటిని: 'ఇదిగో, చూడు. అట్టిభావము నెన్నఁడును తలపోయకు. అది నాకు మహాహానిసుమీ!'"

"నరులను నారాయణునియెడ విముఖులను జేసి సంసారమున—పాపపంకిలమున—ముంచివేయునవి కామినీ కాంచనములే (కామకాంచనమోహామే)"యని శ్రీరామకృష్ణుఁడు లోకమునకు ఉపదేశించును. "నిధిచాల సుఖమా, రాముని సన్నిధిసేవ సుఖమా..."అనియు, "ఎంత నేర్చినా, ఎంత చూచినా, ఎంతవారలైనా కాంతాదాసులే..."అనియు సార్థకనామధేయుఁడగు శ్రీ త్యాగరాజు దివ్యగాన మొనరించి యున్నాఁడుగదా?

జాన్ బజారునందలి తననివాసమునకుఁ దఱచు శ్రీరామకృష్ణుని ఆహ్వానించుచు, మథురుఁ డాతనితో మహానందమున అనేకదినములు గడపువాఁడు. సాయంకాలము విహారార్థము తన గుఱ్ఱపుసారటులోఁ దోడ్కొని వెడలును. అతని యుపయోగమునకై వెండిబంగారుపాత్రలను జేయించును: విలువైన వలువలను గొనివచ్చును. కాని జ్ఞానభక్తివైరాగ్యాది మహైశ్వర్యవంతుఁడగు శ్రీరామకృష్ణుఁడు ఈ వైహికసంపదలన్నిఁటియెడలను అత్యంతము అనాకృష్టుఁడై, అనాసక్తుఁడై మెలఁగుచుండెను.

అగుచో, లోకులను ముప్పతిప్పలఁ బెట్టి మూఁడు

చెఱువుల కెల్ల ప్రాఁకించు భోగ్యవస్తువాంఛ లెన్నఁడును శ్రీరామకృష్ణునకుఁ గలుగనే లేదా యనినచో, కలిగినవి; కాని నిగ్రహించి వానిని దీర్చుకొని యాతఁడు సమస్తభోగ వాంఛారహితుఁ డయ్యెను. స్వానుభవమును దెల్పుచు నిర్విషయుఁడై కాలక్రమమున నాతఁడే భక్తులతో నిట్లు వచించును: “త్యాగసాధనకై రాజసికభావము పూను వాఁడను. అచ్చపు జరీబుటావలువను, ఉంగరమును ధరింప వలయుననియు, పొడవైన గొట్టము గల హుక్కా పీల్చవలె ననియు నాకొకప్పుడు వాంఛ కలిగెను. మథురాబాబు వీని నన్నిటిని గొని పంపెను. శాలువ ధరించితిని. హుక్కా కూడ అనేకరీతులను పీల్చితిని. ఒకప్పుడీ వైపునకు, మఱి యొకప్పు డావైపునకును ఒఱగియు, ఒకప్పుడు తలయెత్తియు ఇంకొకప్పుడు వాల్చియు హుక్కా పట్టితిని. అంతట నాలో నే నిట్లు అనుకొంటిని: ‘ఓ మనసా! దీనినే వెండిహుక్కా పీల్చుటందురు.’ వెంటనే దానిని త్యజించితిని. మఱికొన్ని నిమిషములు శాలువను శరీరమున నుంచుకొని పిమ్మటఁ దీసివేసితిని. ‘ఇదేకదా విలువైన వలువ! కాని యిది మానవుని రజోగుణము వృద్ధిచేయును’ అనుచు, దానిని కాలిక్రింద వేసి త్రొక్కివేయుచు, దానిపై ఉమ్మివేయ నారంభించినాను![1]

[1] ఇంతటితో తృప్తినొందక దాని నాతఁడు తగులఁబెట్టఁబోవ, దాని కా గతి పట్టకుండ నెవ్వరో కాపాడిరనియు, మథురుఁడీ సంఘటన మంతయు విని, “బాబా మంచిపని చేసినారు!” అని సంతసించెననియు ‘శ్రీశ్రీరామకృష్ణలీలాప్రసంగము’ తెలుపుచున్నది. (Sri Ramakrishna The Great Master, P. 441.)

నా చిన్నతనమున ఒకనాఁడు గంగాస్నానము చేయుచుండఁగా, బంగారు మొలత్రాటితోఁ గూడిన యొక బాలుని జూచియుంటిని. దక్షిణేశ్వరకాళికాలయములో నుండఁగా నాకు స్వయముగా అట్టి యాభరణము దాల్చవలెనని మనసయ్యెను. దానిని నాకుఁ జేయించియిచ్చిరి; కాని దాని నెంతోసేపు ఉంచుకోఁజాలకపోతిని. దానిని ధరించినపుడు శరీరమున ఒకానొక వాయుప్రవాహము క్రిందినుండి మీఁదికెగయుచు బాధ కలిగింపసాగెను. సువర్ణస్పర్శచే ఆ బాధ కలిగినది. కొద్ది క్షణములపాటు ఆ నగ దాల్చి యావలఁ బెట్టవలసి వచ్చెను. లేనియెడల దానిని త్రెంచివేసికోవలసివచ్చెడిది.

"భోగలాలస మంచిది కాదు. అందుచే నాకు ఏ కోర్కెలు కలిగినను నెఱవేర్చుకొనువాఁడను. ఒకప్పుడు పెద్ద బజారులో రంగురంగుల 'సందేశ్' (ఒకవిధమైన పాల మిఠాయి) చూచి తినఁగోరఁగాఁ దెచ్చిపెట్టిరి. ఎంతో తింటిని. తత్ఫలితముగా జబ్బుచేసినది.

"ఒకప్పుడు వివిధనగరములలోని పేరు పొందిన మిఠాయిలను తినవలయునని నాకు వాంఛ కలిగినది.[1]

[1] ఒకానొక మధురభక్ష్యము తినవలయునని నీ మనస్సు ఉబలాట పడుచున్నచో దానిని సంపాదించి నోటఁబెట్టుకొని నములుచు, "ఓ మనసా! దీని మాధుర్యానుభవము ఇది గొంతుక్రిందికి దిగునంతవఱకే. అనంతరమిదియు ఇతరపదార్థముల వలెనే రక్త మాంస మల మూత్రాదులుగా మాఱిపోవును. అధికముగాఁ దిన్నచో వ్యాధి సంభవించును. ఇట్టి క్షుద్రవస్తువుపై నీకింత మోహమేల?" యని మనస్సునకు ఉద్బోధించుకొనుచు, ఈ విధమైన వివేచనతో నొకటిరెండుసార్లు దాని ననుభవించిన యెడల తత్కాంక్ష తీఱిపోవునని శ్రీరామకృష్ణుఁడు శిష్యులకు బోధించుచున్నాడు.

"ఒక యేకాదశినాఁడు కృష్ణకిశోర్[1] లూచీ (ఒక విధమైన పూరీ)లను కూరను దినుచుండఁగాఁ జూచితిని. హృదయునితో నిట్లంటిని: 'హృదు, కృష్ణకిశోరుని ఏకాదశి నవలంబింపవలయు నని నాకు కోరిక గలుగుచున్నది.' ఒకనాఁడు అట్లే చేసితిని. బాగుగా కడుపునిండఁ దింటిని. ఆమఱునాఁడు ఉపవాసముచేయవలసివచ్చెను!

"వాంఛ లున్నంతవఱకు—భోగలాలస యున్నంత వఱకు—ముక్తియనున దెవ్వరికైనను అసంభవము.

(సన్న్యసింపఁబోవు శిష్యులను అవలోకించుచు) "చిల్లరకోర్కెలనే యిట్లు వివేకముతో నెఱవేర్చుకొనుటచే వానిని బరిత్యజించుట—వానియందలి రాగమును నివర్తించు కొనుట—సాధ్యమగును, కాని పెద్దవాని విషయమున నిది యసాధ్యము. అట్టి కామోపభోగములకు దిగినంతనే వానిలోఁ జిక్కుకొనిపోవుచుందురు. అట్టివానిని వివేకముచేతను, వాని యందలి దోషములనుగూర్చి చింతించుటచేతను మనసునుండి తఱిమివేయవలయును."

తాను భక్తరాజై యుండవలయు ననియు, శుష్కసన్న్యాసియైయుండక భక్తజనసాంగత్యమున ఆనందించుచుండ వలయుననియుఁ దనకు రెండుకోర్కె లుండెడివని శ్రీరామకృష్ణుఁడు కాలక్రమమునఁ దెలుపును. "అమ్మా! నన్ను బ్రహ్మానంద)రసమునందుంచు, మఱి వసమునం దుంచు"మని యాతఁడు దేవినిఁ బ్రార్థించును.

---

[illegible] [1] ఈమహనీయునితో శ్రీరామకృష్ణుని సంసర్గమునుగూర్చి 'సాధు పండితసంసర్గము' అను ప్రకరణమునఁ జెప్పఁబడును.

ఒకనాఁడు సమాధిస్థితుఁడై మథురనియింట శ్రీరామకృష్ణుఁడు పరుండి మెల్ల మెల్లఁగా బాహ్యప్రజ్ఞ నందుచుండఁగా, ఆతని యద్భుత సహనశీలమును జాటునొక సంఘటనము జరిగెను. దానినిగూర్చి యాతఁడు కాలక్రమమున ప్రసంగవశమున నొకరి కిట్లు చెప్పెను: "అతఁడు కాళీఘట్టపు చంద్రహాల్దార్. తఱచు మథురునింటికి వచ్చుచుండువాఁడు. ఒకనాఁడు భగవదావేశస్థితిలో (మథురునింట వెలుపలిగదిలో) క్రిందఁ బరుండియుంటిని. అచట చీఁకటిగా నుండెను. మథురాబాబునకు ప్రీతిపాత్రుఁడనగుటకై నేను ఆ తన్మయస్థితి నటించుచుంటి నని చంద్రహాల్దార్ తలఁచెను. గదిలో ప్రవేశించి తన కాలిజోళ్లతో నన్ను తన్న నారంభించెను. శరీరమున నల్లని జాడలు పడినవి. ప్రతివారును ఈ సంగతి మథురాబాబునకుఁ జెప్పఁబూనిరి; కాని నేను వల దంటిని."

కాళీఘట్టపు కాళికాలయమున మథురుని కుటుంబ పురోహితుఁడై యుండిన యీ చంద్రహాల్దార్ మథురునివశ పఱచుకొనఁబూనుటలో శ్రీరామకృష్ణుఁడు తనకు పోటీదారుఁ డని యెంచి, "మథురాబాబు నే మంత్రముచే వశపఱచుకొంటివో చెప్పు" మని శ్రీరామకృష్ణుని గుంజి గుంజి యడిగి తన్నెనఁట! సహనమూర్తియగు శ్రీరామకృష్ణుఁడు ఈ సంఘటనమును వెల్లడింపకుండెనను, అచిరకాలముననే ఏదియో మఱియొక దుష్కార్యమూలమున మథురునిచే చంద్రహాల్దార్ పదభ్రష్టుఁడు చేయఁబడెను. మహాభాగవతాపచార ఫలమనుభవింపక తప్పునా?

# భైరవీ బ్రాహ్మణి

శ్రీరామకృష్ణుఁడు ఒకనాఁడు ఉదయము ఆలయో ద్యానమున పూలు కోయుచున్న సమయమున, నావనుండి యొక స్త్రీ—చేత నొక చిన్న మూటతో— అచటి చిన్న స్నానఘట్టమున దిగుట గాంచెను. నడిమి వయస్సు. సుందరరూపము. విరియఁబోసికొనిన దీర్ఘశిరోజములు. సన్న్యాసిని యని సూచించుచున్న కాషాయవస్త్రములు. ఆమెకు నలుబదియేండ్లుండునుగాని యంత వయస్సు గలదిగాఁ గనఁబడదు. ఏదియో అలౌకికాకర్షణ కలుగ, శ్రీరామకృష్ణుఁడు తన గదికి వెడలి హృదయునిచే నామెకుఁ గబురంప, వెంటనే యామె వచ్చెను. శ్రీరామకృష్ణునిఁ గాంచినంతనే ఆనందబాష్పములను విడుచుచు, ఆశ్చర్యానురాగములతో నామె, "నాయనా! నీ విచట నుంటివా! గంగాతీరమున నీ వున్నట్లు గ్రహించి యింతకాలముగా నీకోసము వెదకుచుంటిని; ఇపుడు నిన్నుఁ గనుఁగొంటిని!" అని పలికెను. "అమ్మా! నన్ను గుఱించి నీ వెట్లు తెలిసికోఁగలిగితివి?" అని శ్రీరామకృష్ణుఁ డడుగ నామె యిట్లు తెలిపెను: "మీలో ముగ్గురను గలసికోవలసియుండు నని జగదంబ కృపచే పూర్వమే తెలిసికొంటిని. తూర్పు వంగదేశమున ఇద్దఱను గలసికొనియున్నాను, నేఁ డిచట నిన్నుఁ గనుఁగొన్నాను." త న్నెడఁబాసియున్న తల్లిని గలసికొనిన బిడ్డ వలె శ్రీరామకృష్ణుఁడును ఆనందపరవశుఁ డయ్యెను.

కొంతసేపటి కామె స్వవిషయము తెలిపెను. ఆమె పేరు యోగేశ్వరి.[1] వంగదేశమందలి యశోహర్ [Jessore] జిల్లాలో నొక బ్రాహ్మణవంశమున నామె జన్మించెను. ఆ దేశమందలి ముగ్గురు మహనీయులకు సాధనయందుఁ దాను సాయమొనర్పవలసియున్నట్లు యోగదృష్టివలన నామె గ్రహించెను. వారిలో నిదివఱకే యామె కలసికొనిన వ్యక్తులు 'చంద్ర', 'గిరిజ' యనువారు. శ్రీరామకృష్ణుఁ డామెదగ్గఱఁ గూర్చుండి, తల్లికిఁ దన హృదయరహస్యములను దెలుపు బాలునివలెఁ దన సాధనానుభవవిశేషములను, జనులు తన్ను పిచ్చివాఁడనుచుండుటయు సర్వము తెలిపి, "అమ్మా! ఈ లక్షణములకు అర్థ మేమి? నిజముగా నేను పిచ్చివాఁడనైతినా? అహర్నిశము జగన్మాతను ప్రార్థించుచున్నందుల కిది యేనా ఫలితము?" అని పదేపదే ప్రశ్నింపసాగెను. పరమాశ్చర్యానందములతో ఈ కథ యంతయువిని, పరిపూర్ణమాతృవాత్సల్యముతో ఆ యోగిని యిట్లు సమాధానించెను: "నాయనా! నిన్ను పిచ్చివాఁ డనువారెవరు? ఇది పిచ్చి కాదు. శాస్త్రములలో 'మహాభావము'[2] అని చెప్పఁబడి

[1] తాంత్రికసంప్రదాయమునకుఁ జెందినదై సాధారణముగా శివు నుపాసించు సన్న్యాసినియే 'భైరవి.' శ్రీరామకృష్ణునిచే 'బ్రాహ్మణి' యని చెప్పఁబడుచుండిన యీ యామె నిందుచే 'భైరవీబ్రాహ్మణి' యని పేర్కొని యున్నాము.

[2] 'వాత్సల్యమధురభావ దివ్యానుభవములు' అను ప్రకరణమున దీనినిగూర్చి వివరింపఁబడును.

యున్న దివ్యస్థితియే నీ స్థితి. తన్మూలముననే నీ కివన్నియుఁ గలుగుచున్నవి. ఈ నీ దివ్యస్థితిని గ్రహింపఁజాలనిలోకులు—అజ్ఞానులు—నిన్ను పిచ్చివాఁడనుచున్నారు. శ్రీరాధకును శ్రీచైతన్యమహాప్రభువునకును ఈ స్థితి లభించినది. ఇవన్నియు భక్తిశాస్త్రములలోఁ దెలుపఁబడియున్నవి. ఆ గ్రంథములు నాయొద్ద నున్నవి. ఆత్మసమర్పణ మొనర్చుకొని భగవత్ప్రాప్తికై పరితపించువారెవ్వరైనను, పూర్వము కానీ, వర్తమానమునఁగానీ, ఈ స్థితి పొంది దీని నధిగమింపవలసినవారే యని నిరూపింపఁగలను.'' ఈ వాక్కులు విని శ్రీరామకృష్ణుఁడు అపూర్వధైర్యోత్సాహవంతుఁ డయ్యెను.

అనంతరము ఆ యోగిని భిక్షాటన మొనర్చి తెచ్చిన యాహారపదార్థములను వండి, నివేదనార్థము తన యిష్టదేవ ప్రతీకముమ్రోల నిడి ధ్యానస్థితురాలయ్యెను. ఆమె చెక్కిళ్లపై ఆనందాశ్రుధారలు ప్రవహించుచుండెను. ఇంతలో శ్రీరామకృష్ణుఁడు అర్ధబాహ్యప్రజ్ఞావస్థలో అచటికి వచ్చి యా నైవేద్యమును భుజింపసాగెను. కొంతసేపటి కామె కన్నులు తెఱచి, ధ్యానావస్థలోఁ దనకుఁ గలిగిన దివ్యానుభవమును, శ్రీరామకృష్ణుని చర్యయు ఏకరీతి నుండుట చూడఁగా నామె మేను పులకరించెను. దేహస్మృతి నొందినపిమ్మట శ్రీరామకృష్ణుఁడు తన కార్యమునకు లజ్జించి యామెను క్షమాపణ వేఁడుకొన, నామె యాతని నూఱడించి, ''నేఁటికి నాపూజ సఫలమైనది'' అని వచించుచు, ఆ భుక్తశేషమును మహాప్రసాదముగా భుజించి, తన సాలగ్రామమును గంగార్పిత మొనర్చెను.

ప్రథమసమావేశముననే ఉభయులకును ఏర్పడిన మాతాపుత్త్రసంబంధము నానాఁటికి ప్రబలమయ్యెను. ఇరువురును పగటిపూట పంచవటియందు చాలసేపు పారమార్థిక ప్రసంగములుచేయువారు. తంత్రశాస్త్రవైష్ణవభక్తిశాస్త్రములలో విజ్ఞాననిధియగు బ్రాహ్మణి—శ్రీరామకృష్ణునిచే ఎక్కువ వాడుక చేయఁబడిన యీనామముననే యామె నిఁకఁ బేర్కొందము—ఆతఁడు తన వివిధదివ్యానుభవములనుగూర్చి వేయు ప్రశ్నలకు శాస్త్రప్రమాణముల నుదాహరించుచు సదుత్తరము లొసఁగును.

వచ్చిననాఁటినుండి కొలఁదిదినములుగా ఆలయావరణముననే బ్రాహ్మణి నివసించుచుండెను. ఆమెతోడి తన సన్నిహితత్వము లోకుల యపోహలకు కారణము కావచ్చు నని శ్రీరామకృష్ణునకుఁ దోఁప, ఆతని సూచన ననుసరించి యామె దక్షిణేశ్వరమునకు రెండుమైళ్లదూరముననుండిన అరియాదహ యను గ్రామమున దేవమండలఘట్టముకడ నివాస మేర్పఱుచుకొని యటనుండి ప్రతిదినము నాతనిఁ జూడవచ్చుచుండెను. వాత్సల్యభక్తిభావప్రపూరితహృదయయై యామె శ్రీరామకృష్ణుని గోపాలునిగా భావించును. దివ్యప్రేమానురాగములతో నాతనికి వెన్నను, మధురాహారములను బెట్టును. ఒక్కొక్కప్పు డెటనుండియో పట్టుచీరను నగలను దెచ్చికొని తాల్చి, యిరుగుపొరుగిల్లాండ్రను వెంట నిడుకొని తన్మయురాలై వాత్సల్యభక్తికీర్తనలను బాడుచు, మహోత్సవమున శ్రీరామకృష్ణునికడకు వచ్చి, తాను దెచ్చిన భక్ష్యములను దినిపించును. ఇట్టి దృశ్యములచే, పవిత్రసన్నివేశములచే,

చూపఱ కామె యశోదను తలఁపునకుఁ దెచ్చుచుండెడిది.

ఈ సమయమున శ్రీరామకృష్ణునకు శరీరమున మరల దుర్భరమైన మంట కలుగసాగెను. ఉదయమున ప్రారంభమై మధ్యాహ్నమునకు బాధ దుస్సహమగుచుండెను. నిపుణులగు వైద్యులుసైతము తమ ప్రయత్నములచే నేమియుఁ జేయఁ జాలరైరి. ఆ తాపము భరింపఁజాలక మూఁడు నాలుగు గంటలసే పాతఁడు గంగానదిలోఁ గూర్చుండును. ఇంకను నీళ్లలో నానినచో, ఉన్న బాధకుఁ దోడు మఱే బాధలు కలుగునో యని, బైటికి వచ్చి, తడిగుడ్డతో అలుకఁబడి మఱింతచల్లఁబఱుపఁబడిన చలువఱాతి నేలపైఁ బొరలాడును. బ్రాహ్మణి యీతాప మఖండ భగవత్పరితాపసంజనితమనియు పూర్వము శ్రీ రాధాదేవికిని శ్రీ చైతన్యదేవునకును నిట్టి దుస్సహశరీరతాపము కలిగినట్లు గ్రంథములు తెలుపుచున్న వనియుఁ జెప్పి, శరీరమున గంధము పూసికొని సుగంధకుసుమ మాలలను దాల్చుటే శాస్త్రోక్తనివారణోపాయమని తెలిపెను. అపురూపమైన యీ చికిత్సచే బాధ మూఁడునాళ్లలోనే పూర్తిగా నివారణమయ్యెను. ఇది యిట్లుండ, శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు సిహొర్ గ్రామమునకు వెడలుచుండ, ఆతని శరీరమునుండి యిరువురు బాలురు వెలువడియుండి రను వృత్తాంతము ఆతనివలననే బ్రాహ్మణి విని, యీ సంఘటనము లన్నియు శ్రీ చైతన్య శ్రీ రామకృష్ణుల యేకత్వమునకు నిదర్శనము లని నిశ్చయించుకొని, "శ్రీ చైతన్యుఁ డీసారి (తన నిత్యసహవాసి యగు) నిత్యానందుని 'ఒఱ' యందు

ఆవిర్భవించియున్నాఁడు" అని శ్రీరామకృష్ణునకుఁ జెప్పెను.[1]

కొన్ని దినములైనపిమ్మట శ్రీరామకృష్ణునకు తీవ్రమైన మఱియొకబాధ కలుగసాగెను. దానినిగూర్చి యాతఁడే యిట్లు పలుకును: "ఎంత తినినను తనివి తీఱని దారుణమైన ఆఁకలి! తినిన ఉత్తరక్షణముననే తిరిగి ఆఁకలి! ఏమి తిందునా యను తలంపు తప్ప అహర్నిశము మఱియొక తలంపే లేదయ్యె! 'ఈ క్రొత్త వ్యాధి యేమైయుండునా?' యని కలవరపడి బ్రాహ్మణికిఁ దెలుపఁగా, ఆమె యిట్లు సమాధానించెను: 'నాయనా! భయము లేదు. భగవదనుభవ మార్గమున పురోగమించువారి కిట్టి స్థితులు గలుగుచుండునని శాస్త్రములు చెప్పుచున్నవి. నేను దీనిని గుదుర్పఁగలను.' ఇట్లని యామె అటుకులు మొదలుకొని 'సందేశ్', 'రసగుల్లా' వంటి మధురభక్ష్యముల పర్యంతముగల నానావిధ రుచ్యాహారములను సమృద్ధిగ నొక గదిలో మథురునిచే అమర్పఁ జేయించి, 'అహర్నిశము ఈగదిలో ఉండి, యిచ్చ వచ్చినప్పుడు ఇచ్చవచ్చినదానిని దినుచుండు'మని నాకుఁ జెప్పెను. నేనందుండి పచారుచేయుచు, వానిని అవలోకించుచు, చేతఁ బట్టుకొనుచు, ఇపు డొక దినుసు, మఱియొకప్పుడు మఱియొక దినుసు—ఈ విధముగా యథేష్టముగాఁ దినుచుంటిని. ఇట్లు

1 "చైతన్యదేవుఁడు భగవదవతారము" అని శ్రీరామకృష్ణుఁడు కాలక్రమమున వక్కాణించియుండ, నరేంద్రుఁడు—శ్రీరామకృష్ణుని ప్రియతమశిష్యుఁడు—"అద్వైత-చైతన్య-నిత్యానందు లను నీ మువ్వురును తానేయని ఠాకుర్ (శ్రీరామకృష్ణుఁడు) నాతో ఎన్నియో సార్లు చెప్పియుండిరి" అని వచించును. (Refer The Gospel of Sri Ramakrishna, pp. 235, 393, 615, 913.)

మూఁడునాళ్లు గడచునప్పటికి ఆ విపరీత క్షుద్బాధ నివారణ మైనది."

ఇంతటి ఉద్ధృతముగాఁ గాకున్నను, విపరీతమైన యీ యాఁకలి శ్రీరామకృష్ణునకు జీవితమునఁ బెక్కుసార్లు కలిగెను.

శ్రీరామకృష్ణుని వాస్తవవ్యక్తిత్వమునుగూర్చి తాను జేసిన ప్రతిపాదనమును శంకింపఁబనిలేదని బ్రాహ్మణి యిపుడు నిశ్చయించుకొనెను. ఆతఁడు కేవల సాధారణభక్తుఁడు కాఁడనియు, ఉన్నతాధ్యాత్మికానుభవములను బడసిన మానవాతీతుఁడుకూడఁ గాఁడనియు, ఏదియో మహాకార్యము నిమిత్తము ఆవిర్భవించిన సాక్షాద్భగవదవతారమూర్తి యనియు నామె యాతనితోడనేకాక, హృదయుఁడు మున్నగువారితోడను ధారాళముగాఁ బ్రకటింపసాగెను. ఈ సందర్భమున వెలువడిన యొక ప్రసంగమున నామె, వైష్ణవపండితుల యెదుటఁ దన వాదమును రుజువుచేయ సంసిద్ధురాల నని శ్రీరామకృష్ణునకును మథురునకును దెలిపెను.

బ్రాహ్మణి యొనర్చిన ప్రకటనము కాళికాలయమున విశేషసంచలనము గలిగించెను. సరళ బాలహృదయుఁడగు శ్రీ రామకృష్ణుఁడు పండితసమావేశము జరుపఁబడుటకై ఆత్రము చూపసాగెను. బ్రాహ్మణి యభిప్రాయమునుగూర్చి సంశయాందోళితమానసుఁడై యుండిన మథురుఁడు సమావేశము నొనఁగూర్ప నిశ్చయించెను.

సుప్రసిద్ధపండితులగు వైష్ణవచరణుని, గౌరీకాంత తర్కభూషణుని ఆహ్వానింప నిశ్చయించిరి. వైష్ణవచరణుఁడు మహాభక్తుఁడని ప్రసిద్ధిగాంచి, తత్ప్రాంతమున వైష్ణవసమాజ

నాయకుఁడ యుండెను. గౌరీకాంతుఁడును సాధనసంపన్నుఁ డగు మహావిద్వాంసుఁడు. ఇరువురును మహాపరీక్షాదక్షులు. కొలఁది దినములలో వైష్ణవచరణుఁడు దక్షిణేశ్వరమునకు వచ్చెను. సభ సమావేశ మయ్యెను. పండితులతోడను, మధురనితోడను, స్వయముగా శ్రీరామకృష్ణునితోడను గూడి యుండిన యా సభలో బ్రాహ్మణి శ్రీరామకృష్ణుని వివిధ దివ్యానుభూతులను—తాను విన్నవియు స్వయముగాఁ గన్న వియునగువాని నన్నిఁటిని—ఉగ్గడించి, శాస్త్రప్రమాణము లను క్రోడీకరించుచు, ఆతఁడు సాక్షాద్భగవదవతారమని మహాధైర్యస్థైర్యములతో, అప్రతిహతయుక్తులతోఁ బ్రకటించెను. ఈ చర్చ కంతకును మూలపురుషుఁ డగు నాతఁడు ఆతరుణమున నెట్లుండెను ? ఆ చర్చయు, తత్పరిష్కారమును దన కెంతమాత్రమును సంబంధింపనివో యనునట్లు కేవలము ఉదాసీనుఁడై, అచ్చట జరుగు వినోదమునకు ఆనందించు బాలునివలె నొకప్పుడు నవ్వుచు, మఱియొకప్పుడు చెంతనున్న సంచినుండి సుగంధద్రవ్యములను చిటికెఁడు నోటవైచుకొనుచు, వేఱొక సమయమున, "ఇటు చూడుఁడు, ఒకప్పుడు నా కిట్లుండును, మఱియొకప్పు డట్లుండును" అని వైష్ణవచరణు నకుఁ జెప్పుచు, స్వీయదివ్యభావనిమగ్నుఁడై హాయిగాఁ గూర్చుండియుండెను. బ్రాహ్మణి యొనర్చిన సిద్ధాంతముల నన్నిఁటిని వైష్ణవచరణుఁడు మనఃపూర్వకముగా ఆమోదించి, లోకాతీతవ్యక్తులగు నే కొందఱియందో మహాభావమునందలి కొన్ని దివ్యలక్షణములుమాత్రమే గోచరించియుండ, శ్రీ రామ కృష్ణునియం దవన్నియు పూర్తిగా వ్యక్తమైయుండుట

అత్యాశ్చర్యకరమైన విషయమని వక్కాణించెను. మథురుఁడు మున్నగువారు ఈ పరిష్కారమును విని నిశ్చేష్టులైరి. శ్రీరామకృష్ణుఁడు—బాలునివలె—మథురునితో నిట్లు పలికెను: "ఏమనుచున్నాఁడో అతఁడు! ఏమైనను ఇది రోగము కాదని గ్రహించి సంతోషించుచున్నాను."

శ్రీ రామకృష్ణునియెడ మహాగౌరవమున వైష్ణవ చరణుఁ డింతటినుండి తఱచు దక్షిణేశ్వరము వచ్చి యాతనిని సందర్శించి తన గుప్తసాధనల నాతనికిఁ దెల్పుచు, హితోపదేశములను గైకొనసాగెను. వైష్ణవచరణుఁడు వంగీయ వైష్ణవమతమందలి 'కర్తాభజా' సంప్రదాయమునకుఁ జెందినవాఁడు.[1] కలకత్తాప్రాంతమున నున్న యొకగ్రామమున నీతని శిక్షణమున సాధనల నభ్యసించుచుండిన స్త్రీపురుషశిష్యు లనేకు లుండిరి. వైష్ణవచరణుఁడు శ్రీరామకృష్ణునిఁ బెక్కుమాఱు లచటికిఁ దోడ్కొని వెడలెను. ఈ సంప్రదాయములోని స్త్రీపురుషులలో ఒండొరులకుఁ గల యసాధారణమైన చనవు శ్రీరామకృష్ణునకు దుస్సహమై యుండెడిది. కాని యందును గొందఱు నిజమైన భక్తు లుండుటచే అనంతర మాతఁడు తన యభిప్రాయమును మార్చుకొనెను. వామాచారపరులయెడ రోఁతను దొలఁగించుటకై కాలాంతరమున శిష్యుల కాతఁ డిట్లు ఉపదేశించును: "ఆహా! మీ రేల ద్వేషింపవలయును? వామాచారపరులదిసైతము భగవత్ప్రాప్తిమార్గములలో ఒక మార్గమే యని, కాని యది అశుద్ధమార్గ మని, గ్రహింతురుగాక. ఇంటికి సింహద్వార

[1] ఈ సంప్రదాయస్థులు గురువునే భగవంతునిగా ఆరాధింతురు.

మనియు, దొడ్డిగుమ్మమనియు, పాకివాండ్రు ప్రవేశించు గంత గుమ్మమనియు అనేకద్వారము లుండవచ్చునుగదా! ఎందుండియైనను సరియే, ఇంటిలోఁ బ్రవేశింపవచ్చును—గమ్యమును జేరవచ్చును. కాని మీరు వామాచారపరుల ననుకరింపవలెననియు, వారితోఁ గలసిమెలసి తిరుగవలెననియునా, నాయభిప్రాయము? కాదు, కాదు. ఐనను వారియెడ మీరిసుమంతైనను ద్వేషభావము నొందరాదు.''

స్మరణీయమైన యీ సమావేశము జరిగిన కొన్నాళ్లకు బాంకురాజిల్లాయందలి ఇందేశగ్రామమునుండి గౌరీకాంత తర్కభూషణుఁడు దక్షిణేశ్వరమునకు వచ్చెను. గొప్ప తాంత్రికసాధకుఁడగు నీతఁడు ప్రతిసంవత్సరము దుర్గాపూజా దినములలో తన భార్యనే దేవీప్రతీకముగా ఆరాధించువాఁడు. ఈతఁడు హోమముచేయు విధానము అత్యాశ్చర్యకరము. లోకసామాన్యరీతిని నేలపై సమిధలు పేర్చి హోమముచేయుటకుబదులు తన యెడమఱచేయి వాతావరణమునఁ జాఁపి, దానిపై నించుమించు మూఁడున్నర మణుఁగుల బరువుగల సమిధలను బేర్చి, కుడిచేతితో వానికి నిప్పంటించి, హోమక్రియ పూర్తియగువఱకు చేతి నట్లే యుంచి హోమమాచరించువాఁడఁట! ఆతని యీ యద్భుతప్రక్రియను స్వయముగాఁ దాను జూచితిననియు, అది యాతని అలౌకికశక్తులలో నొకటనియు శ్రీరామకృష్ణుఁడు వచించును.

గౌరీకాంత పండితుఁడు దక్షిణేశ్వరమునకు వచ్చిన సందర్భమున జరిగిన యొక విచిత్రసంఘటనమునుగూర్చి శ్రీరామకృష్ణుఁడు తఱచు భక్తులతో ముచ్చటించువాఁడు.

వాదమున ఈ పండితప్రకాండునిముం దెవ్వరును నిలువఁజాల కుండెడివారనియు, అది యాతనికి దేవీప్రసాదలబ్ధమైన యొక అమానుషశక్తియనియు జనులు చెప్పుకొనువారు. వాదమునకై ఏ పండితసభకైనను ఆహ్వానింపఁబడినపు డీతఁడు శ్రీ శంకరాచార్యకృత మగు దేవీస్తవమందలి "నిరాలంబో లంబోదరజనని కం యామి శరణమ్" (ఓ లంబోదరజననీ! (లంబోదరుఁడగు గణేశుని తల్లీ!) నిరాలంబుఁడనగు నేను నిన్నుఁగాక మఱెవ్వరిని ఆశ్రయింతును?) అను పాదమునకు ముందు 'హా-రే-రే-రే'యను బీజాక్షరములను జేర్చి మేఘగర్జారావమునఁ బఠించుచు, ఉద్దీప్తశక్తిమంతుఁడై, సమస్త ప్రతివాదిభయంకరుఁడై సభలోఁ బ్రవేశించువాఁడఁట! అంత నాతఁడు మల్లుర వలె జబ్బకొట్టి సభలో వీరాసనమునఁ గూర్చుండి అజేయుఁడై భాసించును. దక్షిణేశ్వర కాళికాలయావరణములోనికి సైతమాతఁ డీ గర్జారావముచేయుచునే ప్రవేశించెను. ఆ సమయమునఁ దన గదిలోఁ గూర్చుండి యుండిన శ్రీరామకృష్ణునకు ఈ యుద్దండపండితుని శక్తులను గూర్చి యేమియుఁ దెలియకుండినను, ఏదియో అంతశ్శక్తి ప్రేరణమున, నాతఁడు పండితుఁడు ఉచ్చరించిన శబ్దములను మఱింత గంభీరధ్వనితో ఉచ్చరించెను. అది విని పండితుఁడు మఱింత బిగ్గఱగా అఱచెను. శ్రీరామకృష్ణుఁడు దానిని మించిన కంఠధ్వనితో అఱచి సమాధానించెను. ఇరువురకును ఈపోటీ జరుగుచుండ, తన్మూలమున వెలువడుచుండిన గావుకేకలు, బందిపోటుదొంగలు భయంకర ధ్వనులతో దోపిడిచేయు చున్నట్లు తోఁప, దేవాలయరక్షకభటులు నలువైపుల

నుండియు దుడ్డుకఱ్ఱలతో అచటికిఁ బరుగెత్తుకొనివచ్చిరి! ఎవ రిది పెద్దగొంతో పరీక్షించుకొనుచందమున ఆ పండితుఁడును తమ 'పిచ్చిపూజారి'యు అట్లు అఱచుచుండినట్లు కనుఁగొని యెల్లరును గడుపుబ్బ నవ్వుచు నిలుచుండిరి! శ్రీరామకృష్ణుని కంటె బిగ్గఱగా ఘోషింపఁజాలక పండితుఁడు మొగము చిన్నపుచ్చుకొని మెల్లఁగా కాళికాలయమునఁ బ్రవేశించెను. వాదమున 'గౌరి' అజేయుఁడగుటకు కారణభూతమయ్యు, భగవత్సాక్షాత్కారమునకు అవరోధకరమైన యా యసాధారణశక్తులను ఆతని మేలుకొఱకే జగజ్జనని తనలోనికి (శ్రీరామకృష్ణునిలోనికి) ఆకర్షించెనని యనంతరము శ్రీరామకృష్ణుఁడు తెలిపెను. దివ్యశక్తిసాగరముగదా తాను!

గౌరీకాంతపండితుఁడు వచ్చినపిమ్మటఁ గొలఁదిదినములలో మథురుఁడు మఱియొక పండితసభ సమావేశపఱిచెను. వైష్ణవచరణుఁడును విధిగా ఆహ్వానింపఁబడెను. ఆతఁడు వచ్చుట ఆలస్యముకాఁగా, శ్రీరామకృష్ణుఁడు గౌరీకాంతునితోఁ గూడి కాళికాలయముమ్రోల నాట్యమందిరమున నేర్పఱుపఁబడిన సభామంటపమునకు బయలుదేఱెను. అట నాసీనుఁడగుటకుముందుఁగా శ్రీరామకృష్ణుఁడు కాళికాలయమునఁ జొచ్చి, దేవికిఁ బ్రణమిల్లి, దివ్యభావపరవశుఁడై వెలువడుచుండ, నింతలో వైష్ణవచరణుఁడు వచ్చి యాతనికి సాష్టాంగవందన మొనరించెను. శ్రీరామకృష్ణుఁడు భావసమాధిస్థితుఁడై వైష్ణవచరణుని భుజములపైఁ గూర్చుండెను. వైష్ణవచరణుఁడు దివ్యానందపులకితాంగుఁడై సంస్కృతమున ఆశువుగా శ్లోకములను రచించి శ్రీరామకృష్ణుని స్తుతింప

సాగెను. పరమానందప్రపూరితహృదయుఁడై, సులలితరీతిని స్తవపఠనమొనర్చుచు, బద్ధాంజలియై యుండిన వైష్ణవచరణుని, సమాధిస్థితుఁడై ప్రకాశించుచుండిన శ్రీరామకృష్ణుని ప్రసన్నోజ్జ్వలమూర్తినిఁ గాంచి మధురుఁడు మున్నగువారెల్లరును నిశ్చేష్టులై నిలుచుండిరి. కొంతసేపటికి శ్రీరామకృష్ణుఁడు బాహ్యప్రజ్ఞ నొందఁ, ఎల్లరును ఆతనితో మెల్లగా సభలోఁ బ్రవేశించిరి.

సభాప్రారంభముననే గౌరీకాంతుఁడు శ్రీరామకృష్ణుని దివ్యత్వమునుగూర్చి తాను వైష్ణవచరణుని యభిప్రాయముతో ఏకీభవించుచున్నాననియు, అందుచే వాదము అనావశ్యకమనియుఁ బ్రకటించెను. అనంతరము గౌరీకాంతుని మనోభావమును బరీక్షింపఁబూని శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు (తన శరీరమును జూపుచు) ఆతనితో, "వైష్ణవచరణుఁడు దీనిని అవతార మనుచున్నాఁడు.[1] అ దెట్లు సంభవము!

[1] అవతారతత్త్వమునుగూర్చి శ్రీరామకృష్ణుని యీ క్రింది ప్రవచనములను బరికింపుఁడు: (ఇం దనేకము లాతనిచేఁ బదేపదే వక్కాణింపఁ బడియున్నవి.)

"ఇతరులను బంధవిముక్తులను జేయునదే భగవదవతారము."
(The Gospel of Sri Ramakrishna, page 779.)

"భగవంతుఁడు మానవుఁడుగా అవతరించునపుడు సరిగా మానవునివలెనే ప్రవర్తించును. అందుచేతనే భగవదవతారమును గుర్తించుట దుర్లభము. భగవంతుఁడు మానవుఁడైనపుడు సరిగా మానవునివలెనే ఉండును. అదే ఆఁకలి, దప్పిక, వ్యాధి, దుఃఖము, ఇఁక నొక్కొక్కప్పుడు భయము. రాముఁడు సీతనిమిత్తము మహాదుఃఖితుఁ డయ్యెను. కృష్ణుఁడు తన తండ్రి నందుని కాలిజోళ్లను, పీఁటను తలపైఁ బెట్టుకొని మోసెను."
(Gospel, p. 286.)

నీ కెట్లు తోఁచుచున్నదో చెప్పు'' మనెను. గౌరీకాంతుఁడు

---

"వేదాంతమును (అద్వైతవేదాంతమునని భావము) అనుసరించి చూచినచో, భగవదవతారమనునది లేదు." (Gospel, pp. 231, 233.)

"అవతారమునకును, సిద్ధపురుషునకును, జీవునకును గల భేదము శక్తిప్రకాశమునమాత్రమే." (Sri Ramakrishna The Great Master, pp. 101, 560.)

"భగవంతుని వెదకుచో, మానవునియందు వెదకుము. మఱి దేని యందుకంటెను మానవునియందు విశేషముగా భగవంతుఁడు వ్యక్తమగు చుండును. ఎవనియందు ఊర్జితభక్తి వ్యక్తమగుచుండునో, ప్రేమభక్తి పొంగి పొరలుచుండునో, భగవంతునినిమిత్త మెవ్వఁడు ఉన్మత్తుఁడై—భగవత్ప్రేమోన్మత్తుఁడై—యుండునో, వానియందు నిశ్చయముగా భగవంతుఁడు అవతరించియున్నాఁడని గ్రహింపుము." (Gospel, p. 653.)

"కొందఱు భగవదవతారములు పది యనియు, కొందఱు ఇరువది నాలుగనియు, మఱికొందఱు అసంఖ్యాకములనియుఁ జెప్పుచున్నారు. ఎచటనైనను వానిశక్తి విశేషముగా వ్యక్తమగుచున్నయెడల, భగవంతుఁ డచట అవతరించియున్నట్లు నీవు గ్రహింపవచ్చును. ఇదే నా మతము." (Gospel, p. 780.)

"నీవు ఘనుఁడవు—మహాఘనుఁడవు—కాఁగోరెదవా? ఎంతటి ఘనుఁడవు కాఁగోరెదవు? అవతారమా? చెప్పు. శ్రమపడి కృషి చేయుము, అవతారమవే అయ్యెదవు'' అని శ్రీరామకృష్ణుఁడు వచించువాఁడని యాతని ప్రియశిష్యులలో నొకఁ డగు శ్రీ అద్భుతానంద స్వామి పలుకును. (See Prabuddha Bharata, Jan. 1956, p. 2.)

'అంత్యదశ : నిర్యాణము' అను ప్రకరణమున తుదిభాగము చూ.

అద్వైతవేదాంతపరమానుభూతి నొంది చూచినచో, అవతార భావమే పొడకట్టదనియు, ఇఁక ద్వైత-విశిష్టాద్వైత-తత్త్వానుభవములచేఁ గాననగు భగవదవతారములు పురాణప్రసిద్ధమగు దశావతారములు మాత్రమేకాక, అసంఖ్యాకములుగా నున్నవనియు, ఊర్జితభక్తి మున్న గునవి భగవదవతారలక్షణములనియుఁ దెలుపు శ్రీరామకృష్ణుని సువిశాల భావమును, భక్తిజ్ఞానసిద్ధాంత సమన్వయమును పాఠకులు గుర్తింతురుగాక.

గంభీరముగా నిట్లు పలికెను: "వైష్ణవచరణుఁడు మిమ్ము అవతారమనియేనా చెప్పుచున్నాఁడు? అది అల్పభావము. ఎవ్వని అంశములై అవతారములు ప్రతియుగమునను లోక కల్యాణార్థము ఆవిర్భవించుచు, ఎవ్వని శక్తిమూలమున తత్కార్యమును సాధించుచుండునో, అట్టి సాక్షాత్ పరాత్పరుఁడే మీ రని నాయభిప్రాయము." శ్రీరామకృష్ణుఁడు చిఱునవ్వు నవ్వుచు, "ఓహో! నీ వాతనిని తలదన్నినట్లు కనఁబడుచున్నావు! నాలో నీ కేమి గోచరించుచున్నదో చెప్పు, చూతము" అనెను. గౌరీకాంతుఁ డిట్లు వక్కాణించెను: "శాస్త్రప్రమాణమునను, స్వానుభవమునను ఇట్లు చెప్పుచున్నాను. ఎవరైనను ఈ విషయమున వాదప్రవృత్తులైనయెడల, నా నిశ్చయమును నిరూపింప సంసిద్ధుఁడను." శ్రీరామకృష్ణుఁడు బాలునివలె నిట్లు సమాధానించెను: "మీరే (నీవును, వైష్ణవచరణుఁడును, బ్రాహ్మణియు నని భావము) ఈ మాటలన్నీ చెప్పుచున్నారు. కాని నమ్ము నామాట. నా కీ విషయమై ఏమీ తెలియదు!"

ఈ విధముగా శ్రీరామకృష్ణుని స్థితినిగూర్చి నిర్ణయింప వచ్చిన పండితప్రకాండు లిరువురును ఆతనికి పాదాక్రాంతులైరి. ఆతఁడో, తన్నుఁగూర్చి యెంతటి మహనీయులును, మహాపండితులును సాక్షాద్భగవదవతారమని ప్రకటించినను, ఎప్పటివలెనే వినమ్రుఁడు, దేవీపాదారవిందార్పితమానసుఁడునై యుండెను.

# తాంత్రిక సాధన

తాంత్రికోపాసన అత్యంతప్రాచీన మైనట్టిది. తంత్రము లందలి ధ్యానవిధానము వివిధయోగములందలి ప్రధాన తత్త్వములను సమీకరించుచున్నదని చెప్పనొప్పును. తంత్రములు భగవన్మాతృభావమును బోధించుటయేకాక, స్త్రీమహత్త్వమును వేనోళ్లఁ జాటుచున్నవి. వేదములలోఁ గాని, పురాణములలోఁగాని మన కీభావము చూచాయగాఁ గాని కానరాదు. స్త్రీశరీరము పరమపవిత్రమనియు, ఆమెను సాక్షాజ్జగన్మాతృస్వరూపముగా గ్రహింపవలయు ననియుఁ దెలుపుచు, ఎవ్వరును, ఎన్నఁడును, ఎంతమాత్రము స్త్రీలను హింసింపరాదని తంత్రములు ఆదేశించుచున్నవి.[1]

ఐనను తాంత్రికమార్గావలంబకులు కాలక్రమమున ఇంద్రియలోలురై, దేవీసాక్షాత్కారమునకై ప్రయత్నించుటకు బదులు దైహికము, ఐహికమును నగు అల్పసిద్ధులకై దేవులాడఁజొచ్చిరి. భూతపిశాచారాధనమునకును, క్షుద్ర దేవతారాధనమునకును ఇదియే మూలము. ఇఁక నివి తంత్ర

---

[1] ఈ క్రింది యుదాహరణములను గమనింపుఁడు:

"యస్యాః అంగే మహేశాని సర్వతీర్థాని సన్తివై."—పురశ్చరణోల్లాసతంత్రము. (ఓ మహేశ్వరీ! ఆమె (స్త్రీ) శరీరమున సర్వతీర్థములును నెలకొనియున్నవి.)

"స్త్రియో దేవాః స్త్రియః పుణ్యాః స్త్రియ ఏవ విభూషణమ్,
స్త్రీద్వేషో నైవ కర్తవ్య స్తాసు నిన్దాం ప్రహారకమ్."

—ముండమాలాతంత్రము, పంచమపటలము. (స్త్రీలు దేవతలు, పుణ్యాత్ములు, సమాజమునకు అలంకారములు. వారల నెవ్వరును ఎన్నఁడును ద్వేషింపరాదు, నిందింపరాదు, కొట్టరాదు.)

ములలో నేఁడు మనకుఁ గాన్పించు పరమదుర్మార్గములకును, ఘోరవామాచారములకును దారితీసినవి. ఈవిధముగా ప్రతి తంత్రమునను ఉన్నతోపాసనవిధానము, నీచోపాసనవిధానమునుగూడ గోచరించును. సంస్కారజనితమైన అభిరుచి ననుసరించి సాధకుఁడు వీనియందుండి తన మార్గము నెన్నుకొనుచుండును.

మానవుని సదా మోహితుని జేయుచు, జననమరణరూప సంసారబద్ధుని జేసి, భగవత్సాక్షాత్కారదూరుని గావించు నింద్రియవిషయములకు దివ్యత్వము నాపాదించి, వానియందు సాక్షాదీశ్వరస్వరూపభావమును సాధకునికి అలవఱిచి విషయరాగవిముక్తుని జేయుటయే తంత్రముల ముఖ్యోద్దేశము. సాధకుల అర్హత ననుసరించి, ఇంద్రియనిగ్రహదృష్టిని క్రమాధికమైన పశుభావము, వీరభావము, దివ్యభావము నను మూఁడు సాధనమార్గములను తంత్రములు బోధించుచున్నవి. వైష్ణవమతాచార్యులు తాంత్రికోపాసనయందలి పశుభావమును ప్రధానముగా గ్రహించి, ఆహారవిహారాదిసర్వవిషయములందును సాధకుఁడు శౌచము నవలంబింపవలయునని శాసించుచు, భగవత్సాక్షాత్కారమునకు భగవన్నామజపము ప్రధానసాధనగా నిర్ణయించియున్నారు.

కాలక్రమమున ఈసంప్రదాయమునను దోషములు బయలుదేఱినవి. ఆచార్యుల బోధనలందలి అంతరార్థమునకు స్వస్తిచెప్పి, అనుయాయులు తమ యభిరుచులకును మనఃప్రవృత్తులకును అనుగుణమగు పద్ధతులను అవలంబింపసాగిరి. భగవంతునిపై సాధకుని కెట్టి గాఢప్రేమానురాగములు

కుదురవలయునో తెల్పుచు, కామినీకాముకుల పరస్పర ప్రబలాకర్షణమును ఉదాహరణముగ ఆచార్యులు పేర్కొనిరి. అనుయాయులు ఈ సాదృశ్యమును మక్కికి మక్కిగా గ్రహించి, పూర్వపవిత్రారాధనవిధానమును స్వీయప్రవృత్తులచే భ్రష్టము చేసిరి. కామవ్యాపారసురాపానము లనునవి యెంతమాత్రము లేకుండ తాంత్రిక క్రియలను జయప్రదముగా సాధింపవచ్చుననుటకు శ్రీరామకృష్ణుని సాధనానుభవములే ప్రబలనిదర్శనము.

జగజ్జనని అభ్యనుజ్ఞ నర్థించి పొందియే తా నీనూతన తాంత్రికసాధనమార్గము నవలంబించితినని శ్రీరామకృష్ణుఁడు తెలుపును. తన నైసర్గికమహాదీక్షతో ఆతఁ డీసాధనలకు ఉపక్రమించెను. పంచవటిక్రింద నొకటియు, వనమునకు ఉత్తరపుఁగొన నున్న బిల్వవృక్షముక్రింద మఱొకటియు—రెండు 'కపాలాసనములు' ఏర్పఱుపఁబడెను. ఈ సాధనానుభవములనుగూర్చి శ్రీరామకృష్ణుఁడు అనంతర మిట్లు వచించును: "తంత్రోక్తము, దుష్ప్రాపమునైన వస్తువుల నన్నిఁటిని బ్రాహ్మణి పగటిపూట ఆలయవనమునుండి యెక్కడెక్కడికో వెళ్లి తెచ్చుచుండెడిది. రాత్రి వానిని పంచవటిక్రిందనో, మారేడుచెట్టుక్రిందనో ఉంచి నన్ను బిలిచి, యావస్తువినియోగము తెలిపెడిది......ఒక్కసారి జపమాల త్రిప్పితినో, లేదో, సమాధిలో మునిఁగిపోవ, ఉపాసనక్రియల నిర్దిష్టఫలము ప్రత్యక్షమగుచుండెడిది. ఈ విధముగా అతిశీఘ్రముగా, ఒకదాని వెంబడి నొకటిగా, ఎన్నెన్ని మహాద్భుతదర్శనములు! ఎన్నెన్ని దివ్యానుభూతులు!—వాని నన్నిఁటిని ఇపుడు వివరింపఁజాలను. ప్రధానమైన అఱువదినాలుగు

తంత్రములందును జెప్పఁబడిన సాధనల నన్నింటిని ఒకటొక టిగా బ్రాహ్మణి నాచేఁ జేయించెను. వానిలో అనేకములు అత్యంతకఠినసాధనలు, భ్రమప్రమాదకరములు; వాని నాచరింపఁబోయి సాధకులనేకులు మార్గభ్రష్టు లగుచుందురు. అవినీతిపంకిలమునఁ బడిపోవుచుందురు. అమ్మకృపవలన వానిలో అన్నింటియందును ఉత్తీర్ణుఁడనైతిని."

సాధకుఁడు అసహ్యతను అతిక్రమింపఁగలుగుటకై తంత్రశాస్త్రములు వేనిని నిర్దేశించుచున్నవో, వేని ప్రక్రియ లను, సన్నివేశములనుగూర్చి వినినచో, ఒడలు జలదరించునో, అట్టి యసాధారణసాధన లెన్నియో శ్రీరామకృష్ణుఁడు ఈసమయమున ఆచరించి యందు పరిపూర్ణవిజయోపేతుఁ డయ్యెను. ఇదే విధముగా సముచితమనోనిగ్రహసంపన్ను లగువారికిమాత్రమే తంత్రోద్దిష్టమైన వీరభావసాధనలను[1] —వేని నాచరింపఁబూని యనేకులు కామమోహితులై, మార్గ భ్రష్టులై, సమాజమునకు మహోపద్రవకరులై, యొక్కొక్క ప్పుడు ఉన్మత్తులైపోవుచుందురో, అట్టి కఠినాతికఠినమగు వీరభావసాధనలను — శ్రీ రామకృష్ణుఁడు అఖండజయప్రద ముగా ఆచరించి, ఆధ్యాత్మికవీరశిఖామణి యయ్యెను.

"తంత్రములు స్త్రీసాహచర్యమున సాధన విధించు చున్నవికదా? దానినిగూర్చి మీ యభిప్రాయ మేమి?" అని కాలక్రమమున నరేంద్రుఁడు—తన ప్రియతమశిష్యుఁడు —ప్రశ్నింప, శ్రీ రామకృష్ణుఁ డిట్లు సమాధానించును:

[1] యౌవనోద్దీపితసౌందర్యవతియు, నగ్నయు నగు స్త్రీయొడిలోఁ గూర్చుండి ధ్యానించుట మున్నగునవి.

"అది వాంఛనీయము కాదు, మహాకఠినమార్గము. దాని నవలంబించి సాధకులు తఱచు పతితులై పోవుచుందురు. అట్టివి మూఁడు విధములైన సాధనలు కలవు. స్త్రీయెడ (తాంత్రిక) సాధకుఁడు ప్రేయసీభావముకాని, సఖీభావము కాని, మాతృభావముకాని అవలంబింపవచ్చును. స్త్రీని నేను తల్లిగా భావింతును. ఆమెయెడ సఖీభావముకూడ మంచిదే. కాని స్త్రీని తనప్రేయసిగా భావించుచు, (తాంత్రికవీరభావ) సాధనచేయుట మహాభ్రమప్రమాదకరము. పుత్త్రిభావమే నిష్కళంకము." దుస్సాధమైన తంత్రోక్తయోగమునఁ దన దివ్యశిష్యుఁడు పరిపూర్ణుఁడయ్యెనని బ్రాహ్మణి ప్రకటించెను. "నా కేవనిత పాలిండ్లైనను నాతల్లి పాలిండ్లవలెనే తోఁచును" అని యాతఁడే యొకప్పుడు వచించిన చందమున, సమస్త స్త్రీలయందును మాతృభావ మనెడి తన దివ్యాదర్శము నాతఁడు అసిధారావ్రతముగాఁ బరిపాలించెను. తంత్రశాస్త్రమున మద్యమునకు సాంకేతికపద మగు 'కారణము'— తదుచ్చారణమాత్రమున–జగన్మూలకారణమగు జగజ్జననిని దన మనస్సున స్ఫురింపఁజేయు, ప్రాపంచికవిషయముల నన్నిఁటిని మఱచి యాతఁడు దివ్యానందప్రమత్తుఁ డగువాఁడు.

ఆతఁ డీ సమయమున, 'ఇది పవిత్రము, ఇది అపవిత్రము' ననెడి భేదభావమునకు పూర్తిగా అతీతుఁడయ్యెను. సర్వము ఆతని దృష్టిని పవిత్రమే. "తులసీపత్త్రము, మునగాకును ఒకే విధమున పవిత్రముగాఁ దోఁచుచుండెడివి" అని యాతఁడే తెల్పియున్నాఁడు. శాస్త్రములు ఉపదేశించురీతిని ప్రతి అక్షరము అక్షరతత్త్వప్రతీకమే, జగజ్జననీచిహ్నమే

యని విశ్వసించిన యాతనికి పచ్చిబూతుమాటలుసైతము కేవలము అక్షరసముదాయములుగఁ దోఁచుచుండెడివి; ఇంతేగాక, ఆనందమయియగు జగన్మాతనే యాతనికి అవి స్ఫురింపఁజేయ వానిని విన్నంతనే యాతఁ డొక్కొక్కప్పుడు సమాధినిమగ్నుఁ డగుచుండును. బాహ్యాంతరములందు జ్ఞానతేజము తన్నావరించియున్నటు లాతఁడు కనుఁగొనును.

ఈకాలమున శ్రీరామకృష్ణుని మహత్తరదివ్యానుభవము కుండలినీవిజృంభణమని చెప్పవచ్చును. మూలాధారమునుండి సహస్రారము వఱకును ఆయా కేంద్రములలో అధోముఖమై ముకుళితమైయున్న కమలములు కుండలినీ విజృంభణమున ఊర్ధ్వముఖమై పరిపూర్ణవికాసము నొందినటు లాతఁడు దివ్యదర్శనము నొందెను. ఒడలు జల్లుమన, కుండలినీ శక్తి విజృంభించి శిరస్సును జేరఁబోవునప్పు డయ్యది కంఠమును దాఁటకుండునంతవఱకే మాటాడఁగల్గుచుందు నని యాతఁడు తెల్పును. యోగశాస్త్రోక్తములైన పిపీలికా—మండూక-సర్ప-విహంగ-మర్కట గమనము లను నైదు విధములైన కుండలినీగమనమును తత్సంబంధమగు స్వానుభవ విశేషములతో వివరించును.

సాధారణముగా మానవమనఃప్రవృత్తి అధోముఖమై, అనఁగా, భోజనసంగమాదులందు చరించుచుండునని శ్రీరామకృష్ణుఁడు తెల్పును. కుండలినీ ప్రబోధము నొందనిదే బ్రహ్మజ్ఞానము నొందు టెవ్వనికైనను అసాధ్యమని యాతఁడు వక్కాణించును.

ఈ కాలముననే జగన్మూలకారణము నాతఁడు దర్శించెను. ప్రతిక్షణము అనేకలోకములను గనుచున్న అఖండ చైతన్యవంతము, దివ్యతేజోమయము నగు నొక బ్రహ్మాండమైన త్రికోణముగా అది సాక్షాత్కరించెను. మహాగంభీర ప్రణవనాదమువంటి అనాహతధ్వని తఱచుగా వినవచ్చెడిది. పశుపక్షుల భాషసైత మాతనికి ఈకాలమున అవగాహనమగుచుండెడిదఁట.

మానవుని సర్వశక్తిసంపన్నుని జేయు నణిమాదికమైన యోగసిద్ధు లన్నియు శ్రీరామకృష్ణునకు కరతలామలకమయ్యెను. కాని నిరంతర భగవచ్చింతామృతపాన పరితృప్తుఁడగు భక్తునిదృష్టి కివన్నియు తృణప్రాయము లనియు, వ్యభిచారిణీమలమువలె అతిహేయము లనియు జగజ్జనని తనకొక దృశ్యమూలమున విస్పష్టమొనర్చెనని శ్రీ రామకృష్ణుఁడు పలుకును. సిద్ధులు తఱచు వ్యామోహకరములై సాధకుని పురోభివృద్ధికి అవరోధము కల్పించుచుండును గావున వానిని వాంఛింపరాదని శిష్యుల నాతఁడు హెచ్చరించును.

అచింత్యరీతిని సృష్టిస్థితిలయముల నొనర్చుచు, జనన మరణాదిరూపమగు తన యనంతఖేలనమున లోకులను సదా సమ్మోహితమొనర్చు భగవన్మాయను—దేవీమహామాయాస్వరూపమును—ఆతఁడీసమయముననే దర్శించెను. లోకాతీత సౌందర్యవతి యగు నొక స్త్రీ గంగానదినుండి వెలువడి మెల్లఁగా పంచవటిని సమీపించెను. పూర్ణగర్భవతియగు నామె యంతలో నొక బిడ్డను గని యఖండవాత్సల్యముతోఁ బోషించుచుండెను. మఱుక్షణముననే యామె మహాభయం

కరస్వరూపముదాల్చిబిడ్డను నోటఁబెట్టుకొని తుత్తునియలుచేసి నమలి మ్రింగివేసి, మరల గంగానదిలో అంతర్ధానమయ్యెను!

తాంత్రికసాధనకాలమున శ్రీ రామకృష్ణునకు అసంఖ్యాకమైన దేవతలు ప్రత్యక్షమైరి. వారందఱును అసాధారణ సౌందర్యసందీపితులైనను (షోడశియనియు రాజరాజేశ్వరియనియు నామాంతరములు గల) త్రిపురసుందరి జగన్మోహనరూపవైభవమున నెల్లరను మించెనని యాతఁడు వచించును.

శ్రీరామకృష్ణుని శరీరచ్ఛాయ సర్వజనాకర్షకమై ప్రకాశింపసాగెను. బాహువుపై నాతఁడు ధరించెడి బంగారుతాయెతు రంగు మేని పసిడి కాంతులతో మిళితమైపోవ, ప్రత్యేకముగా దానిని గనుఁగొనుటకే సాధ్యము కాకుండెడిదఁట. శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించును: "జను లీ రూపలావణ్యమును తేఱిచూచువారు. ముఖమును వక్షమును సదా ఎఱ్ఱవాఱియుండ, శరీరము తేజస్సు విరజిమ్ముచున్నట్లుండెడిది. జనులు తేఱిచూచుటచే, ఎప్పుడును దళమైన ఉత్తరీయముతో శరీరము కప్పుకొనువాఁడను: మఱియు అమ్మ నిట్లు వేఁడుకొనువాఁడను: 'ఇదిగో, నీ బాహ్యసౌందర్యము; అమ్మా, దీనిని నీవే తీసికొని అంతస్సౌందర్యమును నాకిమ్ము.' శరీరము నిమిరి, మెల్లఁగాఁ దట్టుచు, 'లోనికిఁ బొమ్ము' అని పదేపదే చెప్పుచుండువాఁడను. చాల కాలమైనపిమ్మట బాహ్యరూపము ఇపు డున్నరీతిని చామనచాయగా మాఱిపోయినది."

కాలక్రమమున నెందఱెందఱో ఆధ్యాత్మికబోధలను, శిక్షణను బడయుటకై తనయొద్దకు వత్తురని శ్రీ రామకృష్ణునకు ఈకాలముననే ఎఱుకపడెను.

# సాధు పండిత సంసర్గము

నిండుకుండ తొణఁకదు. అల్పవిద్యావంతునకే, లేదా, అల్పప్రజ్ఞావంతునకే అహంభావము. తన్మూలమున నాతఁ డెగిరియెగిరిపడుచుండును. పడి తఱచు లేవలేకుండును. "జీవించియున్నన్నాళ్లు నేర్చుకొనుచునేయుందును" అని శ్రీరామకృష్ణుఁడు వచించెనన్నచో, ఆతని వినయసంపద యెట్టిదో విశదము కాఁగలదు. ఆతఁ డెంతటి ఆధ్యాత్మిక ప్రజ్ఞాధురీణుఁడో అంతటి సహజవినయసంశోభితుఁడు. తన్ను గూర్చి అత్యావశ్యకమైననేకాని యాతఁడు 'నేను' అని చెప్పుకొనఁడు; తానని సూచించుటకై యాతఁడు శరీరమును జూపుచు, 'ఇది', లేదా, 'ఇందున్నది' యనును. ఏ యాహ్వానమునిమిత్తము నిరీక్షింపకయే యాతఁడు ప్రసిద్ధులగు సత్యాన్వేషకులను, తత్త్వజ్ఞులను స్వయముగా వెడలి కలసికొనును. తన్నుగూర్చి వారేమనుకొందురో యనికాని, వారు తన్ను సమాదరింతురో, లేదో యనికాని యణుమాత్రము చింతింపఁడు. పారమార్థికులగు కొందఱను గలసికొనుటకై యాతఁడు పరితపించువాఁడు.

బ్రాహ్మణివలన నిదివఱకే సాధనపథమున సాహాయ్యము నొందియుండిన యిరువురిలో నొకఁడగు చంద్ర (చంద్రుఁడు) ఆమె తనకు లేఖ వ్రాయఁగా, ఆమె నివాసమునకు వచ్చెను. ఇంతలో శ్రీరామకృష్ణుఁడును అచటికి వచ్చి భావసమాధిస్థితుఁడై, అకస్మాత్తుగా, "ఆహా! ఇదుగో, చంద్రుఁడు! ఇతఁడు చంద్రుఁడు కాఁడా?" అని బిగ్గఱగాఁ

బలికి, శరీరస్మృతిరహితుఁ డయ్యెను. చంద్రుఁడు ఆతనిచేతు లను బట్టుకొని, మూఁడునాలుగుసార్లు 'రామకృష్ణా!' యని గట్టిగాఁ బిలిచినంతనే శ్రీరామకృష్ణుఁడు బాహ్యప్రజ్ఞ నొంద, నిరువురును ఎంతయో ఆప్యాయముతో సంభాషింపసాగిరి. ఆతఁడు ఇతరులకు అదృశ్యుఁడు కాఁగల్గునట్టి గుటికాసిద్ధి యను నొక సిద్ధిని బడసియుండెను. కాని క్రమముగా వ్యామోహితుఁడై యొక శ్రీమంతుని కుమార్తెను కామించి యామె యంతఃపురము తన గుటికాసిద్ధిప్రభావమున అదృశ్యుఁడై ప్రవేశించుచుండువాఁడఁట. క్రమముగా నాతఁడు తన సిద్ధిని గోల్పోయి యెన్నియో అవమానముల పాలయ్యె ననియు, తుదకు శ్రీరామకృష్ణసాంగత్యప్రభావమున తెలివి నొంది పురోగమనమార్గ మవలంబించెననియుఁ దెలియవచ్చు చున్నది. "సిద్ధులను అశుద్ధమువలె పరిత్యజింపవలయును. ఆధ్యాత్మికసాధనలవలనను, ఆత్మసంయమమువలనను సిద్ధులు వానియంతటనవియే కలుగుచుండును. కాని సిద్ధులపై మనసు నిలుపువారు వానియందుఁ దగుల్కొని యిఁక పురోవృద్ధి నొందఁజాలకుందురు" అను శ్రీరామకృష్ణుని మహోపదేశము నందలి పరమసత్యమున కిది ప్రబలనిదర్శనముకదా!

బ్రాహ్మణికి మఱియొక శిష్యుఁడగు గిరిజయు (గిరిజుఁడు) దక్షిణేశ్వరమునకు వచ్చెను. శ్రీరామకృష్ణుఁ డొక సాయం కాలము ఆతనితో సమీపమున నున్న శంభుచరణమల్లిక్ అనునాతని తోఁటకు వెడలెను. భక్తుఁడు, శ్రీమంతుఁడును నగు శంభుచరణుఁడు శ్రీరామకృష్ణున కేమైనను సేవచేయఁ గల్గుట తన మహాభాగ్యముగాఁ బరిగణించువాఁడు. ముప్పొ

రును ఆధ్యాత్మికగోష్ఠిలో నిమగ్నులైయుండ, చీఁకటిపడెను. గిరిజునితో శ్రీరామకృష్ణుఁడు తన నివాసమునకుఁ దిరిగి వచ్చుచుండ, గాఢాంధకారమున నాతని యడుగులు తడఁబడుచుండెను. ఈస్థితిలో గిరిజుఁడు అకస్మాత్తుగా ఆఁగి, "సోదరా! ఒక్క క్షణ ముండు, వెలుతురు చూపుదును" అని తన వీఁపు త్రిప్పఁగనే యందుండి అద్భుతమైన కాంతి కాళికాలయ ద్వారమువఱకుఁ బ్రసరించెను. ఈయుదంతమును వివరించుచు శ్రీరామకృష్ణుఁ డిట్లు పలుకును : "చంద్రుఁడుగాని, గిరిజుఁడు కాని యా స్థితులను నిలుపుకోలేదు. వా రిచట నివసించుచుండఁగా, వారి మేలుకోసము వానిని అమ్మ దీనిలోనికి (తనలోనికి) ఆకర్షించినది. అంతటినుండి యా నిస్సారవిషయముల నన్నిఁటిని విడిచిపెట్టి భగవంతునివైపు వారు తమ దృష్టి మఱలించిరి."[1]

వివిధసంప్రదాయములకుఁ జెందిన సాధువులును భక్తులును తండోపతండములుగా తమ యాత్రామార్గమధ్యమున దక్షిణేశ్వరము రాసాగిరి. వా రచటఁ గొన్ని దినము లుండి, గంగాసాగరమునకో, జగన్నాథమునకో పయనించువారు.

---

[1] శ్రీరామకృష్ణ నిర్యాణానంతరము అనేక సంవత్సరములకు 1899-వ సం॥న శ్రీ బ్రహ్మానందస్వామి శ్రీరామకృష్ణ మఠాధ్యక్షుఁడై యుండ, నొక మహనీయుఁడు బేలూర్ మఠమునకు వచ్చి తన పేరు చంద్ర యని తెలిపెననియు, శ్రీరామకృష్ణుని ఛాయాపటమునుజూచి 'సోదరా!' యని సంబోధించిన యాతఁడు అశ్రువులు ప్రవహింపఁ దఱచు ధ్యాన ప్రార్థనలందు నిమగ్నుఁడై యుండువాఁడనియు, స్వామి యాతని నటుపై బేలూర్మఠముననే నివసింపఁగోరినను, వ్యవహార పరిష్కారార్థ మాతఁ డింటికి వెళ్లి తిరిగి రాలేదనియుఁ దెలియవచ్చుచున్నది.

వారిలో రామాయతులనెడి వైష్ణవసాధువుల భక్తిప్రపత్తులు అత్యంతప్రశంసనీయములై యుండెడివని తెలుపుచు, అందొక సాధుపుంగవునిగూర్చి శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించును :

“ఒక పుస్తకము, కమండలువు—ఇవియే యాతని యాస్తి. ఆ పుస్తకము ఆతని పెన్నిధి. పూలతోఁ బూజించి యాతఁడు దానిని మహాదీక్షతో పారాయణచేయువాఁడు. ఆతని పరిచయమైనపిమ్మట దాని నొకసారి చూడనిమ్మని బతిమాలి, తెఱచి చూతునుగదా, ప్రతిపుటలోను ఎఱ్ఱసిరాతో పెద్ద పెద్ద అక్షరములతో వ్రాయఁబడిన ‘ఓమ్ రామ’ యను రెండే మాటలు! దానినిగూర్చి యాతఁడు నాకిట్లు విశదపఱిచెను: ‘పెట్టెలకొలఁది పుస్తకాలు చదువుటవలన ఏమి లాభము? సమస్త వేదశాస్త్రములకును భగవంతుఁడే మూలము. భగవంతునకును వాని నామమునకును అభేదము. చతుర్వేదములలోను, అష్టాదశపురాణములలోను, మఱి సకలశాస్త్రములలోను ఉన్నదంతయు భగవన్నామమునం దిమిడియున్నది. కాఁబట్టి వాని నామముతోనే సంతుష్టుఁడనై యున్నాను.’ భగవన్నామమున ఆతని కంతటి మహాభక్తి విశ్వాసములు!”

‘పొట్టకూటి బైరాగిబలఁగము’గాక నిజమైన సాధువులు—పరమహంసపరివ్రాజకులు—ఎందఱెందఱో తనయొద్దకు రా సాగిరనియు, తీవ్రచర్చలచే వారికిఁ దేలకుండిన తాత్త్విక సమస్యలు దేవీప్రేరితమైన తన సమాధానములచే పరిష్కృతమగుచుండెడివనియు శ్రీరామకృష్ణుఁడు తెలుపును. మఱియు నాతఁ డిట్లు వచించును :

“ఒకప్పు డిచటి కొక సాధువు వచ్చెను. ఆతని ముఖము దివ్యతేజస్సుతో ప్రకాశించుచుండెడిది. ఒకచోటఁ గూర్చుండి కేవలము చిఱునవ్వు నవ్వుచుండువాఁడు. ఉదయసాయంకాలములందుమాత్ర మాతఁడు తన గదినుండి వెలువడి, గంగ, ఆకాశము, చెట్లు మొదలైన ప్రకృతిదృశ్యముల నన్నిఁటిని తేఱిచూచి పరమానందమున చేతు లెత్తి నృత్యము చేయువాఁడు. ఒకొక్కప్పుడు క్రిందఁబడి దొరలిపోవ నవ్వుచు, ‘సెబాసు! ఏమి అద్భుతమైనమాయ! ఏమి సుందరమహేంద్రజాలము!’ అని

చిగఱగాఁ బలుకును. బ్రహ్మానందరసాస్వాదన మొనరించినపిమ్మట ఆతని కిదే ఉపాసన.

"మఱియొకప్పు డొకసాధువు వచ్చెను. జ్ఞానోన్మత్తుఁ డాతఁడు. పైకి పిశాచమువలె నుండెను. ఇంచుమించుగా దిగంబరుఁడు. కాళికాలయము నెదుట నిలిచి, ఆలయము కంపించునట్లు దేవీ స్తవము పఠించెను. అనంతరము ఎంగిలి ఆకులకడకుఁ బోయి, ఒక కుక్క మెడపై చేయివేసి, దానితోఁబాటు అందుండి తిననారంభించెను. అది జ్ఞానోన్మాదమని హృదయునకుఁ జెప్పినాను. హృదయుఁ డాతనిని వెంబడించి, తనకు ఉపదేశముచేయుఁడని పదేపదే వేఁడుకొనఁగా, ఆతఁడు బాటప్రక్క నున్న మురికినీటిని జూపుచు, 'ఈ మురికిగుంటలోని నీరును ఆ గంగా జలమును నీ కెపుడు సమమై తోఁచునో అపుడు బ్రహ్మజ్ఞానము నొందినవాఁడ వగుదువు' అని పలికి, యింకను దన్నాతఁడు వెంబడించుచుండ, నొక యిటికముక్కతో నాతనిని బెదరించి త్వరితముగాఁ దన దారిని బోయెను. లోకులకుఁ దెలియరాకుండ, వారివలన లేనిపోని బెడద లేకుండ, సాధుసత్తములు తఱచు ఆవిధముగా సంచరించుచుందురు. ఆతఁడు నిజమైన పరమహంస." (సంక్షిప్తము.)

సాధకులకు వలయు వివిధవస్తువుల నన్నిఁటిని సమకూర్చి ప్రశాంతముగా వారు తమతమ సాధనలను అవలంబించుచుండఁ జూచి యానందింపవలయునని శ్రీరామకృష్ణునకు అభిలాష కలిగెను. మథురుని తోడ్పాటున వారి కాతఁడు వానిని యథేచ్ఛముగాఁ బంచిపెట్టువాఁడు. తాంత్రికసాధకుల కాతఁడు మద్యమునైతే మిచ్చును. కాని వారిలో అనేకులు యోగముపేర తాగి తైతక్కలాడుచుండుట చూచి మద్యదానమును పూర్తిగా మానివేసెను.

"పువ్వు వికసించి దాని పరిమళము పిల్లగాడ్పులచే నల్దిక్కులను వ్యాపింపఁగనే తేనెటీఁగలు తమంతఁ దామే దానికడకు వచ్చును. మిఠాయుల నుంచిన తావునకు చీమలు

తమంతట దామే వచ్చి చేరును. ఇట్లే ముక్తుఁడగు మహనీయుని సుశీలసౌరభము ఎల్లెడలను వ్యాపింప, ముముక్షువు లెల్లరును వానిచే ఆకర్షింపఁబడుచుందురు" అని శ్రీరామకృష్ణుఁడు వచించును. ముక్తుల కెల్లరకును తలమానికమైన యాతఁడే యిందలి సత్యమునకు పరమనిదర్శనభూతుఁడై యొప్పెను. ఆతఁడు ఏసాధనను పరిసమాప్తిచేయునో, ఆసాధనను—ఆ సంప్రదాయమును—అవలంబించు సాధువు లెందఱెందఱో వచ్చి యాతని సాన్నిధ్య సదుపదేశ భాగ్యముల నందుచుండువారు. ఈవిధముగా శ్రీరామకృష్ణుని దివ్యాశయములును, పరమాదర్శమైన యాతని యనుష్ఠానవిధానములును ఈ సాధు బృందములమూలముగను, వారల శిష్యుల మూలముగను, అనుయాయులమూలముగను, నలుగడలను వ్యాపింపనారంభింప, దేశమున అపూర్వచైతన్యము రేకెత్తసాగెను. "ఇఁక నైదువందలసంవత్సరములలోపున రామకృష్ణపరమహంసవంటి మఱియొక లోకోత్తరపురుషుఁడు ఆవిర్భవించుచో, ఆ భారమును ఈలోకము భరింపఁజాలదు. మనకు ఆధారభూతమైయున్న శక్తికిని, భావిభాగ్యోదయమునకును ఆతఁడే (శ్రీరామకృష్ణుఁడే) దివ్యనిదర్శనభూతుఁడు. అంతటి మహనీయుని జననము మహాసంఘటనములకు నాంది" యని కాలక్రమమున శ్రీ అరవిందయోగివంటి మహనీయులు చాటిరన్నచో, శ్రీరామకృష్ణుని ఆధ్యాత్మికప్రతిభాతిశయము ఎట్టిదో ఊహింపనగును. గతశతాబ్దమధ్యమున భారతజాతీయతకును, భారతీయసంస్కృతికిని అపూర్వమైన మహోపద్రవము సంభవింపఁబోయెను. భారతజాతీయజీవనహృదయ

మగు మతధర్మములు ప్రాయికముగా విస్మృతమై, స్వధర్మాచరణము అడుగంట, పరమతావలంబనవ్యామోహము తల యెత్త, సాంఘిక రాజకీయాదిరంగములం దన్నిటను పతనము గోచరింపసాగెను. ఆత్మశ్రేయమునకే కాక జగత్కల్యాణమునకును భారతవర్షము పునఃప్రాణవంతమై నిల్చు టత్యావశ్యకమయ్యెను. ఈ మహాకార్యమునకు వలయు ధార్మికపునర్నిర్మాణము శ్రీరామకృష్ణునివంటి అఖండాధ్యాత్మికశక్తిసంపన్నునికే కదా సాధ్యము? బ్రాహ్మసమాజప్రచారకులలో పేరు పొందిన ప్రతాపచంద్రమజుందార్ మహాశయుని యీ క్రింది వాక్కులను బరికింపుఁడు: "ఈసాధుసత్తముఁడు హిందూమత మాధురీ గాంభీర్యములకు సజీవ నిదర్శనము. పరిపూర్ణ జితేంద్రియుఁ డీతఁడు. ఆపాదమస్తకము ఆత్మవైభవమే, పరమార్థయాథార్థ్యమే, ఆనందమే, దివ్యనైర్మల్యమే "

పండితశిరోమణియగు గౌరీకాంత తర్కభూషణుఁడు శ్రీరామకృష్ణుని ఆధ్యాత్మికమహత్త్వమున కెట్లు ముగ్ధుఁడయ్యెనో కనుఁగొంటిమి. తన తార్కికప్రతిభ యంతయు నిస్సారమనియు, ఈశ్వరసాక్షాత్కారము నొందని జీవితము నిరర్థకమనియు నిశ్చయించుకొని యాతఁడు (ప్రాయికముగా 1870-వ సం॥న) శ్రీరామకృష్ణుని సన్నిధికి వచ్చి శిక్షణనందసాగెను. ఇంతలో ఆతఁ డెక్కడ సన్న్యసించునోయని భయభ్రాంతులై, మఱలిరమ్మని ఆత్మీయు లాతనికిఁ బదేపదే లేఖలు వ్రాయసాగిరి. ఒకనాఁ డాతఁడు శ్రీరామకృష్ణుని సమక్షమున నిల్చి, కరములు మోడ్చి, కన్నుల నీరు గ్రమ్మ, "ప్రభూ! నా యభీష్టము సిద్ధించునట్లును, భగవత్సాక్షా

త్కారము నొందనిదే సంసారమునకు మఱలకుండునట్లును నన్ను ఆశీర్వదింపుఁడు” అని విన్నవించి సెలవు గైకొని వెడలెను. ఇఁక నాతని జాడ యెవ్వరికిని దెలియదు.

పిమ్మట నారాయణశాస్త్రి యను మఱియొక మహా పండితుఁడు శ్రీరామకృష్ణుని సన్నిధికి వచ్చెను. ఈతని నివాస స్థానము రాజపుత్రస్థానము. ముప్పదిరెండేండ్లు గురుకులవాస మొనర్చి, షట్ఛాస్త్రపారంగతుఁడై, యాలోపుననే జయ పురమహారాజు ఆస్థానపండితపదవి స్వీకరింపఁ దన్ను ఆహ్వా నించినను నిరాకరించిన వైరాగ్యసంపన్నుఁ డీతఁడు. కేవల శాస్త్రజ్ఞానముతో ఈ పండితోత్తముఁడు తృప్తినొందక, భగవద్దర్శనము నొంద నిశ్చయించుకొని, భాగ్యవశమున శ్రీరామకృష్ణుని సన్నిధికి వచ్చెను. ఈతనియందు సమృద్ధిగా రాణించుచుండిన సాధనసంపదకు అలరి, తత్త్వబోధన ప్రసంగ ములలో శ్రీరామకృష్ణుఁ డీతనితో గంటలు గడపువాఁడు.

ఇది యిట్లుండ, న్యాయవాదియు, వంగదేశీయ కవివరేణ్యుఁడును, క్రైస్తవమతావలంబియు నగు మైకేల్ మధుసూదనదత్తు కార్యవశమున దక్షిణేశ్వరము వచ్చి శ్రీరామకృష్ణుని సందర్శింప నభిలషించెను. శ్రీరామ కృష్ణుఁడు నారాయణశాస్త్రితో మధుసూదనునికడకు వెడల, శాస్త్రి యాతనితో సంస్కృతమున సంభాషించుచు, నాతని స్వధర్మపరిత్యాగమునకును పరమతావలంబనము నకును కారణ మేమని యడిగెను. మధుసూదనుఁడు తన కడుపు చూపి, దారిద్ర్యబాధచే క్రైస్తవమత మవలంబింప వలసివచ్చెనని సూచించెనఁట. అందులకు పరమజుగుప్సా

సూచక కంఠస్వరమున శాస్త్రి "ఏమి! ఈ మూన్నాళ్ల జీవితమున ఉదరపోషణకై స్వధర్మమును పరిత్యజించుటయా! ఎంత అవివేకము! ఎప్పుడో యొకప్పుడు ఎవ్వరైనను మరణింపక తప్పదు. అట్టిచో, ఇప్పుడే నీవు ప్రాణత్యాగము చేసిన బాగుండెడిది" అని పలికి యాతనితో నిఁక మాఱు మాటాడలేదు. పిమ్మట కవి తనకేమేని బోధింపుఁడని శ్రీరామకృష్ణు నెంతయో బతిమాలుకొనెను. "ఎవ్వరో నా నోరు మూయుచున్నారు, ఒక్కమాటయైనను బలుకఁ జాలకున్నాను" అని శ్రీరామకృష్ణుఁడు బదులుచెప్పెను; సహజముగా మధుసూదనుఁడు మొగము చిన్నపుచ్చుకొనెను; కాని శ్రీరామకృష్ణుఁడు కొన్ని భక్తికీర్తనలను బాడి యాతని నూఱటపఱిచెను.

నారాయణశాస్త్రి యొకనాఁడు శ్రీరామకృష్ణునిఁ బ్రార్థించి యాతనివలన సన్న్యాసమును బడసి దక్షిణేశ్వరము విడిచివెళ్లెను. ఈకాలమున శ్రీరామకృష్ణుఁడు స్వయముగా వెడలికలసికొనిన సుకృతాత్ములలో పద్మలోచనతర్కాలంకారుఁడు చిరస్మరణీయుఁడు. ఈతఁడు మహాపండితుఁడు, ఉదారహృదయుఁడు, భగవద్భక్తుఁడు, సనాతనధర్మనిష్ఠాగరిష్ఠుఁడు.

ఇష్టదేవతోపదేశము ననుసరించి పద్మలోచనుఁడు సదా తనయొద్ద నొక యంగవస్త్రమును జలపాత్రము నుంచుకొని, యేదైనను కఠినసమస్యను బరిష్కరింపవలసివచ్చునెడ, కొన్నియడుగులు నడచి, ముఖము కడుగుకొని తుడుచుకొని పిమ్మట సమాలోచించును. వాదమున నాతఁడిఁక అజేయుఁడు. ఇది యాతఁ డెన్నఁడును ఎవ్వరికిని దెలుపని రహస్యము.

కాని శ్రీరామకృష్ణుఁ డొకనాఁ డాపరికరములను దాఁచి వేయ, పద్మలోచనుఁడు నిశ్చేష్టుఁడై తన యిష్టదేవరూపాంతరమే శ్రీరామకృష్ణుఁడని విశ్వసించి, బాష్పపూరితలోచనుఁడై యాతనిని నుతించుచు, ఆత్మసమర్పణ మొనరించుకొనెను.

కాలక్రమమున ఆర్యసమాజమును స్థాపింపనుండిన శ్రీ దయానందసరస్వతి యా సమయమున కలకత్తా వచ్చియుండ, శ్రీరామకృష్ణుఁ డాతనిఁ గలసికొని కాలాంతరమున శిష్యులతో నిట్లు పలికెను: "సింతిగ్రామమున నాతఁ డొక తోఁటలో నివసించుచుండఁగా వెళ్లిచూచినాను. కొలఁదిగా దివ్యశక్తియున్నట్లు కనఁబడినది. వక్షఃస్థలము సదా ఎఱ్ఱగా నుండెడిది. అది 'వైఖరీ అవస్థ.' అహర్నిశము శాస్త్రచర్చ చేయుచు, వ్యాకరణసాహాయ్యమున అనేక శాస్త్రవాక్యముల కాతఁడు విపరీతార్థములు కల్పించువాఁడు. 'ఏదో యొక అపూర్వకార్యము చేయుదును—నూతనమతము స్థాపింతును' —అను నీయహంకారము ఆతనియం దుండెను."

అధ్యాత్మరామాయణ శ్రవణమునకై శ్రీరామకృష్ణుఁడు కృష్ణకిశోర్ అను మహాభక్తునికడకు వెడలుచుండువాఁడు. కృష్ణకిశోరుని భగవన్నామవిశ్వాసము నాతఁడు విశేషముగాఁ గొనియాడును. ఈకాలమునఁ దన్ను సందర్శించువారగు గోవిందపాల్, గోపాలసేన్ అనునిరువురు దొడ్డ బాలభక్తులనుగూర్చి శ్రీరామకృష్ణుఁడు తఱచు ముచ్చటించును.

# వాత్సల్య మధురభావ దివ్యానుభవములు

ఎవ్వని శాసనాధీనమై వాయువు వీచునో, మేఘుఁడు వర్షించునో, సూర్యుఁడు వెలుంగునో, మృత్యువు ప్రాణులను గ్రసించునో అట్టి సర్వేశ్వరుఁడు భక్తవత్సలుఁడే కాక, భక్త పరాధీనుఁడని మహాభక్తుల చరిత్రలు చాటుచున్నవి. అట్టి భగవానుని అవతారమూర్తులలో ఉత్తమగణ్యుఁ డగు శ్రీరామచంద్రునిఁ దన వత్సగా భావించి శ్రీరామకృష్ణుఁడు పడసిన నిరుపమాన దివ్యానుభవములు ప్రేమమహత్త్వమును బ్రకటించుచు, దివ్యావేశజనకమై యలరారుచున్నవి.

ఇంచుమించుగా 1864-వ సం॥ న దక్షిణేశ్వరమునకు వచ్చిన జటాధారి యను సాధుసత్తముఁడు రామభక్తాగ్రేస రుఁడు. ఆతని భగవద్భక్తిప్రపత్తులు నిరుపమానములని శ్రీరామకృష్ణుఁడు వచించును. "రామలాలా", లేక బాల రామచంద్రుఁడు ఆతని యిష్టదైవము. సదా తనయొద్ద నుంచుకొను 'రామలాలా' యను ముద్దులొలుకు నొక చిన్న లోహవిగ్రహమున నాతఁడు రాము నుపాసించును. రామలాలాసంసేవనమే యాతని యేకైకవృత్తి, అదియే యాతని చిత్తవృత్తి. రామలాలాను ఆతఁడు పాలించును, లాలించును, ఆతనితోఁ గ్రీడించును. ఈవిధముగా బాలరామ చంద్రుని నిరంతరసాక్షాత్కార మాతనికి సిద్ధించెను.

తమ కులదైవమగు రఘువీరుని యర్చనమున బాల్యము ననే తన్మయత నందసాగిన శ్రీరామకృష్ణుఁడు జటాధారి రామసేవాదివ్యానుభవములకు స్వాయముగా ముగ్ధుఁ డగు చుండెను. అచిరకాలముననే యిరువురకును పరమాప్త

సంబంధ మమరెను. జటాధారివలన శ్రీరామకృష్ణుఁడు రామ మంత్రోపదేశము నందెను. రామలాలా ప్రతిమారూపముననే కాక, అప్రతిమానమగు నిజస్వరూపమున శ్రీరామకృష్ణున కెట్లు పూర్తిగా వశుఁ డయ్యెనో, ఆమనోహరకథను అతని వాక్కులలోనే విందము :—

"ఆ బాబాజీ రామలాలాను చిరకాలము సేవించెను. ఎప్పుడును వెంటఁ గైకొనిపోవును. భిక్షాటనమున ప్రాప్తించినదానిని వండి నివేదించును. అంతేకాదు,—రామలాలా తినుటయు, తనకు ఫలానివస్తువు కావలయునని కోరుటయు, విహారమునకు వెళ్లెదననియో, మఱెందుల కనియో గారముగుడుచుటయు బాబాజీకి ప్రత్యక్షానుభవములు. రామ లాలాసాంగత్యమున సదా అతఁడు ఆనందోన్మత్తుఁడై యుండును. రామలాలా చేష్టలన్నియు నాకును గాన్పించెడివి. బాబాజీతో అహర్ని శము కూర్చుండి రామలాలాను అవలోకించువాఁడను."

"నానాఁటికి రామలాలాకు నాపై ప్రీతి వృద్ధిపొందుచుండెను. బాబాజీతో నేను ఉన్నంతసేపు రామలాలా తన క్రీడావినోదములతో హాయిగా నుండును. కాని (నేను నా) గదికి మఱలినంతనే అతఁడును నన్ను వెంబడించును. రావలదని యెంత చెప్పినను వినఁడు. మొట్ట మొదట నిది నా భ్రాంతియేమో యనుకొంటిని. అంత కాలముగా అపార ప్రేమానురాగములతో తన్ను సేవించుచుండిన యాతనిపైఁగంటె నాపై నెక్కువ ప్రీతి యుండునా? కాని ప్రతిదినము ఇదే దృశ్యము—ఇదే యనుభవము—ఐనప్పుడు భ్రాంతియగు టెట్లు? (శిష్యుల నుద్దేశించుచు) మిమ్మందఱను ఇప్పు డెట్లు చూచుచున్నానో, అట్లే రామలాలానుగూడ చూచువాఁడను. ఒకప్పు డాతఁడు నాయెదుట ముచ్చటగా నృత్యము చేయును. మఱియొకప్పుడు నాబుజములపై కుఱుకును. ఇంకొకప్పుడు ఎత్తుకొనుమని పట్టుపట్టును. ఒక్కొక సమయమున తొడపైఁ గూర్చుండఁ బెట్టుకొందును. కాని యతఁడు అక్కడ నుండునా? ఎండలో వనము లోనికిఁ బరుగెత్తును. ముండ్లపొదలలో పువ్వులు కోయును. గంగానదిలో ఉఱికి యథేచ్ఛముగా ఈఁదులాడును. 'వద్దురా, నాయనా! ఎండలో పరుగులెత్తకు, కాళ్లు బొబ్బలెక్కును; అంతగా నీళ్లలో నానకు, జలుబు

చేయును, జ్వరము వచ్చును' అని యెంత చెప్పినను వినఁడు. తామర రేకులను బోలు సుందర నేత్రములతోఁ గూడిన తన దృష్టి నాపై నిగిడ్చి పకపక నవ్వును. తన కొంటె చేష్టలను మఱింతగా సాగించును; వలయాకారముగా మూతి ముడుచును, మఱియొకప్పుడు వెక్కిరించును. అంతట నిజముగా కోపముచే, 'ఓరీ, ధూర్తుఁడా! ఉండు, ఒడలు చిట్లఁగొట్టుదును' అని కేకలువేయుదును. ఎండనుండియో, నీటినుండియో యీవలకు లాగి, గదిలో ఆడుకొమ్మని చేత పలువిధములైన ఆటబొమ్మలు పెట్టి బుజ్జగింతును. ఏమైనను అదుపునఁ బెట్టుట ఎంత మాత్రము సాధ్యపడకుండుటచే, ఒక్కొక్కప్పుడు ఒకటిరెండు లెంపకాయలు వేయుదును. అంత నతఁడు పెదవులు కంపింప, కన్నీరొలుక, వెక్కివెక్కి యేడ్చుచు, నాకేసి చూచును. ఆహా! అతని నట్లు శిక్షించినందులకై నేనెంత వేదనపడువాఁడనో కదా! అప్పుడాతనిని ఒడిలోఁగూర్చుండఁ బెట్టుకొని ఓదార్చు వాఁడను. ఇవన్నియు వాస్తవముగాజరిగినవి.

"ఒకనాఁడు రామలాలా పట్టుపట్టి నాతోఁగూడ స్నానమునకు వచ్చెను. కాని నీటిలోనుండి యీవలకు రాకుండెను. ఎంత చెప్పినను వినఁడయ్యె. తుదకు ప్రాణము విసుగ, నీళ్లలో గట్టిగా నదిమిపట్టి, 'ఏదీ, ఇపుడు నీళ్లలో నీయిచ్చవచ్చినంతసేపు ఉండు'మంటిని. పాపము, ఆ పిల్లవాఁడు నీళ్లలో ఊపిరి ఆడక గిజగిజ కొట్టుకొనసాగెను. పశ్చాత్తాపపడి యెత్తుకొని బుజ్జగించితిని. మఱియొక సందర్భమునఁగూడ ఎట్లు నొచ్చుకొని యెంతగా విలపించితినోకదా! నాయొద్ద లేని యేదో తినుబండారము పెట్టుమని రామలాలా నాఁడు పట్టుపట్టెను. ఊఱడించుటకై అటుకులను—చక్కఁగా దంపనివానిని—బెట్టితిని. వానిని నమలునపుడు అందలి ఊఁకచే—పాపము—కోమలమైన యతని నాలుక గీఱుకొనిపోయెను! ఆహా! అపుడు నేఁ బడిన పరితాపము ఇంతింత కాదు. అంతనాతని నాతొడపైఁ గూర్చుండఁబెట్టుకొని, 'కౌసల్యామాత వెన్నమీఁగడలను బెట్టి నిన్నెంతో గారాబముతోఁ బోషించెడిది; అట్టి పరమ సుకుమారుఁడవగు నీకు నేనెంత తెలివిమాలినవాఁడనై నికృష్టమైన యీ మోటుపదార్థము పెట్టితినోయి!' అనుచు విలపించితిని."

ఇట్లనుచు, శ్రీరామకృష్ణుఁడు మరల పూర్వభావావేశ పరవశుఁడై విలపించెను.

అపురూపమైన తన వాత్సల్యభక్తిసంజనిత దివ్యాను భవములనుగూర్చి శ్రీ రామకృష్ణుఁడు మఱియు నిట్లు ముచ్చ టించును :

"బాబాజీ వంటచేసి, రామలాలాను గానక, పరితప్తుఁడై, యిచటికి (అనఁగా శ్రీరామకృష్ణుని గదికి) వచ్చి, రామలాలా గదిలో ఆడుకొనుచుండుట చూచి, అభిమానగ్రస్తుఁడై బాలు నిట్లు మందలించును: 'ఎంతో శ్రమపడి వంటచేసి నీకోసము వెదకులాడుచుండ, నిశ్చింతగా నీ విక్కడ ఆటలాడుచున్నావు! ని న్ననవేల? ఇది నీ నైజము. చిత్తానుసారము సంచరింతువు. తల్లిదండ్రులను విడనాడి, అడవులకుఁ బోయిన నీకు దయాదాక్షిణ్యము లెక్కడివి? గుండె పగిలి తండ్రి మరణించుచుండ, కడసారి చూపునకైనా నీవు తిరిగి రాలేదు.' ఈ విధముగాఁ గూఁకలిడుచు, రామలాలాను తీసికొనిపోయి అన్నము తినిపించును. రామలాలాకు నన్నువిడిచి వెళ్లుట ఇష్టము లేనందున, బాబాజీ యిచట చాలకాలము ఉండెను.

"ఒకనాఁడు జటాధారి (బాబాజీ) వచ్చి కన్నీరు గార్చుచు, ఇట్లు చెప్పెను : 'రామలాలా తన కృపావిశేష మున నాకు అత్యంతప్రియమగు రూపమున దర్శన మిచ్చి నా జీవితపిపాసను దీర్చెను. మఱియు నిన్ను విడిచి రాఁజాల నని చెప్పెను. నీతోఁ గ్రీడించుచు, అతఁ డిచట హాయిగా నుండుటకంటె నాకుఁ గావలసిన దేమున్నది? అదియే నాకు పరమానందము. అతనిని నీకు అప్పగించి వెళ్లెదను.' ఇట్లనుచు నాతఁడు రామలాలాను నాయొద్ద దిగవిడిచి దక్షిణేశ్వరమువీడి వెళ్లెను. అప్పటినుండియు రామలాలా ఇక్కడ నున్నాఁడు."

ఆత్మార్పణపూర్వకమైన అఖండతపోధ్యానాదులవలన భగవంతుఁడు ప్రత్యక్షమై ప్రాయికముగా ఆముహూర్తము ననే అంతర్ధానమైనట్లు మహాభక్తుల చరిత్రలలో మనకుఁ

గాన్పించుచుండును. కాని శ్రీరామకృష్ణుఁడు అవిచ్ఛిన్న సాక్షాత్కారము నందఁగలుటయేగాక, ఉపాస్యదైవమును బిడ్డగాఁ జేసివేసికొని తనివితీర లాలనపాలనముల నొనరింపఁ గల్గెనన్నచో, అదెంతటి అనన్యసామాన్యదివ్యానుభవము! ఇందలి కీలక మేమి? "భగవానునియెడ 'ప్రేమ' యనఁబడు నిక్కమైన అనురాగమ్మును బడయఁగల్గినచో, వానిని గట్టి వేయు పాశము లభించినదన్నమాటయే"యని శ్రీరామ కృష్ణుఁడే తెలుపును. ప్రేమమూలముననే భగవంతుని—అనిర్వచనీయ ప్రేమస్వరూపుఁడగువానిని—వశమొనర్చుకోఁ గలమనుట ఎంతయు సహజముగదా? శ్రీరామకృష్ణుని చరిత్రమందలి దివ్యసుందరఘట్టములలో ఉత్తమోత్తమగణ్యమగు రామలాలావృత్తాంతము లౌకికులకు కేవల కావ్యకల్పనగనో, శ్రీరామకృష్ణుని చిత్తవిభ్రాంతిగనో తోఁచినఁ దోఁప వచ్చును. కాని త్రికరణశుద్ధిగాఁ దాను భగవత్ప్రాప్తికై, లేదా, భగవదనుభూతికై ప్రయత్నించినను, పరితపించినను, దనకెట్టి దివ్యానుభూతియుఁ గలుగలేదని గుండెపై చేయి వేసికొని చెప్పఁగలవాఁ డెవ్వఁడు?

కం. "ఇందుఁ గలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే"

అను భక్తాగ్రేసరుఁడగు ప్రహ్లాదుని మహోపదేశమునందలి "ఎందెందు వెదకి చూచిన, నందందే కలఁడు" అను

వాక్కులు మణివిరాజితసువర్ణాక్షరములతో లిఖించి గుర్తింపఁ దగిన దివ్యవాక్కులనుటకు సందియము లేదు.

సాధనకాలమున తొలి నాలుగేండ్లలో శ్రీ రామకృష్ణుఁడు భగవానునియెడ శాంత-దాస్య-అపత్య[1] భావముల నవలంబించి వాని యన్నిఁటియందును అఖండవిజయోపేతుఁ డయ్యెను. కొన్ని సమయములలో శ్రీదామ సుదామాది శ్రీకృష్ణమిత్రుల సఖ్యభావమునుగూడ ననుసరించెను. పిమ్మట వాత్సల్యమధురభావము లనెడి ప్రేమామృతసాగరోత్తుంగతరంగములలో నోలలాడ నభిలషించెను.

స్త్రీయే—తల్లియే—వాత్సల్యమునకు పట్టుకొమ్మ. వాత్సల్యభక్తి సాధింపఁబూనినంతనే శ్రీరామకృష్ణుని యంతరంగమున తదనుగుణమగు భావపరిణామము కలుగసాగెను. అట్టిచోఁ దన పురుషస్వభావమునే మఱచిపోవ, మాటలందును చేష్టలందును నాతఁడు అచ్చముగా స్త్రీవలెనే ప్రవర్తించుచుండెను. సఖీభావమున జగజ్జననికి సమస్తోపచారముల నొనర్చును. ఈ తరుణముననే జటాధారి సాంగత్యము లబ్ధమై శ్రీరామకృష్ణుని వాత్సల్యసాధనకు దివ్యమార్గదర్శక మైనది.

సాధనయందు నిర్విరామదీక్షాదక్షుఁడగు శ్రీ రామకృష్ణుఁడు అచిరకాలముననే మధురభావభక్తిసాధనపూనెను. జగదీశ్వరుఁడుగా, తన ప్రభువుగా, తల్లిగా, పుత్త్రుఁడుగా, మిత్రుఁడుగా, తుదకు ప్రాణప్రియుఁడుగా—భక్తిశాస్త్రోక్త

---

[1] అపత్యభావమనఁగా తల్లియనికాని, తండ్రియనికాని భగవంతుని గూర్చి భావించుట.

ములగు నానావిధములను—భగవంతునిఁ బ్రేమించి స్వవశ మొనర్చుకొనుటయే, సర్వవిధములను దివ్యానందానుభూతి నందుటయే, ఆతని పరమసంకల్పము. ప్రేయసి తన ప్రియునిఁ బ్రేమించునట్లు ఏమహోన్నతభక్తిభావమున భక్తుఁడు భగవానునిఁ బ్రేమించునో, ఏదివ్యభావము శాంతదాస్యాదికమైన యితర భావములకును ఆలవాలమో, అదియే మధుర భావమని గమనించియుంటిమి. ఈ భక్తిభావము లన్నియు మానవజీవిత మూలాధారమగు ప్రేమను ఆశ్రయించుకొని యున్నవి. ఈ భక్తిభావశ్రేణియందు ఒక్కొక్క మెట్టు ఎక్కుకొలఁదియు సాధకునకు భగవానునితో చనవు అతిశయించుచుండును; భగవద్వైభవముచేఁ నిఁక నాఁతఁడు అంతగా ఆకృష్టుఁడుగాక, ప్రియతమ సంబంధముననే రమించుచుండును. ఈ చనవును, ఈ యాప్తసంబంధమును భక్తుఁ డెందు జగదీశ్వరునిఁ దనహృదయేశ్వరునిగా—ప్రాణ ప్రియునిగా — ప్రేమించునో, అట్టి మధురభావమున సహజముగా మహోన్నతస్థాయినందుకొనును. బృందావనగోపికల శ్రీకృష్ణప్రణయ చరిత్రయే యిందులకు మహోజ్జ్వలమగు తార్కాణము. ప్రేమావతారమనఁదగు శ్రీచైతన్యుఁడును, ఆతని శిష్యులును మధురభక్తి సాధనను పరిపుష్టమొనర్చి వ్యాప్తి గావించిరి.

తాను ఏసాధనపూనునో, అందు అఖండదీక్ష వహించి నిమగ్నుఁడై, తద్విధానమున ప్రతిసూక్ష్మవివరమును పాటించుచు, అన్యవిషయవిముఖత నొందుట శ్రీరామకృష్ణుని స్వభావము. ఇదియేకదా విజయకీలకము? మధురభావ సాధనకై స్త్రీదుస్తుల నన్నిఁటిని ఆతఁడు మథురు నడిగి

పడసెను. సముచితసువర్ణాభరణములను, (స్త్రీపాత్రధారణమున) నటులు దాల్చు కేశకలాపమునుసైతము మథురుఁడు సమకూర్చెను. ఇఁక శ్రీరామకృష్ణుని శ్రీకృష్ణప్రేమోన్మత్త గోపికాజీవితము ప్రారంభమైనది. శ్రీకృష్ణునిఁ దమ భర్తగా నొనఁగూర్చుమని బృందావనగోపికలు కాత్యాయనీదేవినిఁ బ్రార్థించునట్లు శ్రీరామకృష్ణుఁడును జగజ్జనని నందులకై ప్రార్థించెను. ఈ సమయమున నాతఁడు తఱచు పరిచారికగా రాధాకృష్ణులను సేవించును.

తన దివ్యభావపరిణామము వేషభాషలలో ఈ విధముగాఁ బ్రతిబింబింప, శ్రీరామకృష్ణుఁడు అచ్చముగా స్త్రీవలెనే ప్రవర్తించుచుండ, మథురుని కుటుంబస్త్రీలు ఆతనిఁ దమలో నొకరుగాఁ జూచుకొనుచుండిరనుట అబ్బురము కానేరదు. మథురుని గృహమున, ఒకానొక దుర్గాపూజా మహోత్సవసందర్భమున, శ్రీరామకృష్ణుఁడు పట్టుచీర కట్టుకొని, దివ్యాభరణభూషితుఁడై, స్త్రీజనపరివేష్టితుఁడై, దేవీసఖీభావనిమగ్నుఁడై, దేవికి చామరముతో విసరుచుండ, ఆ దృశ్య మెంతయు దర్శనీయమై విరాజిల్లుచుండెను. చిరపరిచితుఁడై యుండిన మథురుఁడు, ఆ సమయమున, శ్రీరామకృష్ణుని యా స్త్రీరూపమును గాంచి, గుర్తింపఁజాలక, పూజానంతరము తన భార్య నడిగి తెలిసికొని, "ఆహా! స్వయముగా వ్యక్తపఱుచుకొనిననేకాని, అల్పవిషయములలోఁగూడ బాబాను మనము తెలిసికోఁజాలముకదా!" యని యాశ్చర్యపరవశుఁ డయ్యెను.

ప్రాణవల్లభుఁడగు శ్రీకృష్ణుని సమాగమమునకై

శ్రీరామకృష్ణుఁడు మహాపరితాపము నందసాగెను. బాల్యము ననే శ్రీకృష్ణసంసర్గము నాతఁ డెట్లు కాంక్షించెనో పాఠకులకు జ్ఞప్తి నుండవచ్చును. ఇపు డాకాంక్ష వేయింతలైనది. దినములు, నెలలును గడచుచుండెను. విరహావేదన దుర్భరమయ్యెను. అన్నపానములను మఱచి, అహర్నిశము ఆతఁడు విలపించును. శ్రీకృష్ణసందర్శనమహోత్కంఠ క్రమముగా ప్రేమోన్మాదముగాఁ బరిణమించెను. మనోవ్యథకుఁ దోడు శరీరమంతటను తీవ్రమైనమంట. అదెంతటి మహాపరితాపమో కాని, రోమకూపములనుండి సూక్ష్మమైన రక్తబిందువులు స్రవింపసాగెను! ఒక్కొక్కప్పుడు శరీరమందలి కీళ్లన్నియు పట్లు తప్పిపోయినట్లుండును. పరితాపతీవ్రతచే ఇంద్రియ వ్యాపారము లన్నియుఁ గట్టువడ, శరీరము శవప్రాయముగాఁ గాన్పించును.

తన వినిర్మలప్రేమచే శాశ్వతముగా శ్రీకృష్ణునిఁ దన వశవర్తి నొనరించుకొనిన శ్రీరాధాదేవి యనుగ్రహమునఁగాని శ్రీకృష్ణదర్శనభాగ్యము లభింపఁజాలదని శ్రీరామకృష్ణుఁడు తదేకభక్తితో నామెను ప్రార్థింపసాగెను. అచిరకాలముననే లభించిన శ్రీరాధాదర్శనమునుగూర్చి యాతఁడిట్లు వచించును: "శ్రీకృష్ణప్రేమచే తన సర్వస్వము త్యజించిన శ్రీరాధాదేవి మహనీయమూర్తిని—నిరుపమానము, పవిత్రము, ఉజ్జ్వలమును నగు నామె రూపమాధురిని—వర్ణించుట అసాధ్యము. నాగకేసరపుష్పముల పచ్చని పుప్పొడివలె ప్రకాశించుచుండిన దామె శరీరకాంతి."

పూర్వము సీతాదేవివలెనే యిపుడు రాధాదేవియు

సాక్షాత్కారానంతరము తన శరీరమునఁ జొచ్చి లీనమైనట్లు శ్రీరామకృష్ణునకు అనుభూత మయ్యెను. ఇఁక నాతనికిఁ దానే రాధగాఁ దోఁపసాగెను. నిరంతరరాధాధ్యానము ఆతని వ్యక్తిత్వమునే అదృశ్య మొనర్చి, శ్రీరామకృష్ణుని అపర రాధగాఁ బరిణమింపఁజేసెను. అపారము, అగాధము, మహోజ్జ్వలమునగు రా          ష్ణప్రేమానురాగములు శ్రీరామకృష్ణునియందు అభివ్యక్తమై, 'మహాభావము' ఆతనియందు రూపు దాల్చెను. తన మహాభావానుభవములనుగూర్చి యనంతర మాతఁ డిట్లు వచించును :

"ఆ యనుభూతికి ముం దెంతటి దుర్భర వేదనయో, అనంతర మంతటి పరమానందము! మహాభావ మనఁగా ఈశ్వరభావావేశపరవశత్వము. అది మనశ్శరీరములను ఉఱ్ఱూఁత లూఁగించివేయును. పెద్ద యేనుఁగు చిన్న గుడిసెలోఁ దూరినట్లే. గుడిసె అల్లల్లాడిపోవును. కూలి పోవునేమోకూడ. భగవద్విరహానలము, అబ్బా! చెప్పఁదరము గాదు. ఈసితిలో రూప సనాతనులు (శ్రీచైతన్యుని శిష్యవరేణ్యులు) ఒక చెట్టు క్రిందఁ గూర్చుండియుండ, ఆచెట్టు ఆకులు వాడిపోయెడివఁట! ఆసితిలో మూఁడుదినములు శరీరస్మృతి లేకుండ నుంటిని. కదలలేక ఒకచోటఁ బడియుంటిని. స్మృతి వచ్చినపిమ్మట బ్రాహ్మణి నన్ను స్నానమునకుఁ దీసికొనివెళ్లెను. కాని శరీరమును చేతితోఁ దాఁకఁజాలకపోయెను. శరీరముపై దళమైన గుడ్డ కప్పి, దానిపై చేయి వేసి పట్టుకోవలసివచ్చెను. నేలపైఁ బండుకొనియుండఁగా, శరీరమున కంటుకొనిన మట్టి అంతయు కాలిపోయెను. ఆసితిలో వీఁపుగుండా నాఁగటికఱ్ఱు గ్రుచ్చినట్లు తోఁచెడిది. ఆబాధకు తాళఁజాలక, 'చచ్చిపోవుచున్నాను!' అని బొబ్బలుపెట్టువాఁడను! కాని వెనువెంటనే అఖండానందము!"

"పందొమ్మిది భావములును ఒకే వ్యక్తియందు వ్యక్తమగుటయే 'మహాభావము' అని భక్తిశాస్త్రములలోఁ జెప్పబడుచున్నది. వీనిలో ఏఒక్కభావమునైనను బొందుటకు

లోకులకు యావజ్జీవితము పట్టును. కాని యీ శరీరమున (తనయందు) పందొమ్మిదియు పూర్తిగా వ్యక్తమైనవి."

తాను రాధ నను భావము నందుచు, మహాభావ ప్రపూర్ణ ప్రేమానురాగములతో శ్రీకృష్ణుని ధ్యానించుచు, శ్రీరామకృష్ణుఁడు అచిర కాలముననే తన మహాసాధనఫలము నందఁగలైను. శ్రీకృష్ణుఁడు తన జగన్మోహనరూపమున సాక్షాత్కరించి శ్రీరామకృష్ణుని మనోరథము నీడేర్చి యాతని యందు లీనమయ్యెను. అంతట చరాచరసకలప్రపంచమును శ్రీకృష్ణమయముగాఁ గాంచుచు, స్వీయవ్యక్తిత్వమునే మఱచి, తాను శ్రీకృష్ణుఁడనను భావము నందుచు, నాతఁడు అఖండానందసాగరమున నోలలాడసాగెను. రెండుమూఁడు నెల లిట్లు కడచెను. పెక్కేండ్లు పిమ్మట నొకనాఁడాతఁ డొకానొక గడ్డిపువ్వు పుడికి, శిష్యులకుఁ జూపుచు, నిట్లు పలికెను: "ఆ సాధన కాలమున అగపడుచుండెడి శ్రీకృష్ణుని మేని చాయ యిట్లుండెను." అంతరవలోకనపరులగు మహనీయులకు గడ్డిపూలు సైత మెంతటి దొడ్డతలంపులను రేకెత్తించునొకదా!

మధురభావానుభవకాలమున నొకనాఁ డాతఁడు శ్రీమద్భాగవతము వినుచుండ, శ్రీకృష్ణపాదారవిందముల నుండి దివ్యతేజఃకిరణములు ప్రబలపాశరూపమున వెలువడి భాగవతమును, పిమ్మటఁ దన వక్షమును పెక్కుమాఱులు తాఁకుచు, మూఁడిఁటి నేకముచేయుచున్నట్లు దివ్యదర్శనము నొందెను. భాగవత-భక్త-భగవానులు ముగ్గురును ఏకమే యని యిందలి భావమని శ్రీరామకృష్ణుఁడు విశదీకరించును.

# నిర్వికల్ప సమాధి

జంతువు ఆహారనిద్రాదులయందు ముదమందుచుండ, మానవుఁడు ధీవైభవమునను, కళాకౌశలమునను, తుదకు ఆత్మ ధ్యానమునను రమించుచున్నాఁడు. ధ్యానసాక్షాత్కార సంజనితమైన ఆనందమే సర్వోత్కృష్టమైన బ్రహ్మానందము. వేదవేదాంతముల కిది చరమసీమ.

ప్రగాఢధ్యానస్థితియే సమాధి. ఇదియే అతీంద్రియ జ్ఞానావస్థ, దివ్యజ్ఞానావస్థ. సమస్తతత్త్వరహస్యములును ఇందే ప్రత్యక్షమై భాసించును. ఈ స్థితిని బడసినవారే యోగులు, ఋషులు, తత్త్వదర్శులును.

పరిపూర్ణమైన అతీంద్రియజ్ఞానావస్థయే—ధ్యానపరమావధియే—నిర్వికల్పసమాధియని చెప్పనొప్పును. ఇదియే అద్వైతవేదాంతమున తుదిమెట్టు. మాయను విడనాడి, ద్వైతప్రపంచము నతిక్రమించి, సుఖదుఃఖాదిద్వంద్వములను, సమస్తభ్రాంతులను త్రోసిరాజని, యేమహోన్నతస్థితియందు ఆత్మ స్వస్వరూపవైభవమునఁ దేజరిల్లుచుండునో అదియే నిర్వికల్ప సమాధి. నిర్వికల్పసమాధిమహత్త్వమునుగూర్చి శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించును: "మట్ట మధ్యాహ్నము ఎండలో నిలుచుండినచో, 'నేను' కనఁబడకుండా పోవునట్లు సమాధిలో 'నేను' కనఁబడకుండా పోవును." "కర్పూరనీరాజనము వెలుఁగఁగా వెనుక నేమియు మిగులని చందమున సదసద్విచారము ముగియ, నిర్వికల్పసమాధి ప్రాప్తించునపుడు 'నీవు', 'నేను',

'జగత్తు' అను స్ఫురణమే యుండదు. ఇది వర్ణింపనలవి కానిది—జీవుఁడు బ్రహ్మముగా మాఱునట్టి అఖండపరిణామము. ఉప్పు బొమ్మ సముద్రపులోఁతునుగనుఁగొనుటకై అందు దుమికిన దఁట! కాని యది నీటిని తాఁకినంత నే కరఁగిపోయినదఁట! అపుడిఁక సముద్రము ఎంత లోఁతున్నదో వచ్చి చెప్పువా రెవ్వరు!"

తన ఆధ్యాత్మిక విజయయాత్రలో భక్తిమార్గమునను, తాంత్రిక యోగమార్గమునను మహాద్భుతవిజయములను సాధించియున్న శ్రీ రామకృష్ణుఁ డిఁక జ్ఞానమార్గమునను పరిపూర్ణుఁడై అతీంద్రియప్రజ్ఞాపరమావధి యగు నిర్వికల్ప సమాధిని కైవస మొనర్చుకొనవలసియున్నది. "మొదట పురాణమతప్రకారముగను, పిమ్మట తంత్రమతప్రకారము గను, అటుపిమ్మట వేదమతము ననుసరించియు—ఇట్లు భగవంతుఁడు నాచే నానావిధసాధనలను జేయించెను" అని యాతఁడే వచించును.

తోతాపురి యను మహనీయుఁడు ఈసమయముననే దక్షిణేశ్వరవనమునకు వచ్చెను. ఆజానుబాహువు; దృఢ కాయుఁడు; నాగసంప్రదాయమునకుఁ జెందిన యతివరే ణ్యుఁడు; దిగంబరుఁడు; బ్రహ్మమే సత్యమని అపరోక్షాను భూతిచే గ్రహించి, ప్రపంచమును స్వప్నప్రాయముగాఁ గాంచుచు, శీతోష్ణాదులను లక్షింపక విశాలాకాశవితానము క్రింద కాలము గడపుచు, భిక్షచే ప్రాప్తించినదానితో తృప్తి నొందుచు, ఎచటను మూఁడురాత్రులకంటె అదనముగా నిలువక సంచరించు మహాపరివ్రాజకుఁడు; నర్మదానదీతీర

మున నొక నిర్జనారణ్యమున నలుబది యేండ్లు కఠినతప మొనర్చి నిర్వికల్పసమాధి సాధించిన యోగిపుంగవుఁడు. కాళీకాలయ సన్నిధి నాతఁడు శ్రీ రామకృష్ణునిఁ గని, "బ్రహ్మవిద్యకు ఉత్తమాధికారివిగాఁ దోఁచుచున్నావు: వేదాంతసాధన చేయుదువా?" యని యడిగెను. "అదంతయు అమ్మ దివ్య చిత్త" మని శ్రీరామకృష్ణుఁడు కాళీకాలయమునకు వెడలి, భావసమాధిస్థితిలో దేవి అభ్యనుజ్ఞను బడసివచ్చి, "అమ్మ సెలవైనది" అని చెప్పెను. యథావిధిగా వేదాంతసాధన చేయుటకు సన్న్యాసస్వీకారము ఆవశ్యకమని తోతాపురి తెలుప శ్రీరామకృష్ణుఁడు సమ్మతించెను. పితృదేవతలకును, సాంసారికవిషయములపట్ల మృతప్రాయుఁడగు తనకును విధ్యుక్తశ్రాద్ధక్రియలను ఆచరించి, నియమిత శుభదినమున, విరజాహోమమున, శిఖాయజ్ఞోపవీతములను హోమాగ్నికి అర్పించి, శ్రీ రామకృష్ణుఁడు తన గురువరేణ్యుఁడగు తోతాపురి యొసఁగిన కాషాయాంబరములను స్వీకరించెను.

ఆశ్రమసోపానశ్రేణియందు అంత్యసోపానము, సర్వసంగపరిత్యాగ నిలయము, సర్వసమభావసమాశ్రయము, జీవన్ముక్తిపరమసాధనము, శ్రీ బుద్ధ-శంకర-చైతన్యాది-జగద్గురూత్తమావలంబితమును నగు సన్న్యాసాశ్రమము నిట్లు శాస్త్రోక్తముగా శ్రీరామకృష్ణుఁడు స్వీకరించెను. "స్వీయమోక్షజగత్కల్యాణములకై ప్రపంచమునఁ సన్న్యాసి జన్మించుచున్నాఁడు. పరహితార్థము తన జీవితము నర్పించుటకై, ఆకసమును ఆర్తనాదములచే చిల్లులువడఁ జేయు దీనజనకోటి

కష్టములను దొలఁగించుటకై, అనాథుల కన్నిటి నాఁపుటకై, పుత్రశోకసంతప్తలగు తల్లుల నోదార్చుటకై, అజ్ఞులు, అధఃపతితులు నగు జనులు స్వశక్తిపై నిలుచుటకు వలయు సదుపాయముల నొనఁగూర్చుటకై, జాతిమతభేదములను గణింపక సమస్తమానవకోటికిని ఇహపరసౌఖ్యదాయకమగు తత్త్వబోధ లొనరించుటకై, ప్రతివ్యక్తియందును నిద్రాణమై యున్న బ్రహ్మశక్తిని మేల్కొల్పుటకై సన్న్యాసి యీ లోకమున జన్మించుచున్నాఁడు" అని శ్రీవివేకానందస్వామి ప్రకటించును. "సన్న్యాసియందలి అఖండత్యాగమును గాంచిననే లోకులకు త్యాగమును అలవఱచుకొనుటకు వలయు ధైర్యము కలుగును. సన్న్యాసి కానిచో, లోకులకు మఱెవ్వరు త్యాగవైరాగ్య మార్గదర్శకులు కాఁగలరు?" అని శ్రీరామకృష్ణుఁడు వక్కాణించును.

సన్న్యాసదీక్షానంతరము శ్రీరామకృష్ణుఁడు గురునకు సాష్టాంగవందన మొనర్చెను. తోతాపురి అద్వైతవేదాంత తత్త్వోపదేశ మొనర్పసాగెను. పొడవరియు దృఢశరీరియు నైన యా పంజాబుదేశపు యతిసింహము, ఆ మహాముక్తజీవి, అంతగా పొడవరియును పొట్టియుఁ గానివాఁడును, అతిసుకుమార శరీరుఁడును, వినమ్రుఁడు, పరమసత్యాన్వేషకుఁడును నగు తన వంగదేశీయశిష్యునకు ఉపదేశించుచుండిన యాదృశ్యము సంస్మరణీయము. ఆత్మవిచారమూలమున సమాధినిమగ్నత నంది, అఖండసచ్చిదానంద పరబ్రహ్మముతో ఐక్యము నందు విధానమును ఆతరుణమున తోతాపురి యుక్తియుక్తముగా, వేదాంతశాస్త్రప్రమాణపూర్వకముగా శ్రీరామకృష్ణునకు

ఉపదేశించెను.[1] ప్రపంచాధ్యాత్మిక చరిత్రలో ఉత్తమోత్తమ గణ్యమగు తన వేదాంతసాధనానుభవములనుగూర్చి సహజ సరళరీతిని శ్రీరామకృష్ణుఁడు ఇట్లు వచించును :

"దీక్షానంతరము దిగంబరుఁడు అద్వైతవేదాంత సిద్ధాంతములను నాకు ఉపదేశింపసాగెను. సర్వవిషయముల నుండియు మనస్సును ఉపసంహరించుకొని ఆత్మలో నిమగ్నుఁడవు కమ్మని చెప్పెను. కాని నే నెంత ప్రయత్నించినను, నామరూపప్రపంచమును దాఁటి మనస్సును నిర్వికల్పము చేయఁ జాలకపోతిని. ఇతరవిషయములనుండి మనస్సును మఱల్చుట నాకు కష్టమనిపించలేదు కాని, చిద్ఘనము, దేదీప్యమానమునై యొప్పు శ్రీజగదంబరూపము నాకు మిగుల చనవైన కారణమున, ఆదివ్యరూపము నాకు సజీవ సత్యస్వరూపమున ప్రత్యక్షమై నామనస్సును నామరూప ప్రపంచమును దాఁటిపోనీయకుండెను. ఎన్నిసారులు అద్వైతముపై మనసు నిలుపఁ బ్రయత్నించినను, ప్రతిపర్యాయమును ఆరూపము నాకు అడ్డు వచ్చుచునే యుండెను. అప్పుడిఁక

---

1 అందలి సారాంశ మిది: "నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్తము, దేశకాలనిమిత్తత లనువానికి అతీతము, అఖండము, అద్వితీయమును నగు బ్రహ్మము అనిర్వచనీయమగు మాయవలన, నామరూపములచే, విభక్తము, అనేకమునై యున్నట్లు కాన్పించుచున్నది. సమాధినిమగ్నత నందునపుడు మాయాకల్పితనామరూపములుగాని, దేశకాలనిమిత్తతలుగాని గోచరింపవు. కావున మాయామాత్రమగు నామరూపజాలమును ఆత్మవిచారముచే భేదించి, సమాధిమూలమున ఆత్మసంస్థితుఁడ వగుము, అఖండసచ్చిదానందపరబ్రహ్మముతో ఐక్యమునొందుము. ఇట్టి అద్వైతజ్ఞానమే శాశ్వత బ్రహ్మానందప్రాప్తిసాధనము."

నిరాశుఁడనై, 'ఇది నాకు సాధ్యము కాకున్నది. మనస్సును పూర్తిగా నిర్వికల్పముచేసి, ఆత్మధ్యానమున నిమగ్నుఁడను గాఁజాలకున్నాను' అని దిగంబరునితోఁ జెప్ప, నాతఁడు తీవ్ర దృష్టితో నిట్లు నిష్ఠురముగఁ బలికెను: 'ఏమి! నీ కిది సాధ్యము కాకున్నదా! చూచెదను, నీ కిది సాధ్య మైతీరవలయును!' ఇట్లని, చుట్టుపట్ల పరికించి, యొక గాజుపెంకు గనఁబడ, దానిని గైకొని నా కనుబొమలనడుమ నొక్కి, 'సూటిగా మనస్సును ఈచుక్కపై కేంద్రీకరింపుము' అనెను. అంతట కృతనిశ్చయుఁడనై, మరల ధ్యానమునకుఁ గూర్చుండి, శ్రీ జగజ్జననిరూపము కాన్పింపఁగనే వివేక మను ఖడ్గముతో ఆరూపమును ఖండించితిని. ఇఁక నేమియు వికల్పము—అంత రాయము—లేకుండుటచే, మనస్సు దృశ్యప్రపంచమును దాఁటి రివ్వున పై కెగసిపోవ, సమాధినిమగ్నుఁడ నైతిని!"

శ్రీ రామకృష్ణుఁడు అవాఙ్మానసగోచరమగు నిర్వికల్ప సమాధిమహత్త్వమున లీనమయ్యెను!

నిర్విరామముగా మూఁడుదినములు ఒక్కపట్టున శ్రీరామకృష్ణుఁడు అదే విధముగా సమాధినిమగ్నుఁడై కూర్చుండియుండుట గాంచి, తోతాపురి, "ఏమిది! ఇది నిజమా! నలుబదియేండ్ల కఠోరతపస్సుచే నేను సంపాదింపఁ గలిగినదాని నీతఁడు ఒక్కదినముననే సాధింపఁ గలిగెనా!" అని నిశ్చేష్టుఁ డయ్యెను. హృదయము స్పందించుచున్నదా? లేశమైనను ఊపిరి ఆడుచున్నదా!—అని బహుజాగ్రత్తగాఁ బరీక్షించిచూడ, ప్రాణచిహ్నముగాని, చైతన్యలక్షణముగాని యెంతమాత్రము గోచరింపకుండెను. ఐనను ముఖమండలము

ప్రశాంతమై, దివ్య తేజోవంతమై ప్రకాశించుచుండెను. "ఓహో! ఇది మహాద్భుతము! నిర్వికల్పసమాధియే యిది!" యని యాతఁడు నిశ్చయించుకొని, బాహ్యప్రజ్ఞ కలిగించుటకై "హరిః ఓమ్" అను మంత్రమును గంభీరస్వరమున, ఆ పంచవటీధ్యానకుటీరము మాఱుమ్రోఁగునట్లు ఉచ్చరింప నారంభించెను. మెల్ల మెల్లఁగా బహిఃప్రజ్ఞ నొంది, కన్నులు తెఱచి, శ్రీరామకృష్ణుఁడు, తన్ను పరిపూర్ణ వాత్సల్య మహాశ్చర్యానందములతో అవలోకించుచున్న గురువర్యునిఁ గాంచి, సాష్టాంగవందన మొనర్చెను. గురువు శిష్యుని ఆలింగన మొనర్చుకొనెను. ఎచటను మూఁడునాళ్లకంటె అదనముగా నిలువని యా మహాపరివ్రాజకుఁడు—ఆ సర్వసంగపరిత్యాగి—తన అద్భుతశిష్యునిచే ఆకృష్టుఁడై పదునొకండు నెలల పర్యంతము ఆతని సాంగత్యమునఁ గడపెను. కొన్ని విషయములలో శ్రీరామకృష్ణుఁడు స్వయముగాఁ దన గురువున కెట్లు గురువయ్యెనో, ఆముచ్చటల నికఁ గనుఁగొనఁగలము.

# గురుజనసాన్నిధ్య విశేషములు

వ్యాకులశంక హృదయముతో, తీవ్రపరితాపముతో, మనఃపూర్వకమగు ప్రార్థనలతో భగవత్ప్రాప్తిని ఆశించు వానికి గురువు అనావశ్యకము. కాని యిట్టి పరితాపము పొందువా రరుదు,—కావుననే గురుని ఆవశ్యకత” యని శ్రీరామకృష్ణుఁడు వచించును. స్వయముగాఁ దా నట్టి అసాధారణవ్యక్తియైయుండియు గురువులను ఆశ్రయించుటకు కారణ మేమి? “ శాస్త్రవిధిని మన్నించి శాస్త్రప్రామాణ్యమును పాటించుటకై (నా) యీ జీవితమున బ్రాహ్మణి, దిగంబరుఁడు మున్నగువారు గురువులుగా నేర్పడినట్లు తోఁచుచున్నది”[1] అని యాతఁడే సమాధానించును. గురుముఖముననే తత్త్వజ్ఞానము నొందనగునను లోకసామాన్యోద్దిష్టమైన శాస్త్రనియమమును శ్రీరామకృష్ణుఁడు యథావిధిగాఁ బరిపాలించుటయే కాక, తనవ్యక్తిత్వప్రభావముచేఁ దన గురువుల దృక్పథమును సైతము సువిశాల మొనర్చెను.

తన గురువగు తోతాపురి అనుదినము విశేషముగా ధ్యానించుచుండుట చూచి, శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు, “ ఉత్తమోత్తమజ్ఞానము సాధించిన మీరింతిగా ఏలధ్యానము చేయుచుందురు?” అని యడిగెను. తోతాపురి తాను ప్రతిదినము శుభ్రముగాఁ దోము తన లోహపుకమండలువు చూపి, “చూచితివా? ఇదెంత ధగధగలాడుచున్నదో! ప్రతిదినము

1 “ఆచార్యవాన్ పురుషో వేద.” (ఆచార్యునిఁ బడసిన పురుషుఁడు బ్రహ్మమును దెలిసికొనుచున్నాఁడు.)—ఛాందోగ్యోపనిషత్తు, 6–14–2.

తోమనియెడల దాని మెఱుఁగు మాయదా? మనస్సువిష యముకూడ నిట్టిదే. ధ్యానముచే ప్రతిదినము మెఱుఁగు పెట్టనిచో, మనస్సు కళంకితమగును.—"అని సమాధానించెను. అందుల కొప్పుకొనుచు, శ్రీరామకృష్ణుఁడు, "నిజమే కాని, పాత్రము బంగారపు దైనయెడల, ప్రతిదినము తోమ నక్కఱ లేదుకదా!" యనెను. "ఔనౌను, నీవు చెప్పినది నిజమే" యని తోతాపురి చిఱునవ్వుతో అంగీకరించెను. ప్రతిదినము యథావిధిగ ధ్యానించుటవలని ప్రయోజనమును గూర్చి తన గురువర్యుని యీపలుకులను శ్రీరామకృష్ణుఁడు మది నుంచుకొని తన శిష్యులకు మున్ముందు తఱచు తెలుపును. మేలిమి బంగారమువంటి శీలవర్తనములతో శోభించు తన శిష్యుని సమాధానపుఁ బసిడిపలుకులును తోతాపురి మనఃఫలకమున నిట్లే ముద్రితమై యుండనోపును!

బాల్యముననే సద్గురుసాన్నిధ్యమును బొంది క్రమముగా నిర్వికల్పసమాధిస్థితిని బడసిన తోతాపురి దైవానుగ్రహముతో నిమిత్తములేకయే, స్వప్రయత్నముననే మానవుఁడు తరింపఁగలఁడని నమ్మెను. ఆ 'పక్కా వేదాంతి' దృష్టికి శ్రీరామకృష్ణుఁడు జగజ్జనని యని వచించు 'పరాశక్తి' తుదకు ఆభాసమాత్రమే. తన అనిర్వచనీయ శక్తివిలాసములచే బ్రహ్మాండములతో బంతులాడుచు, లోకమును కీలుబొమ్మవలె నాడించు మహామాయయొక్క నిరంకుశప్రభావ మాతనికి అనుభూతము కాలేదు. శ్రీరామకృష్ణుని సాంగత్యమువలన క్రమముగా ఈ లోపము ఎట్లు తొలఁగెనో చూడఁగలము.

ప్రభాతసాయంకాలములందు చప్పట్లు చఱచుచు,

ఒక్కొక్కప్పుడు ఆనందపారవశ్యమున నృత్యముచేయుచు, భగవన్నామసంకీర్తన మొనరించుట శ్రీరామకృష్ణునకు చిన్న నాఁటినుండియు అలవాటు. "హరి బోల్! హరి బోల్!" (హరియనరా! హరి యనరా!)—"హరి గురు, గురు హరి" (హరియే గురువు, గురువే హరి)— "హరి ప్రాణ్ హే గోవింద మమ జీవన్!" (ఓ గోవిందా! నా జీవనమా!)— "మన్ కృష్ణ, ప్రాణ్ కృష్ణ, జ్ఞాన్ కృష్ణ, ధ్యాన్ కృష్ణ, బోధ కృష్ణ, బుద్ధి కృష్ణ"—అని యీ విధముగా ఉచ్చైస్స్వరమునఁ గొంతసేపు ఆతఁడు సంకీర్తనచేయును. సాక్షాత్కార పరమావధి నొందినపిమ్మట సైత మాతఁ డిది విడువలేదు. శ్రీ రామకృష్ణుఁ డొకనాఁడు తోతాపురితో పరమార్థ ప్రసంగములు చేయుచు, సాయంకాల మైనంత నే తన యభ్యాసము ననుసరించి కరతాళధ్వనులతో భగవన్నామసంకీర్తన చేయసాగెను. సంకీర్తనాదులు కేవలము ప్రారంభస్థితిలోని వారికి ఉద్దేశింపఁబడిన "గుంట ఓనమాలు" అని భావించు తోతాపురి, ముక్తపురుషుఁడైన తన శిష్యుఁడు వాని నవలంబించుట గని విస్మితుఁడై, వికటముగా నవ్వుచు, "ఏమది! ఆవిధముగా చేతులతోఁ దట్టుచు చపాతీలు చేయుచున్నావా!" అని హేళనచేసెను. శ్రీరామకృష్ణుఁడును నవ్వుచు నిట్లు సమాధానించెను: "ఏమి అవివేకము! నేను భగవన్నామ సంకీర్తన చేయుచుండఁగా, మీరు దానిని చపాతీలు చేయుటతోఁ బోల్చుటయా!"

మఱియొకనాఁటి సాయంకాలము శ్రీరామకృష్ణుఁడు తన గురునితో, నెగడిప్రక్కనఁ గూర్చుండి వేదాంతచర్చ

చేయుచుండఁగా, తోఁటకాపరి యొకఁడు ఆ నెగడినుండి హుక్కాకై యొక నిప్పుకణికను దీసికొనఁ బోయెను. తోతాపురి కోపోద్దీపితుఁడై యాసేవకునిఁ దిట్టిపోయుచు, పట్టుకాఱువంటి తన చిమ్టాతోఁ గొట్టెదనని బెదరించెను. శ్రీరామకృష్ణుఁడు, "ఆహాహా! ఏమి మాయామోహము! సిగ్గు! సిగ్గు!!" అని అర్ధబాహ్యప్రజ్ఞానస్థితిలోఁ బదేపదే పలుకుచు, పొరలిపొరలి నవ్వసాగెను. తనశిష్యుని వింతచర్యకు విస్మితుఁడై, తోతాపురి, "ఎందుకు నవ్వెదవు? అతఁడు చేసిన పని యెంత అక్రమమో చూడు!" మనెను.[1] చిఱునగవుతో శ్రీరామకృష్ణుఁడు ఇట్లు బదులు చెప్పెను: "నిజమే కాని, దానితోఁబాటు మీ బ్రహ్మజ్ఞానవిజృంభణముకూడ గమనించుచున్నాను! బ్రహ్మమే అద్వితీయసత్తయనియు, జగత్తునందలి సర్వము తత్ప్రకాశమాత్రమే యనియు ఇప్పుడే కదా మీరు చెప్పుచుంటిరి? కాని మఱుక్షణముననే సర్వము మఱచి యొకనిని గొట్టఁబోయితిరి! అప్రతిహతమైన మాయా ప్రభావము చూడ నాకు నవ్వువచ్చుచున్నది!" ఈ పలుకులు విని తోతాపురి గంభీరవదనుఁడై కొంతసేపు నిశ్శబ్దముగా నుండి పిమ్మట నిట్లనెను: "నిజమే నీవు చెప్పినమాట. కోపవివశుఁడనై సర్వము మఱచితిని. కోపము చండాలము. ఇఁకనెన్నఁడును కోపమునకు వశుఁడను గాను."

జగజ్జనని యగు మాయాశక్తికటాక్షవీక్షణములందే మోక్షమార్గము భాసిల్లుచున్నదని శ్రీరామకృష్ణుఁడు ఈ క్రింది

[1] నాగసంప్రదాయపు సాధువులు 'ధుని' యనఁబడు తమ నెగడిని పూజనీయముగా భావించుచు, ఎప్పుడును దగ్గఱ నుంచుకొందురు.

యుదాహరణమూలమున అతిమనోహరముగ విశదీకరించును:

"సీతారామలక్ష్మణులు అడవులగుండా పోవుచున్నారు. అది మిక్కిలి యిఱుకుదారి,—ఒకరివెంబడి నొకరుగా మాత్రమే పోఁగలరు. కోదండపాణియగు రాముఁడు ముందు, అతనివెనుక సీత, ఆమెవెనుక ధనుర్బాణహస్తుఁడు లక్ష్మణుఁడును నడచుచున్నారు. రామునియెడ గాఢ భక్తిప్రేమాసక్తుఁడగు లక్ష్మణుఁడు నవఘనశ్యామసుందరుఁడగు రాము నెప్పుడును జూచుచుండఁగోరును. కాని సీత యడ్డుగా నుండుటచే ఆతఁడు చూడఁజాలక పరితపించును. ఇది యెఱిఁగి యామె కొంచెము ప్రక్కకుఁ దొలఁగి, 'అదిగో, చూడు' మనును. లక్ష్మణుఁడంతట కన్నులార తన యిష్టమూర్తి నవలోకించును. ఇటులనే జీవునకును ఈశ్వరునకును నడుమ మాయాశక్తి—జగజ్జనని—కలదు. ఆమె దయఁదలఁచి తొలఁగిననే కాని జీవుఁడెన్నఁటికిని ఈశ్వరునిఁ గనఁజాలఁడు. కావున ఆమె కృప లేనిచో, నిత్యానిత్యవస్తువివేచనము, వేదాంతవిచారము, ఎంత చేసినను నిష్ప్రయోజనము."[1]

---

[1] కాలాంతరమున శ్రీరామకృష్ణుఁడు ఈ విషయమును గూర్చియే భక్తులకును శిష్యులకును ఇట్లు బోధించెను: "కామకాంచనములు నిజముగా మిథ్యాభూతములని గ్రహించుటయు జగత్తు త్రికాలములయందును అసత్తను దృఢనిశ్చయము నొందుటయు సామాన్యవిషయ మనుకొంటివా? వాని (భగవంతుని) దయ లేనిదే యిది సాధ్యమా?... తన సాధనచే—స్వప్రయత్నముచేతనే—మానవుఁడు ఈ విశ్వాసము నొందఁగలఁడా? అహా! మానవుని శక్తి యేపాటిది! ఆ శక్తితోఁ దాను జేయఁగల్గిన ప్రయత్న మేపాటిది!" భగవత్కృపనుగూర్చి యీ విధముగాఁ బ్రసంగించుచు శ్రీరామకృష్ణుఁడు సమాధిస్థితుఁ డయ్యెను. కొంతసేపటికి అర్ధబాహ్యప్రజ్ఞావస్థలో నాతఁడు, "ఓ కుశలవులారా! రాముఁడ నగు నేను స్వయముగా బంధితుఁడనుగా నొడంబడియుండనిచో, నన్ను మీరు బంధింపఁగల్గియుందురా?" యను నర్థమిచ్చు వంగ కీర్తన పాడ నారంభింప, నాతని యశ్రుధారలచే—తివాసీపైఁ బఱవఁబడియుండిన—దుప్పటి కొంత భాగము తడిసిపోయెను! వేదాంత గ్రంథపఠనాదులందు ప్రబలాసక్తుఁడై యుండిన హరి (తురీయానంద స్వామి) యను శిష్యుఁడీ సన్నివేశమునుగాంచి తన యశ్రుధారల నాఁపుకొనఁజాలకపోయెను. ఆతఁడు అపూర్వమనఃపరివర్తన మందెను.

వజ్రకాయుఁడగు తోతాపురి వ్యాధియన నేమో యెన్నఁడును ఎఱుఁగఁడు. కాని వంగదేశపు శీతోష్ణస్థితియు నీరును భరింపక, రక్తగ్రహణిపీడితుఁ డయ్యెను. ప్రేవులను మెలిపెట్టి పిండుచున్నట్లు అహర్నిశము ఒకటే బాధ. శ్రీరామకృష్ణుని ప్రేరణమున మధురుఁడు చికిత్స చేయింపసాగెను. కాని వ్యాధి తగ్గకుండెను. ఒకరాత్రి బాధ మహాతీవ్రమయ్యెను. అలవాటు చొప్పున శరీరస్మృతినుండి మనస్సు మళ్లించి, బ్రహ్మముపై లగ్న మొనర్చి ధ్యాననిమగ్నుఁ డగుట కెంత ప్రయత్నించినను సాధ్యము కాకుండెను. అంత నాతఁడు ప్రాణము విసుగ, "ఈ దౌర్భాగ్యపు శరీరమూలమునఁగదా మనస్సు నేఁడు వశము తప్పినది! నే నీ శరీరము గాననుట నాకు విస్పష్టము. దీనిని గంగార్పితము చేసి యీ బాధల నన్నిఁటిని తుదముట్టింతును" అని నిశ్చయించుకొని గంగలో దిగెను. అనంతరము జరిగిన సంఘటనమునుగూర్చి కాలక్రమమున శ్రీరామకృష్ణుఁడు భక్తుల కిట్లు తెల్పును: "ఈశ్వరేచ్ఛ లేనిచో, గడ్డిపోఁచయైనను కదలదు. నిజముగా స్వాతంత్రేచ్ఛ—స్వేచ్ఛ—యనున దెక్కడిది? ఎలరును ఈశ్వరేచ్ఛాధీనులై యున్నారు.[1] దిగంబరుఁడు గొప్పజ్ఞాని.

[1] 'జీవుఁడు స్వతంత్రుఁడా, అస్వతంత్రుఁడా?' యను విషయమై శ్రీరామకృష్ణుఁడు కాలక్రమమున నిరువురు ప్రియశిష్యుల కొనర్చిన యీ క్రిందియుపదేశము ముఖ్యముగా గమనింపఁదగియున్నది: "...'ఈనిర్ణీత ప్రదేశమున ఈ యావు తన చిత్తానుసారము సంచరించుఁగాక' యని ఆవు నొక పొడవైన త్రాటితో రాటకుఁ గట్టిపెట్టుచుందుము కదా! ఇట్లే భగవంతుఁడు మానవునకుఁ గొంతశక్తి నిచ్చి అందు తన(మానవుని) చిత్తానుసారము ఎంతవఱకు దేనికి వినియోగించుకొనుటకైనను స్వాతంత్ర్యము

విపరీతమైన కడుపునొప్పివలన ఒకప్పుడు వివశుండై నదిలో మునింగి(చని)పోవుటకై అందు దిగెను. స్నానఘట్టముకడ రేవు చాలదూరమువఱకు మెరక ప్రదేశము. ఎంత లోపలికిం బోయినను, మోంకాలిబంటినీటికంటె ఎక్కువ లేకుండెను. అంతట సర్వము గ్రహించి తిరిగివచ్చెను." [1]

శ్రీరామకృష్ణుని యీసంగ్రహకథనమందలి "సర్వము గ్రహించి" యను వాక్కులలో భావబ్రహ్మాండ మిమిడి యున్నది. తోతాపురిదృక్పథము నావరించియుండిన తెర తొలంగిపోయెను. సర్వము జగన్మాతృస్వరూపముగా అతనికిం గన్పట్టెను. ఆమె కరుణించిననేకాని యామె గీచిన గీటి నెవ్వరును దాంటంజాలరు. ఆత్మసమర్పణ మొనర్చుకొని

నిచ్చియున్నాండు. అందుచేతనే మానవుండు తాను స్వతంత్రుండనను కొనుచుండును. కాని త్రాడు రాటకుం గట్టంబడియున్నది. కాని యీ విషయము గుర్తింపుండు: వినీతుండై మనఃపూర్వకముగా మానవుండు భగవంతుని ప్రార్థించినచో, వాని నాతండు మఱియొకచోట మఱింత పొడవైన త్రాటితోం గట్టవచ్చును, బంధమును పూర్తిగా తొలంగింపను వచ్చును....భగవంతుండు నీ కిచ్చిన శక్తిని సద్వినియోగము చేసిననేకాని నీ కాతండు అధికముగా నీయండు. అందుచేతనే పురుషకారము (మానవ ప్రయత్నము) యొక్క అక్కఱ. కాంబట్టి భగవదనుగ్రహము పొందు టకైనను ప్రతి వ్యక్తియు శ్రమపడి యేదోకొంత కృషి చేయవలసియే యున్నది. ఇట్లు చేసినచో, పదిజన్మములలోం బొందవలసిన అనుభవములు వానికృపవలన ఒక్కజన్మములోనే తీఱిపోవుచుండును. ఏమైనను, కొంత మానవ ప్రయత్నము అత్యావశ్యకము."

[1] ఈసంఘటనవిషయమున ఇతరగ్రంథములకంటె 'శ్రీ శ్రీరామ కృష్ణకథామృత'మే విశేషప్రామాణికముగ గ్రహింపనగును. (Refer 'The Gospel of Sri Ramakrishna,' p. 83.)

యావజ్జీవితము తాను ఏతత్త్వమును బ్రహ్మమని యుపాసించుచున్నాఁడో, అట్టి పరతత్త్వము ఆమెయే! బ్రహ్మము, శక్తియు అభిన్నము—ఏక సత్పదార్థమును గుఱించిన రెండు భావములు.

భక్తిప్రపూరితహృదయుఁడై తోతాపురి తన ధుని కడకుఁ దిరిగివచ్చి, మిగిలిన యారాత్రి యంతయు జగజ్జననీ పావననామస్మరణతోడను ఆమె ధ్యానముతోడను గడపెను. మఱునాఁడు తోతాపురి మనఃపరివర్తనకథను అతనివలననే శ్రీరామకృష్ణుఁడు విని చిఱునగవుతో నిట్లు పలికెను: "ఆహా, అమ్మను మీరు నమ్మక, మాయాశక్తి—జగజ్జని—మిథ్య యని నాతో వాదించుచుంటిరే! ఆమె యునికి సత్యమని మీ కిప్పటికి అనుభూతమైనది. అగ్నియు దహనశక్తియు వలె బ్రహ్మమును శక్తియుఁ దానును అభిన్నమని శ్రీజగదంబ నాకు చాలకాలముక్రిందటనే బోధపఱచెను." [1]

[1] 'జగత్తు మిథ్యయా?' యను విషయమై శ్రీరామకృష్ణుని యీ క్రింది యుపదేశము ముఖ్యగమనార్హము:—"సంసారము—జగత్తు—మిథ్యయా? భగవంతునిఁ గనుఁగొనకుండునంతవఱకు మిథ్యయే. (ఇందుల కొక ఉదాహరణము.) మారేడుపండుయొక్క ముఖ్యభాగమును గూర్చి చెప్పునపుడు అందలి చిప్పను, గింజలను గాక గుంజు నే గ్రహింతుము. కాని దాని పూర్తితూనిక చెప్పవలసివచ్చినప్పుడు గుంజుమాత్రమే తూఁచిన, చాలదు కదా? మొత్తమంతయు—గుంజు, గింజలు, చిప్ప—అన్నింటిని గైకొనవలయును. ఇవన్నియు ఒకే పండునకుఁ జెందునట్టివి. (ఇట్లే) నిత్యమగు బ్రహ్మమును, లీలారూపమగు జగత్తును ఒకే సత్పదార్థమునకుఁ జెందునట్టివి. కావున నేను సర్వము—బ్రహ్మమును జగత్తునుగూడ—అంగీకరింతును. జగత్తు మాయయని త్రోసివేయను. అట్లు త్రోసివేసినచో, పూర్తితూనిక తెలియదు. భగవంతుని నిర్గుణావస్థయందు సాక్షాత్కరించుకొనినపిమ్మట నెవ్వఁడు (ఏభగవంతుఁడు) స్వతస్సిద్ధముగా నిత్యుఁడో,

భగవత్ప్రేమామృతపరిపూరితహృదయులైన యీ మహనీయు లిరువురును, నహబత్ఖానానుండి ప్రభాతార్చనా గానవాహినులు దేవాలయోద్యాన సువాసనలతో సమ్మిళితమై నల్దిక్కులను వ్యాపించుచుండ, భవతారిణీకాళికాలయమునకు వెడలి దేవికి సాష్టాంగవందన మొనరించిరి. తన పరివ్రాజకయాత్రలను సాగింప నెంచిన తోతాపురిగమనమునకు దేవి సమ్మతించినట్లు ఇరువురకును అనుభూతమైనది. పూర్ణారోగ్యవంతుఁడై కొలఁది దినములైనపిమ్మట తోతాపురి శ్రీరామకృష్ణునికడ సెలవుగైకొని దక్షిణేశ్వరము వీడి వెళ్లెను.

తోతాపురితోడి తన సంసర్గమునుగూర్చి కాలాంతరమున శ్రీరామకృష్ణుఁడు శిష్యులతో నిట్లు ముచ్చటించును: (ప్రారంభమున ఛలోక్తులతో): "నే నొకప్పు డొక జ్ఞానిచేతఁ బడితిని; పదునొకండు నెలలపాటు వేదాంతము వినిపించెను. కాని నాలోని భక్తిబీజమునుమాత్రము నశింపఁజేయఁజాలక పోయెను! మనస్సు ఎక్కడెక్కడికిఁ బోయినను, తిరిగి అమ్మ (జగజ్జనని) పాదపద్మములమ్రోల వాలుచుండెడిది. అమ్మను గుఱించి నేను పాడినపుడెల్ల దిగంబరుఁడు (భావావేశమునఁ) విలపించి, 'ఆహా! ఏమిది!' యనును. అంతటి గొప్పజ్ఞానియై యుండియు విలపించువాఁడు."

శ్రీరామకృష్ణునకు తాంత్రికోపాసనమున గురువైనను భైరవీ బ్రాహ్మణి యీతనివలె సమ్యగ్దర్శనము నొందియున్న

ఆతఁడే లీలామయుఁడై జగద్రూపమును దాల్చియున్నాఁడనిబోధపడును."

మా రేడుపండు ఉదాహరణమున గింజలు జీవులను, చిప్ప ప్రపంచమును సూచించునని శ్రీరామకృష్ణుఁడు మఱియొకప్పుడు తెలిపెను.

వ్యక్తి కాదు. అద్వైతవేదాంతమనిన, ఆమెకుఁ గిట్టదు. తోతాపురితో శ్రీరామకృష్ణుని సన్నిహితత్వమున కిచ్చగింపక యామె యాతనితో, "నాయనా! నీ వాసాధువుతో అట్టే చనవుగా మెలఁగకు. అతనిది శుష్కజ్ఞానమార్గము. అతని తోడి సంసర్గమువలన నీభక్తిని, భగవత్ప్రేమానురాగములను గోల్పోవుదువు" అనిసైతము హితోపదేశము చేసియుండెను. శ్రీరామకృష్ణుఁ డీమాటలను బెడచెవినిఁ బెట్టెనని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

తాను రుచిచూచిన నిర్వికల్పానుభవమున శ్రీరామకృష్ణుఁడు నెలకొనియుండ నభిలషించెను. ఆయభిలాష అప్రయత్నముగా నెఱవేఱె, తన మహానుభూతినిగూర్చి యనంతర మాతఁ డిట్లు వచించెను: "ఒక్కపట్టున ఆఱు నెలలవఱకు ఆస్థితి (నిర్వికల్పసమాధి)లో నుంటిని. సామాన్యమానవులు ఆస్థితిని బొందినచో, మరల నందుండి వెలువడరు—మూఁడువారములైనపిమ్మట శరీరము ఎండుటాకువలె రాలిపోవును. రేయింబవళ్ల యెఱుకయే లేకుండెను. నిర్జీవకళేబరమునందువలె నోటిలోను ముక్కుపుటములలోను ఈఁగలుదూరుచుండెడివి, కాని వానియెఱుకయే (నాకు) లేకుండెడిది. ధూళిధూసరితములై తలవెండ్రుకలు జడలుకట్టెను. తెలియకుండఁగనే ప్రాయికముగా మలమూత్రవిసర్జన జరుగుచుండెడిది. దైవవశమున దక్షిణేశ్వరమున కపుడొక సాధువు వచ్చి పరిచర్యలు చేసియుండనియెడల, ఈశరీరము నిశ్చయముగా అంతరించియుండెడిది. ఆసాధువు వెంటనే స్థితిని గుర్తించి, యీశరీరమూలమున శ్రీలోకేశ్వరి యింక ననేక కార్యములు ఒనర్పవలసియున్నదని—

ఈశరీరము పరిరక్షింపఁబడినచో, అనేకులు శ్రేయస్సు నొందఁ గలరని—గ్రహించెను. ఆతఁడు వేళకు ఏదో కొంత ఆహారము తీసికొనివచ్చి, రాళ్ల కట్టవంటి తన చిన్న కట్టతోఁ గొట్టికొట్టి బాహ్యస్మృతి కలిగించుటకై యెంతో ప్రయత్నించువాఁడు. తుదకు కొంచెము స్మృతి వచ్చినట్లు కాన్పింపఁగనే కొంచెము ఆహారమును నోటిలోఁ గ్రుక్కును. కొన్ని దినములలో అందు బహుస్వల్పభాగముమాత్రమే కడుపులోనికిఁ బోయెడిది; మఱి కొన్ని వేళల అదియు సాధ్యముకాకుండెడిది. ఈవిధముగ ఆఱు నెలలు గడచినవి. అంతట అమ్మ ఆజ్ఞ నాకిట్లు వినవచ్చెను: 'భావముఖమున ఉండుము, లోకశిక్షకై (అనఁగా లోకమునకు బోధించుటకై) భావముఖమున (అనఁగా ద్వైతప్రపంచస్ఫురణము, ఆత్మావలోకనము నను రెంటికిని నడుమ—ద్వైత ప్రపంచద్వారమున) ఉండుము.' అటుపిమ్మట రక్తగ్రహణి సంభవించెను. ప్రేవులను మెలిపెట్టి పిండుచున్నట్లు దారుణ బాధ. ఇంచుమించు ఆఱు నెలల పర్యంతమైన యీబాధమూలమున క్రమముగా మరల స్మృతి కలుగనారంభించెను. అంతకు ముందు స్వల్పావకాశము దొరకినపుడెల్ల మనస్సు తీవ్రవపైకెగసి నిర్వికల్పసమాధిస్థితిలో లీనమగుచుండెడిది!"

ఇంచుమించుగా ఈ సమయముననే మథురుఁడు, తన భార్యయగు జగదంబాదాసి రక్తగ్రహణీపీడితయై వైద్యులు నిరాశచేసికొనుట సంభవింప, మహాదుఃఖితుఁడై శ్రీరామకృష్ణుని సన్నిధి కేఁగి కన్నుల నీరు గ్రమ్మ గద్గదకంఠుఁడై యిట్లు విన్నవించెను: "వ్యక్తిగతముగా నాకు ఘోరమైన ఆపద సంభవింపఁబోవు టటుండ, జమీందారి నిర్వాహణ

యితరుల చేతిలోనికిఁ బోయెనా, మిమ్ము సేవించు భాగ్యము నాకిఁక దక్కదు." మథురుని మనోవ్యథ కెంతయు జాలిపడి, అతీంద్రియావస్థలో శ్రీరామకృష్ణుఁడు, "భయపడకు, నీ భాగ్యము నిమ్మళించును" అని అభయమొసఁగెను. అనంతరము జరిగిన అద్భుతసంఘటనమును గూర్చి యాతఁ డిట్లు వచించును: "ఆనాఁటినుండి జగదంబకు క్రమముగా స్వస్థత కలుగ నారంభించెను; ఆ వ్యాధి (తన శరీరమును జూపుచు) ఇచటికి మాఱినది. ఆమె వ్యాధినివారణఫలితముగా ఆఱు నెలలదాఁక రక్తగ్రహణితోడను తదితరవ్యాధులతోడను బాధపడితిని.[1] పదునాలుగేండ్ల పర్యంతము మథురుఁడు ఊరకే అంతటి విశ్వాసముతో ఉపచరించెనా? అమ్మ యీ శరీర మూలమున ఎన్నియో అద్భుతముల నతనికిఁ జూపుటచేత నే ఆతఁ డట్లు ఉపచరింపఁగలిగెను."

ఒరులకు మేలొనఁగూర్చుటకై మహాత్ములు స్వాయముగా దారుణవ్యథలనైనను అనుభవింతురు గదా! మథురుఁడు ఘనవైద్యునిచే శ్రీరామకృష్ణునకు చికిత్స చేయించుచుండ, హృదయుఁడు నిరంతరము పరిచర్య చేయసాగెను. జ్ఞానయోగసాధకులగు యతివరేణ్యు లెందఱెందఱో ఈసమయమున దక్షిణేశ్వరమునకు రాసాగిరి. తీవ్రవ్యాధిగ్రస్తుఁడై యుండియు దాని నిసుమంతయుఁ బాటింపక, శ్రీరామకృష్ణుఁడు వారల మహోన్నత వేదాంతచర్చల నాలకించుచు, వారికిఁ బొడకట్టని తత్త్వరహస్యములను దెలుపుచుండువాఁడు.

[1] దీర్ఘనిర్వికల్పసమాధినితిపిమ్మట ఆఱునెలల వఱకును సంభవించిన వ్యథ లివియే యని గ్రహింపనగును.

క్రమముగా శ్రీరామకృష్ణుఁడు స్వస్థుఁ డయ్యెను. సనాతనధర్మమందలి నానాసంప్రదాయములచే నానారీతులను పరంజ్యోతిని సందర్శించిన యాతని సువిశాలవీక్షణములు అన్య మతములపై సైతముప్రసరింపసాగెను. మహమ్మదీయమతము నకు—ప్రాయికముగా అందలి సూఫీసంప్రదాయమునకుఁ—జెందిన గోవిందరాయ్ అను మహనీయుఁడు దక్షిణేశ్వరము వచ్చియుండ, శ్రీరామకృష్ణుఁడు ఆతని దివ్యజీవనవిధానముచే ఆకృష్టుఁడై, ఇస్లాంమతోద్దిష్టమగు భగవదుపాసనమున ఆతనిచే ఉపదేశ మందెను. ఈసాధనానుభవములనుగూర్చి శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించును: "అపుడు అల్లానామ స్మరణము చేయుచు, మహమ్మదీయులవలెనే బట్టకట్టుకొనుచు, యథావిధిగా నమాజు చేయుచుండెడివాఁడను. మనస్సునుండి హిందూమతభావములన్నియు పూర్తిగా పలాయనమగుటచే హైందవదేవతలకు నమస్కరింపకుండుటయేగాక, వారిని దర్శింపవలయునని నాకపుడు బుద్ధికూడ పుట్టెడిది కాదు. ఈ విధముగా మూఁడునాళ్లు సాధన చేసినపిమ్మట ఆసాధన గమ్యము పొందితిని." తేజస్వంతుఁడైన యొక పురుషుఁడు గంభీరాకారముతోడను, పొడవైన గడ్డముతోడను శ్రీరామ కృష్ణునకు ప్రత్యక్షమయ్యెను; అంత నాతనిమనస్సు సగుణ బ్రహ్మభావము నొంది తుదకు నిర్గుణబ్రహ్మానుభవమున లీనమయ్యెను.

ఈసాధనకాలమున శ్రీరామకృష్ణుఁడు మహమ్మదీ యాహారము సైతము భుజింపసమ్మతించెననియు మథురుఁడాతని నెంతయో బతిమాలుకొనినమీఁదట మాత్రమే విరమించె

ననియు హృదయుఁడు తెలుపును. కాని యేసాధన నైనను సమగ్రముగా, హృదయపూర్వకముగా, అవలంబించుట శ్రీరామకృష్ణునకు స్వభావసిద్ధ మనియు, తదనుగుణముగాఁ దనకోర్కె కొంతవఱకైనను తీఱినఁగాని యాతఁడు సంతృప్తి నందఁ డనియు గ్రహించిన మధురుఁడు పలురకముల భోజ్యముల నొక మహమ్మదీయుని సలహా ననుసరించి బ్రాహ్మణునిచేఁ జేయించి పంపువాఁడు. మహమ్మదీయమత సాధన కాలమున శ్రీరామకృష్ణుఁ డెన్నఁడును దేవాలయావరణములో అడుగిడ లేదు; వెలుపల నున్న మధురుని తాత్కాలిక నివాసభవనమున నివసించుచుండెను.

"వేదాంతసాధనయందు పరిపూర్ణత నందినపిమ్మట నే శ్రీరామకృష్ణుఁడు మహమ్మదీయమతసాధన నాచరించుటను బట్టిచూచినచో, వేదాంతవిజ్ఞానమున విశ్వాస మేర్పడినప్పుడే హిందువులును మహమ్మదీయులును పరస్పరసానుభూతి నొంది సోదరభావనిబద్ధులు కాఁగలరనుట స్పష్టము" అని శ్రీరామకృష్ణలీలాప్రసంగగ్రంథకర్త శ్రీశారదానందస్వామి వ్యాఖ్యానించియున్నాఁడు. హిందువులకును మహమ్మదీయులకును మధ్య నేర్పడియున్న విభేదముల కెంతయో చింతించుచు, పరస్పర సఖ్యభావావశ్యకతను దెలుపుచు, శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించువాఁడు: "హిందువులకును మహమ్మదీయులకును నడుమ విభేదపర్వతము లేర్పడియున్నవే! ఎంతో కాలము నుండి కలసి నివసించుచున్నను, వీరల భావములు, మతవిశ్వాసములు, ఆచారవ్యవహారములును ఒండొరులకు దుర్బోధములై యున్నవే!" ఐనను సర్వధర్మసమన్వయమూర్తియగు నాతఁడు

మహాత్మ్యనీయమత సాధనయందుఁ బడసిన దివ్యానుభవము ఏనాటికైనను ఈ యుభయజాతులును తమలోఁ దమకుఁ గల విభేదము లంతరింప సౌభ్రాత్రమున నొండొరుల నాలింగన మొనర్చుకొనఁగల రను దివ్యసూచనయేమో!

గ్రహణి నివారణమైనను శ్రీరామకృష్ణుఁ డింకను నీరసించియుండెను. పల్లెటూరివాతావరణము ఆరోగ్యమునకు విశేషముగా అనుకూలించు నను మథురుని ప్రేరణమునను, తోడ్పాటునను ఆతఁడు 1867–వ సం॥ మే నెలలో భైరవీ బ్రాహ్మణితోడను, హృదయునితోడను జన్మగ్రామమగు కామార్పుకురునకు వెళ్లెను. తల్లి చంద్రాదేవి గంగాతీరమును వీడుట కిష్టపడక, మథురుని సంరక్షణమున దక్షిణేశ్వరమువనే యుండెను.

గ్రామవాసులు ఎడతెఱపి లేకుండ శ్రీరామకృష్ణుని సాన్నిధ్యము నొందుచు, ఆతని బోధామృతమును గ్రోలసాగిరి.

శ్రీరామకృష్ణుని రాకనుగూర్చి ఆత్మీయు లాతని సతీమణియగు శ్రీశారదామణీదేవికిఁ గబురంప నామె వచ్చెను. శ్రీరామకృష్ణభక్తకోటిచే మాతృదేవి యనియు శ్రీమాత యనియుఁ బిలువఁబడు నామె యిపుడు పదునాలుగేండ్ల నవయౌవనవతి. కొలఁదిదినములలోనే ప్రాణేశ్వరుని చిత్తవృత్తిని గ్రహించి యామె పరిపూర్ణభక్తిప్రేమానురాగములతో సేవింపనభిలషించుచుండెను. ప్రాయము వచ్చినపిమ్మట ప్రాణవల్లభునితోఁ దన కొనఁగూడిన ప్రథమసమావేశ మిదియే. సుసంప్రదాయములలోఁ బుట్టిపెరిగిన యామె తన భర్తకు ఆత్మసమర్పణమొనర్చుకొని పరమాప్తుఁడు, పరమా

త్స్వుడును తన కాతఁడేయని నమ్మియుండెను. ఇఁక శ్రీరామ కృష్ణుఁడో! తాను సన్న్యాసియైయుండియు, వనితయనినంతనే భీతిలు సామాన్యవిరాగులవలెఁగాక, తన నూతన బాధ్యతను మనఃపూర్వకముగా గుర్తించి సహధర్మచారిణికిఁ దగు శిక్షణ గఱపసాగెను. వివాహితుఁడ నని తన గురువగు తోతాపురితోఁ దాను జెప్పినప్పుడాతఁ డిట్లు తెలిపియుండెను: "ఐననేమి! భార్యతో నివసించుచున్నను, ఎవఁడు తన వివేక వైరాగ్యములను చెక్కుచెదరకుండఁ గాపాడుకొనఁగల్గునో, అతఁడే స్థితప్రజ్ఞుఁడు, బ్రహ్మజ్ఞాననిష్ఠుఁడు. ఎవఁడు స్త్రీపురుషులను ఆత్మగనే గ్రహించి, ఆత్మభావముతో వారియెడ వర్తింపఁగలుగునో వాఁడే పరిపూర్ణజ్ఞాని. స్త్రీపురుషభేదభావము గలవాఁడు ఉత్తమసాధకుఁడు కావచ్చునేమోకాని పరమావధి కింకను దూరస్థుఁడే." ఈ సద్గురువాక్కులు శ్రీరామకృష్ణున కిపుడు స్మరణకు వచ్చెను.

ఏదైనను తనధర్మముగా, కర్తవ్యముగాఁ దోఁచినచో, దాని నాచరించుపట్ల శ్రీరామకృష్ణుఁ డిసుమంతయు జాగు సేయనోపఁడు, అసంపూర్ణముగను విడువఁడు. ఆధ్యాత్మిక విషయములందే కాక, సాంసారిక విషయములందును సహధర్మిణి కాతఁడు గఱపిన శిక్షణ మనఃపూర్వకమై, లోకాదర్శమై యొప్పెను. గృహకృత్యనిర్వహణమునం దేమి, ధన వినియోగమునం దేమి, అన్నిఁటికంటెను ముఖ్యముగా భగవదర్పితమానసయై ఆ యా పరిస్థితులకు అనుగుణముగా వర్తించుటయం దేమి, సర్వతోముఖమగు శిక్షణ మామె పడయఁగల్గుటకై యాతఁడు ప్రత్యేకశ్రద్ధ వహించెను.

అనుష్ఠానానుప్రాణితమైన యీబోధనము ఎట్లు దివ్యఫలప్రద మయ్యెనో యిఁకఁ జూచెదము. పావనాత్ముఁడగు తన హృదయేశ్వరుఁడు తనపైఁ జూపిన స్వార్థరహిత వినిర్మల ప్రేమానురాగములకు ఆమె ముగ్ధురాలై, పరమానందముతో నాతనిఁ దన యిష్టదైవముగా నుపాసించుచు, ఆతని యడుగు జాడల ననుసరించి స్వీయవ్యక్తిత్వశీలములను ఆదర్శప్రాయ ముగా నొనరించుకొనసాగెను.

భైరవీబ్రాహ్మణి రామేశ్వరుని కుటుంబముతో చన వుగ మెలఁగుచు నెల్లరిచే గౌరవింపఁబడుచుండెను. దివ్యాను భూతులను బడసిన వ్యక్తియేకాని, ఆమె యింకను పరి పూర్ణత నందలేదు. ఇతరగురువులతో శ్రీ రామకృష్ణుఁడు సంసర్గ మొనర్చినను, తుదకే యితరభక్తునియెడనైనను విశేష గౌరవము చూపినను ఆమె సహింపఁజాలదయ్యె. బ్రాహ్మణి వంటి భక్తురాలును, విదుషీమణియు నిట్టి యసూయా హంకార పిశాచగ్రస్తురా లయ్యెనన్నచో, సామాన్యులగు లోకుల మాట యిఁకఁ జెప్పనేల?

క్రమముగా బ్రాహ్మణి అహంభావమును దురభి మానమును హెచ్చెను. శ్రీరామకృష్ణుని గురువగు తాను అత్యంతప్రముఖవ్యక్తి ననియు ప్రతివారును తనమాటను శిరసావహింపవలయుననియు నామె తలంచుచుండెను. భార్య యెడ శ్రీరామకృష్ణుఁడు విధ్యుక్తధర్మమును నిర్వహించుట ఆమెకుఁ గిట్టకుండెను. ఆతని బ్రహ్మచర్యమున కది భంగకర మగునేమో యని యామె భయపడియుండవచ్చును. కాని శ్రీరామకృష్ణుఁడు ఆమెమాటలను పెడచెవినిఁ బెట్టెను. ఇది

యామెకు అవమానకరముగఁ దోఁచుటయే కాక, అహం భావమును ప్రజ్వలింపఁజేయ, నాతనిఁ జిన్నచూపునఁ జూడ సాగెను. ఆధ్యాత్మిక విషయములనుగూర్చి తనతో నెవ్వరైనను జర్చించి పిమ్మట శ్రీరామకృష్ణుని యభిప్రాయము నరయఁ గోరుచో, అహంకారము ఉట్టిపడ నామె యిట్లు పలుకును: "అతని నేల యడుగవలయును? అతని కన్నులను దెఱచినది నేనేకదా?" క్రమముగా ముంగోపియై యామె చీటికి మాటికి ఇంటిలోని స్త్రీలను గద్దింపసాగెను. కాని పరమశాంత స్వభావుఁడగు శ్రీ రామకృష్ణుఁ డామెను మునుపటివలెనే గారవించుచుండెను. పఱిహితోపదేశానుసారము శ్రీశారదా దేవి యామెను తన యత్తగారివలెనే భావించుచు, ప్రేమ గౌరవములతో, వినయవిధేయతలతో సేవించుచుండెను.

వినయము కంటె ఒప్పులకు పట్టుకొమ్మగాని, అహంకారముకంటె తప్పులకు ఆలవాలముకాని మఱియొకటి లేదు. వినయవంతుఁడగువానికే జ్ఞానలాభము గలుగుననియు, మిట్టిపడువాని హృదయమునుండి జ్ఞానము కొట్టుకొనిపోవుననియు శ్రీరామకృష్ణుఁడు వచించును. యోగానుభూతులను బడసియు, బ్రాహ్మణి ఆత్మనిగ్రహమును గోల్పోయెను. ఒకనాఁ డామె హృదయునితో నేదియో అల్పవిషయమునుగూర్చి పెద్ద జగడము తెచ్చిపెట్టుకొనెను. ఇంటిలోని యితర వ్యక్తులందఱును జేరి దానిని బరిష్కరింపవలసివచ్చెను. బ్రాహ్మణి మొదట ఈయవమానమున కెంతయో దుఃఖించి, పిమ్మటఁ దనతప్పు గ్రహించి సిగ్గుపడెను. పశ్చాత్తాపతప్తురాలైన యామెకుఁ దా నిటీవల చేసిన తప్పులేకాక, వానికి మూలమగు తన

మనోదౌర్బల్యమును గోచరింపఁ, దా నా కుటుంబమున నిఁక నివసింపరాదని నిశ్చయించుకొనెను. శ్రీరామకృష్ణునియెడఁ దన కేర్పడిన ఆసక్తి స్వర్ణపాశమువంటిదనియు శ్రేయమార్గ మునఁ బురోగమించుటకై దానిని విడఁ దీసికొనవలయుననియు నామెగ్రహించెను. 'పరివ్రాజకజీవితమును, ప్రవాహజలమును ఎన్నఁడును కలుషితముకావు' అని యెఱింగియుండిన యామె యందులకై సంసిద్ధురాలయ్యెను. కొలఁదిదినములైనపిమ్మట నామె యెంతయో శ్రద్ధతో గ్రుచ్చి చందనచర్చితములొనర్చిన పుష్పమాలలను గైకొనివచ్చి, శ్రీచైతన్యదేవావతారమను విశ్వాసమున వానితో శ్రీరామకృష్ణు నలంకరించి, క్షమాపణ వేఁడికొని కామార్పుకుర్ విడిచి వెళ్లెను. తన పరమపూజ్య శిష్యునితో నామె గడపిన దాఱేండ్లు, ఎవరికన్నుల నెవ రెట్లు తెలిచిరో చూచితిమికదా! శ్రీరామకృష్ణుని సంసర్గము ఆతని గురువులైనంతటివారికి సైతము ఎట్లు గురుతర ప్రబోధకర మయ్యెనో గమనించితిమికదా!

హృదయుని తల్లి—శ్రీరామకృష్ణుని మేనత్తకుమార్తె యగు హేమాంగినీదేవి—శ్రీరామకృష్ణుఁ దన యిష్టదైవ ముగ నుపాసించుచు, ఆతనిపాదములను పుష్పచందనములతోఁ బూజించెడిది. కాశిలో మరణించునట్లు వరమిమ్మని యొకనాఁ డామె ప్రార్థించెను. దివ్యభావపారవశ్యస్థితిలో శ్రీరామ కృష్ణుఁడు ఆమె శిరమునఁ దన పాదము నిడి కోరిన వర మొసఁగెను. తుదివఱకును స్మృతితో నామె నిజముగా కాశిలోనే పరమపదించెను.

కామార్పుకుర్‌న ఆఱేడు నెలలు గడపి, శ్రీరామ కృష్ణుఁడు హృదయునితో దక్షిణేశ్వరమునకు మఱలెను.

# మథురునిపై అనుగ్రహము

మథురునిపై శ్రీరామకృష్ణుని యనుగ్రహమున కే మైనను హేతు వనునది యున్నచో, అయ్యది మథురుని భక్తియే యని చెప్పనొప్పును. శ్రీరామకృష్ణునియెడఁ దన గాఢభక్తివిశ్వాసములను వెల్లడించుచు, హృదయునితో నొకప్పు డాతఁడు, "హృదయమహాశయా! నా భార్య, బిడ్డలు, ఐశ్వర్యము, పదవి, తదితరమైన సర్వము మిథ్య; శ్రీరామకృష్ణుఁడే సత్యము" అని వక్కాణించెను.

మథురుఁడు ప్రతిసంవత్సరము దేవీనవరాత్రమునఁ దనయింట విశేషశ్రద్ధాభక్తులతో శ్రీ దుర్గాపూజామహోత్సవములు జరుపును. ఇట్టి యొకసందర్భమున, విజయదశమి నాఁడు, దేవిని ఉద్వాసన మొనర్పవలయు సమయమున, కడసారి ప్రణామాదుల నాచరించుటకై రమ్మని పురోహితుఁడు పదేపదే మథురునకుఁ గబురంపుచుండెను. కాని మథురుఁడు భక్త్యుద్రేక పూరితుఁడై, "అమ్మను విసర్జింపనీయను. పూజ యథాప్రకారముగనే జరుగుచుండును. నా సమ్మతి లేనిదే అమ్మ నెవ్వరైనను గంగలో విసర్జించిరా,...జాగ్రత్త!" యని హెచ్చరించెను. ఈ సమాచారము విని శ్రీరామకృష్ణుఁడు వచ్చి, సంగతిసందర్భములను మథురునివలననే విని, యాతని హృదయమును నిమురుచు నిట్లు పలికెను : "ఓహో! ఇదియా నీభయము! కాని నీవు అమ్మను వీడియుండవలయు ననువా రెవ్వరు? ప్రతిమను గంగలో విసర్జించినను, అమ్మ యెచటికిఁ బోవును? తల్లి తన బిడ్డను వీడి మనఁగలదా!

బాహ్యముగా, నీభవనమున ఆసీనురాలై యీ మూఁడు దినములును నీపూజను స్వీకరించినది. కాని యింతటినుండి అమ్మ నీ కింకను సన్నిహితురాలై, నిరంతరము నీ హృదయమున అధివసించుచు నీపూజను స్వీకరించును ''

ఆ మహిమాన్వితస్పర్శయు భక్తిజ్ఞానామృతవీచికలైన యీ వాక్కులను మథురునకు అపూర్వశాంతిని—మధుర ప్రశాంతిని—గల్గించెను. హృదయమున దేవి భాసించుట గోచరించియుండనోపును. ప్రతిమానిమజ్జనమున కాతఁడు వెనువెంటనే సమ్మతించెను. స్పర్శచే, వాక్కుచే, కటాక్షముచే సద్గురువరేణ్యులు మహత్తరమైన మనఃపరివర్తనము గల్గింప గలరనుట కిది యొక నిదర్శనముగదా? శ్రీరామకృష్ణసూర్య కరస్పర్శనమున శిష్యహృదయకమలము లెట్లువికసించెడివో ఇటుపైఁ గనుఁగొనఁగలము. అది హృదయాంతరభావస్పర్శ. తాను స్పృశించునపుడు శిష్యుని మనోమాలిన్యము తొలఁగ, వాని నిర్మలదృష్టిని సత్యము భాసించునని యాతఁ డిందలి రహస్యము దెల్పును.

శ్రీరామకృష్ణునియెడ మథురుని గాఢభక్తిని నిరూపించు నొక సంఘటనము. అపాయకరమైన వ్రణముచే మథురుఁ డొకప్పుడు మంచముపట్టియుండి, తన కొకసారి వచ్చి దర్శన మిమ్మని పలుసారులు శ్రీరామకృష్ణునకు వర్తమానమంపెను. ఆతఁడు వచ్చినంతనే మథురుఁడు మహాశ్రమపడి లేచికూర్చుండి యామహనీయుని పాదరజమునకై యాచించెను. ''దానివలన నీకేమి ప్రయోజనము! అది నీవ్రణమును మాన్పునా?'' అని శ్రీరామకృష్ణుఁడు అడుగ, మథురుఁడు ఇట్లు పలికెను:

"వ్రణచికిత్సకై వైద్యు లున్నారు. కాని సంసారసాగరమును తరించుటకై నేను కోరునది నా రక్షకుని పాదధూళి!" వెంటనే శ్రీరామకృష్ణుఁడు భావసమాధిస్థితుఁడై యొప్ప, మథురుఁడు తన కన్నులవెంట బాష్పధారలు ప్రవహింప, మహాభక్తిపూర్వకముగా ఆతని పాదకమలములందుఁ దన శిరము నుంచెను. అచిరకాలముననే యాతఁడు వ్యాధి నివారణ నొందెను.

దివ్యభావపరవశుఁడై శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు మథురునితో, "నీవు జీవించియున్నంతపర్యంతము నే నిచట (దక్షిణేశ్వరమున) నుందును" అని పలుక, మథురుఁడు శ్రీరామకృష్ణసేవాసాన్నిధ్యమహాభాగ్యము తన భార్యకును, కుమారుఁడగు ద్వారకానాథునకునుగూడ యావజ్జీవితము లభింపవలయునను నాత్రమును బ్రకటింప, శ్రీరామకృష్ణుఁడు "మంచిది ; నీభార్యయు 'ద్వారి'యు జీవించియున్నంతవఱకు దక్షిణేశ్వరముననే యుందును" అని యనుగ్రహించెను. వారల యనంతరమే యాతఁడు దక్షిణేశ్వరము వీడెను.

మథురుఁడు తన ప్రతిరహస్యము శ్రీరామకృష్ణునకు విన్నవించుకొను రీతినే ఆతఁడును ప్రాయికముగా సర్వవిషయములందును మథురునితో సమాలోచించి, బాలకునివలె ఆతని సలహా, లేదా, అభిప్రాయము గైకొనును. ఐనను ఆతఁడు మథురుని ఐశ్వర్యము సద్వినియోగ మగునట్లు చూచును. యోగీశ్వరునిసర్వజ్ఞత్వము,పసిబాలకునిఅమాయికత్వమును అద్భుతరీతిని శ్రీరామకృష్ణునియందు సమ్మేళన మొందియుండుట గాంచి మథురుఁడు ముగ్ధుఁడై యాతని

శరీరరక్షణభారము తాను వహించుచు, తన శ్రేయోభారము నాతనిపై నిడెను. వ్యావహారిక విపత్తులలోఁ జిక్కుకొన్నప్పుడును శ్రీరామకృష్ణునే యాతఁడు ఆశ్రయించుచుండును. ఒకప్పు డాతఁడు తన బలఁగమునకుఁ దన యెదిరిపక్షపు జమీందారుని బలఁగముతో యథేచ్ఛముగాఁ బోరాడ నాజ్ఞ యిచ్చెను. ఈపోరాటమునఁ గొందఱు మడిసిరి. శాసన సంబంధమైన విపత్తునకుఁ దాను గుఱి కానుండుట కనుఁగొని, వెంటనే వెళ్లి శ్రీరామకృష్ణుని పాదసన్నిధిని వాలి, "బాబా! రక్షింపుము!" అని ప్రార్థించెను. శ్రీరామకృష్ణుఁడు మొదట గట్టిగాఁ గూఁకలిడుచు, "ఓధూర్తుఁడా! రోజూ నీ వేదో తంపి తెచ్చి పెట్టుకొని వచ్చి, 'నన్ను రక్షింపు' మనుచుందువు! నేనేమి చేయఁగలను? పోయి స్వయంకృతకర్మఫలము ననుభవింపు"మనెను. కాని మధురుఁడు పట్టుపట్టి బతిమాలుకొన, తుద కాతఁడు, "వెళ్లు! అమ్మ సంకల్పము ఎట్లున్నదో అట్లగును!" అని పలికెను. మధురునకు విపత్తు తొలఁగిపోయెను.

శ్రీరామకృష్ణుని సమాధిస్థితులనే కాక, ఆతని యపార దివ్యప్రభావమున కెన్నియో నిదర్శనములను కన్నులారఁ గాంచుచుండిన మధురుఁడు స్వయముగా సమాధిదివ్యానందానుభవము నందనభిలషించి, ప్రార్థింప నాతఁ డిట్లు సమాధానించెను: "ఓహో! అది సకాలమున ప్రాప్తించును, సకాలమున ప్రాప్తించును. గింజ పాతినంతనే చెట్టయి ఫలించునా? ఏల? నీపరిస్థితి బాగుగనే యున్నది—ఈవైపు, ఆవైపు—రెండు వైపులును (ఇహపరము లని భావము) నడచుచున్నవి. అవన్నియు (సమాధి మొదలైనవి) నీకు

ప్రాప్తించెనా, నీ జమీందారి చక్కఁగా నిర్వహించుకోఁ జాలవు. సర్వము తాఱుమాఱు అగును.'' కాని మథురుఁడు పట్టుపట్టెను. అంతట శ్రీరామకృష్ణుఁడు, "సరే, అమ్మ నడిగెదను. ఆమె తన యిచ్ఛానుసారము చేయును'' అని పలికెను. కొన్ని దినము లైనంతనే మథురునకు నిజముగా సమాధిస్థితి కలిగెను. తన జమీందారి నిఁక నాతఁ డెంత మాత్రము నిర్వహించుకోఁ జాలకుండెను. ఆతఁ డాడును, పాడును, నవ్వును, అశ్రుధారలు ప్రవహింప నిష్కారణముగా నేడ్చును. ఈ విచిత్రపరిణామమునకు కారణము గ్రహింపఁ జాలక బంధువులు ఘనవైద్యులచే చికిత్సచేయింపసాగిరి, కాని నిష్ప్రయోజన మయ్యెను. ఎల్లరును మహాందోళన మొందుచుండిరి. తుదకు మథురునిసూచనపై శ్రీరామకృష్ణునకు వర్తమాన మంపఁబడ నాతఁడువచ్చెను. ఈయద్భుతసంఘట నమునుగూర్చి యాతని వాక్కులనే ఆలకింతము :

"వెళ్లి చూచుసరికి ఆతఁడు విచిత్రస్థితిలో నుండెను. కన్నులు ఎఱ్ఱవాఱియుండెను. భగవంతునిగూర్చి యాతఁడు ప్రసంగించుచుండ చెక్కిళ్లపై అశ్రుధారలు ప్రవహించుచుండెను. ఒళ్ళు దడదడలాడు చుండెను. వచ్చి నాపాదములను పెనవైచుకొని, 'బాబా! క్షమింపుఁడు! మూన్నాళ్లుగా ఈ స్థితిలో నున్నాను. ఎంత ప్రయత్నించినను మనస్సు వ్యవహారముమీఁదికిఁ ద్రిప్పుకోఁజాలకున్నాను; సర్వము తాఱు మాఱైనది. దయయుంచి మీ భావసమాధిస్థితిని మీరే తీసికొనుఁడు, నాకిఁక వలదు' అనెను. 'ఏల? నీవే కదా కావలయునని పట్టుపట్టితివి?' అంటిని. అందు కాతఁడు, 'నిజమే, ఈ స్థితివలని ఆనందముకూడ అనుభ వించుచున్నాను. కాని నేనిట్లే ఉండిపోతినా, జమీందారి ధ్వంసమై

పోవును. మీకేకాని మాకుఁ దగని స్థితి ఇది. కావున దయయుంచి తిరిగి తీసికొనుఁడు' అనెను. నవ్వి, నేను, 'ఆ సంగతి మునుపే చెప్పితిని గదా? కాని నీవు విననైతివి' అంటిని. 'నిజమే బాబా! కాని యిది నన్ను భూతమువలె ఆవేశించి సదా తన చిత్తానుసారము త్రిప్పునని అప్పుడు నా కెట్లు తెలియును?' అన్నాఁడు మథురుఁడు! అంతట చేతితో రొమ్ము నిమురఁగా, అతఁడు స్థిమితపడెను.”

ప్రబలమైన ఆధ్యాత్మికస్థితులను భరించుటకుఁ దగు శిక్షణయు సాధనయు అత్యావశ్యకము. లేనిచో, తన్మూలమున శారీరమానసిక ప్రతిఘాతములు—అనర్థములు—సైతము సంభవించును. ఆశించుటకు ముందు అర్హత కలిగియుండవలయును. నానావిధభక్ష్యభోజ్యపానీయములతోఁ గూడిన దివ్యభోజనమును ఆరోగ్యవంతుఁడు, క్షుధార్తుఁడు నగువాఁడే కదా తనివి తీర నారగించి జీర్ణించుకొనఁగల్గుచున్నాఁడు! ఇట్లే బ్రహ్మానందానుభవమునకును వినిర్మలశీల మనెడి ఆరోగ్యమును, భగవత్పరితాప మనెడి ఆఁకలియు ఆవశ్యకము. వేదాంతమైనను, యోగశాస్త్రమైనను, మఱియే ఆధ్యాత్మిక శాస్త్రమైనను బ్రహ్మచర్యాదికమైన సాధనసంపదనుగూర్చి మున్ముందు నొక్కి వక్కాణించుచుండుట సువిదితము. ఐహిక వాంఛలను పరిత్యజింపనిదే మహోత్తమాధ్యాత్మికస్థితుల నందఁగోరుట నిష్ప్రయోజన మనియు హాస్యాస్పద మనియు మథురుని చరిత్రయందలి యీ సంఘటనము లోకమునకు బోధించు మహత్తర గుణపాఠము.

శ్రీరామకృష్ణుని సుఖజీవనమున కేదియో కొంత శాస్త్రాధారము నేర్పఱుపవలయు నని మథురుని మహాభి

లాష. కాని అఖండత్యాగతపోధనుఁ డగు శ్రీరామకృష్ణుఁ డందుల కొల్లఁడయ్యె. చంద్రాదేవి దక్షిణేశ్వరమున నుండ, మథురుఁడు తన యభిలాషను నెఱవేర్చుకొనవచ్చునని తలఁచి, యొకనాఁ డామెను సమీపించి, యిచ్చ వచ్చిన దేనినైనను తన్నడుగుఁ డని—తనవలన నేదియో యొకటి స్వీకరింపక తప్పదని—పట్టుపట్టెను. ఏ మహాభూదానమో, గృహ దానమో, ధనదానమో చేయవలయునని యాతని హృద యాభిలాష. చంద్రాదేవి యాశ్చర్యపడి, యెంత యాలోచించినను కోరఁదగిన దేమియుఁ దోఁపక, చిట్టచివరకు, "సరే, ఏమైనను ఈయక తప్పనియెడల, ఒక అణా పెట్టి పొగాకు కొనియిమ్ము, పండ్లపొడి చేసికొందును" అనెను. ఈపరమాదర్శసంతృప్తిని, తన్మూలమగు నిస్పృహత్వమును గనిన మథురునకు కన్నుల నీరు గ్రమ్మ, "ఆహా! ఇటువంటి తల్లిగాక మఱెవ్వరు శ్రీరామకృష్ణునివంటి పుత్త్రునిఁ గనఁ గలరు!" అని తనలోఁ దా ననుకొనుచు, నాతఁ డామెకు సాష్టాంగవందన మొనర్చెను.

# తీర్థయాత్ర

తీర్థమహిమయు తీర్థసంసేవనప్రభావమును వేదశాస్త్ర పురాణాదులందేకాక, యించుమించుగా సమస్తమతధర్మ గ్రంథములందును ప్రకటింపఁబడియున్నవి. "తీర్థములలో— పుణ్యక్షేత్రములలో—నేమున్నది? అంతా మనమనస్సులోనే ఉన్నది" అనువారు సర్వసాధారణముగా మెట్టవేదాంతులు, నాస్తికులునేకాని పారమార్థికులు కారు. తీర్థయాత్రలు ఆధ్యాత్మికవికాసమున కెట్లు తోడ్పడునో తెల్పుచు శ్రీరామ కృష్ణుఁ డిట్లు ప్రవచించును :

"భగవత్సాక్షాత్కారమును గోరి యెందఱెందఱో చిరకాలము జపతపములను, ధ్యానమును, ప్రార్థనలను, పూజలను సలిపిన పుణ్యస్థలము లందు భగవానుఁడు నిశ్చయముగా వెలసియుండునని గ్రహింపుఁడు. వారి శ్రద్ధాభక్తులచే పారమార్థికభావము లచ్చట ఘనీభూతమైయుండునని చెప్పవచ్చును. కావున నిట్టి పుణ్యతీర్థములందు సులభముగా భగవద్భావ ములు ఉద్దీప్తమై భగవద్దర్శనము లభించును. యుగయుగాంతరముల నుండియు అసంఖ్యాకులగు సాధువులు, భక్తులు, సిద్ధపురుషులును ఈశ్వర సాక్షాత్కారము నొందుటకై యిట్టి పుణ్యక్షేత్రములకు వచ్చి, సకల వాంఛలను విడనాడి, భక్తిపూరిత హృదయముతో ప్రార్థనలు సలిపి యుందురు. కావున భగవంతుఁడు సర్వత్ర నిండియున్నను, ఈపుణ్య క్షేత్రములందు ముఖ్యముగా వెలసియుండునని గ్రహింపుఁడు. ఎక్కడ త్రవ్వినను నీరు దొరకును; కాని బావియో, కోనేటో, సరస్సో ఉన్న తావున త్రవ్వవలసిన పనిలేకయే, కావలయునన్నప్పుడెల్ల సులభముగా, సిద్ధముగా, జలము లభించును గదా!"

మథురుఁడును ఆతని భార్యయు శ్రీరామకృష్ణుని తోడను, హృదయునితోడను, శతాధికపరివారముతోడను ఉత్తరభారతదేశమునకు తీర్థయాత్రలకై బయలుదేఱిరి. నాఁడు

క్రీ.శ. 1868–వ సం॥ జనవరి 27–వ తేది. దారిలో దేవఘుర్, లేక వైద్యనాథ మను పుణ్యక్షేత్రమున నాఁగి, తత్సమీప గ్రామముమీఁదుగాఁ బోవుచుండ, ఆగ్రామవాసుల దుఃస్థితిని గని శ్రీరామకృష్ణుఁడు మహాదుఃఖితుఁడై మథురునితో నిట్లు పలికెను: "నీవు అమ్మ (జగజ్జనని) 'రసద్దారు'వు. ఈపేదల కందఱకును సంతర్పణ జరిపి యొక్కొక్కరి కొక్కొక్క బట్ట నిమ్ము." అందఱ జనులకు అన్నవస్త్రదానము చేయఁ బూనినచో, యాత్రకు ధనముచాలకపోవచ్చునని మథురుఁడు మొదట సంశయింప, శ్రీరామకృష్ణుఁడు వారల దుర్భర దారిద్ర్యమును గని మహాపరితప్తుఁడై కన్నీరు గార్చుచు, "ఛీ! నేను కాశి రాను. ఈదీనులతో ఇక్కడనే ఉండి పోవుదును" అని మథురునియొద్దనుండి వెళ్లి యాపేదలతోఁ గూర్చుండెను. ఇట్టి దీనజనసానుభూతి కెవ్వని హృదయము కరఁగిపోకుండును! మథురుఁడు వెంటనే కలకత్తానుండి బేళ్ల కొలఁది బట్టలను తెప్పించి వారికిఁ బంచిపెట్టి సంతర్పణకూడ జరిపెను. పరమానందభరితుఁడై శ్రీరామకృష్ణుఁ డంతట కాశికి బయలుదేఱెను. దీనార్తదరిద్రనారాయణసేవకై కాలక్రమమున దేశదేశాంతరములలో శ్రీరామకృష్ణసేవాశ్రమములను నెలకొల్పిన శ్రీవివేకానందస్వామి యీ దీనజన బాంధవుని ప్రియతమశిష్యుఁడే కదా!

భారతపుణ్యక్షేత్రరాజము, శివనిత్యధామము నై వెలయు కాశి సమీపించినంతనే శ్రీరామకృష్ణున కయ్యది —పురాణములు తెల్పురీతిని—సువర్ణనిర్మితమై యున్నట్లు దివ్యదర్శనము గల్గెను. అనాదిగా అసంఖ్యాకులైన మహాభక్తు

లయు, యతివరేణ్యులయు, తాపసోత్తములయు దివ్యభావములు పుంజీభూతమై యద్దానిని దేవతాధామ మొనరించెనో యన, నిజమైన వారణాసి ఆధ్యాత్మికముగా, సువర్ణమయముగా భాసించెను; బాహ్యభౌతిక కాశియో, కేవలము దానినీడ. మహోజ్జ్వలమైన యాదివ్యదర్శనముచే నాతఁడు దివ్యభావపరవశుఁడై మొదటఁ గొన్ని దినముల వఱకును మలమూత్రవిసర్జనమునకై తదీయాధ్యాత్మికావరణమైన అసీనదిని దాఁటి వెడలుచుండువాఁడు.

కాశిలో మథురుఁడు పండితసన్మాన సంతర్పణములను జరిపెను. శ్రీరామకృష్ణుఁడు తన యనుచరుఁడగు హృదయునితో నించుమించుగా ప్రతిదినము విశ్వనాథాలయమునకు వెడలి సేవించువాఁడు. దేవతాసన్నిధినే కాక, దారిలో సైతమాతఁడు సమాధిస్థితి నందువాఁడు. కేదారనాథాలయమున నాతఁడు పొందుచుండెడి సమాధి మహాగాఢమై యొప్పుచుండెడిదని తెలియవచ్చుచున్నది.

కాశియందలి ప్రసిద్ధయతీంద్రులను శ్రీరామకృష్ణుఁడు సందర్శించెను. మథురునితో నాతఁడు నానక్ పంథీలనువారి మఠమునకు వెళ్లి వారి దైవభక్తిని గని పరమానందభరితుఁడయ్యెను. ఒకనాఁ డాతఁడు సుప్రసిద్ధ త్రైలింగస్వామిని సందర్శింప వెడలెను. తమ జన్మముచే ఆంధ్ర దేశమునకు చిరకీర్తి నొనగూర్చిన మహనీయులలో ప్రధానగణ్యుఁడగు స్వామి యపుడు మౌనదీక్షలో నుండెను. కూర్చుండుమని సంజ్ఞ యొనర్చి, స్వాగతచిహ్నముగా నాతఁడు శ్రీరామకృష్ణునకుఁ దన పొడుముడబ్బీ నందించెను. త్రైలింగస్వామి

పారమార్థిక ప్రతిభాతిశయమును గొనియాడుచు, శ్రీరామ కృష్ణుఁడు తన యీసమావేశమునుగూర్చి యనంతర మిట్లు వచించెను: "సాక్షాత్తు విశ్వనాథుఁడు ఆయనశరీరమున రూపుదాల్చి వెల్గొందుచున్నట్లు కనుఁగొంటిని! ఆ మహానీయుని యునికివలన కాశి మహత్తరపవిత్రమై భాసించుచుండెను! మహోత్తమజ్ఞానావస్థ యది! శరీరస్ఫురణమే లేదు; ఎవ్వరును అడుగుపెట్టఁజాలనంతటి వేఁడియిసుక— ఆయన ఉన్నచోట! కాని దానిపై హాయిగాఁ బండుకొని యుండెను! పాయసము వండి తీసికొనివెళ్లి తినిపించితిని. అప్పుడాయన మౌనవ్రత మవలంబించియుండెను. 'ఈశ్వరుఁడు (ఈశ్వరతత్త్వమని భావము) ఏకమా, అనేకమా?' యని సంజ్ఞచే అడిగినాను. సమాధిస్థితిలోనుండి చూచునపుడు భగవంతుఁడు ఏకమనియు, వ్యావహారికజ్ఞానావస్థలోనుండి చూచునపుడు అనేకమనియు సంజ్ఞలచే సమాధానించెను. హృదయునకు ఆయనను జూపి, 'ఇదియే నిజమైన పరమహంస స్థితి' యంటిని." పరమహంసలే కదా పరమహంసలను గుర్తింపఁగల్గువారు!

మణికర్ణికయొద్ద త్రైలింగస్వామి యప్పుడొక స్నానఘట్టమును నిర్మించుచుండెను. శ్రీరామకృష్ణుని పనుపున హృదయుఁ డందులకై కొన్ని పాఱలమట్టి త్రవ్వఁగా, స్వామి చాల సంతసించెను. తమబసకొకనాఁడు స్వామి నాహ్వానించి యఖండగౌరవముతో శ్రీరామకృష్ణుఁడు ఆతిథ్య మొసఁగెను.

కాశీక్షేత్రమాహాత్మ్యమును జాటు నొక మహాద్భుత దివ్యదర్శనము శ్రీరామకృష్ణునకు కాశిలోనే కలిగెను.

ఒకనాఁడాతఁడు హృదయునితోడను, మథురునితోడను, ఒకపండాతోడను గంగానదిపై పడవలోఁ బయనించు చుండెను. పడవ మణికర్ణికను సమీపింప, నచటి శ్మశాన మందలి శవదహనమును గని, అకస్మాత్తుగా ఆనందపర వశుఁడై వడిగా పడవయంచునకు వెడలి సమాధినిమగ్నుఁడై నిల్చెను. నదిలోఁ బడకుండఁ గాపాడుటకై కొందఱు రయమున ముందునకు వచ్చిరి. కాని యాతఁడు దివ్యదరహాసకాంతులను వెదచల్లుచున్న ముఖమండలముతో నిశ్చలుఁడై యచట నిలిచియుండ, నెవ్వరును గాపాడనక్కఱయే లేకపోయెను. తన దివ్యానుభూతినిగూర్చి యనంతర మాతఁ డిట్లు వచించెను: "పొడవరియు, పింగళవర్ణ జటాధారియు, శ్వేతవర్ణుఁడును నగు నొక పురుషుఁడు మెల్లగా నడుగు లిడుచు, ప్రతిచితి కడకును వెడలి, నెమ్మదిగా అందలి జీవునిఁ బైకెత్తి, చెవిలో తారకబ్రహ్మమంత్ర ముపదేశించుచుండుట కనుఁగొంటిని! సర్వశక్తిమయి యగు శ్రీజగదంబ—మహాకాళి—కాష్ఠమున కవ్వలిప్రక్క గూర్చుండి, యాజీవుని స్థూలసూక్ష్మకారణాది బంధముల నన్నిఁటిని విడఁదీసి, స్వయముగా మోక్షద్వార మును తెఱచి, కైవల్యధామమున కనుపుచుండెను. ఎన్నో యుగముల యోగతపోనిష్ఠలచేఁ బొందనగు అద్వైతానుభవ భూమానందమును శ్రీవిశ్వనాథుఁడు క్షణములో ఆజీవులకు ఈవిధముగ ప్రసాదించి వారిని కృతార్థుల నొనర్చుచుండెను."

యాత్రికబృందముతో శ్రీరామకృష్ణుఁడు తాత్కాలి కముగా ప్రయాగకు వెడలి, గంగా యమునా సరస్వతీ సంగమమగు త్రివేణీసంగమమున స్నానమాచరించి, తిరిగివచ్చి

బృందావనమునకు బయలుదేఱెను.

భూమియు భాగవతులకు భూవైకుంఠమునగు బృందావనమున శ్రీరామకృష్ణుఁడు పొందిన దివ్యానందానుభవములు వర్ణనాతీతములు. వానినిగూర్చి యాతఁడే యిట్లు తెల్పెను:

“(మందిరమున) బంకువిహారిని (బంకువిహారియను శ్రీకృష్ణవిగ్రహమునని భావము) గని పరవశుఁడనై ఆలింగన మొనర్చుకొనుటకై పరుగెత్తితిని. గోవిందజీని జూచినప్పుడు నాకట్టి భావపారవశ్యము గలుగలేదు. కాళియ దమనఘట్టమును జూచినంతమాత్రముననే వివశుఁడనై పోవ, హృదయుఁడు నన్ను పసిబిడ్డనువలె స్నానముచేయించువాఁడు. సాయంకాలము యమునా తీరమున నడయాడుచుండువాఁడను. అచట పెద్ద రేఁగుచెట్లనడుమ పర్ణకుటీరము లుండెను. మేఁత మేసి తిరిగివచ్చుచున్న ఆలమందలను ఒకనాఁడు సాయంకాలము చూచితిని. అవియు వాని వెనుక గోపబాలకులును యమునానది నీఁదికొని వచ్చుచుండిరి. ఆదృశ్యము వెంటనే శ్రీకృష్ణుని జ్ఞప్తికిఁ దేఁగా, భావపరవశుఁడనై, ‘ఆహా! కృష్ణుఁ డేఁడీ! కృష్ణుఁ డేఁడీ!’ అని ఉన్మత్తునివలెఁ గేకలిడుచుఁ బరుగెత్తితిని. శ్యామకుండమును రాధాకుండమును (మధురకుఁ గొన్ని మైళ్ళ దూరమున నున్న పావన తటాకములు) దర్శింప నొక పల్లకి నెక్కి వెళ్లితిని. త్రోవలో గోవర్ధనగిరియొద్ద దిగి, వివశుఁడనై దాని శిఖరమునకుఁ బరుగిడిపోయి బాహ్యస్మృతిరహితుఁడనై నిలుచుంటిని. అపుడు వ్రజవాసులు (అచటి జనులు) వచ్చి మెల్లఁగా నన్ను దింపిరి. శ్యామకుండరాధాకుండములకుఁ బోవుదారిలో పూర్వపుఁబచ్చిక బయళ్లు, చెట్లు, పొదలు, పక్షులు, లేళ్లు,—శ్రీకృష్ణుని బాల్యక్రీడలకు నిలయమైన వీని నన్నిఁటిని—జూచి మనస్సు పట్టఁజాలకపోతిని. కన్నీళ్లు జలజల ప్రవహింప బట్ట తడిసిపోయెను. ‘ఓకృష్ణా! నీసహవాసభాగ్యముచే పవిత్రమైన ప్రతిదియు ఇచ్చట నున్నది, నీవుమాత్రము కానరాకున్నావు!’ అని భావించితిని. పల్లకీలో నుంటిని. కాని యొక్కమాటయైనను బలుకు శక్తి లేదు, ఆఁపుఁడని బోయీలకుఁ జెప్పఁజాలకుంటిని. హృదయుఁడు వెనుక వచ్చుచుండెను. ‘బహుజాగ్రత్తసుఁడీ! అని వారిని ముందే యాతఁడు హెచ్చరించియుండెను. శ్యామకుండరాధాకుండముల సమీపమున

సాధువులు పర్ణకుటీరముల నేర్పఱుచుకొని, వెలుపలి జనులు తమకు అగపడకుండుటకై ద్వారమువైపు వీఁపు త్రిప్పి సాధనల నొనర్చుచుండిరి."

బృందావనమున శ్రీరామకృష్ణుఁడు గంగామాత యను నొక గొప్ప వైష్ణవభక్తురాలిని సందర్శించెను. ఈమె మహోత్తమ దివ్యానుభూతుల నందినదని ప్రసిద్ధి. అప్పటి కామెకు అఱువదేండ్లుండును. ఈ మహనీయురాలి దివ్యగుణసంపద్వైభవము తన్నెంతగా ఆకర్షించెనో తెలుపుచు శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించును :

"గంగామాయి నన్నెంతో ఆప్యాయముతో, శ్రద్ధతో ఆదరించుచుండెడిది. ఆమె వృద్ధురాలు. నిధువనసమీపమున ఏకాంతముగా ఒక కుటీరమున నివసించుచుండెను. నా స్థితిని, సమాధ్యవస్థలో శరీరవిస్మృతిని జూచి, 'ఈతఁడు సాక్షాత్తు రాధాదేవిమూర్తిభావమే' యనును. నన్ను 'దులాలీ' యని (శ్రీరాధాదేవిముద్దుపేర) పిలుచును! ఆమెతో నున్నపుడు అన్నపానములమాట, బసకు మఱలుదమనుమాట—సర్వము మఱచిపోవువాఁడను. కొన్నిదినములు హృదయుఁడు అచ్చటికే భోజనము తెచ్చి తినిపించును. గంగామాయి కూడ నాకోసము అనేకపదార్థములు చేయును. ఆమెకు సమాధిస్థితులు గలుగుచుండెడివి. అట్టి సమయములలో గుంపులు గుంపులుగా జనులు ఆమెను దర్శింపవచ్చువారు. ఆమెను వీడివచ్చుటకు నాకు మనసు రాకుండెను; అచ్చటనే యుండుటకు సర్వము సిద్ధము చేసిరి. (జీర్ణశక్తి మందగించుటచే) నాకు ఉప్పుడుబియ్యము వండునట్లు ఏర్పాటైనది. కుటీరమున నొకచివర గంగామాయి, మఱియొక చివరను నేనును బరుండవలెననుకొంటిమి. ఈ విధముగా సర్వము సిద్ధమయ్యెను. హృదయుఁ డంతట, 'నీకు అజీర్తిబాధలు కలుగునపుడు నిన్నుఁ జూచువా రెవరు?' అనెను. గంగామాయి వెంటనే, 'ఏల? నేను జూతును, సేవచేయుదును' అనెను. ఈవిధముగా హృదయుఁడు ఒక చేతిని, గంగామాయి రెండవచేతిని పట్టుకొని నన్ను లాగిరి! ఆసమయమున దక్షిణేశ్వరమున ఒంటరిగా నివసించుచున్న మాతల్లిమాట నాకు జ్ఞప్తికి వచ్చినది. 'నేను బృందావనమున ఆఁగిపోయినయెడల, ఆమె కెంత యిబ్బందిగా నుండునో?' అని భావించితిని. దీనితో సమస్యా

పరిష్కారమైనది. వెళ్లకతప్పదంటిని."

ఒక్కమాటిది మాతృభక్తిపరాయణుడు, జగన్మాతృభక్తిపరాయణుడును శ్రీరామకృష్ణుడే! "పుష్పచందనములతో మా అమ్మను పూజించువాడను. సాక్షాత్తు జగన్మాతయే లోకమున మన తల్లియై ఆవిర్భవించుచున్నది. తలిదండ్రులను సంతుష్టులనొనర్పనిదే ఏ ఆధ్యాత్మికసాధనయు సఫలముకాదు" అని యాతడు తెలుపును.

బృందావనమున నాతడు వైష్ణవవేషము నవలంబించెను. మధురలో ధ్రువఘట్టమును గాంచినంతనే యాతనికి వసుదేవుడు చేతులలో శిశువగు శ్రీకృష్ణునెత్తుకొని యమునానదిని దాటుచుండినట్లు దివ్యదర్శనము కలిగెను.

బృందావనమున నించుమించుగా నొక పక్షము గడపి, యాత్రికబృందముతో శ్రీరామకృష్ణుడు తిరిగి కాశి వచ్చెను. తన తాంత్రికగురువగు భైరవీబ్రాహ్మణిని కాశిలో కలిసికొని పెక్కుమాఱులామెకడకు వెడలెను. జీవితాంతపర్యంతము కాశిలోనే యుండుమని శ్రీరామకృష్ణుడామెకు హితోపదేశమొనర్చెను. కొలదికాలముననే యామె పరమపదించెనట.

వీణాగానమును వినవలయు నను కుతూహలమున శ్రీరామకృష్ణుడు కాశిలో మహేశచంద్రసర్కార్ అను ప్రసిద్ధవైణికునియొద్దకు వెళ్లి, యాతని వాద్యస్వరములు చెవిని బడినంతనే సమాధిస్థితుడయ్యెను. ఒకించుక స్మృతి కలుగ, జగజ్జననిని, "అమ్మా! వీణాగానము వినవలయునని యున్నది. నాస్మృతిని హరింపకు"మని ప్రార్థించెను. పిమ్మట పరిపూర్ణస్మృతితో గానానందము ననుభవించుచు, అపు

డపుడు తానుగూడఁ బాడుచు, జాముసేపు పరమానందమున నోలలాడి, ఫలాహార మొనర్చి తిరిగి బసకు వచ్చెను. అనంతరము మహేశచంద్రుఁడు ప్రతిదినము శ్రీరామకృష్ణుని సందర్శింపవచ్చువాఁడు.

మథురుఁడు గయాక్షేత్రమును దర్శింపఁగోరెను; కాని స్వీయజననవృత్తాంతము నెఱిఁగియుండిన శ్రీరామకృష్ణుఁడు తా నచటికి రాఁజాలననెను—అచటికి వెడలినచో, తన మనస్సు అచట గదాధరభగవానునియందు శాశ్వతముగా లయమైపోవు నని యాతని విశ్వాసము. జగన్మాత చేతిలోని సాధనమాత్రుఁడనని పరిగణించుకొనిన యాతనికిఁ దా నామె దివ్యసంకల్పము నీడేర్చుటకై తన శరీర మింకను ఇలలో నిలువవలసియున్నదని తెలియును. కావున వారందఱును తిన్నఁగా కలకత్తా వచ్చిరి.

బృందావనధూళిని శ్రీరామకృష్ణుఁడు పిడికెఁడు కైకొని వచ్చి, తన తపోభూమియైన పంచవటియందుఁ గొంతచల్లి, మిగిలినదానిని తన సాధనకుటీరమున భూస్థాపిత మొనర్చి, "ఇపు డీస్థలము బృందావనమంతటి పావనమైనది" అని వచించెను. "గంగాజలమును సామాన్యజలముగఁ బరిగణింపఁ దగదు. బృందావనమృత్తికను సామాన్యమైన మట్టిగఁ దలంపరాదు. జగన్నాథప్రసాదమును అన్నముగ భావింపరాదు. ఈమూఁడును సాక్షాద్బ్రహ్మస్వరూపములు" అని యాతఁడు వక్కాణించును. కొలఁదిదినములైనంతనే మథురుఁడు—శ్రీరామకృష్ణుని యభిమతము ననుసరించి—భూరిదక్షిణలతో వైష్ణవసమారాధన జరిపెను.

# హృదయుఁడు, అక్షయుఁడును

"ఏచాయల నెల్లవారు నిజసత్త్వసమాన ఫలార్థు లేక దా!" అను నార్యోక్తికి హృదయుఁడు నిదర్శనభూతుఁడు. దక్షిణేశ్వరమున నెన్నో సంవత్సరములుగా శ్రీరామకృష్ణునితో నివసించుచుండియు, ఆ మహనీయసాన్నిధ్యభాగ్య మెట్టిదో ఆతఁడు గుర్తింపలేదు; ఆతనికి నానావిధసేవలను జేయుచుండిన వాఁడయ్యు, అందులకుఁదగు మనోభావము నలవఱుచుకొనఁ జూనలేదు; ఆ మహాద్భుత జీవితానుభవములను, ఆ దివ్య జీవితపరిణామములను కన్నులారఁ గాంచుచుండియు వాని నవగాహన మొనర్చుకొనుటకై ప్రయత్నింపను లేదు. ఇట్టిది గదా జన్మానుగతసంస్కారప్రభావము! సాంసారికవిషయ ప్రబలాసక్తత! ఆధ్యాత్మికజీవితమునకై తన కింకను గావలసినంత వ్యవధి యున్నదనియు, కుటుంబము సుసంపన్నమై, కాలక్రమమున భోగవాంఛలు మందగించినపిమ్మట ఆముష్మికముపై దృష్టి నిలుపవచ్చుననియు నాతని యభిప్రాయము. కాని తీర్థయాత్రలనుండి వచ్చిన పిమ్మట, భార్యావియోగము ప్రాప్తింప, దృక్పథము మాఱె, పరితాపముతో దేవినిగూర్చి ధ్యానప్రార్థనల నొనర్పసాగెను. శ్రీరామకృష్ణుఁడు పడసిన దివ్యానుభూతులవంటివి తానును బడయవలయునని, తన కట్టివానిని లభింపఁజేయుమని పట్టుపట్టి యాతనిని వేఁడుకొనెను. తనకు ఉపచరించుచుండుటచేతనే సమస్తలాభములు కలుగఁగలవని శ్రీరామకృష్ణుఁ డెంత చెప్పినను, హృదయుఁడు వినకుండుటచే, తుదకు శ్రీరామకృష్ణుఁడు, "సరి, అమ్మ

సంకల్ప మెట్లున్నదో అట్లు అగుఁగాక. నా ఇచ్ఛవలన నేమగును? నా మనఃపరివర్తన గల్గించి, యీ దివ్యావస్థల నన్నిఁటిని ఒనగూర్చిన దామెయే; ఆమె సంకల్పించినచో, నీవును పొందఁగలవు" అని యానతిచ్చెను.

కొన్ని దినములైనంతనే హృదయుఁడు దివ్యదర్శనము లనేకాక, పూజాధ్యానసమయములం దపుడపుడు అర్ధబాహ్య ప్రజ్ఞతోఁగూడిన భావసమాధిస్థితులనుగూడఁ బడయసాగెను. ఇవ్విషయమై మధురుఁడు ప్రశ్నింప, శ్రీరామకృష్ణుఁ డిట్లు సమాధానించెను: "ఈస్థితుల నతఁడు నటించుట లేదు. కొన్ని దివ్యదర్శనములకై అమ్మను పట్టుపట్టి ప్రార్థించెను. తత్ఫలిత మిది. త్వరలోనే అమ్మ వానిని జక్కఁజేయును." కాని మధురుఁడు చిఱునవ్వుతో నిట్లనెను: "కాదు, బాబా! ఇదంతా మీలీల! మీరే హృదయునకు ఈస్థితి కలిగించితిరి. తిరిగి సామాన్యస్థితికిఁ దీసికొనిరండని నామనవి. మేమిరువురము నందీ భృంగులవలె మీ సన్నిధియుండి మిమ్ము సేవించుచుండవలసిన వారము. ఇట్టి యాధ్యాత్మికస్థితులు మావంటివారికిఁగావు."

కొలఁది కాలమైనపిమ్మట నొక సాయంకాలము శ్రీరామకృష్ణుఁడు పంచవటివైపు పోవుచుండ, హృదయుఁడు తన సాయము కావలసివచ్చునేమో యని వెంబడించెను. అకస్మాత్తుగా అతని కొక అద్భుతదృశ్యము గోచరించెను. తన బాబు సామాన్యమానవుఁడుగాఁ గాక నానాదిక్కుల నావరించిన తేజముతో వెల్గొందు దివ్యశరీరముతోఁ గనిపించెను. జ్యోతిర్మయమైన యాతని పాదకమలములు భూమి నంటుటలేదు. భ్రమకాదుకదా యని హృదయుఁడు పదేపదే

కన్నులు నులుపుకొని చూడసాగెను. ఆశ్చర్యచకితుఁడై తనయందును ఏమైనను మార్పు సంభవించిన దేమో యని చూచుకొన, తా నాదివ్యపురుషుని నిత్యపరిచారకుఁడో యన, తదీయాంశసంభూతుఁడై సంసేవనార్థము భిన్నరూపము దాల్చెనో యన, తానును తేజోమయశరీరుఁడై యున్నట్లు కనుపట్టెను! ఆనందపరవశుఁడై తన్ను, లోకమును, లోకాభిప్రాయములను సర్వము మఱచి, ఉన్మత్తునివలె, "ఓ రామకృష్ణా! రామకృష్ణా! మానవులము కాదు మనము—ఏల యిచట నున్నాము? రమ్ము, దేశదేశములకుఁ బోయి జీవోద్ధారణ చేయుదము! నీవును నేనును అభిన్నులము" అని కేకలు వేయసాగెను. ఈకల్లోలము విని శ్రీరామకృష్ణుఁడు, "ఓహో! ఊరకుండుము! మన కేమి సంభవించిన దని ఆలాగున గావుకేకలు వేయుచున్నావు? ఏదో కొంప మునిఁగినదని జను లిచట గుమికూడుదురు" అని హెచ్చరించెను. కాని హృదయుఁడు ఊరకుండఁడయ్యె. శ్రీరామకృష్ణుఁడు వెంటనే యాతనికడకు వెడలి, వక్షము స్పృశించి, "అమ్మా! ఈధూర్తుని మరల స్తబ్ధునిఁ జేయుము!" అని ప్రార్థించెను. వెంటనే హృదయుఁడు పతితదేవతవోలె ఆనందవిరహితుఁడై యామహోన్నత స్థితినుండి తన సామాన్యమానసికస్థితిలోఁ జతికిలఁబడెను. తన పతనమునకుఁ బరితపించి యేడ్చుచు, శ్రీరామకృష్ణునితో నాతఁడు మొఱపెట్టుకొనెను. "నీవు జడుఁడవై పోవలయునని కాదు నా అభిప్రాయము. ప్రస్తుతము స్తిమితపడవలయునని కోరితిని. ఒక స్వల్పదృశ్యమునకే ఎంత గంధరగోళము చేసితివి! అందుచే అట్లు చెప్పవలసి

వచ్చెను. నే నెల్లప్పుడు అనేక దివ్యదృశ్యములు చూచు చుందును. కాని వానిని గూర్చి యెన్నఁడైనను ఈ విధముగా 'ఆర్భాటము' చేసితినా? వానిని జూచుటకు నీకింకను అర్హత రాలేదు. ప్రస్తుతము ఊరకుండుము. సకాలమున నిట్టివాని ననేకము చూతువు" అని శ్రీరామకృష్ణుఁడు ఓదార్చెను.

హృదయుఁడు తాత్కాలికముగా ఊరకుండినను, తీవ్ర ప్రయత్నముచే అట్టి దివ్యదర్శనములను మరలఁ బొందవలెనని సంకల్పించి యెక్కువగా ధ్యానప్రార్థనలు చేయసాగెను. పూర్వము శ్రీరామకృష్ణుఁడు ధ్యానించెడిచోటనే తానును దేవిని ప్రార్థింపవలయునని నిశ్చయించుకొని, యొకనడిరేయి పంచవటికిఁ బోయి, ధ్యానప్రార్థనార్థము ఆతఁడు శ్రీరామ కృష్ణుని యాసనము నధిష్ఠించెను. ఇదే సమయమున శ్రీ రామకృష్ణునకును అచటికిఁ బోవలయు నని బుద్ధిపుట్టి యాతఁడు వెడలుచుండఁగా, "అయ్యో! కాలిపోవుచున్నాను! బాబూ! రక్షింపుము!" అను హృదయుని ఆర్తనాదమును విని, శీఘ్రముగా వెళ్లి, "ఏమి జరిగినది?" అని యడిగెను. "ధ్యానమునకై యిచటఁ గూర్చుండుసరికి నాపై నెవ్వరో నిప్పులపల్లెము గుమ్మరించినట్లైనది. అయ్యయ్యో! భరింపలే కున్నాను ఈ బాధ!" అని గిజగిజలాడిపోవుచు హృదయుఁడు బదులు చెప్పెను. శ్రీరామకృష్ణుఁడు మెల్లగా ఆతని శరీరము నిమిరి, "చల్లఁబడిపోవును. కాని యేమిటికిట్లు చేయుచున్నావు? నాకు ఉపచరించుచున్నచో, సర్వము లభించునని నేను జెప్ప లేదా!" యనెను. శ్రీరామకృష్ణుని హస్తస్పర్శవలనఁ దన బాధయంతయు తత్‌క్షణమే మటుమాయమయ్యెనని హృద

యుఁడు చెప్పువాఁడు. తన్ను సేవించుచో, సర్వము లభించు నని శ్రీరామకృష్ణుఁడు తెలిపెనన్నచో, ఆతని వ్యక్తిత్వము, తదీయసేవాపరమార్గము నెట్టివో పాఠకులు పరికింతురు గాక!

1868-వ సం॥న, దేవీనవరాత్రమున, హృదయుఁడు తనయింట దుర్గాపూజ జరుపఁబూని శ్రీరామకృష్ణు నాహ్వానింప, నాతఁడు రాఁజాలనని చెప్పి యిట్లు ఊఱడించెను: "హృదు, విచారింపకు. సూక్ష్మశరీరమున ప్రతిదినము నీ పూజను జూచుటకై వత్తును. నీ వొక్కఁడవే నన్నుఁ జూడఁ గలవు." ఇట్లని, తత్పూజానిర్వహణమునుగూర్చి సవివరముగా బోధించెను. హృదయుఁడు ఆనందభరితుఁడై యింటికి వెడలెను. పూజాసమయమున మూఁడు నాళ్లును తేజశ్శరీరమునఁ దన పినతండ్రి దేవీప్రతిమప్రక్క నిల్చియుండుట చూచి హృదయుఁడు అమితాశ్చర్యానందభరితుఁ డయ్యెను. పూజానంతర మాతఁడు వచ్చి, జరిగిన వృత్తాంత మంతయు వివరింప, శ్రీరామకృష్ణుఁడు "ఔను, హారతిసేవాసమయము లందును, (మహాష్టమీ మహానవమీతిథుల సంధికాలము నందలి పరమపవిత్రమైన) 'సంధిపూజా' వేళను నీపూజను జూడవలయునని నిజముగా నాకు ఆతురత కలిగెను. అంతట సమాధిస్థితిలో తేజశ్శరీరమున, తేజోమయమార్గమున నీ పూజామందిరమునకుఁ గొంపోఁబడితిని" అని తెలిపెను.

సన్నిహితబంధువర్గమునఁ దన సౌశీల్యముచేతను, సాధన సంపదచేతను శ్రీరామకృష్ణునకు విశేషప్రీతిపాత్రులైన వారిలో ఆతని పెద్దన్నయగు రామకుమారుని యేకపుత్త్రుఁడు అక్షయుఁడు—ప్రధానగణ్యుఁడు. మిక్కిలి చక్కనివాఁడును,

ఇంటిలోనివారి కెల్లరకును అల్లారుముద్దుబిడ్డఁడును నైన యీ ధన్యాత్ముని, బాల్యమున, శ్రీరామకృష్ణుఁ డెత్తుకొని ముద్దాడు వాఁడఁట. దక్షిణేశ్వరమున, రాధాకాంతాలయమున అర్చకుఁ డైన యీతఁడు పూజించునపుడు తన్మయుఁడై, ధ్యాన నిమగ్నుఁడై, ప్రేక్షకభక్తజనసమూహముల యునికి సైత మెఱుంగకుండువాఁడని శ్రీరామకృష్ణుఁడే పలుకును.

తన వివాహానంతరము అక్షయుఁడు తీవ్రవ్యాధిగ్రస్తుఁ డయ్యెను. శ్రీరామకృష్ణుఁ డీసందర్భమున హృదయునితో నిట్లు పల్కెను: "వైద్యులు పొరపడినారు. ఇది సన్నిపాత జ్వరము. మంచి వైద్యునిఁ బిలిచి, నీసంతృప్తికోసము బాగుగా చికిత్స చేయింపుము. కాని (యీ) కుఱ్ఱవాఁడు బ్రతుకఁడు." అందులకు హృదయుఁడు, "ఇస్సీ! ఇట్టి యపశకునపుమాట లాడఁబోకు బాబూ!" యనెను. "అనవలయునని యిట్లను చుంటినా? అమ్మయే నాచే ఇట్లు పలికించుచున్నది. అక్షయుఁడు చనిపోవలెనని కోరుకునను కొనుచుంటివా!" అని శ్రీరామకృష్ణుఁడు సమాధానించెను. హృదయుఁ డెంతో ఆందోళనపడి, బాలుఁడు కోలుకొనుటకై సమస్తప్రయత్న ములు చేసెను; కాని వ్యాధి ప్రబలమై ప్రాణముమీఁదికి వచ్చెను. అవసానసమయమున శ్రీరామకృష్ణుఁడు అక్షయుని శయ్యప్రక్కకు వెడలి, "అక్షయా! 'గంగా, నారాయణా, ఓం రామా!' యను" మనెను. అక్షయుఁడు ఈపరమపావన మంత్రము ముమ్మాఱు ఉచ్చరించి ప్రాణములు విడిచెను. అక్షయుని మరణసందర్భమునఁ దనకుఁ గలిగిన స్మరణీయమైన యనుభవములను గూర్చి శ్రీరామకృష్ణుఁ డిట్లు తెలిపెను.

"అక్షయుఁడు నాకన్నెదుటనే మరణించెను. అపుడు నా కెంతమాత్రము దుఃఖము కలుగలేదు. ప్రక్కను నిలుచుండి (నేను) మానవు లెట్లు మరణింతురో చూచితిని. ఒఱనుండి కత్తిని పైకిఁ దీయుటవంటిది అది. కత్తి యెప్పటిదే, కాని ఒఱమాత్రము దిగవిడువఁబడినది. ఈదృశ్యమును జూచి, ఆనందమున నవ్వుచు, పాడుచు, నృత్యము చేసితిని. వారు కళేబరము తీసికొనిపోయి దహనము చేసిరి. కాని మఱునాఁడు (తనగదిప్రక్కనున్న వసారా చూపుచు) నే నక్కడ నిలిచి యుండఁగా, అక్షయుని మరణమును గూర్చి నాకు దుర్భరమైన వేదన కలిగినది—తడిబట్టను పిండునట్లు ఎవ్వరో నా హృదయమును మెలిపెట్టి పిండుచున్నట్లు అఖండబాధపడితిని. ఇట్లు భావించితిని: 'అమ్మా! దీనికి (తనకు) కట్టుబట్టతోనైనను సంబంధము లేదు, ఇఁక సోదరునికుమారునితో నేపాటి సంబంధము! ఐనను వాని మరణమునకు నేనే యింత బాధ పడినప్పుడు తమ యాప్తులు గతించునపుడు గృహస్థు లెంతగాఁ గుందుదురో కదా! అమ్మా! ఈ విషయము నాకు బోధించుచుంటివా?'

శకుంతల భర్తయొద్ద కేఁగునపుడు ఆమె యెడఁబాటునకు దుఃఖాక్రాంతుఁడై కణ్వమహర్షి పలుకు నీ క్రింది వాక్కులు ఈ సందర్భమున స్మరణీయములు:

శ్లో. "యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠస్స్తంభిత బాష్పవృత్తి కలుషశ్చింతాజడం దర్శనం
వైక్లబ్యం మమ తావదీదృశ మహో స్నేహాదరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథం ను తనయావిశ్లేష దుఃఖైర్నవైః."

—కాళిదాసవిరచిత శాకుంతలము.

# దీనజన సానుభూతి : కొన్ని

## విశేష సంఘటనలు

"పేదల దుఃస్థితినిగూర్చి యెవ్వని మానసము క్షోభించునో వానినే మహాత్ముఁ డందును, క్షోభింపనివాఁడు దురాత్ముఁడే" యని శ్రీవివేకానందస్వామి వక్కాణించును. వివేకానంద హృదయాధినాథుఁడగు శ్రీరామకృష్ణుని దీనజన సానుభూతి యెట్టిదో గమనించియున్నాము. అతఁ యుని మరణమునకుఁ గొలఁదికాలమునకుఁ బిమ్మట మథురుఁడు తన జమీందారియందు పర్యటనార్థము శ్రీరామకృష్ణునిఁదనతోఁ దోడ్కొని వెడలెను. ఇదివఱకు వైద్యనాథసమీపగ్రామము నందువలెనే శ్రీరామకృష్ణుఁ డీసమయమునను ఒక ఘోర దరిద్రగ్రామములోని జనుల దీనస్థితిఁ జూచి మహాదుఃఖితుఁడై, యాదీననారాయణసేవ చేయక తప్పదని మథురునితోఁ జెప్పెను. మథురుఁడు వారందఱకును సంతర్పణ జరిపి, యొక్కొక్కరికొక్కొక్క నూతనవస్త్రమును, కొంతనూనెను గూడఁ బంచిపెట్టెను. శ్రీరామకృష్ణుని సమాధిస్థితు లెట్టివో, ఆధ్యాత్మికమహిమాతిశయ మెట్టిదో అనేకులు గ్రహింపఁ జాలకపోవుదురేమోకాని, దీనుల దుఃస్థితిని గని క్షోభించి, విలపించి, అన్నవస్త్రాదులచే వారిని సంతృప్తి నొందించు వఱకును శాంతి నొందఁజాలని యాతని కరుణామయహృదయమునకు ముగ్ధుఁడు గానివాఁ డెవ్వఁడు?

కలకత్తాలోని కలుటోలా యను పేఁటయందలి యొక భక్తసమాజము శ్రీరామకృష్ణు నాహ్వానింప నాతఁడు

నీకు ఆదేశించిననేకాని యాయనలోకమునకు బోధింప నీవు అధికారివి గావు" అని గంభీరముగఁ బలికి సమాధినిమగ్నుఁడయ్యెను! ఉత్తరీయము శరీరమునుండి క్రిందఁ బడిపోయెను. దోవతి సైతము జాఱిపోయెను. ముఖమండలము దివ్యప్రభా పరివేష్టితమై భాసించుచుండెను. ఎల్లరును మంత్రముగ్ధులవలె తదేకదృష్టితో ఆ మహామూర్తిని అవలోకించుచుండిరి. ఎవ్వరును కిక్కురుమన సాహసింపలేదు. తన మాటలను భక్తి ప్రపత్తులతో శిరసావహించు జనసహస్రపు మన్ననలకు అలవాటుపడిన బాబాజీ యీ ఆకస్మిక విజృంభణమునకు 'నిర్ఘాంతపడెను.' అప్రతిహతమగు నధికారముతో వెలువడిన యీ వాక్కులు తన హృదయమున సూటిగా నాటుకొనన నాతఁడు తన తప్పిదమును గుర్తించెను. తాను కేవలము భగవానుని దాసుఁడనని, నిమిత్తమాత్రుఁడనని, గ్రహించెను. అనంతరము శ్రీరామకృష్ణుని భావసమాధిస్థితుల నడుమజరిగిన దివ్యసంభాషణమున, కలుటోలాలో శ్రీచైతన్యాసనము నధిష్ఠించిన దీ పరమభాగవతోత్తముఁడే యని గ్రహించి, యవ్విషయమై తాను ఖండించియున్నందులకు పశ్చాత్తప్తుఁడై బాబాజీ క్షమాపణ వేఁడికొనెను.

కాల్నానుండి యాత్రికబృందము నవద్వీపమునుఁ జేరెను. నవద్వీపమున—విచిత్రము—శ్రీరామకృష్ణునకు భావపారవశ్యము కలుగలేదు; కాని, నదీతీరమునుండి పడవలోనొకింత దవ్వునకు వెడలినంతనే కలిగిన దివ్యదర్శనమునుగూర్చి యాతఁడిట్లు వచించెను: "తప్తకాంచనమువలె భాసించు శరీరచ్ఛాయతో, తమ శిరములను పరివేషించిన ప్రభామండలము

లతో, చిఱునగవుతో నిరువురు బాలుర చేతులు పైకెత్తుకొని, వాయుమండలమునుండి పరుగెత్తుకొని నావైపునకు వచ్చు చుండిరి. 'అదిగో, వారు వచ్చుచున్నారు, వచ్చుచున్నారు' అని కేక వేసితిని. తెప్పపాటులో వారువచ్చి యీ శరీర మున (అనఁగాఁ దనయందు) ప్రవేశింప, శరీరస్మృతి గోల్పోయి క్రిందఁ బడిపోతిని. అపుడు హృదయుఁడు నన్నుఁ బట్టుకొనక పోయిన యెడల నీళ్లలోఁ బడిపోయి యుందును." ఇవ్విష యమై మధురుఁడు ప్రశ్నింప నాతఁ డిట్లు తెలిపెను: "శ్రీ గౌరాంగుని సరియైన జన్మస్థానమగు పూర్వపు నవద్వీపము నదిలో మునిఁగిపోయినది. ఆ యిసుక గడ్డ గల తావే యది.[1] అందుచే నాకు ఊరిలోఁ గాక యాస్థలమున భావపారవశ్యము కలిగినది."

పదునాలేండ్లుగా శ్రీరామకృష్ణుని సాన్నిధ్యము నొందుచు, సేవల నొనర్చుచుండిన మధురునకు అవసాన సమయము సమీపించెను. 1871-వ సం॥ జూలై నెలలో నాతఁడు విషజ్వరగ్రస్తుఁ డయ్యెను. జగజ్జనని యాతనిని దన యొడిలోనికిఁ జేర్చుకొనఁ బోవుచున్నదని శ్రీరామకృష్ణుఁడు గ్రహించి, ఆరోగ్యవిచారణమునకై స్వయముగా వెడలక, ప్రతిదినము హృదయునిఁ బంపుచుండెను. అవసానదినమున నాతనిని కాళీఘట్టమునకుఁ గొనిపోయిరి. నాఁడు శ్రీరామ కృష్ణుఁడు హృదయుని సైతము పంపక, యించుమించు జాము సేపు సమాధినిమగ్నుఁడై యుండి, పిమ్మట, 'మధురునిఆత్మ

---

1 చారిత్రక పరిశోధన లీయభిప్రాయమును బలపఱుచుచున్నట్లు కాన్పించుచున్నది.

దివ్యాకారమున దేవీలోకమునకుఁ బోయె'నని హృదయునకుఁ జెప్పెను. ఆదేసమయమున మథురుఁడు గతించెనను వార్త వచ్చెను. కాలాంతరమున నొక భక్తుఁడు, "మథురానాథునకు పునర్జన్మము లేదనుకొందును" అని పలుక శ్రీరామకృష్ణుఁడు, "బహుశః ఆతఁడు రాజకుమారుఁడై మరల జన్మించియుండును. ఆతని కింకను భోగవాంఛ యుండెను" అని సమాధానించెను.

మథురుఁడు పునర్జన్మరహితుఁడు గాకపోయిననేమి? పదునాల్గేండ్లు పరమానందముతో, అత్యద్భుతానుభవములతో దేవీపరమప్రియనందనుని సేవించి అమరకీర్తి నార్జించిన ధన్యాత్ముఁడు గదా యాతఁడు!

# దివ్యదాంపత్యము

శ్రీరామకృష్ణుని జీవితము సర్వధర్మసామరస్యనిలయము. యతియయ్యు, నాతఁడు భార్యను, బాంధువర్గమును బరిత్యజింపలేదు, సరికదా, వారితో నత్యంతాప్తభావమున మెలఁగుచు, వారిపై పరమప్రేమానురాగములను జూపుచు, తోడ్తోడనే సంగరాహిత్యమున సుప్రతిష్ఠితుఁడై యొప్పెను. ధన్యాత్ముఁడు, లేక సిద్ధాత్ముఁ డెట్టి వాఁడను విషయమున నాతని యీ క్రింది ప్రవచన మొంతయు గమనింపఁ దగి యున్నది: "ఎవని బుద్ధియు హృదయమునుచు పూర్ణవికాసము నంది సామరస్యము నొందియున్నవో వాఁడే నిజముగా ధన్యాత్ముఁడు. అట్టివాఁ డెక్కడ నున్నను, ఏపరిస్థితులలో నున్నను, ప్రశంసార్హముగా వర్తింపఁ జాలును. ఆతఁడు దైవము నెడ వినిర్మలభక్తివిశ్వాసపూర్ణుఁడై యుండును. వినను పరులతో నాతని వ్యవహారమునం దెట్టి లోపమును గానరాదు. లోకవ్యవహారములను నిర్వహించునపు డాతఁడు దక్షుఁడు; పండితసభలలో నాతఁడు విశేషవిద్యావంతుఁడై ప్రకాశించును; వాదములలో నద్భుతయుక్తినైపుణ్యమును బ్రదర్శించును; తల్లిదండ్రులయెడ విధేయుఁడై శ్రద్ధాభక్తులను జూపును; బంధుమిత్రులయెడ హితవర్తనుఁడై ప్రేమానురాగములతో మెలఁగును; ఇరుగుపొరుగువారియెడ దయాదాక్షిణ్యములు గలిగి పరోపకార మొనర్చుట కెప్పుడును సంసిద్ధుఁడై యుండును; భార్యయెడ ప్రేమంపువేలుపై వర్తించును. ఇట్టివాఁడే నిజముగా సిద్ధాత్ముఁడు." ఇంచు

మొదలుగా ఈ విధముగ బహుళము శ్రీరామకృష్ణునియందుం శ్రీరామకృష్ణుని [illegible] వేఱుగా జెప్ప నక్కఱలేదు. నానావర్ణ సంచితములగు బహుముఖ రత్న రాశులవలె [illegible] స్వకీయమునే నాతఁడు [illegible] ప్రసరింపఁజేసెను. ముఖ్యముగా నాటిని [illegible] బ్రహ్మసమాజాద్యాశ్రమములవారి నెల్లర [illegible] పిలిపిడెను.

తన పదునాల్గేండ్ల ప్రాయమున కామార్పుకూర్‌న పతి సన్నిధిని తాను గడపిన పావనానందదినములనుగూర్చి శ్రీ శారదాదేవి యిట్లు పలికెను: "అప్పటినుండి నా యంత రంగమున సదా ఆనందపూర్ణకలశము స్థాపితమై యున్నట్లు తోచెడిది: ఆ యనుభవము, ఆ యానందము, వర్ణనాతీ తము." ఈ దివ్యానందానుభూతి యామె సౌశీల్యమును పెంపొందించెను, దయాక్షమానిర్వ్యాజ నిరాడంబరత్వాది సుగుణములు వికసించెను. ఎల్లరయందును అపార ప్రేమానురాగములు చూపుచు, ఎవ్వరేమన్నను వినుకొనక, జయరాంవాటిలో పుట్టినింట వారికి సమస్తపరిచర్యల నొనర్చుచుండిన యామె మనసు మాత్రము సహజముగా దక్షిణేశ్వరమందలి ప్రాణేశ్వ రుని యందే లగ్నమై యుండెను.

నాలుగేండ్లు గడచినవి; ఆమె యిపుడు పదునెనిమి దేండ్ల యౌవనవతి. మృదుల సతీహృదయము పతిసన్నిధి నుండవలయునని కాంక్షించును గదా? ఆతని సాహచర్య మునకై ప్రేమామృతసేచనమునకై యారాటమొందును గదా! ఇది యిట్లుండ, ఆమె నెచ్చెలులలోనే కొందఱు

ఆమెనుగూర్చి 'పిచ్చివాని పెండ్లాము!' అని జాలినో, జుగుప్సనో చూపసాగిరి. సంశయధూమము క్రమముగా మనశ్శాంతిని గ్రమ్ముకొనసాగెను. ఒకవేళ వారి యపనిందలు నిజమే యగుచో నేమిచేయుట? నాలుగేండ్లకు పూర్వము తాను జూచిన పావనాత్ముఁడు, ప్రేమమూర్తియుఁ గాదా యిపు డాతఁడు? ఆతనికి మతిపోవుట నిజమా? సాధ్యమా? అగుచోఁ దాను బుట్టినింట కాలక్షేపము చేయుచుండుట తగునా? ఆతనిచెంత కేఁగి సేవచేయుట తన కర్తవ్యము కాదా? ఈరీతి పర్యాలోచనానంతర మామె స్వయముగా దక్షిణేశ్వరము వెళ్లి పరిస్థితుల నరయుట మంచిదని నిశ్చయించుకొనెను.

దోలపూర్ణిమాపర్వము, విశేషము శ్రీచైతన్య జన్మ దినమును నగు శుభదినమున గంగాస్నానార్థమై వెడలు చుండిన బందుగురాండ్రగు కొందఱు స్త్రీలతో శ్రీశారదాదేవి కలకత్తాకు వెడల నిశ్చయించుకొనెను. ఆమె యీ ప్రయాణ మందలి నిజమైన యుద్దేశ మేమో తండ్రి రామచంద్రుఁడు గ్రహించి కుమార్తెను దోడ్కొని యాత్రికబృందముతో బయలుదేఱెను. ఎనుబదిమైళ్ల దూరము. నడకనే ప్రయా ణము. ప్రకృతి సౌందర్యమును దిలకించుచు మహానందముతో వారందఱును యాత్ర సాగించుచుండిరి. అట్టి దూరయాత్రల కెన్నఁడును అలవడని శ్రీశారదాదేవి మార్గమధ్యమున తీవ్ర జ్వరగ్రస్తయై తండ్రితో నొక సత్రమున నాఁగవలసివచ్చెను. ఈసమయమునఁ దన కెంతయో ఉపశాంతిదాయకమైన యొక దివ్యదర్శనమునుగూర్చి యనంతర మామె యిట్లు తెలిపెను:

"జ్వరముచే నప్పు డొడలు తెలియక పడియుంటిని. ఆ సమయమున కాఱుమబ్బును బోలు నలిచాయ గల యొకతె నా ప్రక్కను గూర్చుండి యున్నట్లు కనిపించెను. నల్లనిదైయైనను, అంత చక్కని స్త్రీని మఱెవ్వరిని జూచియుండలేదు. మృదువైన తన చల్లని చేతులతో నామె నా శిరమును నిమురుచుండ, ఒడలిమంట ఉపశమించెను. 'నీ వెక్కడ నుండి వచ్చితివమ్మా!' అని నే నడుగ, 'దక్షిణేశ్వరమునుండి' యని యామె బదులు చెప్పెను. అంత నేను నివ్వెఱపడి, 'దక్షిణేశ్వరము నుండియా! నేను ఆయనను గలసికొని సేవచేయుటకై యచటికి వెళ్లవలయునని యభిలాషపడితిని. కాని దురదృష్టవశమున ఈ జ్వరమువలన అంతా తాఱుమాఱైనది' యంటిని. అంత నామె యిట్లుపలికెను: 'కలతనొందకు, శీఘ్రముగ నే నీవు నిస్తరించెదవు. దక్షిణేశ్వరమున నతనిఁ గలసికొందువు. నీ నిమిత్తమే నే నాతని నచట ఉంచినాను.' 'ఆలాగునా? ఎంత దయామయురాలవు! నీవు మాకేమగుదువు?' అని యడిగితిని. 'నేను నీ అక్కను' అని యామె బదులుచెప్పినది. 'ఆహా! అందుచేతనే వచ్చితివి!' అంటిని. ఈ సంభాషణ మైనంతనే నాకు గాఢనిద్ర పట్టినది."

క్రమముగా జ్వరము ఉపశమింప, మఱునాఁడు రామచంద్రుఁడు ఆమెతో ప్రయాణము సాగించి (1872 వ సం॥ ఏప్రిల్ నెలలో నొకనాఁటి) రాత్రి తొమ్మిది గంటలకు దక్షిణేశ్వరము చేరెను. అట్టి దుర్బలస్థితిలో నున్న సతీమణిని జూచి శ్రీరామకృష్ణుఁడు మిక్కిలి చింతించి, స్వయముగాఁ దన గదిలో నామె కొక పడుక నేర్పాటు చేయించెను. అమిత సంతాపముతోఁ బదేపదే యాతఁ డిట్లు పలికెను: "అయ్యో! కాలము మించిపోయిన పిమ్మట వచ్చితివి. నా మథురుఁ డిప్పుడు లేఁడుగదా, నీ సౌకర్యములు చూచుటకు!" తగిన చికిత్సను, పరిచర్యను శ్రీరామకృష్ణుఁ డేర్పఱుప, నామెయుఁడు నాలుగు దినములలో ఆరోగ్యము నందెను. అంతటఁ దన తల్లితో నుండుమని యామెను వాద్యమందిరమునకుఁ బంపెను.

ప్రాణేశ్వర సందర్శనమునకై స్వాతివర్షమునకు ముత్తెపుఁ జిప్పవలె వేచియుండిన శ్రీశారదాదేవి యాతని ప్రేమాదరములను జూఱఁగొనినప్పు డిఁక నామె యానందము నెవరు వర్ణింపఁ గలరు? స్వధర్మవిషయమున నిఁక సందియ మేల? దక్షిణేశ్వరముననే యుండి ప్రాణేశ్వరుని, పూజ్యురాలగు తన యత్తను సేవించుటయే తన కర్తవ్యమని యామె నిశ్చయించుకొనెను.

సత్యధర్మపరాయణులగువారు ఎట్టి విషమపరిస్థితులలో నైనను మహాధైర్యస్థైర్యములతో వర్తింపఁ గల రనుటకు శ్రీరామకృష్ణుని జీవితమున అనుపమానములగు పెక్కు నిదర్శనములు గాన్పించును. సర్వసంగపరిత్యాగ దీక్షితుఁడు బ్రహ్మచర్యవ్రతధారియునైన యా యతి నవయౌవనశోభిత సౌందర్యవతి యగు భార్య తనయొద్ద నివసింప ననుమతించె నన్నచో, తన మనస్సంయమమునకును భావసంశుద్ధికిని ఎట్టి ప్రచండాగ్నిపరీక్షకు అనుమతించెనో పరికింపుఁడు. తన సాధనలవలనఁ దానెంతవఱకు జితేంద్రియత్వము, సిద్ధత్వము నందెనో శోధించుకొనుట కీయవకాశము నాతఁడు స్వీకరించె నని భావింపనగును. సహధర్మచారిణికి కామార్పుకుర్‌లోఁ దా నిదివఱకుఁ గఱపసాగిన శిక్షణమును శ్రీరామకృష్ణుఁ డిపుడు మరలఁ గైకొని గృహనిర్వహణము మొదలుకొని బ్రహ్మజ్ఞానమువఱకును నానావిషయములను బోధింపసాగెను. ఆతఁ డామె కొనర్చిన ముఖ్యోపదేశములలో నిది యొకటి : "చందమామ యందఱి బిడ్డలకును మామయే. ఇటులనే

భగవంతుఁ డెల్లరకును పరమాప్తుఁడు. వానిని ప్రార్థించుటకు ప్రతివ్యక్తికిని హక్కు కలదు. మనఃపూర్వకముగా ప్రార్థించు వా రెల్లరును వాని సాక్షాత్కారమునొంది ధన్యు లగుదురు. నీవును వానిని ప్రార్థించినచో, దర్శింపఁగలవు."

శ్రీ శారదాదేవి వచ్చి మూఁడుపక్షములైన పిమ్మట శ్రీరామకృష్ణున కొక దివ్యాభిలాష కలిగెను. నాఁడు 1872-వ సం॥ జూన్, 5-వ తేది: అమావాస్య. అది ఫలహారిణీ కాళీపూజాసుదినము.[1] శ్రీరామకృష్ణుఁడు తన గదిలో ప్రత్యేకసన్నాహ మొనర్చి, పూజాసమయమునకు అచటికి వచ్చియుండుమని శ్రీశారదాదేవికిఁ దెల్పెను. ఆమె రాత్రి తొమ్మిదిగంటల కామె వెడలెను. శ్రీరామకృష్ణుఁడు అర్చకస్థానమున ఆసీనుఁడై ప్రారంభక్రియలను నెఱవేర్చి, దేవతకై ప్రత్యేకముగా అమర్పఁబడియుండిన పీఠమునఁ గూర్చుండుమని శ్రీశారదాదేవికి సంజ్ఞ చేసెను. భక్తితో పూజాక్రియల నవలోకించుచు, అర్ధబాహ్యప్రజ్ఞావస్థలో నున్నయామె మంత్రముగ్ధ లీల నాతని పనుపున పీఠము[2] నధిష్ఠించెను. అంతట పవిత్రగంగాజలము నామెపై ప్రోక్షించి, సమంత్రకముగా శ్రీరామకృష్ణుఁ డిట్లు ఆవాహన మొనర్చెను: "ఓ బాలా! (కౌమారీ!) సర్వశక్త్యధీశ్వరీ! మాతా! త్రిపురసుందరీ! నాకై సిద్ధిద్వారమును తెఱువుము;

---

[1] ఫలహారిణీకాళి యనఁగా పూర్వకర్మఫలములను హరించు కాళియని భావము.

[2] ఈపీఠము బేలూర్మఠమున, శ్రీరామకృష్ణాలయమున భద్రపఱుపఁబడి యున్నది.

ఈమె మనశ్శరీరములను పరమపవిత్రమొనర్చి, యీమె యందు ఆవిర్భవించి సర్వకల్యాణసాధనభూతవు కమ్ము!" అంత నామెను పరమేశ్వరీ స్వరూపముగా భావించి షోడశోపచారములతోఁ బూజింపసాగెను. ఆ సమయమున నామె దివ్యభావపారవశ్యమును బొందియుండి తుదకు సమాధిస్థితి నందెను. పూజ సమాప్త మగుసరికి ఆతఁడును సమాధి నిమగ్నుఁ డయ్యెను. ఆ ప్రశాంతసమయమున నిటులా లోకోత్తరదంపతులు హృదయైక్యసౌఖ్య మధిష్ఠించి యింద్రియాతీతానందసాగరమున నోలలాడిరి! ఆ దివ్యానందపారవశ్యమున గంటలు గడచెను. అర్ధరాత్ర మగుసరికి శ్రీరామకృష్ణునకు అల్లన బాహ్యస్మృతి కలుగసాగెను. అంత నాతఁడు కట్టెదుట సతీమణియందు ఆవిర్భవించియున్న లోకేశ్వరికి ఆత్మసమర్పణగావించుకొని సమంత్రకముగాఁ దన సమస్తసాధనఫలమును, జపమాలను, తన దగు సర్వస్వమును సమర్పించి ప్రణామ మొనర్చెను.

షోడశీ[1] పూజ యను నీ మహా (తాంత్రిక) క్రియ శ్రీ శారదా రామకృష్ణుల దాంపత్యము నెంత దివ్యసుందర మొనర్చెనో గమనింపనగును. శ్రీరామకృష్ణుని దివ్యసాధనల కిది శాంతిపాఠమై, యాతని గురుభావమునకు—లోకమున కాతఁడొనర్చిన యఖండజ్ఞానదానమునకు—గణపతిపూజయై యొప్పెనన్నచో, శ్రీశారదాదేవి జీవితమున నియ్యది నిరుపమాన మానసికపరిణతికి నాందియై, ఆమె పార

[1] త్రిపురసుందరి యనియు రాజరాజేశ్వరి యనియు శ్రీవిద్య యనియు భావింపఁబడు జగన్మాతయే షోడశి.

మాత్రిక జీవితమునకు ప్రాణప్రతిష్ఠయై యలరారెనని చెప్ప నొప్పును.

శ్రీరామకృష్ణుని పావనసాహచర్యమున దక్షిణేశ్వరమునఁ దాను గడపిన దివ్యానందదినములను గూర్చి శ్రీశారదా దేవి యిట్లు పలుకును: "అహర్నిశము అపు డాయన పొందుచుండెడి అద్భుతమైన దివ్యభావములను వర్ణింప నెవరి తరము? దివ్యభావపరవశులై ఒక్కొక్కప్పు డాయన దురవగాహమైన వేదాంతవిషయములనుగూర్చి ప్రసంగించువారు. ఒకప్పుడు నవ్వుదురు, మఱియొకప్పుడు ఏడ్తురు, ఇంకొకప్పుడు గాఢసమాధినిమగ్నులై నిశ్చలులై యొప్పుదురు! రాత్రి యంతయు నిట్లే జరుగుచుండును. ఆయనయందు ప్రత్యక్షమగు అసాధారణమైన దివ్యావేశమును, దివ్య చైతన్యమును జూచి భయముతో వణఁకుచు, రాత్రి యెట్లు కడచునా యని తత్తఱిల్లుదానను. సమాధిస్థితు లనఁగా నెట్టివో అప్పుడు నాకుఁ దెలియదయ్యె. ఒకనాఁ డాయన సమాధినుండి యెంత సేపటికిని స్మృతి నొందకుండుట చూచి భయభ్రాంతురాలనై విలపించి హృదయునకుఁ గబురంపినాను. ఆతఁడు వచ్చి ఆయన చెవిలో భగవన్నామము నుచ్చరింప నారంభించెను. చాలసేపైన వెనుక బాహ్యస్మృతి కలిగెను. అటుతరువాత నాచిక్కును గ్రహించి యే యే సమాధి స్థితులలో ఏ యే భగవన్నామములను, ఇతరస్థితులలో ఏ యే మంత్రములను ఉచ్చరింపవలయునో ఠాకుర్ స్వయముగా నాకు నేర్పిరి. అప్పటినుండి ఆ విధానములవలన బాహ్యస్మృతి కలుగుచుండెడిది; అందుచే నాకును చాలవఱకు భయము

తగ్గెను. ఈవిధముగా నెలలు గడచెను. ఏనాడు తనకే నిమిషమున సమాధిస్థితి కలుగునోయని నేను రాత్రియంతయు మేల్కొనవలసివచ్చుచుండుట కనుగొని, ఆయన నన్ను నహూబత్తునం బండుకొనుమని చెప్పిరి." శ్రీ శారదా దేవి ఠాకురు తన కా దినములలో సంసారనిత్యకృత్యములందలి వివరములు—దీపపువత్తుల నెట్లు కత్తిరించి చక్కఁజేయవలయునో, తమలపాకులచిలుకల నెట్లు చుట్టవలయునో, వారివారి స్వభావానుగుణముగా కుటుంబమునందలి వివిధవ్యక్తులతో నెట్లు మెలఁగవలయునో. ఇతరుల యిండ్లకు వెడలునపు డెట్లు నడచుకోవలయునో—ఇట్టి దైనందిన వ్యావహారికవిషయములు మొదలుకొని ప్రార్థన, భగవన్నామసంకీర్తన, ధ్యానము, బ్రహ్మసాక్షాత్కారము పర్యంతము సర్వవిషయములను గూర్చియు బోధించిరని చెప్పుచుండెడిది. జ్ఞానవిజ్ఞానప్రదము, ఇహపర శ్రేయోదాయకము, పరమానందమయము నగు మహోత్తరాదర్శదాంపత్యము ఇంతకంటె మఱేది?

తన సతీమణినాలుకపై శ్రీరామకృష్ణుఁ డొకప్పుడు మహోపదేశాత్మకమంత్రాక్షరములను లిఖించెను. ఒకనాఁ డాతఁ డామెకు యోగమునుగూర్చి బోధించుచు, కుండలినీ విజృంభణమునుగూర్చి కాకితముపై షట్చక్రములను చిత్రించెను. జపధ్యానార్థము ఆతఁ డామెను తెల్లవాఱు జామున నే మేల్కొల్పినట్టి, లేదా, తన యన్నకుమార్తెయగు లక్ష్మీదేవిచే మేల్కొల్పఁజేసినట్టి, సమయము లనేకములు కలవు. సకాలమున వారిరువురును మేల్కొననిచో, వారల పడుక యొకించుక తడియునట్లు తన కమండలువులో

నొక్కొక్కప్పు డాతఁడు గడపపై నీరు పోయును! "పని పాటులలో ఎంత మునిఁగి తేలుచుండినను, ప్రతిదినము లక్ష పర్యాయములు నా మంత్రమును జపించుచుండెడిదానను" అని శ్రీశారదాదేవి యొకప్పుడు తెల్పెనన్నచో, శ్రీరామ కృష్ణుఁ డామెకుఁ గఱపిన శిక్షణము ఎట్టిదో తెలియఁగలదు. గృహకృత్యములతోఁ బాటు సకాలమున జపధ్యానాదుల నాచరించుచుఁ దాను బొందెడి పరమానందమునుగూర్చి యామె పల్కిన యీక్రిందివాక్కులు సుస్మరణీయములు :

"ఆ దినములలో తెల్లవాఱుజామున మూఁడుగంటలకు లేచి ధ్యానమునకుఁ గూర్చుండుదానను. తఱచుగా ధ్యాన నిమగ్నత కలుగ శరీరస్మృతి లేకుండెడిది. పండువెన్నెలలో నహబత్ఖానా మెట్ల సమీపమునఁ గూర్చుండి యొక రాత్రి జప మొనర్చుచుంటిని. అంతయు ప్రశాంతముగా నుండెను. శ్రీగురుఁ డపుడా త్రోవను బట్టి వెళ్లిరను సంగతియే నాకుఁ దెలియలేదు...ఆహా! ఏమి యా దివ్యానందదినములు! పండువెన్నెలరాత్రులలో చంద్రునిఁ దిలకించి కరములు మోడ్చి యిట్లు ప్రార్థించుదానను: 'నా హృదయము ఆ చంద్రకిరణముల వలె నిర్మలమై వెలయుఁగాక!' లేదా, 'తండ్రీ! లోకేశ్వరా! చంద్రునియందుఁగూడ మచ్చకలదు, కాని నా హృదయము అకలంకమై వెలయుఁగాక!' ధ్యానమున సుస్థిరుల మైనంతనే హృదయమున భగవానుని విస్పష్టముగాఁ గనవచ్చును, అపు డాతని వాక్కులను వినవచ్చును. ఇట్టి నిర్మలమానసమున ఏభావము తోఁచినను వెనువెంటనే ఫలించును. అపుడు మీరు దివ్యానందమున నోలలాడెదరు,

ప్రశాంతి మిమ్ముల నావరించును, వరించును. ఆహా! ఆదిన ములలో నా మానస మెంత ప్రశాంతముగా నుండెడిది! (పరిచారికయగు) బృంద యొకనాఁడు నా యెదుట ప్రమాద వశమున) నొక కంచుపళ్లెము దొరలింప, ఖంగుమని మ్రోగెను. ఆ శబ్దము నా హృదయాంతరాళముం జొచ్చినది.[1] ఏ పరమేశ్వరుఁడు మన హృదయాంతర్వర్తియై వెలుగొందుచున్నాఁడో, ఆ పరమేశ్వరుఁడే యితరు లందఱి హృదయములందును —దీనుల— అసహాయుల — పతితుల — చండాలుర — హృదయములందును నెలకొని యున్నాఁడని సాక్షాత్కారము నొందునప్పుడు ప్రేమ పొంగులు వారును.[2] ఇట్టి భగవదనుభవము నరునకు నిజమైన ఆనందమును కల్గించును.''

శ్రీశారదాదేవి శ్రీరామకృష్ణునకుఁ దాను జేయు సేవలలో వంటను, వడ్డనను ప్రధానముగాఁ బరిగణించెను. తీవ్ర తపస్సాధనలచే క్షీణించిన యాతని జీర్ణశక్తికి సరిగా సరిపడునట్లు ఆమె వండును. ఈ విషయమును గూర్చి యాతఁడు చిఱునవ్వు నవ్వుచు, భక్తులతో, ''ఆమెతో నా కీపాటి సంబంధము గలదనుకుండీ! ఆమెగానిచో, నా యారోగ్యమునకు సరిపడునట్లు వండిపెట్టువా రెవ్వరు?'' అనును. ఒకప్పుడాతఁ

[1] నహబత్ఖానాలో శ్రీశారదాదేవి యపుడు ధ్యానించుచుండ, ఉఱుము తీసినట్లు తోఁచిన యా శబ్దము విని అశ్రుపూరితలోచన యయ్యెనఁట! చిత్తము ధ్యాననిమగ్నము కానున్నయపుడు సూది జాఱుటచేఁ గలుగు శబ్దమైనను పెద్ద పిడుగువలెఁ దోఁచునని యోగశాస్త్రము తెల్పుచున్నది.

[2] కాలక్రమమున శ్రీ శారదాదేవి నిర్వికల్పసమాధిస్థితిని సైతము పొందెనని తెలియవచ్చుచున్నది.

డామెతో, "నీవు వండిన యాహారము తిని నే నెంతగా బలియుచున్నానో చూడుము!" మనెను.

శ్రీ శారదాదేవి తన్నుగూర్చి ప్రతివిషయమునను శ్రీరామకృష్ణుఁ డెంతటి శ్రద్ధ వహించెనో తెలుపుచు నొకప్పు డొకరి కిట్లు చెప్పెను: "ఆయన మహాత్యాగి, సర్వసంగ పరిత్యాగి; ఐనను నన్నుగూర్చి ఆయన తాపత్రయ మాయనకు ఉండనే యుండెను. 'రాత్రివేళ నీవు ఎన్ని చపాతీలు తినుచుందువు?' అని నన్నడిగిరి. ఆ ప్రశ్న కెట్లు సమాధానము చెప్పుదు! సిగ్గుచేఁ జమిడిపోతిని. కాని ఆయన మరల అదే ప్రశ్న వేయ, 'ఐదారు' అని సమాధానింప వలసివచ్చెను.'

శ్రీశారదా రామకృష్ణుల యన్యోన్య దివ్యానురాగమున కామవాసన లేశమును గానరాదనుట కనేక నిదర్శనములు గలవు. ఆమె తనపక్కను బండుకొనియుండఁగాఁ గాంచి శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు తనలోఁ దా నిట్లు వితర్కించుకొనెనఁట: "మనసా! లోకముచే నిదియే నారీశరీర మని చెప్పఁబడునది. లోకులు దీనికై తాపత్రయ పడెదరు. కాని దీనికై ప్రాఁకులాడువాఁడు దేహాభిమాన కూపమునఁబడి భగవంతునిఁ బొందఁజాలకుండును. ఓ మనసా! త్రికరణశుద్ధిగా—లోపల నొకటియుఁ బైకొకటియుఁ గాకుండఁ—జెప్పు, నీకీ స్త్రీశరీరము కావలయునా? భగవంతుఁడు కావలయునా? చెప్పు. ఇందు మొదటిదే నీకుఁ గావలసిన పక్షమున, ఇదిగో, సిద్ధముగా నీయెదుట నున్నది,—నిరభ్యంతరముగా నీవు దీనిని గ్రహింపవచ్చును." ఈ విధముగాఁ బర్యాలోచించి యామెశరీరమును దాఁకఁబోవ, శ్రీరామ

కృష్ణుని మానసము (ప్రబలశక్తిమయ విద్యుత్తంత్రిని తాఁకిన శరీరమువలె) మహోద్వేగమున మఱలి యంతర్ముఖమగుటయు, నాఁటి రాత్రి యంతయు సమాధినిమగ్నుఁడై యుండెను! మఱునాఁడు ఉదయ మాతఁడు బహిఃప్రజ్ఞ నొందుటకై భగవన్నామ మాతని చెవులలో నెంతయో సేపు ఉచ్చరింపవలసివచ్చెనఁట.

మానవలోకమున నవతరించిన ప్రేమరసాధిదేవతయో యన శ్రీశారదాదేవి యొకనాఁడు శ్రీరామకృష్ణుని పాదకమలములను తన కరపల్లవముల నల్లన నొత్తుచు, "నన్నుగూర్చి మీ రేమని తలంచెదరు?" అని నెమ్మోమునఁ జిఱునవ్వు వెలయఁ బ్రశ్నించెను. వెంటనే శ్రీరామకృష్ణుఁ డిట్లు సమాధానించెను: "ఆలయమున నారాధింపఁబడుచున్న యేతల్లి యీశరీరమును గన్నతల్లియై యిపుడు నహబత్తున నివసించుచున్నదో, ఆతల్లియే యిపుడు నా పాదములు ఒత్తుచున్నది.[1] ఆనందమయియైన జగజ్జనని ప్రత్యక్షమూర్తివనియే నిన్నుగూర్చి సదా భావించుచుందును." పావనానందదాయకములు, ఆత్మోద్ధారకములును గదా ఆ లోకోత్తర దంపతుల సరస సల్లాపములు!

సర్వసంగపరిత్యాగియయ్యు, శ్రీరామకృష్ణుఁడు శ్రీశారదాదేవిజీవితము నన్నివిధములను ఆనందమయ మొనర్చుటకై—సతీమణి తన యభిరుచులను, మనోభావములను పతి

---

1 "నా భార్య నా పాదములు ఒత్తును, కాని పిమ్మట నే నామెకు నమస్కరింతును" అని శ్రీరామకృష్ణుఁడు మఱియొకప్పుడు కొందఱు భక్తులకుఁ దెల్పెను.

లక్షించుపట్లఁ బొందు ననిర్వచనీయసంతృప్తి నామె కొరకుగూర్చుటకై—మనఃపూర్వకముగాఁ బ్రయత్నించెను. స్త్రీలకు ఉచితములగు నాభరణములం దామెకు ప్రీతి కలదని యెట్లో గ్రహించి మూఁడువందలరూపాయలను బెట్టి చక్కని నగలను జేయించెను. తన దివ్యదర్శనమున తాను సీతాదేవి కరముల కెట్టి మురుగులను గాంచియుండెనో, అట్టివానినే యాతఁడు సతీమణికి ముచ్చటగాఁ జేయించెను.[1] ఆతఁడామె నెంతగాఁ బ్రేమించెనో, ఆమె మానసము నెట్లు అలరించెనో తెలుపు నిదర్శనములు అనేకములు కలవు. శరీరచ్ఛాయనుగూర్చి దక్షిణేశ్వరమున నొకప్పుడొక పోటీ పరీక్ష జరిగెను. అందు శ్రీరామకృష్ణుఁడే యొక యభ్యర్థి.[2] మఱియొకఁడు (కాలాంతరమున) ఆతని శిష్యులైనవారిలో నొకని యల్లుఁడు. ఇరువురును వర్చస్సునకు పేరు గాంచి యుండిరి. శ్రీరామకృష్ణుఁడు శ్రీశారదాదేవిని మధ్యవర్తినిగా నియమించెను. అభ్యర్థు లిరువురును ఆమె తమ్ముఁ బరీక్షించుటకై పంచవటీప్రాంతమున నొకరి ప్రక్క నొకరు నడువసాగిరి. శ్రీశారదాదేవి నిష్పక్షపాతబుద్ధితో రెండవవ్యక్తికే విజయపతాకము నొసఁగెనఁట.

"నీ వెవరిని ఎక్కువగా ప్రేమింతువు—నన్నా,

---

[1] వత్తు, కర్ణభూషలు, (సఖీభావసాధనకాలమున శ్రీరామకృష్ణునకు మథురుఁడొసఁగిన) బంగారు గాజులు, మెడను బంగారు గొలుసు—ఇవి యాకాలమున నామె ధరించుచుండెడి నగలు. ఆమె రూపము 'మిలమిల వెలిఁగిపోవుచుండెడి'దని యామె యాప్తురాలు తెలిపెను.

[2] శ్రీరామకృష్ణుని శరీరము ఆ దినములలో స్వర్ణచ్ఛాయతో నొప్పుచుండెడిది. శ్రీశారదాదేవి తాను తైలమర్దన మొనర్చుచుండ, ఆయన శరీరము స్వర్ణకాంతుల నీనుచుండెడి దని తెలిపియున్నది.

ఆమెనా!" యని శ్రీరామకృష్ణుఁ డొకప్పుడు శ్రీశారదాదేవి యెదుట గౌరీమా యను భక్తురాలి నడుగ, నామె సందర్భోచితముగా, "ఓ మురళీధరా! రాధకంటె నీవు అధికుఁడవు గావుసుమీ. ఆపన్నులగు జనులు నిన్ను, 'ఓ మధుసూదనా! రక్షింపుము' అని ప్రార్థింప, నీవో, 'ఓ రాధా! మానసోహారిణీ!' అని నీ విరహతాపమును నీ మురళీగానమున వెడలఁబోసి కొందువు" అని తెల్పు వంగకీర్తనద్వారా సమాధానించెను!

తన సతీమణినిగూర్చి శ్రీరామకృష్ణుఁడు ఛలోక్తిగ "నిజవర్ణమును బూడిదచే కప్పుకొనుము పిల్లి" యని వచించుచు! కాలక్రమమున నాతఁ డామె శిక్షా ముసు అని యాడుచు, "ఆమె నా [illegible]రాలా? ఆమె నా శక్తి" యని పల్కెను. హృదయునితో నొకనాఁ డాతఁడు, "హృదయా! ఆమెపేరు శారద. ఆమె సరస్వతి. కావుననే అలంకారప్రియ" యనెను. మఱియొకప్పు డాతని నిట్లు హెచ్చరించెను: "నీవు నన్ను నిరసించుచుందువు; దాని కేమి లెమ్ము. ఆమెనుమాత్రము అట్లు చేయఁబోకుము; ఆమె యంతరాత్మ పడగనెత్తెనా, (ఆమెకు కోపము వచ్చినచో అనిభావము) హరి బ్రహ్మాదులు నిన్ను రక్షింపఁజాలరు." కాలక్రమమున శ్రీరామకృష్ణుఁడు తన ప్రియబాలశిష్యులలో నొకఁడగు శారదాప్రసన్న యను నాతని కామెచే మంత్రోపదేశము చేయించెను. వేయేల, తన సహధర్మిణియనినచో, శ్రీరామకృష్ణునకు అపురూపమైన ప్రేమగౌరవానురాగములు. ఠాకుర్ తన్నెన్నఁడును 'ఏ మే' యని పిలిచియెఱుఁగ రనియు పూవుతోనైనను గొట్టియెఱుఁగరనియు శ్రీశారదాదేవి తెలుపును.

కాలక్రమమున భక్తు లనేకులు శ్రీరామకృష్ణుని సన్నిధికి ఫలములను మధురాహారములను పుష్కలముగాఁ గొనివచ్చుచుండువారు. శ్రీశారదాదేవి శ్రీరామకృష్ణునకు అందుఁ గొంత యుంచి, తన మాటయే తలపెట్టక, భక్తుల కును, ఇరుగుపొరుగుబిడ్డలకును వాని నన్నిఁటిని బంచిపెట్టె డిది. శ్రీరామకృష్ణుఁ డొకనాఁడది గాంచి, అయ్యది అతి వ్యయమునకు లక్షణముగా నెంచి సంతాపసూచక కంఠస్వర మున నిట్లు పలికెను: "ఈవిధముగా వ్యయించిన నెట్లు నిర్వ హింపఁగలవు?" ఆమె మృదులమాతృహృదయమున కా పలుకులు ములుకులై సోకెను. బొమముడిచే వదనకమలము ముకుళింప, ఎఱ్ఱవాఱిన కనులతో త్వరితగతి నామె యట నుండి వెడలిపోయెను. తత్క్షణమే శ్రీరామకృష్ణుఁడు పరిస్థి తిని గ్రహించి, సన్నిహితుఁడగు రామలాలును గేకవైచి, కంపితగాత్రమున నిట్లు పలికెను: "రామలాల్! వెళ్లి మీ పిన్నిని సమాధానపఱుచుము. ఆమె మనస్సు క్షోభించెనా, నా కిఁక దుర్గతియే."

హృదయసింహాసనమున ఉన్నతాదర్శములను నెల కొల్పుకొని విజ్ఞానానంద తేజమున వాని నుపాసించుచుండు వారికి విషయవాంఛ లనెడి చీఁకట్లు పటాపంచలైపోవును. "నన్ను మాయలోనికి లాగుట నీ యభిమతమా?" అని శ్రీరామకృష్ణుఁడు తన యర్ధాంగిని ఆమె దక్షిణేశ్వరప్రారంభ దినములలో నొకనాఁడు ప్రశ్నింప, వెంటనే యామె యిట్లు సమాధాన మొసఁగెను: "ఏల? ఆధ్యాత్మిక మార్గమున మీకుఁ దోడ్పడుటకే నేను వచ్చియున్నాను." ఏమి దివ్య

సమాధానము! ఇట్టి పరమానుకూలదాంపత్య మమరినచో, ఏ యున్నతావశ్యములు అవలీలగా సాధింపఁబడుచుండును!

ఆదర్శదాంపత్యమును గూర్చి యిట నొక విషయము పరికింపవలసియున్నది. సత్సంతానమున దాంపత్యము శోభిల్లు ననుటకును వివాహమువలని ముఖ్యప్రయోజనము సత్సంతానమే యని వేదశాస్త్రప్రమాణములు కలవనుటకును సందియము లేదు. సన్న్యసించుటకు పూర్వము శ్రీరామకృష్ణుఁడు ఒకపర్యాయము అత్తవారింటికి వెడలియుండ, ఆయని యత్తగారు శ్యామసుందరీదేవి తన కుమార్తెకు—శారదాదేవికి—బిడ్డలు లేరనియు మాతృజీవనమహాభాగ్యమున కామె నోఁచుకొనలేదు కాఁబోలు ననియు వగచి, అల్లునకు వినవచ్చునట్లు ఇట్లు పలికెను: “నా శారదను పిచ్చివాని కిచ్చి పెండ్లిచేసినాము. కుటుంబజీవనసౌఖ్యము ఆమెకు లేదయ్యె! బిడ్డలు లేరైరి! ‘అమ్మా!’ యనిపించుకొను భాగ్యమున కామె నోచుకోలేదు కాఁబోలును!” తన గదిలోనుండి యది విని శ్రీరామకృష్ణుఁడు ఈసమస్యను బరిష్కరించుచు నిట్లు సమాధానించెను: “అత్తా! ఆవిషయమై మీ రెంతమాత్రమును బెంగపెట్టుకో నక్కఱలేదు. అహర్నిశము ‘అమ్మా! అమ్మా!’ యని ప్రాణము విసిగించునంతమంది బిడ్డలు మీ కుమార్తెకుఁ గలుగఁ గలరు.” శ్రీరామకృష్ణుని వాక్యములు అమోఘములు కదా! శ్రీశారదారామకృష్ణు కంటె విశేషాధ్యాత్మిక పుత్త్రపౌత్త్ర సంతతిని—శిష్యప్రశిష్యసంతతిని—గనిన తల్లిదండ్రు లెవ్వరు?

“కాఁపురము చేసితి నన్నమాటయే కాని, మగనితో సంసారసుఖమును నీ వేమనుభవించితి వమ్మా! మగనివిలువను

సి వెఱ్ఱిగనైతివి!" అని కాలక్రమమున నొక యావురాలు దన్ను నాక్షేపింప, శ్రీశారదాదేవి వెంటనే సగర్వముగా నిట్లు సమాధానించెను: "ఔను! నా భర్త దిగంబరుఁ డగు యతీంద్రుఁడు.—పరమహంస!"

శ్రీశారదా రామకృష్ణుల దాంపత్యజీవనౌన్నత్యము పైని దెల్పిన యామె యీ సమాధానమున దేదీప్యమానమై ప్రకాశించుచుండుట లేదా?

ఆధ్యాత్మిక సాధనలందుఁ దన సతీమణివలనఁ దాను బడసిన సహకారము ఎంతటి యమూల్యమో తెలుపుచు కాలక్రమమున శ్రీరామకృష్ణుఁడు శిష్యులతో నిట్లు పలుకును: "ఆమె యంతటి పావనాత్మయే కాకపోో, ఆమె ప్రేరణలచే నేను ఆత్మనిగ్రహమును గోల్పోయియుండెడివాఁడనేమో యెవరు చెప్పఁగలరు? 'ఆమె మనస్సునుండి శారీరభోగ వాంఛలను నిర్మూలింపు' మని వివాహానంతరము అమ్మను మనఃపూర్వకముగా ప్రార్థించినాను. అమ్మ నా ప్రార్థనను సఫలమొనర్చెనని యామెతో (అనఁగా శారదాదేవితో) నివసించినప్పుడు గ్రహించినాను."

దంపతుల కిట్టి హృదయైక్యమే సనాతనభారతీయ వివాహపరమలక్ష్యము. వివాహసమయమున వరుఁడు వధువు హృదయమును స్పృశించి, "యదేతత్ హృదయం తవ తదస్తు హృదయం మమ, యదిదం హృదయం మమ తదస్తు హృదయం తవ" అని హృదయైక్యప్రార్థన మొనర్చు నాచారము సతీపతులకే కాక తన్మూలమున సంఘమునకును ఇహపర శ్రేయస్సాధనభూతమగు దివ్యసంప్రదాయముకదా?

# సాధనానుభవవిశేషములు : సాధనాంతము

"మీ రెందుకు సాధన చేయవలసివచ్చినది!"[1] అని గిరీశచంద్ర ఘోష్ అను ప్రియశిష్యుఁడు కాలక్రమమున శ్రీరామకృష్ణునిఁ బ్రశ్నింప, నాతఁడు చిఱునవ్వు నవ్వుచు నిట్లు సమాధానించెను: "శివునిఁ దన భర్తగాఁ బడయుటకై భగవతి (పార్వతి) సైతము పంచాగ్నితపస్సు, శీతకాలమున జలమున (కంఠపర్యంతము) నిలిచియుండుట, సూర్యుని తదేకదృష్టితోఁ జూచుట—ఇట్టి యనేక కఠోరసాధన లాచరించెను. స్వయముగా కృష్ణుఁడును రాధాయంత్రముఁ గైకొని అనేక సాధన లొనరించెను." (ఒనరింపవలసివచ్చెనని భావము.)

ఎల్లరను సంసారమోహితులను జేయు కామమును దా నెట్లు ఎదుర్కొనెనో తెలుపుచు, కాలాంతరమున శ్రీరామకృష్ణుఁడు శిష్యభక్తబృందముతో నిట్లు వచించును: "కామినీకాంచనములయెడ మనస్సు విరక్తి పొందినయెడల, ఇఁక దేనినిగూర్చియైనను వ్యాకులపడవలయునా? ఎంత విచిత్రము! ఎంతో జపధ్యానములను ఆచరించినపిమ్మటమాత్రమే నే నీ వాంఛలను తొలఁగించుకోఁగలిగితిని. కామవిముక్తి పొందుటనిన మాటలా? సాధన ప్రారంభించిన ఆఱునెలలకు నాకే అంతరంగమున ఒక విచిత్రభావము తలయెత్తెను. అంతట చెట్టు (అనఁగా పంచవటి) క్రింద నేలపైఁబడి బోరన విలపించి, శ్రీజగజ్జననితో, 'అమ్మా! అంతవఱకు వచ్చెనా, కత్తితో నిజముగా గొంతు కోసికొందు' నంటిని."

---

1 'మీరు ఆజన్మసిద్ధులు కదా' యని భావము.

"మహాశయా! కామవిముక్తి నొందు టెట్లు?" అని సాధకుఁడైన యొక యువకుఁడు తన మనోవికారమునుగూర్చి మిక్కిలి ఖిన్నుఁడై యొకప్పుడు తన్ను బ్రశ్నింప, శ్రీరామకృష్ణుఁడు స్వానుభవమును దెల్పుచు నిట్లు ఉద్బోధించెను: "ఆహా! భగవత్సాక్షాత్కారము కలుగనిదే కామము పోదు. శరీర మున్నంతవఱకు సాక్షాత్కారానంతరముకూడ ఏ కొంచెమో నిలిచియుండును; కాని యప్పుడది తల యెత్తఁ జాలదు. నే నైనను పూర్తిగా కామవిముక్తుఁడ ననుకొనుచుంటివా? ఒకప్పుడు నేను కామమును జయించితి ననుకొంటిని. పంచవటిక్రిందఁ గూర్చుండియుండఁగా, కామము నిగ్రహింప శక్యము గాదని తోఁచునంతటి ఉద్ధృతముగాఁ గలిగెను. అంతట నేలమీఁది ధూళిపై మొగము పెట్టి రాచుకొనుచు, విలపించి అమ్మ కిట్లు మొఱలిడితిని: 'అమ్మా! మహాపరాధము చేసితిని, కామమును జయించితి నని యిఁక నెన్నఁడును అనుకొనను.' అప్పు డది యంతరించినది.... భగవంతుని మనఃపూర్వకముగా ప్రార్థింపుము, నిరంతరము హరినామస్మరణ చేయుచుండుము. కామభావము లంతట క్రమముగా నీకు వశమైపోవును." [1]

---

[1] గాంధి మహాత్ముని 'ఆత్మకథ'యందలి యీ క్రిందివాక్యములను గమనింపుఁడు: "వికారరూపములగు మలములను, అనఁగా కామాదులను, శుద్ధిచేయుటలో హృదయపూర్వకమైన ఉపాసన ఉత్తమసాధన మని చెప్పుటకు నేను సందేహింపను." "మనోమాలిన్యము విచారముచేత, ఈశ్వరధ్యానముచేత, తుదకు ఈశ్వరానుగ్రహముచేతనే క్షాళితమగును." (శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిచే అనువదింపఁబడియున్న 'ఆత్మకథ' నుండి ఉద్ధృతము.)

తన కామదమనమునుగూర్చి కాలాంతరమున శ్రీరామకృష్ణుఁడు ఆ ప్రశిష్యుల కిట్లు తెల్పెను: మీతో అతి గుహ్యవిషయము చెప్పుచున్నాను. కామమును జయించుటకై అనేకసాధనలను ఆచరించినాను. 'జయ! కాళీ!' 'జయ! కాళీ!' యనుచు, ఎన్నో సార్లు...ప్రదక్షిణము చేసినాను."

వేఱొకప్పు డాతఁ డిట్లు తెలిపెను: "మానవుఁడు జితేంద్రియుఁడు కాఁగలుగు టెట్లు! స్వయముగా స్త్రీభావమును ఆరోపించుకొనవలయును. నేను అనేక దినములు (జగజ్జనని)సఖీభావమునఁ గడపితిని. స్త్రీవలె చీర కట్టుకొని, నగలు పెట్టుకొని, పయ్యెద వేసికొనువాఁడను. ప్రొద్దుటతో సే సాయంకాలము దేవికి హారతిసేవ చేయువాఁడను. కానిచో, భార్యను ఎనిమిదిమాసములు ఎట్లు దగ్గఱ నుంచుకోఁగలిగితిని! ఇరువురముకూడ అమ్మ (జగజ్జనని) సఖులవలె మెలఁగితిమి."

అహంకారాదినిర్మూలనార్థము శ్రీరామకృష్ణుఁడు ఆచరించిన అపూర్వసాధనలనుగూర్చియు, అందాతఁడు వడసిన అద్భుతవిజయములను గూర్చియు ముచ్చటించియుంటిమి. మహామహానీయులను సైతము అహంకారమమకారములు ఒక్కొక్కప్పుడు—తాత్కాలికముగనే యగుఁగాక—ఆవేశించుచుండును. శ్రీరామకృష్ణుఁడొకప్పుడు కొందఱు భక్తులకు స్వానుభవము నిట్లు వెల్లడించెను: "మఱియొక విచిత్రానుభవము కలుగుచుండెడిది: ఏనాఁడైనను నాకు అహంకారము కలిగెనా, ఆ మఱునాఁడు జబ్బుచేయుచుండెడిది." చదువరులారా! పవిత్రజీవితమున కిసుమంతైనను ప్రతికూలమైన చిత్తవృత్తులు శ్రీరామకృష్ణుని మనశ్శరీరముల కెట్టి బాధ

కల్గించెడివో పరికింపుఁడు. మఱియొకప్పుడాతఁడిట్లు తెలిపెను: "అహంకారము నెట్లు నశింపఁజేసికొనవలయునో తెలియునా? వడ్లు దంచువారప్పుడప్పుడు ఆఁగి, ఊఁక పూర్తిగా పోయెనో లేదో యని పరిశీలించుచుందురు. నగలను త్రాసులో వేసి తూఁచువారు ముల్లు సరిగా నడుమ నిలుచుచున్నదో లేదో తఱచుగా ఆఁగి కనుఁగొనుచుందురు. అటులనే అహంకారము ఇంకను తల యెత్తుచున్నదో, అడఁగిపోయినదో తెలిసికొనుటకు అప్పుడప్పుడు నన్ను నేను నిందించుకొనువాఁడను. ఒక్కొక్కప్పుడు శరీరస్వభావమునుగూర్చి యిట్లు పర్యాలోచించుకొనువాఁడను: 'చూడు! ఈశరీరమెట్టిదో! మాంసముతోడను ఎముకలతోడను గూడిన పంజరము గాక మఱేమిది? ఇందులో నెత్తురు, చీము మొదలగు మలినపదార్థములు తప్ప మఱేమున్నవి? దీనినిగుఱించి యింత అభిమానమును అహంకారమును పూనుట ఎంత విచిత్రము!' "[1]

తన జ్ఞానసాధననుగూర్చి శ్రీరామకృష్ణుఁ డొకప్పుడిట్లు తెలిపెను "అవిద్య నశింపనిదే బ్రహ్మజ్ఞానము

---

[1] శ్రీ రామకృష్ణుఁడు నిరసించునది దేహాభిమానముకాని శరీరసంరక్షణము కాదని గ్రహింపనగును. ఆతఁ డిట్లు ఉపదేశించును: "ఈ తనువు తుచ్ఛము, అశాశ్వతమునైయుండ, సాధువులును భక్తులును దీనిని సంరక్షించుకొందు రేల? వట్టిపెట్టెనుగూర్చి యెవ్వరును (అంతగా) జాగ్రత్తపడరు. వెలగల నగలు, బంగారము, ప్రశస్తమైన వస్తువులును గల ఖజానాపెట్టెను ఎల్లరును జాగ్రత్తగాఁ గాపాడుకొందురు. ఈ దేహము దేవాలయము ('దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవ స్సనాతనః) కావున సాధుజనులు దీనిని సంరక్షించుకొనకుండ నుండఁజాలరు. మన శరీరములు దేవుని ధనాగారములు."

కలుగదు. అందుచే నేను పులినై అవిద్యను (అనఁగా అజ్ఞానమును) కబళించివేయుచున్నట్లు భావించువాఁడను."

సర్వము తన కెట్లు భగవన్మయముగాఁ గాన్పింప సాగెనో, తన పూజాకలాపము ఎట్లు అంత మొందెనో కాలాంతరమున భక్తుల కాతఁ డిట్లు వెల్లడించెను: "ఈశ్వర సాక్షాత్కారముతో సమస్తకర్మములును తొలఁగిపోవును. నా పూజాకలాపము ఈ విధముగనే అంత మొందినది. కాళి కాలయమున పూజచేయువాఁడను. సమస్తము చిన్మయునని అకస్మాత్తుగా నొకనాఁడు నాకు విదితమైనది. (అన్న మాపి నది.) పూజాపాత్రములు, వేదిక, ద్వారబంధము—సర్వము చిన్మయమై గోచరించినవి. మానవులు, జంతువులు, సమస్త ప్రాణులును చిన్మయమే. అంతట పిచ్చివానివలె నలువైపు లను పూలను వెదచల్ల నారంభించితిని. చూచినదాని నెల్ల పూజించితిని."

పాపులుకూడ భగవద్రూపులే యని తెలుపుచు, శ్రీ రామకృష్ణుఁ డొకప్పుడు దేవి తన పూజాసమయమున రమణి యను వేశ్యారూపమున ప్రత్యక్ష మయ్యెననియుఁ దెలిపి యున్నాఁడు.

మఱియొకప్పు డాతఁ డిట్లు వెల్లడించెను: "శివార్చన చేయుచు, ఒకనాఁడు శివుని శిరస్సున (శివలింగముపై) వజ్రము నుంచుచుండఁగా, ఈ విశ్వమంతయు శివుఁడే యని నాకు గోచరించినది. అంతటితో నా శివమూర్తి పూజ అంత మొందినది. మఱియొకనాఁడు పూవులను గోయుచుండఁగా, ప్రతి పూలమొక్కయు భగవంతుని విశ్వరూపము నలంక

రించుచున్న పూవులు తీవలెఁ గాన్పించినవి. పూలు గోయుట కదియే నాకు కడసారి.”

ఈ విధముగా సనాతన ధర్మమహాసాగరమందలి అమూల్య రత్నములను కైవసము చేసికొని, పిమ్మట మహమ్మదీయ మతతత్త్వానుభూతిని బడసియున్న శ్రీరామకృష్ణుని సునిశిత దృష్టి ప్రాయికముగా 1874-వ సం॥న క్రైస్తవమతముపైఁ బ్రసరింపసాగెను. క్రైస్తవమతానుసారము సాక్షాత్కారము నొందవలెనని అభిలాష కలిగెను. అది యిట్లు సంఘటిల్లెను. సాధువుని యనంతరము శ్రద్ధాభక్తులతో శ్రీరామకృష్ణుని యక్కఱలను దీర్చుచు. సేవల నొనర్పసాగిన ధన్యుఁడు—శంభుచరణ మల్లిక్ అను నుదారహృదయుఁడగు హిందువుఁడు—శ్రీరామకృష్ణునకు బైబిల్ చదివి వినిపించుచుండువాఁడు. శ్రీరామకృష్ణుఁ డొకనాఁ డొక భక్తుని భవనమున బాలక్రీస్తు చిత్రపటమును—మేరీకన్య తన దివ్యశిశువు నెత్తుకొనియున్నట్లుండు మనోహర చిత్రపటమును—జూచుట తటస్థించెను. తదేకదృష్టితో నాతఁడు ఆ చిత్తరువు నవలోకించుచు, ఏసు ప్రభుని యద్భుత జీవితమునుగూర్చి చింతింపసాగెను. పటము నిక్కముగా ప్రాణప్రదీప్తమై భాసించెను. మేరీక్రీస్తులనుండి దివ్యతేజఃకిరణములు వెలువడి తనలోఁ బ్రవేశించుచు, తన దృక్పథమును పూర్తిగా మార్చివేయుచున్నట్లు తోఁచెను. నూతన భావతరంగములు పొంగిపొరలి తన హిందూభావముల నొకమూలకు నెట్టివేయుచుండెను. “అమ్మా! అమ్మా! ఇదేమి? నన్ను నీ వేమి చేయుచున్నావు?” అని యాతఁడు ఆర్త

ముతో కాళీమాతను ప్రార్థించెను. కాని ఫలము లేదయ్యె. ఈ నూతన భావతరంగ విజృంభణమునకుఁ దన హైందవ దేవతాశక్తి మఱుమాయమైపోవ, వాని తావున క్రీస్తు నెడలను, క్రైస్తవసంప్రదాయము నెడలను గాఢభక్తి హృదయమున్నాక్రమించెను. క్రైస్తవభక్తులు తమ ప్రార్థనాలయములలో క్రీస్తువిగ్రహము ముందు క్రొవ్వొత్తుల ధూపదీపారాధనములతో హృదయపూర్వక ప్రార్థనల నొనర్చుచున్న దృశ్యము ప్రత్యక్షమయ్యెను. మూఁడుదినము లీ భావములు మనస్సున సంపూర్ణాధిపత్యము వహించెను. నాలవనాఁడాతఁడు పంచవటియందు నడయాడుచుండ, ప్రశాంతముఖమండలముతో నొప్పు నొక యపూర్వవ్యక్తి తదేకదృష్టితోఁ దన్నుఁ జూచుచు, సమీపించు మార్గము గాన్పించెను. ఆతఁడు అన్యదేశీయుఁడని వెంటనే గ్రహించెను. సుందరవిశాలనేత్రములు, ఒకించుక చిదకముక్కైన యున్నను, ముఖదివ్యసౌందర్యమునకది యించుకంతయు వెలితికలిగించుట లేదు. ముగ్ధుఁడై శ్రీరామకృష్ణుఁడు ఈ యపూర్వవ్యక్తి యెవ్వరా యనుకొనుచుండ, చట్టన ఆ మూర్తి తన్ను సమీపింప, హృదయాంతరాళమునుండి, "మానవకోటిసముద్ధరణమునకై తన హృదయరక్తమును ధారపోసి దారుణవ్యథల ననుభవించిన క్రీస్తుమహాశయుఁడే యీతఁడు! ప్రేమమూర్తియు పరమ యోగియు నగు ఏసుక్రీస్తుప్రభువే యీతఁడు!" అను విస్పష్టభావము వెలువడెను.

ఏసుక్రీస్తు అంతట శ్రీరామకృష్ణుని ఆలింగన మొనర్చుకొని, యాతనియందు లీన మయ్యెను. శ్రీ రామకృష్ణుఁడు బాహ్యస్మృతిరహితుఁడై, సమాధిస్థితిని, తన్మూలమున సగుణ

బ్రహ్మసాక్షాత్కారము నందెను. కొంత సేపటికి బాహ్యప్రజ్ఞ కలిగెను. ఏసుక్రీస్తు భగవదవతారమని శ్రీరామకృష్ణుఁడు ఈవిధముగా నిశ్చయించుకొనెను.[1]

క్రీస్తుమతవైఖరినిగూర్చి విద్యమానమై యున్న త్రివిధ వర్ణనలలో నొకటి పూర్తిని ముక్కు చిదకముక్కు అని తెలుపుచున్నట్లు కాలాంతరమున శ్రీ రామకృష్ణుని శిష్యులు—గుహానిర్యాణానంతరము—తెలిసికొనిరి! సాక్షాత్కారసంజనిత వచనములు—ప్రత్యక్షానుభవవాక్కులు—అమోఘములుకదా!

ఇప్పటివఱకు బుద్ధదేవునిగూర్చియు, ఇతరమతమహాసంస్థాపకులనుగూర్చియు శ్రీరామకృష్ణుని యభిప్రాయము నరయుట సముచితము. బుద్ధుఁడు భగవదవతారమూర్తి యని నమ్మి భక్తితో శ్రీరామకృష్ణుఁడు ఆతని నారాధించువాఁడు. శ్రీజగన్నాథాలయమందలి విగ్రహత్రయమున శ్రీబుద్ధదేవుఁడే యిప్పటికిని అర్చింపఁబడుచున్నాఁడని విశ్వసించి, గంగాజలమువలెనే జగన్నాథప్రసాదమును పరమపవిత్రముగాఁ బరిగణించువాఁడు. జగన్నాథాలయమందలి సర్వమతసమానమునుగూర్చి విని సందర్శింపఁ గుతూహలపడెను గాని, శ్రీచైతన్యుఁ డెచటఁ దన యవతారమును చాలించెనో, అట్టి

[1] ఏసుక్రీస్తు-భగవానుని జన్మదినోత్సవము పూజ, బైబిల్ పారాయణ మున్నగువానితో నేఁడు దేశదేశాంతరములలో వ్యాపించియున్న శ్రీరామకృష్ణమఠము లన్నిఁటియందును శ్రద్ధాభక్తులతో జరుపఁబడుచుండును. ఇట్లే శ్రీబుద్ధదేవునియొక్కయు, శ్రీరామ శ్రీకృష్ణ శ్రీచైతన్య శ్రీశంకరాచార్యులయొక్కయు జన్మదినోత్సవములను సముచితరీతిని జరుపుట శ్రీరామకృష్ణమత సంప్రదాయము.

దూ దివ్యక్షేత్రసంబంధమైన భావసంసర్గప్రభావమునకుఁ దన శరీర మచట పతన మగునేమోయని—తా నింకను లోకో ద్ధరణార్థము జీవింపవలసియున్నదని యెఱింగియున్న యాతఁడు —వెడల మానుకొనెను. "బుద్ధుఁడు అవతారమూర్తి యనుట కిసుమంతేయు సందియము లేదు, వైదికజ్ఞానకాండ కును ఆయనసిద్ధాంతములకును భేదము లేదు" అని యాతఁడు వక్కాణించెను.

జైనమతస్థాపకులగు తీర్థంకరులనుగూర్చియు, సిక్కు మతగురువులనుగూర్చియు తదీయమతప్రతినిధులగువారివలన శ్రీరామకృష్ణుఁ డెంతయో విని విశేషగౌరవము చూపెను. సిక్కుగురువులందఱును జనకమహారాజుయొక్క అవతారము లనియు, సిక్కుమతస్థాపనానంతర మాతఁడు శాశ్వతపర బ్రహ్మైక్యము ... దెనని విశ్వసింపఁదగు ననియుఁ దెలిపెను.

తాను ... దవతార మను మనోనిశ్చయము శ్రీరామ కృష్ణునకుఁ ... ను.[1]

శిష్యుని ... దా, భక్తుని అరక్త ననుసరించి శ్రీరామ కృష్ణుఁడు తన యథార్థవ్యక్తిత్వమును సూచించువాఁడు. ఏమైనను, తాను అత్యంతము అసాధారణవ్యక్తి ననియు, తన యపూర్వసాధనానుభూతులు నూతనమైన యొక ఆధ్యా త్మికవికాసయుగమును వెలువరించి ముక్తిమార్గమునందలి యవరోధముల నెట్లు అతిక్రమింపవలయునో మానవకోటికిఁ జూపుటకే కాని స్వప్రయోజనార్థము కావనియు నాతఁడు

1 అవతారతత్త్వమునుగూర్చి శ్రీ రామకృష్ణుని ప్రవచనములను 'భైరవీ బ్రాహ్మణి' యను ప్రకరణము తుదిని క్రోడీకరించియున్నాము.

అంగీకరింపవలసివచ్చెను. తన వివిధసాధనలు ఇతరులనిమిత్తమే కాని నిజముగాఁ దనకు ఆవశ్యకము కావనియుఁ దాను నిత్యముక్తుఁడ ననియు గ్రహించెను. కావున ముక్తి యను మాట తనకు అన్వయింపదు. "జమీందారుని యుద్యోగి యెచట కల్లోలము సంభవించునో అచటికిఁ బరుగెత్తవలసియుండును" అని యాతఁడు తన్నుగూర్చి దివ్యభావగర్భితముగాఁ బలుకును. (వాయవ్యమూల, అనఁగా పశ్చిమోత్తరదిక్కు చూపుచు) అచట మరలఁ దాను ఆవిర్భవింపవలసియుండు నని శిష్యులకుఁ జెప్పువాఁడు.[1] గిరీశచంద్ర ఘోష్ మున్నగు కొందఱు శిష్యులు ఆతఁ డీ సంఘటనకాలమును సూచించుచు, "ఇన్నూఱేండ్ల తరువాత నే నచటికిఁ బోవలసియుండును. అపుడు అనేకులు ముక్తి నొందుదురు; అపు డింకను ముక్తులు కానివారు దీర్ఘకాలము వేచియుండవలసివచ్చును" అని తెలిపె నని పలికియున్నారు.

స్వీయ వివిధమహాసాధనాంతమున శ్రీరామకృష్ణుని దివ్యదృష్టికి గోచరములైన మహత్తరవిషయము లిట్టివి అనేకములు కలవు. ఇందొకటి తన నిర్యాణసమయవిషయము. శ్రీ శారదాదేవితో దక్షిణేశ్వరమున నొకనాఁ డాతఁ డిట్లు పలికెను: "ఎవ్వరిచేతినుండి యైనను సరియే, నే నెపుడు అన్నము తినుట, కలకత్తాలో రాత్రులు గడపుట, ఒకరికిఁ బెట్టఁగా మిగిలినదాని నారగించుటయుఁ జూతువో అపుడు

[1] ఆ సమయమునఁ దా నొక ప్రభువుగా ఆవిర్భవింతు నని శ్రీరామకృష్ణుఁడు తనతోఁ జెప్పినట్లు శ్రీ విజ్ఞానానందస్వామివలన మేము వినియున్నాము.

నా అవసానకాలము ఆసన్నమైన దని గ్రహింపుము." ఈ వాక్కులు 'తు, చ' తప్పకుండ యథార్థము లయ్యెను. ఆమెతో మఱియొక సందర్భమున భావపారవశ్యస్థితిలో నాతఁడు, "అవసానకాలమున పాయసము తప్ప మతేమియూ తినను" అని తెలిపెను. ఇదియు వాస్తవ మయ్యెను.

ఇఁక సర్వసాధారణముగా ఆధ్యాత్మికవిషయములను గూర్చి శ్రీరామకృష్ణుని సిద్ధాంతములను గమనింతము.

"ఏకం సత్ విప్రా బహుధా వదంతి" (ఉన్న దొక్కటియే, ఋషులు దాని ననేకనామములఁ బేర్కొందురు) అను వేదవాక్యమే శ్రీరామకృష్ణుని భగవత్తత్త్వోపదేశముల కన్నిఁటికిని మూలసూత్రము. "భగవంతుని నామరూపములు అనంతములు. ఏనామమున, ఏరూపమున నీవు వాని నారాధించినను సరియే, తన్మూలముననే నీకు వాని సాక్షాత్కారము లభింపఁగలదు" అని యాతఁడు బోధించును.

సర్వమతములును యథార్థమే(అనఁగా ఆస్తికధర్మము లన్నియు పరమార్థప్రాప్తిమార్గములే) యని నానామత సాధనల మూలమున శ్రీరామకృష్ణునకుఁ గలిగిన సునిశ్చితాభిప్రాయము. "బ్రహ్మానందసరోవరమునకు అనేకమైన రేవు లున్నవి. ప్రపంచమందలి ప్రతిమతమును అట్టిదియొకానొక రేవు. కాళీఘట్టమందలి కాళికాలయమును జేరుటకు అనేక మార్గము లున్నవి. ఇట్లే ఈశ్వరసదనమును జేరుటకును ఎన్నియో మార్గములు కలవు. ప్రతిమతమును వీనిలో కేవలము ఒకానొకమార్గము" అని యాతఁడు వక్కాణించును. సంగ్రహముగా నాతఁడు "మతము లెన్నో, మార్గము లన్ని"

యని వచించును. ధర్మచ్యుతి నరికట్టి, మతవివాదములు హేతురహితములని ప్రకటించి, "మతము లెన్నో, మార్గము లన్ని" యను నీ మహత్తరసత్యమును లోకమునకు నిరూపించుటయే శ్రీరామకృష్ణుని ఆవిర్భావమునకు ప్రధానోద్దేశమని గ్రహింపనగును. రైలుబండ్లు, వాయువిమానములు మున్నగు ప్రయాణ సౌకర్యముల మూలముననే కాక, రేడియో, టెలిఫోన్ మున్నగు ప్రకటనయంత్రసాధనముల మూలముననుు, వార్తాపత్రికాదుల మూలమునను దూరమనునది యించుమించుగాఁ దొలఁగిపోవ, లోకు లెల్లరును అత్యంతసన్నిహితులై మనవలసియున్న నేఁడు, అన్యోన్యమతగ్రహణము అత్యావశ్యకమై యున్న నేఁడు, అందులకు మూలసమన్వయసూత్రమై యున్న యీ మహాధర్మతత్త్వమును స్వానుభవపూర్వకముగా లోకమునకుఁ జాటిన సర్వమతసమన్వయాచార్యశేఖరుఁడు శ్రీరామకృష్ణుఁడు.

సర్వమతములును పరమార్థ ప్రాప్తిమార్గము లేయగుచో, స్వమతానుష్ఠానము, లేదా, స్వధర్మానుష్ఠానము ఆవశ్యకమని యేర్పడుచున్నదికదా! స్వధర్మానుష్ఠానావశ్యకతనుగూర్చియు, తోడ్తోడనే పరమతధర్మములయందుండవలయు సద్భావమునుగూర్చియు శ్రీరామకృష్ణుఁడు పదేపదే నొక్కి వక్కాణించియున్నాఁడు.

"మొదలు తన మతము వదలక
తుద నెవ్వరి మతమునైన దూషింపకయున్
పదపడి కోర్కులు గోరక
ముదమున నటియించువాఁడె ముఖ్యుఁడు వేమా!"

అని వేమనయోగియుఁ జెప్పియున్నాఁడుగదా? "ఇతరమత ధర్మముల నెన్నఁడును ద్వేషింపక, వానియెడ సదా సద్భావము కలిగియుండవలయును. కారుణ్యమున క్రైస్తవుని వలెను, బాహ్యాచారములందు పట్టుదల చూపుచో మహమ్మదీయునివలెను, సర్వభూతహిత మొనర్చునెడ హిందువుఁడుగను వర్తించుట పాడి" యని శ్రీరామకృష్ణుఁడు వచించును

ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము ననునవి మానవుని ఆధ్యాత్మిక వికాసమునందలి క్రమావస్థ లని యాతఁడు కనుఁగొనెను. వివిధమానసికదృక్పథములకు అనుగుణమగు నివి భగవత్ప్రాప్తిమార్గమున క్రమసాధనములే కాని యెంతమాత్రము పరస్పరవిరుద్ధములు కావని చాటెను. శ్రీరామకృష్ణుని యీ సిద్ధాంతమువలననే వేదములు అర్థవంతము లగుననియు, శాస్త్రములకు సమన్వయ మేర్పడు ననియు శ్రీరామకృష్ణ హృదయతత్త్వవేత్తలలో మేటియగు వివేకానందస్వామి చాటియున్నాఁడు. మతవాఙ్మయమును అర్థముచేసికొనుటకై శ్రీరామకృష్ణుని యీ మహానుభూతి లోకమున కెంతగాఁ దోడ్పడఁగలదో ఒకించుక పరిశీలించినచో స్పష్టము కాఁగలదు. క్రమవికాససాధనభూతమైన యీ త్రిమతసిద్ధాంతములనుగూర్చియు పండితుల నడుమ నెట్టి భేదాభిప్రాయపు తుపానులు చెలరేఁగియున్నవో మత చరిత్రను గమనించినవారి కెల్లరకును విదితమే. ఈ త్రిమత సిద్ధాంతముల యంతర్గత సామరస్యము నరయక, ప్రతిసంప్రదాయమును వీనిలో ఏ యొకానొక దృక్పథమునో అవలంబించి, మిగిలిన రెంటిని త్రోసిరాజని శాస్త్రతత్త్వనిర్ణయము

చేయఁబూనుటచే, స్వపక్షేతర శాస్త్రవాక్యములకు విపరీతార్థ కల్పనలతోఁ గూడిన యీ వ్యాఖ్యానములవలన తత్త్వజిజ్ఞాసువులకును ముముక్షువులకును అంతగా ప్రయోజనము లేకపోవుచున్నది. కావున వీని యన్నిఁటి అంతరార్థమును స్వయముగా అనుభూత మొనర్చుకొని యథార్థములను దొలఁగించు మహాప్రవక్త ఆవిర్భవించుట ఆవశ్యక మైనది. త్రిమతసిద్ధాంత సామరస్యమును దెలుపుచు నాతఁ డిట్లు వక్కాణించును :

"సాక్షాత్కార విషయమున అద్వైతము తుది మాట. అది మనస్సునకును వాక్కునకును గూడ అతీత మగుటచే కేవలము సమాధిస్థితిలో అనుభూత మొనర్చుకొనఁదగినది."

"మనస్సుచేతను, బుద్ధిచేతను విశిష్టాద్వైతపర్యంతము మాత్రమే గ్రహించి వాక్కులోఁ దెలుపనగును. ఆ స్థితిలో నిత్యము, లీలయు (అనఁగా బ్రహ్మము, జగత్తును) గూడ తుల్యముగనే-నిత్యము (యథార్థము)-భగవానుని నామము, ధామము, భగవానుఁడును చిన్మయమే!" ("చిన్మయ నామ్, చిన్మయ ధామ్, చిన్మయ శ్యామ్!")

"వేదములలోఁ దెలుపఁబడిన సచ్చిదానందబ్రహ్మమే తంత్రములలోని సచ్చిదానందశివుఁడు, ఆతఁడే పురాణముల లోని సచ్చిదానందకృష్ణుఁడు." "భక్తుని యీశ్వరుఁడు రసమయుఁడు; జ్ఞాని యీశ్వరుఁడు తేజోమయుఁడు."

"విషయరాగము ప్రబలముగాఁ గల సాధారణ మానవులకు ద్వైతభావము, అనఁగా, నారదపాంచరాత్రమున

ఉపదేశింపఁబడియున్నట్లు బిగ్గఱగా నామసంకీర్తన చేయుట మున్నగునవి ప్రశస్తము, శ్రేయస్కరము.''

కర్మమునుగూర్చియు, కర్మరాహిత్యమునుగూర్చియు నాతఁ డిట్లు బోధించును : "సత్త్వగుణాధిక్యము గల వ్యక్తి నుండి కర్మములు తమంతఁ దామే తొలఁగిపోవును. ప్రయత్నించినను ఆతఁడు కర్మములను జేయఁజాలఁడు; భగవంతుఁడే వానిని కర్మములను జేయనీయఁడనియుఁ జెప్పవచ్చును. గర్భవతి యగు కోడలికి ప్రసవకాలము సమీపించు కొలఁదియు గృహకృత్యభారము తగ్గింపఁబడును. ప్రసవానంతరము బిడ్డను సంరక్షించుకొనుట తప్ప మఱేమియు నుండదు, ఉండ నీయరు. కాని సామాన్యమానవుఁడు శ్రీమంతుని యింటి దాసివలె—గృహయజమానునకు సమస్త పరిచర్యలను జేయుచున్నను, తనయిల్లు అది కాదను యెఱుక గల యా దాసివలె—మెలఁగుచు, సదా భగవంతునిమీఁదనే నిర్భర పడి కర్తవ్యముల నన్నిఁటిని అసంగబుద్ధితో నిర్వర్తింపఁ బూనవలయును. ఇదే కర్మయోగము. సాధ్యమైనంతవఱకు భగవన్నామము స్మరించుచు, తోడ్తోడనే పైని జెప్పిన రీతిని నిత్యకృత్యముల నొనర్చుచుండవలయును—ఇదియే మార్గము." తన జీవితమున ప్రకాశితమైన ఉదారధర్మతత్త్వములను పరమప్రమాణముగా గ్రహించువారితోఁ గూడిన యొక నూతన సంప్రదాయమును శ్రీరామకృష్ణుఁడు తన మూలమున జగజ్జనని స్థాపింపనున్న దని గ్రహించెను.

"ఇఁక పునర్జన్మము లేకుండ, ప్రస్తుతజన్మమే కడసారి జన్మమై యున్నవా రందఱును ఇచటికి వత్తురు; మఱియు

ఒక్కసారియైనను భగవంతుని మనఃపూర్వకముగా ప్రార్థించి యున్నవా రందఱును ఇచటికి వచ్చితీరవలయును" అని యాతఁడు యోగదృష్టిచే గ్రహించి కాలక్రమమున శిష్యు లకుఁ దెలుపువాఁడు. 'ఇచటికి' అనఁగాఁ దనయొద్ద కనికాని, వేనికిఁ దాను మూర్తీభావమో, అట్టి ఉదారమతతత్త్వముల సమాశ్రయమున కనికాని గ్రహింపనగును.

# ఆప్తబంధు వియోగములు

మహాత్యాగశీలుఁడును భక్తుఁడును నగు రామేశ్వరుఁడు —శ్రీరామకృష్ణుని చిన్నన్న— క్రీ. శ. 1873-వ సం॥న కామార్పుకుర్‌న దివంగతుఁ డయ్యెను. ఆసన్నమృత్యువును గూర్చి శ్రీరామకృష్ణుఁ డాతనిని సూచనప్రాయముగా హెచ్చరించియే యుండెను. తన ముసలితల్లి యీ పుత్త్రి వియోగదుఃఖభారమునఁ గ్రుంగిపోవునేమో యని శ్రీరామ కృష్ణుఁడు అత్యంతార్తుఁడై యామె నూఱడింపు మని జగజ్జననిని ప్రార్థించెను. అనంతరము కన్నీటితో మరణవార్త నాతఁడు చంద్రాదేవికిఁ దెలుప నామె, "నాయనా! సంసారము అనిత్యము. ఎన్నఁడో యొకనాఁడు ఎవ్వరైనను మరణింపక తప్పదు; కావున శోకించుట నిష్ప్రయోజనము" అని తానే శ్రీరామకృష్ణు నోదార్పసాగెను! జీవితవిషమ సన్నివేశము లన్నింటియందును శ్రీరామకృష్ణునకు భగవ త్ప్రార్థన యెట్లు జీవగఱ్ఱయై యొప్పెనో గమనింపనగును. "ప్రార్థించునపుడు మనస్సును, వాక్కును ఏకీభవించుచో, తప్పక భగవంతుఁడు అట్టి ప్రార్థన నాలకించి సఫలము చేయును" అని యాతఁడు వక్కాణించును.

తన ప్రాణేశ్వరునితో నొకసంవత్సరముపై నెనిమిది మాసములు నివసించి కామార్పుకుర్ వెళ్లియున్న శ్రీ శారదాదేవి (1874-వ సం॥న) తిరిగి దక్షిణేశ్వరము వచ్చెను. నహబత్ఖానాయందలి యిఱుకుగదిలో నామె నివాస మేర్పఱచు

అసదుపాయముగా నుండుట గని, శంభుచరణుఁడు విశ్వనాథ ఉపాధ్యాయ యను మఱియొక భక్తుని తోడ్పాటున ఆలయ సమీపమున నామెకై యొక కుటీరమును నిర్మించెను. ప్రతి దినము ఆమె శ్రీరామకృష్ణుని భోజనమును సిద్ధమొనర్చి యాతని గదికిఁ గొనివచ్చును. ఆతఁడును ఆమె యోగక్షేమ ముల నరయుటకై ప్రతిదినము నొక్కసారి యామె కుటీర మునకు వెడలి, సాయంకాలము తప్పక తన నివాసమునకుఁ దిరిగి వచ్చును. ఆ ప్రేమలో అంతటి యసంగబుద్ధి!

ఇంచుమించుగా నొక సంవత్సర మైనపిమ్మట నామె తీవ్రమైన గ్రహణిచే బాధపడి జయరామవాటి వెళ్లెను. అంతట నిమ్మళించినను, కొన్నాళ్లకు వ్యాధి తిరుగఁబెట్టి ప్రాణాపాయస్థితి సంభవించెను. ఈ వార్త విని శ్రీరామ కృష్ణుఁడు విషాదగ్రస్తుఁడై హృదయునితో నిట్లు పలికెను: "హృదయా! ఆమె మానవజన్మసాఫల్యము నొందనియెడల, ఈ లోకమున జన్మించుటయు గతించుటయు నిష్ప్రయోజన మైపోవునే!" కాని శ్రీశారదాదేవి యీ విపత్సమయమున వెలువరించిన భగవద్విశ్వాసము ఆశ్చర్యకరము. రహస్య ముగా నామె తమ యూరిలోని సింహవాహినీదేవ్యాలయము నకు వెళ్లి, యాచల్లని తల్లి తన వ్యాధినివారణ చేయనిచో ప్రాయోపవేశము చేయఁబూని యచటఁ బ్రణమిల్లియుండెను. తన యనుంగుబిడ్డ తనయెదుట ప్రాయోపవేశ మొనర్చు చుండుట చూచి దేవి యెట్లు సహింపఁగలుగును? అచిర కాలముననే దేవి యామె వ్యాధినివారణకై యొక ఓషధిని దెలుపఁ, గొలఁది దినములలో నామె స్వస్థురాలయ్యెను.

మాతృభక్తిపూరితుఁ డగు శ్రీరామకృష్ణుఁడు ప్రతి దినము కొంత సేపు తన తల్లియొద్దనుండి, యామె యక్కఱలను దీర్చుచు నామెను సేవించును. ఆమె యవసానసమయము సమీపించెను. మూఁడు దినములు శరీరస్మృతిరహితయై యుండిన యామెను అవసానసమయమున గంగాతీరమునకుఁ గొనిపోయిరి. మాతృపాదములకు శ్రీరామకృష్ణుఁడు పుష్పాంజలి సమర్పించెను. ప్రశాంతముగా నామె పరమపదించెను. నాఁడు 1876-వ సం॥న మార్చి నెలలో శ్రీరామకృష్ణుని నలుబదవ జన్మదినము. యతి యగు నాతఁడు తన యన్న కుమారుఁ డగు రామలాలుచే యథావిధిగా ఉత్తరక్రియలు జరిపించెను. అనంతర మాతఁడు తల్లికి తర్పణముచేయఁబోవఁగా, వ్రేళ్లు కొంకరుపాటి, పట్టు వదలిపోవ, జలమంతయుఁ గాఱిపోయెను! పదేపదే ప్రయత్నింపఁ బదేపదే యిట్లే సంభవింప నాతఁడు విలపించెను. స్వయముగాఁ దాను నిత్యనైమిత్తిక కర్మవిముక్తుఁ డగు యతివరేణ్యుఁడు గదా? పరమధర్మాశ్రయుఁడు, ధర్మప్రతిష్ఠితుఁడు నగు నాతఁడు ఒకవేళఁ దనకు విహితముకాని కృత్యము చేయఁబూనినను, ఆతని శరీరమే యందులకు అసమర్థమైపోవుట అద్భుతమైన యాతని శారీర మానసిక విశిష్టపరిణామము.

ధర్మనిష్ఠవలెనే సత్యసంధతయు శ్రీరామకృష్ణుని స్వభావమున నెంతటి గాఢముగా నాటుకొనియుండెనో, ఆతఁ డేమఱియున్నపుడు సైతము సత్యస్వరూపిణి—జగజ్జనని—యాతని నెట్లు కాపాడుచుండెనో, తెలుపు నొక సంఘటనము. శ్రీరామకృష్ణుఁ డీ కాలమునఁ దఱచు విరేచనములచే బాధ

పడుచుండె నని శంభుచరణుఁడు తెలిసికొని, నల్లమందు మాత్రలను సేవింపుఁ డని సలహాచెప్పి, వానిని దనయొద్ద నుండి తీసికొం డనెను. శ్రీరామకృష్ణుఁడు అంగీకరించెను గాని, యాతనితో సంభాషించుచు, ఆతనితోఁబాటు తానును ఆమాట మఱచి, పిమ్మట నాతని ధర్మవైద్యశాలను నిర్వహించుచున్న యొకని నడిగి కొంచెము నల్లమందు గైకొనెను. అంత నాతఁడు తన నివాసమునకు బయలుదేఱ, దారి తప్పుచుండెను. ఆశ్చర్యపడి దృష్టి వెనుకకు సారింప, శంభు నింటికిని, వైద్యశాలకును బోవు దారి స్పష్టముగా గోచరించు చుండెను, గాని ముందు తెరువు సరిగాఁ గనఁబడదయ్యె. వెనుకకు మఱలి, జాగ్రత్తగా దారి చూచుకొనుచు, ముం దడుగు వేయఁబూనెను. కాని మఱల తొట్రుపాటే! త న్నేదియో వెనుకకు లాగుచున్నట్లుండెను. ఇట్లు పలుసార్లు విఫలప్రయత్న మొనర్చిన పిమ్మట నాతనికి శంభుఁడు తన యుద్యోగియొద్దనుండికాక తనయొద్దనుండి నల్లమందు తీసి కొనుమని చెప్పినట్లు అకస్మాత్తుగాఁ దట్టెను. అనుమతి లేనిదే యిచ్చుట కాతనికి అధికార మెక్కడిది? జగజ్జనని తన్ను నివారించియుండనిచో, తాను అసత్యము, దొంగ తనము నను దోషములకుఁ బాల్పడినవాఁడనై యుండునని తోఁచెను! కావున నాతఁడు వైద్యశాలకు వెళ్లి, "ఇదిగో, నీ నల్లమందు తిరిగి నీ కిచ్చివేయుచున్నాను" అని బిగ్గఱగాఁ జెప్పుచు, కిటికీగుండా పొట్లమును లోనికిఁ బడవేసెను. ఇట్లుఁ దిరిగి, ఆలయమందలి తన నివాసమునకు బయలుదేఱ, మనస్సు ఎంతమాత్రము సమ్మోహితము కాలేదు. దారి స్పష్ట

ముగాఁ గాన్పింప సురక్షితముగాఁ జేరెను. ఈ సంఘటనమును గూర్చి యనంతర మాతఁ డిట్లు పలికెను: "భారమునంతయు అమ్మపైఁ బెట్టితిని గావున ఆమె నాచేయి పట్టుకొనియుండి లేశమైనను మార్గమునుండి యెన్నఁడును తప్పిపోనీయదు."

శంభుచరణుఁడు తీవ్రవ్యాధిగ్రస్తుఁ డయ్యెను. ఆతనిఁ జూచివచ్చి, శ్రీరామకృష్ణుఁడు హృదయునితో, "శంభుని జీవనదీపములోని చమురు ఐపోయినది" అని చెప్పెను. అది యథార్థ మయ్యెను. గతించుటకుఁ గొలఁదినాళ్లకు ముం దాతఁడు, "మరణమునుగూర్చి నా కెంతమాత్రము చింత లేదు, అవసానయాత్రకై సంసిద్ధుఁడనై యున్నాను" అని ధైర్యోల్లాసములతోఁ జెప్పఁగలిగిన ధీరుఁడు. మథురునకుఁ బిమ్మటఁ దనసౌకర్యముల నరయుటకై దేవిచే నియమితుఁడైన రెండవరసద్దారు శంభుచరణుఁడని శ్రీరామకృష్ణుఁడు తెల్పెను.

నేపాళసంస్థానమునకుఁ జెందిన గొప్ప సైనికోద్యోగి యగు విశ్వనాథఉపాధ్యాయ యను నతఁడు ప్రభామండల పరివేష్టితుఁడై యున్న యొక మహాపురుషుఁడు ఉత్తమజ్ఞానము తనయొద్దఁ బొందుమని తన్నుఁ బిలుచుచున్నట్లు కల గని, యనంతరము శ్రీ రామకృష్ణుని గూర్చి విని, కలసికొని, స్వప్నమునఁ దాను గాంచిన పురుషుఁ డాతఁడే యని గుర్తించి, ఆశ్చర్యపరవశుఁ డయ్యెను. శ్రీరామకృష్ణుఁ డీతనిని పూర్వ స్నేహితునివలె ఆదరించెను. ఉత్తమభక్తుఁడు, మహాపండితుఁడు నగు విశ్వనాథుఁడు శ్రీరామకృష్ణుని దివ్యమానసిక స్థితిని గ్రహించి తన గురువుగా భావించి సేవింపసాగెను. శ్రీరామకృష్ణుని మూఁడవ రసద్దారైన మహనీయుఁ డీతఁడు.

# బ్రాహ్మసామాజిక సంసర్గము

బ్రాహ్మసామాజికులతో సంసర్గము శ్రీరామకృష్ణుని దివ్య జీవితచరిత్రలో నూతనాధ్యాయమును వెలువరించిన యొక ముఖ్యసంఘటనము. బ్రాహ్మసామాజికులనుండియే కాలక్రమమున నాతని ప్రధానశిష్యులు వెలువడిరి.[1]

'ఆది బ్రాహ్మసమాజ' సంస్థాపకుఁ డగు మహర్షి-దేవేంద్రనాథఠాకుర్ యొక్క భగవద్భక్తినిగూర్చి విని శ్రీరామకృష్ణుఁ డిదివఱకే మథురానాథునితో వెడలి యాతనిఁ గలసికొని యుండెను. స్మరణీయమైన యీ సమావేశమును గూర్చి యాతఁడు (శ్రీరామకృష్ణుఁడు) ఇట్లు తెలిపెను:

"...దేవేంద్రుని శరీరలక్షణములను జూడఁగోరి యాతనితో, 'నీ శరీరము చూపు'మంటిని. ఆతఁడు తన చొక్కా పై కెత్తి చూపెను. గౌరవర్ణము. అందు సిందూరకాంతి కలిగియుండెను.... మొదట నేను ఆతనిఁ గలసికొనినప్పుడు ఆతఁడు కొంచెము అహంకారము కలిగియున్నట్లు కనిపించెను. అది సహజముకదా?—అంతటి ఐశ్వర్యము, విద్య, పేరు ప్రతిష్ఠలను అనుభవించుచుండె నాయెను. దానిని గనుఁగొని మథురునితో ఇట్లంటిని: 'అహంకారమునకు మూల మేది? జ్ఞానమా, అజ్ఞానమా? బ్రహ్మజ్ఞాని యైనవానికి, 'నేను పండితుఁడను, నేను జ్ఞానిని, నేను ధనవంతుఁడను' అనునట్టి అహంకారము ఉండఁగలదా?' దేవేంద్రునితో ప్రసంగించుచుండఁగా, నిజముగా ఎవ రెట్టివారో కనుఁగొనఁగల విచిత్రమైన మనఃస్థితి అకస్మాత్తుగా నన్ను ఆవేశించినది. ఆ మనఃస్థితిలో మహాపండితులు సైతము, వివేక వైరాగ్యరహితులైనయెడల,

---

[1] బ్రాహ్మసామాజిక సమావేశమునుగూర్చి శ్రీ రామకృష్ణుఁ డొకప్పుడు, "బ్రాహ్మసభయా, లేక (బ్రాహ్మ) శోభయా? బ్రాహ్మసమాజమున నియమితమైన ఉపాసన జరుగుచుండును, అది చాల మంచిది; కాని యందు మునుఁగవలయును" అని పలికెను. (Refer The Gospel of Sri Ramakrishna, p. 947.)

శాకంటికి గడిపరకలవలెఁ గనఁబడుదురు....లోలోన నాకు నవ్వు పొంగి పొరలుచుండెను. దేవేంద్రునియందు యోగము, భోగము రెండునుగూడఁ గనఁబడెను. అతనికి చాలమంది పిల్లలుండిరి. జ్ఞాని యైయుండియు సర్వదా సంసారనిమగ్నుఁడై యుండవలసినవాఁ డాయెను. 'నీవు కలియుగ జనకుఁడవు' అంటిని. 'ఇహపరములను రెంటిని జతపటిచి తన పరిపూర్ణ క్షీరకలశమునుండి యాతఁడు పాలను గ్రోలెను.' 'నీవు సంసారమం దుండి మనస్సును భగవంతునియందు నిలిపియుంతు వని విని నిన్ను జూడవచ్చినాను. భగవద్విషయ మేమైనను వినిపింపు' మంటిని. అంత నతఁడు వేదములనుండి కొంఁదిగా వినిపించి యిట్లనెను: 'ఈ జగత్తు వేయికొమ్మల దీపపు సెమ్మెవంటిది. ఇందుఁ గల ప్రతిజీవియు నం దొక దీపము.' పంచవటియందు ధ్యానించుచుండఁగా, సరిగా ఇట్టి దృశ్యమునే ఒకప్పుడు చూచియుంటిని. ఆ నా దర్శనముతో ఆతని వాక్కులు ఏకీభవించుట చూచి యాతఁడు చాల గొప్పవాఁడైయుండ వలయునని యూహించి, యా వాక్కులను వ్యాఖ్యానింపు మంటిని. అంత నతఁడు, 'ఈ జగత్తత్త్వము నెవరు తెలిసికోఁగలరు?—తన మహిమను ప్రకాశిత మొనర్చుటకై భగవంతుఁడు మానవుని సృజించెను. దీపపుసెమ్మెలో దీపములు లేనిచో అంతా అంధకారమైపోవును; సెమ్మెకూడా కనఁబడదు గదా?' యనెను. మేము చాలసేపు సంభాషించితిమి. అతఁడును సంతసించి తమ సమాజవార్షికోత్సవమునకు నన్ను ఆహ్వానింప, నే నిట్లంటిని: 'అది ఈశ్వరేచ్ఛాధీనము. నా స్థితి చూచుచుంటివికదా! ఈశ్వరుఁడు నన్ను ఎపుడు ఏస్థితిలో నుంచునో వానికే యెఱుక.' అందు కాతఁడు, 'కాదు మీరు రాక తప్పదు. కాని దోవతి ధరించి, ఉత్తరీయము కప్పుకొని రాఁగోరెదను. మీ దుస్తులు చిందఱవందఱగా నుండుట చూచి యెవరైనను ఏమైనను అన్న యెడల, నాకు కష్టముగా నుండును' అనెను. అందులకు, 'అది నావల్ల కాదు. నేను బాబును (లౌకిక వేషధారి నని భావము) కాఁజాల' నంటిని. దేవేంద్రుఁడును, మథురుఁడును, అందఱును పక్కున నవ్విరి. ఆ ఉత్సవమునకు ఉత్తరీయము ధరించి రానియెడల, అసభ్యముగా నుండునని —నన్ను వారించుచు—దేవేంద్రునియొద్దనుండి మఱునాఁడు మథురునకు లేఖ వచ్చెను!"

శ్రీరామకృష్ణున కింతవఱకు విశేషముగా యతుల తోడను, సనాతనపండితులతోడను గల్గుచుండిన సమావేశములవలన నాతని దివ్యాశయములును, ఉపదేశములును సనాతనమతధర్మావలంబుల—పూర్వాచారపరాయణుల—నడుమ విశేషముగా వ్యాప్తి నొందసాగెను. ఆంగ్లభాషావేత్తలు, ఆధునికభావపూరితులు, సంఘసంస్కరణ ప్రవృత్తులు, అందు ముఖ్యముగా బ్రాహ్మసామాజికులును అగు వారితో నాతనికి సుపరిచయము గల్గుటకును, వారిపై నాతని ప్రభావము ప్రసరించుటకును బ్రాహ్మసమాజనాయకుఁడు, సుప్రసిద్ధప్రచారకుఁడును నగు శ్రీకేశవచంద్రసేను నాతఁడు కలసికొనుటయే ప్రారంభమని చెప్పవచ్చును. విద్యాధికుఁడును, గంభీరవక్తయు, దేవేంద్రనాథమహాశయునకు కుడిబుజమునై యుండిన కేశవచంద్రసేను అచిరకాలముననే 'ఆదిబ్రాహ్మసమాజ'మందలి పురోగమనశాఖకు నాయకుఁడై 'భారతవర్షీయ బ్రాహ్మసమాజము'ను స్థాపించెను.

1875-వ సం॥న మార్చి నెలలో నొకనాఁడు శ్రీరామకృష్ణుఁడు హృదయునితో బయలుదేఱి, (ఆసమయమున దక్షిణేశ్వరసమీపమున నివసించుచుండిన) కేశవచంద్రసేనుని గలసికొని, "మీరు భగవంతుని సందర్శించితిరఁట. కావున దానినిగూర్చి వినుటకై మీయొద్దకు వచ్చితి" ననెను. అనంతర మాతఁడు భక్తిపరవశుఁడై యొక కాళీకీర్తన పాడి సమాధిస్థితుఁ డయ్యెను. అట్టిస్థితుల నెఱుఁగని కేశవునకును నాతని యనుచరులకును అదియొక విశేషముగాఁ దోఁపలేదు; కాని హృదయుఁడు శ్రీరామకృష్ణుని చెవిలో ఓంకారము

నుచ్చరించుచు బాహ్యప్రజ్ఞ కలిగించుట వారలకు ఆశ్చర్య జనక మయ్యెను. శ్రీరామకృష్ణుని వదనము దివ్య తేజముతో విరాజిల్లుచుండ, నందుండి గంగాప్రవాహమువలె అనర్గళమైన దివ్యవాణి వెలువడి యెల్లరను సమ్మోహితుల నొనర్చెను. అనంతకల్యాణగుణపరిపూర్ణుఁడు, అద్వితీయుఁడు నగు భగవంతుఁడే నానావిధములుగా భాసించుచున్నాఁడని తెలుపుచు, నాతఁడు మనోహరమైన యుదాహరణములతో భగవత్తత్త్వమునుగూర్చి సహజసరళరీతి నిట్లు ప్రసంగింపసాగెను :

"కొందఱు గ్రుడ్డివాండ్రు ఒక జంతువుకడకు వచ్చుట తటసించెను. వారి కొకఁడు అది యేనుఁగని చెప్పి, యది యెట్లు తోఁచుచున్నదో తెలుపుఁడనెను. అంతట వారిలో నొకఁడు దాని కాలు తడవి, 'ఏనుఁగు స్తంభమువలె నుండు' ననెను. రెండవవాఁడు దాని చెవి తడవి, 'ఏనుఁగు చేటవలె నుండు' నని చెప్పెను. ఇట్లే దాని తొండమును, లేదా, కడుపును తాఁకినవారు వివిధాభిప్రాయములను వెలిపుచ్చిరి. భగవద్విషయముకూడ నిట్టిదే. ప్రతివాఁడును (పరిమితమైన తన) అనుభవము ననుసరించి భగవత్తత్త్వమునుగూర్చి భావించుచుండును...."

అత్యంతము పరిమితమైన తన బుద్ధిచే, అనుభవముచే మానవుఁడు అపరిమితము, అవాఙ్మానసగోచరము నగు భగవత్తత్త్వమును నిరూపింపఁ బూనుట పంచదారగుట్ట నంతయుఁ దననోటఁ గఱచుకొనిపోనెంచిన చీమ యత్నము వంటిదని—అంతటి పరిహాసాస్పద మని—శ్రీరామకృష్ణుఁడు తెలిపెను. భగవత్కృపవలననే భగవత్సాక్షాత్కారము లభించు నని వక్కాణించెను. ఆ వాగ్వైఖరిచే నాతఁడు భగవత్సాక్షాత్కారము నొందిన మహనీయుఁడని భాసింప, బ్రాహ్మసమాజాచార్యశేఖరుఁ డగు కేశవచంద్రుఁడు

నిశ్చేష్టుండై యా సిద్ధపురుషునిముందు పసిబాలునిగాఁ దన్ను భావించుకొని, యఖండగౌరవముతో నాతని వాక్కుల నాలకింపసాగెను. ప్రసంగము తుదిని శ్రీరామకృష్ణుండు కేశవునితో, "సి తోఁక ఊడినది" అని పలికెను. శ్రోతల కీమాటలు బోధపడలేదని గ్రహించి యాతఁ డిట్లు విశదీకరించెను: "కప్పపిల్లలను జూచితిరికదా? తోఁక యున్నంత వఱకు అవి నీటనే నివసింపవలసియుండును; కాని యది యూడినపిమ్మట నవి నీటను, నేలమీఁదనుగూడ నివసింపఁ గలవు. ఇట్లే అజ్ఞాన మను వాల మున్నంతవఱకు మానవుఁడు లోకమను గుంటయందుమాత్రమే మనఁగలుగుచున్నాఁడు. కాని యీ తోఁక యూడినపిదపఁ దన చిత్తానుసారము లోకమునను భగవంతునియందునుగూడ నెలకొనియుండఁ గల్గును. కేశవా, ఇపుడు నీమనస్సు అట్టి స్థితిలో నున్నది. నీవు లోకమునను మనఁగలవు, దివ్యానందానుభవమును బొందఁగలవు." కొంతసేపటికి సెలవు గైకొని శ్రీరామ కృష్ణుండు దక్షిణేశ్వరమునకు మఱలెను.

శ్రీరామకృష్ణునియెడ కేశవుఁడు గాఢాసక్తచిత్తుఁ డయ్యెను. ఐనను, ఆ మహాపురుషునిగూర్చి సవిమర్శముగాఁ దెలిసికొనఁగోరి యాతనిఁ బరిశీలించి తనకుఁ దెలుపుటకై కేశవుఁడు తన యనుచరులను గొందఱను దక్షిణేశ్వరమునకుఁ బంపెను. క్రమముగా నిరువురకును ఆప్తత పెంపొంద, కేశవుఁడు తఱచు శ్రీరామకృష్ణుని సందర్శించుచు దివ్య ప్రసంగానందలాభము నందసాగెను. శ్రీరామకృష్ణుఁడును ఒక్కొక్కప్పుడు కలకత్తా వెడలి కేశవునిఁ గలసికొనును.

బ్రాహ్మసమాజవార్షికోత్సవసందర్భములలోఁ దన యనుచరు లతో కేశవుఁడు దక్షిణేశ్వరము వచ్చుటయో, సమాజమునకు శ్రీరామకృష్ణుని రావించుకొనుటయో జరుగుచుండెడిది. భక్తశిష్యబృందముతో నాతఁడు ప్రత్యేకమైన స్టీమరులో శ్రీరామకృష్ణుని సన్నిధికి వచ్చి యాతనిఁ దోడ్కొ-నివెడలి పావనగంగానదిపై ఆ పరమపావనవాగమృతానందతరంగ ములలో నోలలాడిన సమయము లనేకములు కలవు. శ్రీరామ కృష్ణుని దివ్యబోధనలను బ్రాహ్మసమాజమందిరములనుండి తన ప్రబోధోపన్యాసమూలముననేకాక, ఆంగ్లమునను వంగ భాషయందును గల వివిధవార్తాపత్రికలలోఁ దన రచనల మూలమునఁగూడ కేశవచంద్రుఁడు వ్యాప్తిచేయసాగెను. ఆ మహనీయసాన్నిధ్యమున మహోన్నతవేదాంతమతతత్త్వము లనుగూర్చి క్రమక్రమముగా గ్రహించుచు, తదనుభూతికై వలయు సాధనల నాతఁడు అవలంబింపసాగెను.

"ఎంతకాలము మీ రీవిధముగా దాఁగియుందురు! క్రమముగా జనులు తండోపతండములుగా మీ సన్నిధికి వత్తురు" అని కేశవుఁ డొకప్పుడు పలుక, శ్రీరామకృష్ణుఁడు, "ఏమనుచుంటివి?...ప్రతివాని పాదధూళికి ధూళిని నేను. ఎవ్వరైనను ఇచటికిఁ దమ దయావిశేషమున వచ్చుచో వత్తురుగాక!" అని బదులుచెప్పెను. మఱియొకప్పు డాతఁడు కేశవునితో నిట్లు పలికెను: "మీ పత్రికలో నన్నుగూర్చి యెందుకు వ్రాయుదువు? పుస్తకాలలోను, వార్తాపత్రికలలోను వ్రాయుటవలన నీ వెవ్వరిని ఘనునిఁ జేయఁజాలవు....నేఁడు నిన్ను పొగడిన నాలుక రేపు తెగడును. నాకు పేరు

ప్రతిష్ఠలు అక్కఱలేదు. సదా అధమాధముఁడనై యుందును గాక." ఇట్టి నిరహంకారము—ఇట్టి వినయము—మహోదారశీలసౌరభముకదా! "శ్రీరామకృష్ణుఁ డెల్లరను తన నమస్కారాయుధముచే (వినయముచే) జయించెను" అని గిరీశచంద్రఘోష్—శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యులలో ప్రధానగణ్యుఁడు—వచించును. తన్ను సందర్శింప వచ్చువారలకు శ్రీరామకృష్ణుఁడు తఱచు ముందు తానే నమస్కరించుననుటటుండ, చిన్నబిడ్డలు తనకుఁ బ్రణమిల్లినను, అందులకు ప్రతిగా ఫాలముతో నేలను దాఁకి వారికి ప్రణామ మొనర్చును. భక్తులతోఁగూడి భగవద్భజన, లేదా, సంకీర్తన చేయునపుడు తుదిని నాతఁడు, 'భాగవత-భక్త-భగవాన్!' అని పలుకుచు, ఆ భక్తబృందమునకు సాష్టాంగ వందన మొనర్చును. అట్టియెడ నాతఁ డొకప్పు డిట్లు వచించెను: "జ్ఞానుల పాదములకు ప్రణామములు; భక్తుల పాదములకు ప్రణామములు; సాకారవాదులగునట్టియు నిరాకారవాదులగునట్టియు భక్తుల చరణములకు నా ప్రణామములు; ప్రాచీన బ్రహ్మజ్ఞానుల చరణములకును, బ్రాహ్మసమాజపు నవీన బ్రహ్మజ్ఞానుల చరణములకును ప్రణామములు." భక్తులకాతఁడు స్వయముగా వీవనతో విసరిన సమయము లెన్నియో కలవు. భక్తులకు దాసానుదాసుఁడ ననియు, వారల పాదరజోలేశమ ననియు నాతఁడు వచించును. కాలాంతరమున నాతఁ డొక గృహస్థశిష్యునితో, "నాకెన్నియో దివ్యదర్శనములు గలుగుచుండును; కాని వానిని గూర్చి యెన్నఁడును గర్వపడను....నిశ్చయముగాఁ జెప్పు

చున్నాను—లేశమును అహంభావము పొందను" అని తెలిపెను. మఱియొకప్పు డాతఁడు, "నా కేమియుఁ దెలియ దన్న సంగతి తెలియును" అని పలికెను. 'గురువు', 'బాబా' (అనఁగా తండ్రి), 'కర్త' యను పలుకులతో తన్ను ఎవ్వరై నను సంబోధించుచో, అవి తనకు ములుకులవలెసోఁకుననియు, జగత్తునఁ దన కెవ్వఁడును శిష్యుఁడు కాఁడనియు, ఎల్లరకును దానే శిష్యుఁడ ననియు నింకొకప్పుడు వచించెను. కాళికా లయవనమున నొకప్పు డాతఁడు నడచుచుండ, నొకానొకఁ డాతనిని సామాన్యుఁడైన తోఁటమాలి యనుకొని, "ఓయీ, అదిగో, ఆ పువ్వులను నాకుఁ గోసియిమ్ము" అనఁగా, పల్లెత్తుమాట యైనను అనక, అట్లే కోసియిచ్చి చల్లఁగా అటనుండి వెడలిన నిగర్వచూడామణి యీ జగద్గురువరే ణ్యుఁడు. వినయాదిసుగుణప్రబోధకమైన నైతికధార్మికశిక్ష ణము నేఁటి పాఠశాలలలోను, కళాశాలలలోను వెనుకఁబడి యుండు టెంతయు శోచనీయము.

శ్రీరామకృష్ణునియెడ కేశవచంద్రుని గౌరవము క్రమముగా విశేషభక్తిభావముగాఁ బరిణమింప, సందర్శన సమయమున నాతఁ డాతనికి ప్రణామపూర్వకముగా ఫల పుష్పాదులను అర్పించువాఁడు.[1] ఒకనాఁ డాతఁడు శ్రీరామకృష్ణునిఁ దన ధ్యానపుగదికిఁ దోడ్కొనివెడలి పూవులతోఁ బూజించెను.[2]

---

[1] Refer 'The Gospel of Sri Ramakrishna', p. 942.

[2] Refer 'Sri Ramakrishna The Great Master,' p. 318.

శ్రీరామకృష్ణునాధ్యాత్మికతత్త్వములను కేశవుఁడు స్వీయసాధనలచేఁ దనకు సాధ్యమైనంతవఱకు స్వీకరించి 'నవ విధానము' అను తన నూతన సంప్రదాయమును లోకము నకుఁ బ్రకటింపసాగెను. కాని యాతఁడు బోధింపఁబూనిన యీ నవవిధానము అనేకమతములలోనుండి తా నెన్నుకొనిన తత్త్వముల కూడిక యనఁదగియుండ, ప్రతివ్యక్తిని—సనాతన ధర్మానుసారముగా—స్వధర్మమును, లేదా, స్వీయ మానసికసంస్కారానుగత మగు మతమును మనఃపూర్వక ముగా అవలంబింపనిచ్చుటయే శ్రీరామకృష్ణుని యాశయ మని చెప్పనొప్పును.

బ్రాహ్మసమాజమందలి నవవిధానసభ్యులు, సాధారణ బ్రాహ్మసమాజసభ్యులు నను నిరుశాఖలవారును తమలోఁ దాము స్పర్ధలచే, స్వపక్షదురభిమానముచే, బద్ధులు గాక యావచ్ఛక్తితో భగవదన్వేషణచేయఁగల్గుటకై అట్టి యవ రోధములను శ్రీరామకృష్ణుఁడు తొలఁగింపఁబూనెను.

శ్రీరామకృష్ణుని సంసర్గమువలన బ్రాహ్మసమాజము విశేషలాభము నందెను. భగవన్మాతృభావమును తదీయ సభ్యులకుఁ గల్గించిన దాతఁడే. భగవద్భావమును, భగవ దుపాసనమునుగూర్చి కేశవచంద్రునకును అతని యనుచరుల కును ఒకనాఁ డాతఁ డిట్లు ఉద్బోధించెను :

"భగవానుని వైభవమునుగూర్చియు శక్తులనుగూర్చియు మీ రంతగా స్తోత్రములు చేయుచుందురేల ? తండ్రికడ నున్న కుమారుఁడు, 'మా నాయన కెన్ని యిండ్లు, వాకిండ్లు నున్నవి; ఇన్ని గుఱ్ఱము లున్నవి, ఇన్ని యావు లున్నవి, ఇన్ని తోఁట లున్నవి' అని తలపోయునా ? లేక

తండ్రి త న్నెంత మక్కువతోఁ జూచునో తలపోయునా? తండ్రి తన బిడ్డలకు అన్నవస్త్రము లిచ్చి పోషించి వారిని సుఖపెట్టుట అబ్బురమా? మన మందఱము భగవానుని బిడ్డలము కామా? మన యోగక్షేమముల నాతఁడు ప్రేమతో వహించుటలో ఆశ్చర్య మేమున్నది? కావున నిజమైన భగవద్భక్తుఁడు వాని వైభవమునుగూర్చి చింతించుటకు బదులు వానితో సన్నిహితసంబంధము నేర్పఱుచుకొని వానిని తనవానినిగా నొనర్చుకొనును; తన ముద్దు చెల్లింపుమని పట్టుపట్టును; 'భగవంతుఁడు నావాఁడు' అని గర్వించును; 'నాకు నీవు సాక్షాత్కరింపక తప్పదు' అని నిర్బంధించును. వాని వైభవమునుగూర్చి—విభూతులనుగూర్చి—మీ రంతగా చింతించుచున్నపక్షమున వానిని మీరు సన్నిహితునిగా—ఆప్తునిగా—భావింపఁజాలరు; వానిని నిర్బంధింపఁజాలరు. అప్పుడు భగవంతుని మహిమాతిశయమునుగూర్చి 'ఆతఁ డెంత అతీతుఁడో'యని భయభ్రాంతు లగుదురు. ఆతఁ డిఁక సన్నిహితుఁ డెట్లగును? పరమాత్ముని మీరు అత్యంతసన్నిహితునిగా, పరమాప్తునిగా భావింపవలయును. అప్పుడే మీరు వానిని సాక్షాత్కరించుకొనఁగల్గుదురు."

భగవంతునిగూర్చి బ్రాహ్మసామాజికుల భావము శ్రీరామకృష్ణుని బోధలవలన విశేషవైశాల్యము నొందెను. ఆతఁడు వారి కిట్లు ఉపదేశించువాఁడు: "భగవంతునిగూర్చి తాను సర్వము గ్రహించితి నని యెవ్వరును వానికి పరిమితి కల్పింపఁజాలరు. సాకారుఁ డాతఁడే, నిరాకారుఁడును ఆతఁడే. సర్వాతీతుఁ డగు నాతఁ డింకను ఎట్టివాఁడో యెవరికిఁ దెలియును!" భగవంతుఁడు సాకారుఁడై యుండుట అసంభవమనియు, విగ్రహమూలమునఁగాని, ప్రతీకమూలమునఁగాని వాని నర్చించుట దోషమనియు, పాపమనియుఁ దలఁచువారి కాతఁ డిట్లు బోధించును: "నీటికి ఆకారము లేదు, నిజమే; కాని మంచుగడ్డగా గట్టిపడినప్పుడు ఆకార మేర్పడుచున్నది కదా? ఇట్లే నిరాకారసచ్చిదానందబ్రహ్మమును ఉపాసకుని

భక్తిఫలితముగా వివిధరూపములను దాల్చుచుండును. బొమ్మసీతాఫలము నిజమైన సీతాఫలము నెట్లు తోఁచింపునో, లేదా, ఛాయాపటము ఒకనికి గతించిన తన తండ్రి నెట్లు జ్ఞప్తికిఁ దెచ్చునో, అట్లే విగ్రహాదిచిహ్నములును యథార్థ భగవత్స్వరూపసాక్షాత్కారమునకుఁ దోడ్పడును."

'ఉత్త బొమ్మలకొలువు' అనియు, ఱాళ్లను అప్పలను బూజించుట యనియుఁ దాము నిరసించుచుండిన విగ్రహారాధనమున విశేషార్థము కలదని బ్రాహ్మమతస్థులు గ్రహింప సాగిరి. దేవీమూర్తిపూజవలన అఖండసాక్షాత్కారమును బడసి లోకపూజ్యుఁడై కేశవచంద్రాదిబ్రాహ్మమతాచార్యులకు సైతము ప్రబోధకుఁడైన శ్రీరామకృష్ణుఁడే విగ్రహారాధనప్రయోజనమునకు ప్రత్యక్షనిదర్శనభూతుఁడు కదా!

కేశవచంద్రసేనుని సహచరుఁడగు ప్రతాపచంద్ర మజుందారు *The Theistic Quarterly Review* అను పత్రికలో శ్రీరామకృష్ణుని సర్వతోముఖానుభూతినిగూర్చి అత్యంత హృదయంగమముగ నిట్లు చాటెను :

"ఆయన మత మేమి? సనాతనహిందూమతము; కాని యది విచిత్రమైన, అపురూపమైన హిందూమతము. రామకృష్ణపరమహంస యే ప్రత్యేక హిందూదేవతారాధకుఁడును గాఁడు. ఆయన శైవుఁడు కాఁడు, శాక్తేయుఁడు కాఁడు, వైష్ణవుఁడు కాఁడు, వేదాంతి కాఁడు. ఐనను ఈ సర్వమును అతఁడే. శివారాధకుఁడు, కాళికారాధకుఁడు, రామారాధకుఁడు, కృష్ణారాధకుఁడు నాతఁడే. తోడ్తోడనే వేదాంత సిద్ధాంతముల నాతఁడు సుస్థిరవిశ్వాసముతో సమర్థించును.... విగ్రహారాధకుఁడయ్యు, అఖండ సచ్చిదానంద స్వరూపమని తాను వచించునట్టి నిరాకార - అద్వితీయ - అనంతపరిపూర్ణ - భగవత్తత్త్వమును

అఖండభక్తివిశ్వాసములతో ధ్యానించును. ఆయనకు ఈ దేవతలలో ప్రతి యొక్కరును అఖండజ్ఞానానందమయము, నిత్యము, నిర్వికారము నగు పరబ్రహ్మముతో జీవాత్మకుఁ గల పరమసంబంధమును బ్రకాశింపఁజేయు నొక మహాశక్తికి మూర్తీభావము...అనిర్వచనీయము, నిర్వికారము నగు అఖండసచ్చిదానందసాగరమునకు ఈ యవతారములు కేవలము వివిధ శక్తులనియు లీలాస్వరూపములనియు ఆయన వచించును....భగవదనుగ్రహమున ఆయన సజీవుఁడై మాకు ప్రాప్యుఁడై యున్నంతవఱకు సంతోషపూర్వకముగా ఆయన పాదసన్నిధిని గూర్చుండి పవిత్రతను, పారమార్థికతను, భగవద్భక్తిప్రమత్తతనుగూర్చి యాయన దివ్యబోధలను బడయుచుందుము.''

ప్రతాపచంద్రుఁడే మఱియొక వ్యాసమున నిట్లు ప్రకటించెను: ''సర్వజీవులను నిత్యనిర్నిద్రప్రేమతోఁ బోషించు భగవానుని జగన్మాతృత్వమునుగూర్చిన తన సుదృఢభావములచే, శిశుస్వభావవినిర్మలమైన తనభక్తిచే ఆయన దానిని (జగన్మాతృభావమును) మా మనస్సునకు అద్భుతముగా విశదపఱిచెను. పురాణవర్ణిత దేవతల రూపమున—ముప్పది మూఁడుకోట్ల పౌరాణిక భారతవర్షీయ దేవతలరూపమున—ఆరాధింపఁబడు భగవదనంతకల్యాణగుణములను ఆయన సాంగత్యప్రభావమున మునుపటికంటె బాగుగా గ్రహింపఁగల్గితిమి.'' బ్రాహ్మమతస్థుల ఆధ్యాత్మికదృక్పథమును శ్రీరామకృష్ణుఁ డెట్లు పరివర్తన మొందించెనో దీనివలన స్పష్టమగుచున్నది కదా?

శ్రీరామకృష్ణుని లోకోత్తరవ్యక్తిత్వమూర్తిమత్త్వములచే ఆకర్షింపఁబడిన బ్రాహ్మసమాజనాయకులలో మఱియొక ప్రసిద్ధపురుషుఁడు పండిత విజయకృష్ణ గోస్వామి. తొలుత కేశవచంద్రు ననుసరించుచుండిన యీతఁడు

అభిప్రాయభేదముచే విడివడి, తన సత్యాన్వేషణము రగుల్కొన శ్రీరామకృష్ణుని సాన్నిధ్యము నొందునప్పటికే భగవత్సాక్షాత్కారమునకై పరితపించుచుండెను. దక్షిణేశ్వరమునను, బ్రాహ్మసామాజిక గృహములందును అనేకపర్యాయములు శ్రీరామకృష్ణునితో స్వయముగా తన్మయనృత్యము సల్పిన ధన్యుఁ డీతఁడు. విజయకృష్ణుని స్థూలకాయము నెంచి శ్రీరామకృష్ణుఁ డొకప్పుడు, "విజయునకు ఈ రోజులలో సంకీర్తన మనిన, అమితప్రీతి; కాని యీతఁడు (మిద్దెపై) నృత్యము చేయుచో, మిద్దె యంతయు గభాలున కూలిపోవునేమోయని నా భయము!" అని యాప్యాయముతోఁ బరిహసించెను. శ్రీరామకృష్ణసాన్నిధ్యసదుపదేశముల నొందుచు, విశేష శ్రద్ధాభక్తులతో సాధనల నొనర్చుచు, విజయకృష్ణుఁడు వివిధ దివ్యానుభవముల నొందసాగెను. బ్రాహ్మమతాభిప్రాయముల ననుసరించి యింతకుముందు దాను మూఢవిశ్వాసముగాఁ బరిగణించుచుండిన దేవతాస్వరూపములలో నమ్మక మీతనికి మరలఁ గుదిరెను. శ్రీరామకృష్ణునుండి యొక్కొక్కప్పుడు వందలకొలఁది మైళ్లదూరమున నున్నను, తదీయదర్శన స్పర్శనభాగ్యము ఈ మహనీయునకు లభించుచుండెడిదఁట.

బ్రాహ్మమతాచార్యులలో మఱియొక విఖ్యాతపురుషుఁడగు పండిత శివనాథశాస్త్రి శ్రీరామకృష్ణుని పరిచయము నొంది, అపురూపమైన యాతని కామకాంచనత్యాగమునకు విస్మితుఁ డయ్యెను. "జిజ్ఞాసువులగు ప్రేక్షకులచే పరిశోధనార్థము ఆయన చేతిలో నాణెము లుంచఁబడిన సమయములలో నే నచట నుంటిని. అపుడు పరమహంస తనకు

అలవాటైయున్న యొకానొక సమాధిస్థితి నొంది, యది తీసివేయఁబడినపిమ్మటఁ గాని బాహ్యస్మృతి నొందకుండు వాఁడు'' అని యాతఁడు వ్రాసియున్నాఁడు. ఏమైనను, యోగ మును భోగమును సమ్మేళన మొనర్పఁబూను దృక్పథము గల యీతఁడు శ్రీరామకృష్ణు నఖండకామకాంచనత్యాగతత్త్వ మును చక్కఁగా గ్రహించినట్లు కనఁబడదు. శివనాథుఁడు తనతో ఒకానొక సంభాషణమున, శ్రీరామకృష్ణుఁడు నవ్వుచు, ''నీకు వేళ యైనది; ఆలస్య మగునేమో జాగ్రత్త! లేకున్న నీా ఆవిడ నిన్ను గదిలోనికి రానీయదు!'' అని వేళాకోళము చేసెనని వ్రాసియున్నాఁడు. శ్రీరామకృష్ణుని సమాధిస్థితులు నాడీదౌర్బల్యసంజనితమైన మూర్ఛావస్థ లనియు, శ్రీచైత న్యుఁడు, మహమ్మదు మున్నగు మహనీయులును మహాభక్త లును పొందుచుండినవి సైత మిట్టివే యనియు శివనాథు నభి ప్రాయము. ఇది యిట్లుండ, శ్రీరామకృష్ణునితోడి విశేష సంసర్గమువలన బ్రాహ్మసామాజికులకు ఆధ్యాత్మికభావవిప్ల వము సంభవించునేమో యనియు, తన్మూలమున బ్రాహ్మ సమాజమే అంతరించునేమో యనియు తుద కాతఁడు భయ పడినట్లు కాన్పించును. శ్రీరామకృష్ణుఁడు శివనాథుని యభి ప్రాయములనుగూర్చి విని, యొకనాఁడాతనితో నిట్లు పలికెను: ''సరేకాని శివనాథా! నా సమాధి ఒకరోగ మనియు, అందుచే ఆసమయమున బాహ్యస్మృతి కోల్పోవుచుందుననియు నీవు చెప్పుచున్నట్లు వినుచున్నాను. అహర్నిశము నీవు నానావిధ తార్కికవిషయములనుగుఱించి చింతించుచున్నను, సుస్థిర మతిమంతుఁడ ననుకొనుచున్న నీకు, దేని దివ్యతేజముచే

సర్వము భాసించుచున్నదో, అట్టి యనంతచిత్స్వరూపమును ధ్యానించు నేను మతిభ్రష్టుఁడనుగాఁ దోఁచుచుంటినా ?[1] సెబాస్! ఏమి యుక్తివాదము!" శివనాథుఁడు మాఱు మాటాడక ఊరకుండెను.

శివనాథుఁ డనిన శ్రీరామకృష్ణునకు అఖండప్రేమ. తన్నాతఁడు ఆలింగనమొనర్చుకొనువాఁడని శివనాథుఁడే వ్రాసియున్నాఁడు. శివనాథుని సత్యకాంక్షయే, తత్త్వజిజ్ఞాసయే యిందులకు కారణమని చెప్పనొప్పును.

శ్రీరామకృష్ణ సాంగత్యలాభము నొందిన మఱియొక ప్రసిద్ధబ్రాహ్మమతాచార్యుఁడు చిరంజీవిశర్మ యను ప్రచ్ఛన్న నామమునఁ బరఁగిన త్రైలోక్యనాథ సాన్న్యాల్. ప్రసిద్ధ గాయకుఁడు, కీర్తనరచయితయు నగు నీతఁడు శ్రీరామకృష్ణుని అతీంద్రియస్థితులను తఱచు సందర్శించుచు, దివ్యావేశపూరితుఁడై వెలువరించిన భక్తికీర్తనలును గేయములును స్వాయముగా నాతని మెప్పు నొంది వేలకొలఁది వంగదేశీయ హృదయములను నేఁటికిని స్పృశించుచున్నవి.

త్రైలోక్యనాథునితో నొకానొక సందర్భమున శ్రీరామకృష్ణుఁ డొనరించిన యీ క్రింది ప్రసంగ మెంతయు గమనింపఁదగియున్నది :

"...ఏమేమి! పెండదట ధనసంచయము, పిమ్మట భగవంతుఁడునా! దానమును దయాదాక్షిణ్యములను గూర్చియా చెప్పుచున్నావు? కూఁతుల పెండ్లిండ్లకై వేనవేలరూపాయలు ఖర్చుపెట్టుచుందురు, గాని, పొరుగు

[1] 'దేని దివ్యతేజముచే సర్వము భాసించుచున్నదో...' అను భావము 'తమేవ భాన్తమనుభాతి సర్వం, తస్య భాసా సర్వ మిదం విభాతి' అను సూక్తులలో కఠ, ముండకోపనిషత్తులలోఁ గానగును.

వాఁడు కుటుంబసహితముగా పస్తుపడియున్నను, పట్టెఁడన్నము పెట్టుటకై వేయిసార్లు ఆలోచించి తటపటాయించుచుందురే! ఇరుగుపొరుగువారు తినఁ దిండి లేక పస్తుపడియుండఁగా, 'కానీ, ఆ నిర్భాగ్యులు చచ్చినను, బ్రతికినను నాకేమి?— నేను, నా కుటుంబమును హాయిగా నుండుటయే నాకుఁ గావలసినది' అని వా రనుకొనుచుందురు. 'చిన్న నా పొట్టకు శ్రీరామరక్ష!' సర్వభూతదయనుగూర్చి నోటఁ జెప్పుచుందురు!

"నరుఁడు సంసారమున నున్నను పారమార్థికుఁడై యుండవచ్చును. కాని యట్టివాఁడు మొదట జ్ఞానప్రాప్తి నొందియుండవలయును. తొలుత భగవత్సాక్షాత్కారము నొందియుండవలయును. అపు డాతఁడు కళంక సాగరమున నీఁదులాడినను కళంకితుఁడు గాకుండును. భగవత్సందర్శనము నొందిన పిమ్మట నరుఁడు సంసారమున బురదలో చేఁపవలె (లేదా, మట్టిలో కుమ్మరపురుగువలె) లిప్తుఁడు గాకుండ మెలఁగఁగలుగును."

బ్రాహ్మసమాజాధ్యాత్మికభావ వికాసస్థితిగతులను గూర్చి కాలక్రమమున శ్రీరామకృష్ణుని శిష్యులు కొందఱు ప్రతాపచంద్రునిఁ బ్రశ్నింప నాతఁ డిట్లు సమాధానించెను: "ఆయనను (అనఁగా శ్రీరామకృష్ణుని) జూచుటకుముందు ధర్మ మనఁగా, పరమార్థ మనఁగా, నెట్టిదో గ్రహించితిమా? కేవలము ప్రాతిపదికస్థితిలో ప్రాఁకులాడుచుంటిమి. ఆయన సందర్శనలాభము నందినపిమ్మటనే నిజమైన పారమార్థికజీవన మనఁగా నెట్టిదో మాకు బోధపడినది."

ప్రతాపచంద్రమహాశయుని వినయపూర్వకమైన యీ ప్రకటనము బ్రాహ్మసమాజముపై శ్రీరామకృష్ణుని ప్రభావమునకు ప్రబలనిదర్శనము కదా?

వంగదేశమున ఆధునికవిద్యావంతులగు యువకుల మనోభావములను, ధోరణులను గ్రహించుటకేకాక, కాలక్రమమునఁ దన సందేశవ్యాపనమునకు ప్రధానసాధనభూతులైన మహాత్యాగులా జనసంఘమునుండి వెలువడుటకును

బ్రాహ్మసమాజసభ్యులతోడి సంసర్గము శ్రీరామకృష్ణునకు విశేషముగా నుపకరించెను. లోకమున వికాసవంతమగు నే యుద్యమమున నైనను ముందంజ వేయు విద్యావంతు లగు నవీనవిచారశీలజనులతో పరిచయము నొందుటకు యుగధర్మ ప్రవర్తకుఁ డగు శ్రీరామకృష్ణున కిదియే ప్రారంభము. విద్యుద్దీపకాంతులతో మిర్మిట్లు గొల్పుచు, వివిధయంత్ర యానవేగముతో దూరభారములను తృణీకరింపఁ జేయుచు, వార్తాపత్రికాదిప్రచురణలతో పులకలు గల్గించుచు, చలన చిత్రచాతుర్యముతో సమ్మోహితులను జేయుచు, పురాణ వర్ణితస్వర్గసుఖములను బెక్కింటిని స్వయముగా భూతలమునకు దింపి, లోకులకు లోకాంతరచింత యనుదానిని దొలఁగించి, లౌకికచింతను అద్భుతరీతిని రేకెత్తింపఁజాలు పాశ్చాత్య నాగరికతావిజ్ఞానములు సనాతనఋషీశ్వరసంతతి యగు భారతీయుల మానసమును సైతము ఎట్లు వశమొనర్చుకొన సాగెనో గ్రహించుటకు శ్రీరామకృష్ణునకు—పల్లెటూరి వాతావరణమునఁ బుట్టిపెరిగి, పిమ్మటఁ దన యపూర్వసాధ నానుభవములలో నిమగ్నుఁడై యుండిన యాతనికి—ఇంత వఱకు అవకాశము లేకపోయెను. కామకాంచనత్యాగ మెవ్వని యాధ్యాత్మికజీవితమునకు హృదయస్పందనమో, ఆత్మవశీకరణ మెవ్వనికి అక్షరాభ్యాసమునాఁటినుండియు అభ్యస్తము కాసాగిన విద్యయో, అట్టి యా మహనీయునకు యోగమును భోగముతో సమన్వయింపఁజూచుట—క్షణిక తుచ్ఛవిషయసుఖములను శాశ్వతబ్రహ్మానందముతో ముడి పెట్టఁజూచుట—పరిహాసాస్పదముగాఁ దోఁచుట సహజము

గదా? సనాతనభారతీయవిధానముల ననుసరించియే యాతఁడు పరమపురుషార్థసిద్ధిని బడసెను. ఇఁక దేశీయమతధార్మిక స్థితిగతు లపు డెట్లుండెను? భారతీయమహర్షుల మహోపదేశ ములకంటె పాశ్చాత్యతత్త్వశాస్త్రవేత్తల యభిప్రాయ ములను ఊహాలునే దేశీయులకు—అందు ముఖ్యముగా ఆంగ్లవిద్యావంతులకు—విశేషప్రామాణికముగాఁ దోఁచు చుండెను. సనాతన భారతీయధర్మతత్త్వములు శ్రీరామ కృష్ణునియందు ప్రత్యక్షముగా ప్రకాశించుచుండినను, వానిని గ్రహించుట వారికి దుస్సాధ మయ్యెను. యోగమును భోగముతో జతపఱుపఁబూనిన విద్యావంతుల విచిత్రమైన కలగలుపు భావములను దొలఁగించు టాతనికిని కష్టసాధ్య ముగాఁ దోఁచెను. కాని యాతఁ డెంతమాత్రము నిర్విణ్ణుఁడు గాక, అక్షీణప్రేమతో బ్రాహ్మసామాజికులకుఁ దన సాధనాను భవములను సర్వము తెలుపుచు, త్యాగావశ్యకత, సాధన దీక్ష, భగవద్విశ్వాసము, నిష్కామకర్మాచరణము, స్వధర్మా నుష్ఠానము మున్నగు మహత్తరవిషయములనుగూర్చి తన బోధనసారమును వారి కొసఁగసాగెను. వారల మన స్తత్త్వ మును గ్రహించి, తన బోధలలోఁ దమకు ఇచ్చవచ్చినంత వఱకే స్వీకరింపవచ్చు నని స్వేచ్ఛ నొసఁగెను. అప్పటి కది చాలునని యాతని భావము. తన బోధలను పూర్తిగా గ్రహించుటకేకాక, అవలంబించుటకును ఎవ్వరు మహా ధైర్యోత్సాహములతో ముందంజవేయుదురో, అట్టి జగజ్జననీ ప్రియతమనందనులను గలసికొనుటకై యాతని ఆత్రము ఈ యనుభవానంతరము శతగుణాధిక మయ్యెను.

# సంకీర్తనానంద పారవశ్యము : కాంచనాది విషయ విముఖత్వము

కేశవచంద్రసేనునిఁ గలసికొనిన కొలఁది కాలమునకుఁ బిమ్మట శ్రీరామకృష్ణుఁడు సర్వజనసమ్మోహనకరమైన శ్రీ చైతన్యుని నగరసంకీర్తనమును దర్శింప నభిలషించి, అద్భుత దివ్యదర్శనము నొందెను. భక్తజనమహాసమూహము పంచవటివైపునుండి ఆలయవనప్రధానద్వారముదిశగా నడచుచు, క్రమముగా వృక్షసమూహము వెనుక అదృశ్యమైపోవుచున్నట్లు కాన్పించెను. నవద్వీపచంద్రుఁ డగు శ్రీ చైతన్యుఁడు తనకు ఒకవైపున అద్వైతునితోడను, మఱియొక వైపున నిత్యానందునితోడను ఆ మహాసమావేశమధ్యము నుండి అఖండభక్త్యావేశపరవశుఁడై మెల్లఁగాఁ బురోగమించుచుండ, భక్తజనసాగరము సంకీర్తనానందతరంగములతో నుప్పొంగుచుండెను. దివ్యానందోన్మత్తులై కొందఱు తన్మయ నృత్యము సల్పుచుండ, మఱికొందఱు ఆనందోద్వేగమున నిశ్చేష్టు లగుచుండిరి. ఈవిధముగా నాలుగు శతాబ్దముల క్రిందటి యీ దివ్యప్రేమోన్మత్తదృశ్యము శ్రీరామకృష్ణుని కట్టెదుట మరలఁ బ్రదర్శిత మయ్యెను. ఆ సమావేశమందలి కొన్ని ముఖములు ఆతని మనఃఫలకమున వ[illegible]లువ, కాలక్రమమున నాతఁడు తదీయవ్యక్తులను త[illegible] ముఖ్యశిష్యులలోఁ గొందఱగా గుర్తించి, వారు తమ పూర్వజన్మమున శ్రీచైతన్యుని సాంగోపాంగకోటిలోనివా రని విశ్వసించెను.

శ్రీ చైతన్యుని సంకీర్తనదివ్యానందానుభవములను శ్రీరామకృష్ణుఁడు స్వయముగా అనతికాలముననే పడసెను. అది యిట్లు సంఘటిల్లెను. పై దివ్యదర్శనానంతరము కొన్నాళ్ల కాతఁడు కామార్పుకుర్ నకు కడసారి వెడలెను. అటనుండి పరిసరగ్రామములకు వెడలి యందలి సంకీర్తనము లలోఁ బాల్గొనసాగెను. సంకీర్తనసంఘములును, జనసమూహములును ఆతని సంకీర్తనానందప్రమత్తతచే నెట్లు అద్భుత రీతిని ఆకర్షింపఁబడసాగెనో తెలియుట కాతని యీక్రింది వాక్కులే మనకు నిదర్శనములు :

“సిహార్ గ్రామమందలి హృదయు నింటికి వెళ్లియుంటిని. అట నుండి వారు నన్ను శ్యామబజారునకుఁ దీసికొనిపోయిరి. ఆగ్రామమునఁ బ్రవేశింపఁబోవుచు, గౌరాంగభక్తులను గలసికొందునని గ్రహించితిని. ఏమి ఆకర్షణ! అహోరాత్రము ఏడునాళ్లు జనసమూహములు! నిరంతరము నృత్యసంకీర్తనలే. జనులు గోడలపైకి, చెట్లపైకిఁగూడ ఎక్కి చూచుచుండిరి. నటవరగోస్వామి యింట నాబస. అచటను ఇదే విధముగా అహర్నిశము ఒకే జనసమ్మర్దము. ఉదయము రవంత విశ్రాంతికై ఒకసాలెయింటికిఁ బాతిపోవువాఁడను. కాని మద్దెళ్లతోను, తాళములతోను కొలఁది నిమిషములలోనే అచటను జనసమూహము సిద్ధమగును. ‘తాకుటీ, తాకుటీ’ యను నిరంతర మృదంగ ధ్వని! మా స్నానభోజనములు అపరాహ్ణము మూఁడుగంటలకు! ‘దినమునకు ఏడుసార్లు పుట్టి గిట్టు నొకఁడు వచ్చె’ ననువార్త నల్దిక్కులను వ్యాపించెను! (ఆ నిరంతర సంకీర్తనపు ధాకకు) సొమ్మసిలి పడిపోవుదునేమో యని హృదయుఁడు నన్ను ఆ జనసమూహములనుండి యొక పొలమునకు లాగుకొనిపోవును. కాని మరల చీమల బారువలె జనులు మమ్ము వెంబడించువారు. మరల తాళములు, మద్దెలలు—‘తాకుటీ తాకుటీ!’ ‘మీ రెందు కీవిధముగా మా వెంటఁ బడెదరు? ఇది వఱ కెన్నఁడును మేము సంకీర్తన వినలేదను కొనుచుంటిరా?’ అని హృదయుఁడు వారిని మందలించును. దూర

గ్రామములనుండి జనులు తండోపతండములుగా వచ్చుచు, రాత్రులుకూడ అచటనే యుండిపోవువారు. దివ్యాకర్షణ యననేమో నాకచ్చట బోధపడినది. భగవంతుఁడు భూమిపై నవతరించి జరుపు లీలలయందలి ఆకర్షణ యోగమాయాప్రభావమునఁ గలుగుచుండును. సమ్మోహనాస్త్రమననో యనునట్లు దాని కెల్లరును వశీభూతులైపోవుచుందురు!

"అయూరి గోస్వాములు (వైష్ణవప్రముఖులు) తమకు రావలసిన కట్నములలో మేము వాటా కోరుదుమేమోయని నాతో జగడమాడ వచ్చిరి. కాని నేనొకబట్టనైనను, తుద కొక నూలుపోగునైనను తీసికొనుట లేదని శీఘ్రముగనే వారు కనుఁగొనిరి! నేను బ్రహ్మజ్ఞాని నని వారితో నెవరో చెప్పిరి. అందుచే వైష్ణవపండితులు నన్ను బరీక్షింప నెంచిరి. వారిలో నొక రిట్లు ప్రశ్నించిరి: 'ఐతే యితనికి మెడలో తావళమును, నుదుట నామమును లేవేమి?' దీనికి వారిలోనే యొకఁడు, 'కొబ్బరిచెట్టు-ఎండుమట్టలవలె వానియంత టవియే రాలిపోయినవోయి!' అని బదులు చెప్పెను."

జ్ఞానోదయానంతరము సమస్తానుబంధములును తమంతఁ దామే విడిపోవుననుట కుదాహరణముగా శ్రీరామకృష్ణుఁడు ఈ సామ్యము చెప్పుచు, తా నెక్కడ దీనిని వినెనో, తన సహజసరళస్వభావమునఁ బేర్కొనుచుండువాఁడు. ఇట్లే యెవరివలన ఏ లేశము గ్రహించినను, దానిని అవకాశము కలిగినప్పుడు వెల్లడించుట ఆమహనీయుని యలవాటు.

సుమధురకంఠుఁ డగు శ్రీరామకృష్ణుని దివ్యగానము వలెనే యాతని నృత్యమును ఎల్లరను సమ్మోహితుల నొనర్చుచుండెడివి. కాలాంతరమున నొక బ్రాహ్మసామాజికభక్తునింట శ్రీరామకృష్ణుని సహజసుందర నృత్యమును కన్నులారఁ గాంచిన శారదానందస్వామి యిట్లు వ్రాసెను :

"అది యొక అపూర్వదృశ్యము! దివ్యానందమహోత్తుంగతరంగములు పొంగిపొరలుచుండెను. ఎలరును సంకీర్తనానందపరవశులై యుండిరి.

...తాళమృదంగాదులతోఁ గూడిన యా దివ్యగానమందలి యారోహణావరోహణముల ననుసరించి త్వరితగతి నింతలో ముందుకును, మరల నంతలో వెనుకకును బోవుచు, ఆ భగవదానందప్రమత్త జనసంఘమధ్యమున ఠాకుర్ (శ్రీరామకృష్ణుఁడు) నృత్యము చేయుచుండెను...ఆయన మందస్మిత ముఖమండలమున అసాధారణమైన యొక దివ్యతేజము తాండవించు చుండెను. అపురూపమైన లాలిత్యసౌకుమార్యములు సింహబలముతో అద్భుతరీతిని సమ్మేళన మొంది యాయనప్రత్యంగమునను భాసించు చుండెను. ఆహా! ఆ లోకోత్తరనృత్యము! అం దేమియు పటాటోపము లేదు; ఎగురుటలు, దుముకుటలును లేవు; అసహజమైన చేష్టలు లేవు; సంయమలోప మిసుమంతయు లేదు. చాలకాల మొక చిన్న బురద గుంటలో బంధితమై యుండి, అకస్మాత్తుగ నొక సరోవరమున విడువఁ బడిన యొక పెద్దచేప యెట్లు ఇంతలో మెల్లఁగా, అంతలో త్వరిత ముగా, నానాదిక్కులను ఈఁదులాడుచు, నానావిధములఁ దన యానం దమును వెలువరించునో, అట్లె ఆయన నృత్యమున లోనుండి పైకుబుకు చున్న లాలిత్యమాధుర్యానందములకు అనురూపమైన సహజస్థితిగతులు ప్రత్యవయవవిన్యాసమునను ప్రకాశించుచుండెను. ఆయన తన యంతరంగ మునఁ బొందుచుండిన బ్రహ్మానందమునకు, బ్రహ్మసాక్షాత్కారమునకు, ఆ నృత్యము ప్రత్యక్షశారీరప్రకటనమో యనునట్లు తోఁచుచుండెను. ఇట్లు నృత్యమొనర్చుచు, నొక్కొక్కప్పు డాయన బాహ్యస్మృతి కోల్పోవ, కట్టుబట్ట జాఱిపోవుచుండ, నితరులు దానిని మొలచుట్టును గట్టిగా బిగించువారు. దివ్యభావావేశమున నొకానొకరు బాహ్యస్మృతి కోల్పోవుట చూచి యాయన వారి యెడఁద తాఁకి స్మృతి గల్గించును. దివ్య తేజోమయానందవాహిని యాయన యందుండి జాలువాఱి నలువైపు లను బ్రసరించుచు, నిజమైన భక్తులను భగవత్సాక్షాత్కారభాగ్యము నొందఁజేయుచుండినట్లు తోఁచెను. అయ్యది మందవైరాగ్యవంతులగు సామాన్యభక్తులకు తీవ్రభక్తి గల్గింపఁదొడ్డడ, మందబుద్ధులను ఆత్మ సామ్రాజ్యము దెస నుత్సాహముతోఁ బురోగమింపఁజేయ, తీవ్రసంసారా సక్తులగువారికి తాత్కాలికముగా ఆయాసక్తిని దొలఁగించివేయుచుండెను. ఆయన భావావేశప్రభావము ఇతరులను అమాంతముగా ఆకర్షించి పరవ శుల నొనర్చుచుండెను....ఈ సంకీర్తన దివ్యానందమున నిట్లు రెండు

గంటలకంపై నెక్కువకాలము గడచిపోవ, 'దివ్యమధురహరినామము ధరణికిం దెచ్చినవా రెవరో?...' అను కీర్తన పాడఁబడ... నానా మత భక్తాచార్యులకును (జయజయ నినాదపూర్వక) నమస్కారములు ఆచరింపఁబడెను...."

ఇఁక శ్రీరామకృష్ణుని కామార్పుకుర్ నివాసవిశేష ములు. గ్రామాంతరము వెడలుటకై యొకనాఁ డాతఁడు పల్లకీయొద్దకు వచ్చెను. పచ్చనిశరీరమున కెంజాయపట్టుపంచె, బాహువున బంగారుతాయెతు, తాంబూలరంజితమై యొప్పు పెదవులును ఆతని రూపసంపద నినుమడించుచు, సొగసు గులుకుచుండెను. పల్లకీ యెక్కఁబోవుచు, నాతఁడు అచటికి వచ్చియున్న జనసమూహమును జూచి, "ఇందఱి రాకకు కారణ మేమి?" అని తన సన్నిధి నున్న హృదయు నడిగి, యాతని సమాధానము విని, తన శారీరసౌందర్యము జనుల నట్లు ఆకర్షించుచుండుటకు మిక్కిలి నొచ్చుకొనెను. ఆ భావమే తనకు అసహ్య మగుటచే నాతఁడు, "ఒక మనుష్యునిం జూచుటకా యింతమంది జనులు గుమిగూడుట! నేను వెళ్లను. నే నెక్కడికి వెళ్లినను జను లిట్లే చేరుదురు" అని యఖండవిరక్తితోడను, అసహ్యతతోడను తన గదికి మఱలి యాదుస్తు తీసివేసెను. హృదయాదు లెంత బతిమాలు కొన్నను, అతఁ డానాఁడు బయలుదేఱలేదు. బాహ్య సౌందర్యాదులనే లోకులు లక్షించుచు, విషయాకర్షణలకు లోనై, సంసారసంతాపపరిపీడితు లగుచుండుట శ్రీరామ కృష్ణునకు అఖండ మనోవ్యథ కలిగించియుండనోపును. తాంత్రికసాధనానంతరము తనకుఁ గలిగిన యసాధారణ

శరీర తేజమునుగూర్చి యాతఁడిట్లే మహావిరక్తుఁడై యుండెఁగదా!

శ్రీరామకృష్ణునకు ఈ కాలమున నొకటిరెండుసార్లు విపరీతమైన యాఁకలి కలిగెను. కామార్పుకుర్‌లోఁ గొలఁది నెల లుండి యాతఁడు దక్షిణేశ్వరమునకు మఱలెను. భక్తులు, సాధకులును అనేకు లాతని సాన్నిధ్యము నందసాగిరి. లోకు లెల్లరును దేనినిగూర్చి కలలు గనుచు, కలవరించుచుందురో, అట్టి ధనము నెడ శ్రీరామకృష్ణుని యనాసక్తిని, విముఖతను వేనోళ్లఁ జాటు నొక సంఘటనము ఈ సమయమున నే జరిగెను. దానినిగూర్చి యాతఁ డిట్లు పలుకును : "మార్వాడీ యగు లక్ష్మీనారాయణ వేదాంతి తఱచుగా ఇచటికి వచ్చుచుండువాఁడు. ఒకనాఁ డాతఁడు (నా) పడక మలినముగా నుండుట చూచి (అనఁగా దానిపై మలినవస్త్రము పఱవఁ బడియుండుట చూచి యని భావము), 'మీపేర పదివేల రూపాయలు బ్యాంకులో వేయుదును, దానిపై వచ్చు వడ్డీతో మీ సేవ జరుగుచుండును' అనెను. ఆతఁ డీమాట లన్నంతనే తలపై నెవ్వరో లాఠీతోఁ గొట్టినట్లు స్మృతితప్పి పడిపోతిని. తిరిగి స్మృతి వచ్చిన పిమ్మట నాతనితో నిట్లంటిని : 'మరల నీ విట్టి మాట లాడు నెడల, ఇఁక నీ విచటికి రావద్దు. ధనము ముట్టుట నాకు అసాధ్యము. దగ్గఱ ఉంచుకొనుటయు నాకు అసాధ్యమే.' చాల గడుసువాఁ డాతఁడు. 'హేయోపాదేయ భావము' (ఇది విడువఁదగినది, ఇది గ్రహింపఁదగినదియునను భావము) మీ కింకను పోలేదన్నమాట. ఐతే మీరు పూర్ణజ్ఞానము నొందలేదు' అన్నాఁ డాతఁడు. అందుపై,

'అయ్యా, నే నంతవఱకు ఇంకా రాలే' దంటిని. అంతట లక్ష్మీనారాయణ ఆధనము హృదయునియొద్ద నుంచఁగోరెను. 'అదియు వలదు. హృదయునియొద్ద నుంచితినా, నా యిష్టానుసారము దానిని ఖర్చుపెట్టుమని నే ననవచ్చును; నామాట అతఁడు వినకపోయెనా, నాకు కోపము రావచ్చును. ధనసంపర్కమే చెడ్డది. హృదయునియొద్ద నీ వుంచరాదు' అంటిని. అద్దమునొద్ద నుంచిన వస్తు వేదైనను దానిలో ప్రతిబింబింపదా?"

ఈ సంఘటనమునుగూర్చియే మఱియొకప్పు డాతఁ డిట్లు పలికెను: "ఆ మార్వాడీ భక్తుఁడు ఆ ధనము ఈయఁ గోరినప్పుడు నా తల అంపముతోఁ గోయఁబడుచున్నట్లు (నాకు) అనిపించెను. 'అమ్మా! అమ్మా! ఇప్పటికిని నీవు నాకు మరల ప్రలోభనము చూపవచ్చితివా?' అని అమ్మతో మొఱపెట్టినాను. ఇది యిట్లుండ, ఆమె (అనఁగా శారదా దేవి) మనస్సు తెలిసికొనుటకై అపుడు పిలిపించి, 'ఇదిగో, చూడు. ఆతఁడు ఆధనము ఈయఁగోరుచున్నాఁడు. నేను పుచ్చుకోఁజాలను. నీపేర నుంచఁగోరుచున్నాఁడు. నీవు పుచ్చుకోరాదా?—ఏమందువు?' అంటిని. ఈమాట విన్నంత నే యామె, 'అదెట్లు? దాని నెన్నఁటికిని గ్రహింపరాదు. నేను పుచ్చుకొన్నట్లయితే, మీరు పుచ్చుకొన్నట్లేయగును. ఆధనము నాదగ్గఱ ఉంచుకొంటినా, మీసేవకును, ఇతరమైన అవసరములకునే కదా ఖర్చుపెట్టవలసి యుండును? కాఁబట్టి మీరు స్వీకరించినట్లే యగును. మీ త్యాగముచూచి జనులు మీయందు శ్రద్ధాభక్తులు చూపుచున్నారు; కావున ఆధనము

నెన్నఁటికిని ప్రతిగ్రహింపరాదు' అనెను. 'బ్రతుకు జీవుఁడా' యనుకొని దీర్ఘనిశ్వాసము విగిడ్చితిని!''

సర్వవిధములను శ్రీరామకృష్ణునకుఁ దగిన సహధర్మిణీమణి గదా శ్రీశారదామణీదేవి!

భగవంతునిపై నిర్భరపడక, భవిష్యత్తునుగూర్చి లేనిపోని వ్యూహములను బన్నుట శ్రీరామకృష్ణుని కెంతటి అసహ్యమో నిరూపించు నొక సంఘటనము జరిగెను. దానిని గూర్చి యాతఁడే యిట్లు తెలిపెను :

''హృదయుఁ డొకప్పు డిచటి కొక కోడెదూడను తీసికొని వచ్చెను. వనములో మేయుటకై యది త్రాటితోఁ గట్టఁబడియుండుట చూచి, ఒకనాఁ డతనితో, 'హృదయా, ప్రతిరోజు దాని నేల అచటఁ గట్టివేయుదువు?' అని యడిగినాను. అందు కతఁడు, 'బాబూ! దీనిని మా ఊరు పంపుదును. ఇది బలిష్ఠమైన గిత్త అగును. అపుడు దీనిని నాఁగలికిఁ గట్టుదును' అన్నాఁడు. ఈ మాటలు వినఁగానే దిగ్భ్రాంతుఁడనై యిట్లు భావించితిని: 'అహా! ఏమి దురవగాహమైన మాయాలీల! ఎక్కడి సిహొర్ (హృదయుని జన్మగ్రామము)! ఎక్కడి కలకత్తా! పాపము ఈదూడ అంతదూరము పోవలయునఁట! అపు డది పెరిగి పెద్ద గిత్త యగునఁట! అపుడు దీనిని నాఁగలికిఁ గట్టునఁట! ఇదే కదా సంసారము! ఇదే కదా మాయ!' స్మృతి తప్పి క్రిందఁ బడిపోతిని. ఎంతో సేపటికిఁగాని తిరిగి స్మృతి రాలేదు.''

దివ్యదర్శనములలో, దివ్యరూపములలో, తనకిదివఱకే జగజ్జనని చూపిన పావనాత్ములగు భక్తులను—తన యాంతరంగికకోటిని—గలసికొనుటకై శ్రీరామకృష్ణునకు ఈ కాలమున మహాతీవ్రవాంఛ కలుగసాగెను. జగన్మంగళకరమగు

తన సందేశమును తన దివ్యోపదేశరత్నములను లోక మునకు అందఁజేయనున్నవారలను సుశిక్షితుల నొనర్ప వలయు సమయము వచ్చెను. తన యలౌకికపరితాపమును గూర్చి యాతఁ డిట్లు పలుకును :

"అపుడు నేను బొందుచుండిన పరితాపమునకు మేర లేకుండెను. ఆ నిరంతరపరితాపమును పగటిపూట నెట్లో అణఁచుకొనియుండువాఁడను. లౌకికుల నిస్సారవిషయప్రసంగములు నాకు విషప్రాయముగాఁ దోఁచెడివి; వారందఱును — ఆత్మీయులగు వారందఱును — ఎపుడు వత్తురో కదా! — వారితో మనసార భగవత్ప్రసంగములు చేయుచు, ఎపుడు చిత్తశాంతిని, శ్రవణానందమును బొందుదునో కదా! — అని యావేదనపడువాఁడను. ఆత్మానుభూతుల నన్నిఁటిని వారితో ముచ్చటించి హృదయభారము నెపుడు తగ్గించుకొందునా యని యుబలాటపడువాఁడను. ప్రతి స్వల్పవిషయము నన్ను వారిని స్మరింపఁజేయుచు, వారి రాకనుగూర్చి నా మనోభావములను ఉద్దీపింపఁజేయుచుండెడిది; — ఈవిధముగా నా కపుడు వారినిగూర్చియే నిరంతరచింత. ఒకరి కేమి చెప్పవలసియుండునో, మఱియొకరి కేమి యీయవలసియుండునో యని యిట్లు అప్పటికే నాలో నేను ఆయితపడుచుండువాఁడను. పగలు గడచి సాయంకాల మైనంత నే యిఁక నా భావములను, వ్యాకులమును అణఁచుకోఁజాలకపోవువాఁడను. 'అయ్యో! మఱియొకదినము గతించినది. వా రింకను రాలేదే!' యను చింత నన్ను అలముకొనెడిది. ఆరాత్రికసమయమున శంఖఘంటారావములతో దేవాలయము మాఱు మ్రోఁగునపుడు, వనభవనపుకప్పుపై కెక్కి, దుర్భరహృదయసంతాపమున, కన్నుల నీరు గ్రమ్మఁగా, ఎలుఁగెత్తి, 'ఓ నా వత్సలారా! రండు! ఆహా! మీ రెక్కడ నున్నారు? మిమ్ముఁ జూడకుండ నే నిఁక జీవింపఁజాలను' అని యఱచువాఁడను. వారికోసమె నేఁ బరిత

పించినంతగా తల్లి తన బిడ్డను జూచుటకై పరితపించునా యని నా సందేహము; ప్రేయసీప్రేయసులుకాని, ఆప్తమిత్రులుగాని ఒండొరు లను గలిసికొనుటకై అట్లు వర్తించిరని నే నెన్నఁడును వినియుండలేదు—అంతగా తల్లడిల్లిపోయితిని. అనంతరము కొన్నాళ్లకు భక్తులు ఒక రొకరుగా రాసాగిరి.”

రసభరితమగు కావ్యమే రసికహృదయములను ఆకర్షించునట్లు లోకాతీతమైన యీ శిష్యవాత్సల్యమే లోకోత్తరచరిత్రులగు శిష్యులను, భక్తులను శ్రీరామకృష్ణుని సన్నిధికిఁ గొనిరాసాగెను.

# ప్రియతమశిష్యుఁడగు నరేంద్రుఁడు

శ్రీరామకృష్ణుని అలౌకికప్రేమపూరితమైన యా పిలుపునకు ఆతని సాన్నిధ్యము నందసాగిన కొలఁదిమంది గృహస్థశిష్యులకును, భక్తులకును బిమ్మటఁ బేర్కొనఁదగిన మహామహనీయుఁడు కాలక్రమమున వివేకానందనామమున జగద్విఖ్యాతుఁడై వఱలిన నరేంద్రుఁడు ('నరేంద్రనాథదత్త'). గతశతాబ్దపు తుదిభాగమున అమెరికా (చికాగో) లో జరిగిన సర్వమతమహాసభయందు హిందూమతప్రతినిధియై, తన మహోపన్యాసామృతవాహినులచే సభ్యులను తన్మయత నొందించిన మహాప్రబోధకుఁడు, భారతీయవిజ్ఞాన సనాతన ధర్మ మహత్త్వమును పాశ్చాత్యులకు అనర్గళముగాఁ జాటి, పాశ్చాత్యమేధానిధులచే 'ఈశ్వర నియుక్త మహావక్త' (*Orator by Divine Right*) అనియు, 'వేదాంతిశిరోభూషణము' (*The Paragon of Vedantins*) అనియు, 'హైందవ ఝంఝామారుతము' (*The Hindu Cyclone*) అనియు సంకీర్తితుఁడు, అఖండభోగైశ్వర్యసంపన్నులగు తన అమెరికాదేశీయమిత్రుల భవనములలో హంసతూలికా తల్పములపైఁ దాను సుఖనిద్రితుఁడు కాఁజాలుటకు మాఱు, ఘోరదారిద్ర్యపీడితులై, 'అన్నమో రామచంద్రా!' యని యార్చుచు, పస్తులు పడియుండు భారతదేశీయదీనజనసహస్రములను దలఁచి కన్నీటిధారలచే పడకనంతయుఁ దడిపిన దయార్ద్రహృదయుఁడు, "నా దేశమున (నా పరమపవిత్ర భారతదేశమున) నొక కుక్కయైనను బస్తుపడియున్నంత



శ్రీ వివేకానందస్వామి ( చికాగో విశ్వమతమహాసభలో )
'ఈశ్వరప్రేరిత మహావక్త' ('Orator by Divine Right')

వఱకు దానికి ఆహారమిడి రక్షించుటయే నా పరమధర్మము, ఇదియే నా మతము; తద్భిన్న మంతయు అధర్మము, కృత్రిమధర్మము"; "సమస్తజీవస్వరూపుని, అద్వితీయుని... విశేషము...నా ఆర్తనారాయణుని, నా దీననారాయణుని, సమస్తదేశీయుల కెల్ల పేదయగు నా భారతనారాయణుని,— నా యిష్టదేవత నర్చించుటకై యెన్ని జన్మములైన నెత్తెదను గాక, ఎన్నివేల బాధలనైనను అనుభవింతునుగాక" యని ప్రకటించి, అన్నదాన విద్యాదాన జ్ఞానదానాదులచే నేఁడు అఖండదేశసేవనే కాక, ప్రపంచసేవను సల్పుచు, శాఖోప శాఖలతో జగద్వ్యాప్తమై యున్న శ్రీరామకృష్ణమఠసేవా సంఘములను స్థాపించిన దేశభక్తాగ్రగణ్యుఁడు, విశ్వమానవ ప్రేమపూరితుఁడు, ద్వైతాద్వైతాది సిద్ధాంత సమన్వయ మూర్తి, ప్రాచ్యపాశ్చాత్యవిజ్ఞానసాగరుఁడు, సింహగంభీర పురుషాకృతియు జగన్మోహనస్త్రీసౌందర్యమును అద్భుతరీతిని సమ్మేళన మొందియున్న సర్వజనాకర్షకమూర్తియు నగు శ్రీ వివేకానందస్వామినిగూర్చి వినియుండని—పులకితాంగు లైయుండని— దేశభక్తులుగాని, మతభక్తులుగాని, సారస్వత భక్తులుగాని యుండరు.

కలకత్తాలోని సిమ్లా యను పేఁటయందు దత్తవంశము విద్యావిజ్ఞానములతోడను సిరిసంపదలతోడను తులఁదూఁగుచు ప్రఖ్యాతి గాంచియుండెను. వీరు కాయస్థక్షత్రియులు. మహా విద్యావంతుఁడై, సాంసారికజీవితౌన్నత్యము కరతలామలక మయ్యు, విడనాడివైచి, యిరువదియైదేండ్లు నిండకమునుపే సర్వసంగపరిత్యాగ మొనర్చి సన్న్యసించిన దుర్గాచరణదత్తు

నరేంద్రుని పితామహుఁడు. దుర్గాచరణుని పుత్త్రుఁడు కలకత్తాలో సుప్రసిద్ధన్యాయవాది, ఉదారహృదయుఁడు, మహాభోగి, తో[illegible]ఁడనే మహాదాతయునగు విశ్వనాథునకును, విద్యాసౌశీల్యవతియు, శివభక్తిపరాయణయు నగు నాతని సతీమణి భువనేశ్వరీ దేవికిని వీరేశ్వరశివానుగ్రహమున, దుందుభినామసంవత్సర పుష్య బహుళ సప్తమీ సోమవారమున (1863–వ సం॥ జనవరి 12–వ తేదిని) సర్వజనానందకరమగు మకరసంక్రాంతినాఁడు నరేంద్రుఁడు ఉదయించెను. నిత్యము రామాయణమహాభారతములను పారాయణ మొనర్చుచు, వానిలోని విశేషభాగములను కంఠస్థ మొనర్చుకొనిన యామె రామాయణమహాభారతసారమును నరేంద్రునకు ఉగ్గుబాలతోఁ బోసెనని చెప్పనొప్పును.

నరేంద్రుఁడు దినదినప్రవర్ధమానుఁడై, తోఁడిబాలురకు నాయకుఁడై, మహాద్భుతప్రతిభతో పాఠశాలలో విద్యనభ్యసింపసాగెను. ప్రేమానురాగ నిలయమగు హృదయము, ధైర్యసాహసములకు ఆకరమగు నాత్మవిశ్వాసము, శాస్త్రకళాకౌశలమునకు తావలమగు ధీశక్తియు బాల్యముననే యాతనియందు వికసింపనారంభించెను. బుద్ధిబలమునకు దేహబలము దీప్తినొసఁగ, వ్యాయామము, ఈఁత, సాము, గరిడీ, కుస్తీ, మల్లయుద్ధము మున్నగువానిలో నిపుణుఁడయ్యెను. శారీర–మానసిక–ఆధ్యాత్మిక–వికాసమునకు వలయు నిట్టి సమగ్రవిద్యాభ్యాసమే కదా విద్యార్థులకు ఆవశ్యకము? ఇఁక లలితకళలలో గాన మనిన నరేంద్రునకు ప్రాణము. గానకళాకోవిదుఁడైన యాతని దివ్యగానమాధురత

మునకు శ్రీరామకృష్ణపరమహంస యెట్లు బ్రహ్మానందసాగరమున నోలలాడునో కనుఁగొనఁగలము.

ధ్యానము నరేంద్రునకు బాలక్రీడ. దేవతావిగ్రహములతో నాడుకొనుచు, చిన్ననాఁడే యాతఁడు మైమఱపు నొందిన సమయము లెన్నియో కలవు. కాలక్రమమున ధ్యానమున విశేషానురక్తుఁడై యితరులకుఁ దెలియరాకుండ రాత్రి విశేషభాగము ధ్యానమునఁ గడపువాఁడు.

కళాశాలలో నరేంద్రుఁడు ఆంగ్లము, సంస్కృతము, దేశచరిత్ర, తర్కశాస్త్రతత్త్వశాస్త్రములు—వీనియన్నిఁటి యందే కాక, గాన కవితా వక్తృత్వములందును దన కౌశలముచే సహపాఠులను, అధ్యాపకులను ముగ్ధుల నొనర్చుచు, "లోకమున నీతఁడు ఘనత వహించితీరును" అని కళాశాలా ప్రధానాచార్యునిచే ప్రశంసల నందిన ప్రతిభానిధి. పాశ్చాత్య తత్త్వశాస్త్రవాఙ్మయము నాతఁ డెంతశ్రద్ధగా, కూలంకషముగాఁ జదువసాగినను, తన పిపాసను దీర్పఁగల తత్త్వానుభవామృతము ఆతని కందు లభింపకుండెను.

నరేంద్రుఁడు అధశ్శయనబ్రహ్మచర్యవ్రత మవలంబించుచుండిన నిష్ఠాపరుఁడు. కటికినేలమీఁదనే, లేదా, క్రింద నొక్కొక్కప్పు డొక కంబళిమాత్రము పఱచుకొని పరుండును. మాంసాహారము వంశానుగత మైయుండినను, దానిని వర్జించి యాతఁ డీ కాలమున శాకాహారమును మాత్రమే గ్రహింప సాగెను.[1] గంటలతరబడి నాతఁడు ధ్యానించుచుండును.

---

[1] శ్రీరామకృష్ణుని ప్రియతమ శిష్యుఁడగు నీతఁడు (కాలక్రమమున

యౌవనోదయమునుండియు నరేంద్రునకుఁ దన యంత రంగమున అపూర్వభావసంఘర్షణ—తన జీవితాదర్శమును గూర్చి హృదయమథనము—కలుగసాగెను. దానినిగూర్చి యాతఁడే యిట్లు పలుకును:

"యౌవనోదయమునుండియు ప్రతిదినము రాత్రి పరుండఁబోవు నపుడు రెండు ఆదర్శములు చిత్రితములై నా కట్టెదుటఁ గాన్పించెడివి. అందొకటి నేను అఖండభోగభాగ్యములతో, ఆశ్రితపరివారములతో, అధికారగౌరవములతో, సకలైశ్వర్యసంపద్విలాసవైభవోపేతుఁడనై లోకమున ఘను లనఁబడువారిలో అగ్రస్థానము వహించియున్నట్లు ప్రదర్శించును. నిశ్చయముగా అట్టి సామర్థ్యము నా కున్నట్లు తోఁచును. ఉత్తరక్షణముననే రెండవ దృశ్యము—సర్వసంగపరిత్యాగినై, కౌపీనమాత్రధారినై, భిక్షాన్నతృప్తుఁడనై, ఏ చెట్టుక్రిందనో రాత్రులు గడపుచు, కేవలము ఈశ్వరేచ్ఛపై నిర్భరపడి మనుచున్నట్లు ప్రదర్శించును.... పరిశీలించినకొలఁదియు, ఈ రెండు దృశ్యములలో తుదకు రెండవదే ప్రబలాకర్షకమై హృదయము నాక్రమించును. యథార్థపరమానందము నొందు మార్గ మిదే యని తోఁచును...."

ఈ విధముగా మోక్షసామ్రాజ్యలక్ష్మిపై దృష్టి నిలిపి యున్న నరేంద్రుఁడు వివాహము నొల్లక భగవద్దర్శన కాంక్షతోఁ బరితపించుచుండెను. ఇంతకుముందే యాతఁడు

---

(శ్రీవివేకానందస్వామి) మాంసాహారవిషయమై Practical Vedanta (అనుష్ఠానవేదాంతము)నఁ బల్కిన యీ క్రిందివాక్కు లెంతయు గమనింపఁదగియున్నవి: "నేను సరియైన శాకాహారిని గాకపోవచ్చును, కాని యీ విషయమున ఆదర్శ మెట్టిదో నాకు అవగత మైయున్నది. మాంసము తినుచో, అది తప్పని నాకుఁ దెలియును; కొన్ని పరిస్థితు లలోఁ దినుట తప్పనిసరియైనను, అది క్రూర మని నాకుఁ దెలియును.... సర్వజంతువులును నా సోదరులే కావున, మాంసము తినకుండుటయే, ఏజీవిని హింసింపకుండుటయే, ఆదర్శము, ధర్మము."

బ్రాహ్మసమాజమునఁ జేరి మహర్షి దేవేంద్రనాథునిఁ గలసి కొనియుండెను. నరేంద్రుఁ డిపుడు మరల దేవేంద్రుని సందర్శించి, "మహాశయా! మీరు దేవునిఁ జూచితిరా?" యని యావేశపూరితుఁడై ప్రశ్నించెను. అఖండవైరాగ్య సంజనితము, మహాధైర్యసాహసోపేతము నైన యాప్రశ్నకు సంతృప్తికరమైన సమాధానము నొసఁగక, దేవేంద్రుఁడు, "వత్సా! నీవి యోగినేత్రములు" అని వచించి యూర కుండెను. నరేంద్రుఁడు నిరాశతో వెనుకకు మఱలెను.

భగవత్సందర్శనమునకై యిఁక నరేంద్రుని పరితాపము వర్ణనాతీతము. అకస్మాత్తుగా నాతనికి ఈ క్రిందివిషయము జ్ఞప్తికి వచ్చెను :—సురేంద్రనాథమిత్ర యను భక్తునింటికి శ్రీరామకృష్ణపరమహంస నేంచేసియుండిన సమయమున సంకీర్తన మొనర్చుటకై తా నచటికి వెడలియుండెను. తన గానమునకు శ్రీరామకృష్ణుఁడు ముగ్ధుఁడై తన్నుగూర్చి విచారణసల్పుటయేకాక, త్వరలో దక్షిణేశ్వరమునకు రమ్మని తన్నాహ్వానించియుండెను. ఇఁక నరేంద్రుఁడు శ్రీరామ కృష్ణుని సందర్శింప నెంచెను.

ఈ సమయమున నరేంద్రు నాతని చుట్టమగు రామ చంద్రదత్తు, "బిలే! (నరేంద్రుని ముద్దుపేరు) పరమార్థమే నీకు వలసినపక్షమున బ్రాహ్మసమాజాదికములకుఁ బోవనేల? దక్షిణేశ్వరములోని శ్రీరామకృష్ణపరమహంసకడకు వెళ్లు" మని ప్రోత్సహించెను. అనతికాలముననే కొందఱు మిత్రులతో నరేంద్రుఁడు శ్రీరామకృష్ణుని సన్నిధికి వెడలెను. చంద్రో దయసమయమున సముద్రమువలె నరేంద్రునిఁ జూచినంతనే

తన హృదయ ముప్పొంగ శ్రీరామకృష్ణుఁ డాతని నెట్లు ఆదరించెనో తెలిసికొనుటకు నరేంద్రుని యీ క్రిందివచనములే మనకు నిదర్శనములు :

“ (ఆయన కోరిక ననుసరించి) కీర్తనలను పాడితిని. అనంతరము ఠాకుర్ ఆకస్మాత్తుగా లేచి నాచేయి పట్టుకొని నన్ను...ఏకాంతప్రదేశమునకుఁ దీసికొనిపోయిరి. అచట నా కేదియో ఉపదేశ మొనరురని తలఁచితిని ; కాని నా యాశ్చర్య మేమని చెప్పుదును ?...ఆనందపారవశ్యమున అశ్రుధారలు జాలువాఱ, ‘ ఎంతకాలమునకు వచ్చితివోయి తండ్రీ! ఇంతవఱ కెట్లు నిర్దాక్షిణ్యము వహించితి వోయి !’ అని వివశులై పలికిరి. భావాతిశయ మించుక శాంతించినంతనే మరల ఆయన, ‘ నాయనా ! చాలకాలము నీకోసము వేచియుంటిని. లౌకికజనుల తుచ్ఛప్రసంగములను వినుటచే నాచెవులు మండిపోయినవి. ఆహా ! నా ఆత్మానుభవములనుగూర్చి యొక రసజ్ఞునితో ముచ్చటించుట కెంతగాఁ బరితపించితినోయి ! ఇఁక నీతోఁ బ్రసంగించి యీతాపమును చల్లార్చుకొందును’ అని (ముదితాంతరంగులై) వచించిరి. అంతట బద్ధాంజలియై నా యెదుట నిలిచి, ‘ ప్రభూ ! నీవు నరుఁడను ఆ సనాతనఋషివని—మానవకోటి బాధలను బాపుటకై ఆవిర్భవించిన నారాయణుని అవతారమవని—నే నెఱుఁగుదును ’ అని పలుకసాగిరి !—అనంతర మాయన స్వహస్తములతో వెన్న, కలకండ, మిఠాయిని నాచేఁ దినిపించి, ‘ మరల నొంటరిగా, శీఘ్రముగా, రావలయునుజుమీ!’ యని నన్ను ఒడంబఱిచి పంపిరి.”

ఏమహావాంఛచేఁ దాను శ్రీరామకృష్ణుని సందర్శించెనో, అట్టి భగవత్సందర్శనైకవాంఛవలననే నరేంద్రుఁ డాతని నిట్టి ప్రేమపాశములచే బంధించివైచెను. ఇవ్విషయమై శ్రీరామకృష్ణుని వచనములను ఆలకింపుఁడు :

“...అతఁడు (నరేంద్రుఁడు) కేవలము అసంగుఁడై యున్నట్లు, బాహ్యవిషయస్పృహయే అతనికి లేనట్లు, కనుపించినది. మనస్సున అధికాంశము సర్వదా అంతరవలోకనాయత్తమైయున్న ట్లుండెను అతని కన్నులు. లౌకికచింతానిమగ్నమైన కలకత్తానగరమునుండి అట్టి సత్త్వ

గుణాధిపుఁడు—ఆత్మనిరతుఁడు—వచ్చుట నాకు ఆశ్చర్యముగాఁ దోఁచి నది... నా కోరిక ననుసరించి నరేంద్రుఁడు పాడిన పాటలలో,

'మన్ చలో నిజ నికేతనె,

సంసార విదేశె విదేశిర్ వేషె భ్రమ కేనొ అకారణె...'

(మనసా! స్వస్థానమునకు వెడలుదము రమ్ము! విదేశమగు నీసంసారమున పరుఁడవై యేల పరిభ్రమించెదవు ?) అను నాతని పాట ...విని వివశుఁడనై భావసమాధినిమగ్నుఁడ నైతిని.

"పిమ్మట నరేంద్రుఁడు సెలవు తీసికొని వెళ్లెను. కాని మరల నరేంద్రునిఁ జూచుటకై నేఁ బడిన పరితాపము ఇంతింత కాదు....తడి బట్టను బిండునట్లు ఆవ్యాకులత నా హృదయమును బిండివేసినది! దుర్భర విచారమునకు లోనై,...వనములో నొక మూలుమూలకుఁ బోయి; 'ఓ నరేంద్రా! నాయొద్దకు రమ్ము! నిన్ను జూడనియెడల నే నెట్లు జీవింపఁ గలను?' అని యెలుఁగెత్తి విలపించితిని. ఇట్లొక దినమా, రెండు దినములా? ఆఱు నెల లట్లు కడచినవి. నరేంద్రునితో నితరబాలురను వచ్చినను, నా ప్రాణములకు ప్రాణమై నన్ను ఆకర్షించిన వ్యక్తి నరేంద్రుఁ డొక్కఁడే."

శ్రీరామకృష్ణుని చేష్టలును ఆతని విచిత్రవచనములును నరేంద్రునకు బోధపడలేదు. "నిజముగా నీతఁ డొక దివ్య పురుషుఁడా? కాక యొక పిచ్చివాఁడా?" అని యాతఁడు ఆందోళన మొందసాగెను. ఈవిషయమునే తలఁచి నరేంద్రుఁ డిట్లు పలుకువాఁడు :

"నే నాయనను సావధానుఁడనై పరిశీలించితిని. ఆయన వచనము లందుఁగాని, వర్తనమందుఁగాని నా కేమియు విరుద్ధముగాఁ దోఁపలేదు. విశేషము, ఆయన దివ్యప్రసంగములను, సమాధిస్థితులను బట్టిచూడ, నిజమైన విరాగివలెఁ గాన్పించెను : ఠాకుర్ వచనములకును జీవితమున కును అద్భుత మగు సామరస్య మున్నదని గ్రహించితిని....'భగవత్సా క్షాత్కారము పొందవచ్చును. నే నిప్పుడు నిన్నెట్లు చూచుచున్నానో అట్లే మనము భగవంతునిఁ జూడవచ్చును. నీతో నే నెట్లు సంభాషించు చున్నానో, అట్లే మనము భగవంతునితో సంభాషింపవచ్చును. కాని భగవంతునికోసము పరితపించువా రెవ్వరు? పుత్త్రసంతానము లేదనియో,

కలిమి కలుఁగలే దనియో కన్నీరు కాలువలు కట్టునట్లు విలపింతురు; కాని భగవంతునికోసము విలపించువా రెవ్వరు? నిజముగాఁ బరితపించిన యెడల, భగవంతుఁడు ప్రత్యక్షు మైతీరును' అని యాయన వక్కాణించిరి. ఇవ్విషయములను ఆయన సామాన్యబోధకులవలెఁగాక, స్వానుభవపూర్వకముగాఁ బలికెనని నమ్మకతీరినది కాదు. కాని యాయన వచనములకును స న్నాదరించుపట్టున ఆయన విచిత్రచర్యలకును సామరస్యము నాకగపడలేదు.... అందుచే ఆయన పిచ్చివాఁ డని నిశ్చయించుకొంటిని. ఐనను ఆయన వైరాగ్యమో, అత్యద్భుతము! 'ఈతఁడు పిచ్చివాఁడే యగుఁగాక; కాని యిట్టి మహోన్నత వైరాగ్యసంపద యెందఱు అదృష్టవంతులకు అబ్బును? నిజముగా నీతనికి పిచ్చియెత్తిన దనుకొన్నను, మహనీయుల కెల్ల మహనీయుఁ డీతఁడు. యథార్థమైన మహర్షి. లోకము ఈతని పాదసేవ చేయవలయుననుట కీ యొక్క కారణము చాలును!' పరస్పరవిరుద్ధములగు నిట్టి భావములతో ఆయనకు పాదాభివందన మాచరించి సెలవుగైకొని మఱలితిని."

క్రమముమించుగా నొక నెలయైన వెనుక నరేంద్రుఁడు రెండవనారి శ్రీరామకృష్ణుని సందర్శించెను. నరేంద్రునిఁ జూచినంతనే శ్రీరామకృష్ణుఁడు అపరిమితానందభరితుఁడై అత్యంతప్రీతిపూర్వకముగాఁ దన పాన్పుపైఁ గూర్చుండఁ జేసెను. ఉత్తరక్షణముననే యాతఁడు అఖండావేశపరవశుఁడై నరేంద్రునిపై దృష్టి నిగిడ్చి తనలోఁ దా నేదియో గొణఁగుకొనుచు మెల్లగా నాతని సమీపించెను. ఆ సమయమున జరిగిన మహాసంఘటనమునుగూర్చి నరేంద్రుని వచనములనే యుదాహరించుట ఉచితము :

"...వెనుకటివలెనే యీతఁ డేదియో విచిత్రచర్య నొనర్చును గాఁబోలు ననుకొంటిని. అెప్పపాటుకాలములో ఆయన తన కుడిపాదమును నా శరీరముపై నుంచెను. తోడనే నా కొక అపూర్వానుభవము కలుగ నారంభించెను. కండ్లు తెఱచికొని చూచుచుండఁగనే యా మందిరము సమస్తవస్తుసహితముగా గిఱ్ఱునఁ దిరుగ నారంభించి క్షణములో

అదృశ్యమైనది. నాతోఁబాటు చరాచర ప్రపంచమంతయు సర్వవ్యాప్తమగు మహాశూన్యమున లయించిపోవుచున్నట్లు తోఁచెను. అట్టి ఘోరభయంకరస్థితిలో నా వ్యక్తిత్వమే నశించిపోవుచున్నట్లు కాన్పింప, నే నిఁక మృత్యుముఖమునఁ బడుచుంటినని తలఁచి, 'నన్ను మీ రేమి చేయుచున్నారు? నా కింట తల్లిదండ్రు లున్నారు' అని వివశుఁడనై పల్కితిని.[1] ఆయన పక్కున నవ్వి, మెల్లఁగా నా వక్షమును నిమురుచు నిట్లు పలికిరి: 'మంచిది. ఇప్పటి కిది చాలును. సర్వము సకాలమున ప్రాప్తించును లెమ్ము.' అత్యాశ్చర్యము! ఆయన ఇట్లు పలికిన మఱుక్షణమే నా విచిత్రానుభవము అదృశ్యమైనది. మందిరాంతరమందును వెలుపలను సమస్తము మరల యథాప్రకారముగఁ గాన్పించెను. నా కెప్పటి మనఃస్థితి నొందితిని."[2]

"ఇది యంతయు ఇంద్రజాలమా? యథార్థమా?" యని నరేంద్రుఁడు ఆశ్చర్యచకితుఁడై వితర్కింపసాగెను. శ్రీరామకృష్ణుఁ డాతని కొక మహాసమస్యగాఁ దోఁచెను. "ఏమైనను మరల నాతని సమ్మోహనవిద్యకు వశ్యుఁడను

---

[1] ఇవ్విషయమునే స్మరించుచు శ్రీరామకృష్ణుఁ డొకప్పు డిట్లు నరేంద్రునిఁ బరిహసించెను: "ఒకప్పు డొకఁడు చనిపోయి దయ్యమయ్యెను. ఆదయ్య మెవ్వరైనను తోడు దొరకుదురా యని పరితపించుచుండెను. ఎవ్వరైనను చనిపోయిరని విన్నంతనే ఆత్రముతో అచటికిఁ బోవుచుండెడిది; కాని దురదృష్టవశమున—విశేషము ఆ వ్యక్తిపూర్వపుణ్యవశమున—ఆ జీవుఁడు ముక్తుఁ డగుట సంభవించుటచే, ప్రతిపర్యాయము నిరాశతో వెనుకకు మఱలుచుండెడిది. నా స్థితియు నట్లే యున్నది. నిన్ను జూచినంతనే నా కొక మిత్రుఁడు దొరకెనని మురిసితిని; కాని నీవో, 'నా కింట తల్లిదండ్రు లున్నారు' అంటివి! ఆకథలోని దయ్యమువలె నేను ఏకాకినై యున్నాను."

[2] "ఠాకుర్ (శ్రీరామకృష్ణుఁడు) ఎవ్వనినైనను అవలీలగా పూర్వసంస్కారబంధవిముక్తు నొనర్చి, తెప్పపాటులో ఉన్నతభూమికలకుఁ గొనిపోఁగల్గుచుండెడివారు" అని యాయన శిష్యులును మా గురువర్యులును అగు శ్రీ విజ్ఞానానందస్వామివలన వినియున్నాము.

గారాదని నరేంద్రుఁడు నిశ్చయించుకొనెను. శీఘ్రముగా మరల వచ్చెదనని వాగ్దాన మొనరించిన వెనుక శ్రీరామకృష్ణుఁ డాతనికి సెల వొసంగెను.

అచిరకాలముననే నరేంద్రుఁడు మరల శ్రీరామకృష్ణుని సందర్శించెను. చెంత నున్న యదునాథమల్లికుని వనమునకు శ్రీరామకృష్ణుఁ డాతనిఁ గొనిపోయి కొంతసేపందు విహరించెను. పిమ్మట నిరువురును అచటి చావడిలోఁ గూర్చుండిరి. వెంటనే యాతఁడు సమాధిస్థితుఁడై నరేంద్రుని స్పృశించెను. శ్రీరామకృష్ణు నద్భుతప్రభావ మను సూర్యరశ్మిచే నరేంద్రుని మనోనిశ్చయ మను మంచు కరఁగిపోవ, పరిపూర్ణముగా నాతఁడు బాహ్యస్మృతిరహితుఁ డయ్యెను. కొంతసేపటికి స్మృతి కలుగ, చూచుసరికి శ్రీరామకృష్ణుఁడు తనఱొమ్ము మెల్లఁగా నిమురుచుండెను.

శ్రీరామకృష్ణుఁ డా సమయమున నరేంద్రునిగూర్చి గ్రహించిన యద్భుతవిషయము లనేకములు గలవు. ఇవ్విషయమునుగూర్చియే యనంతర మాతఁ డిట్లు వచించెను: "ఆస్థితిలో నరేంద్రు ననేకప్రశ్న లడిగితిని. ఆతని పూర్వజన్మవృత్తాంతమునుగూర్చియు, ఈలోకమున నాతని యుద్యమమునుగూర్చియు, ఆయుఃపరిమితినిగూర్చియుఁ బ్రశ్నింప నాతఁడు అంతర్ముఖుఁడై నా ప్రశ్నల కన్నిఁటికిని సదుత్తరముల నొసఁగెను. ఆతనిఁగూర్చి నా కిదివఱకే కలిగిన యభిప్రాయములును, చూచిన విషయములును ఆ సమాధానములచే మఱింత బలపడినవి. అవన్నియు పరమరహస్యములు. కాని యాతఁడు ధ్యానసిద్ధుఁ డనియు మహర్షి యనియు నిజ

స్వరూపమును గ్రహించిన మఱుక్షణముననే యోగమార్గ మున శరీరత్యాగ మొనర్చుననియు గ్రహించితిని.''

నరేంద్రుఁడు తన్ను సందర్శించుటకు పూర్వమే శ్రీ రామకృష్ణుఁ డాతనిఁగూర్చి పొందిన దివ్యదర్శనములు అత్యాశ్చర్యకరములు.

నరేంద్రుని జననమునకు పూర్వ మొకనాఁడు గగనమండలమున కాశీక్షేత్రమువైపునుండి కాళీఘట్టము (కలకత్తా) వైపునకు దివ్యతేజము మెఱసినట్లు కాంచి, తోడనే యాతఁడు, "నా ప్రార్థన సఫల మైనది, నా ప్రియబాలకుఁడు నాయొద్దకు వచ్చితీరును" అని యానందపరవశుఁడై వచించెను. సమాధిస్థితుఁడై యుండ మఱియొకప్పుడు శ్రీరామకృష్ణుని చిత్తము తేజోమార్గమున క్రమముగా సూర్య-చంద్ర-నక్షత్రమండిత-స్థూలజగమును, సూక్ష్మభావప్రపంచమును, దేవతామూర్తులను, తేజోనిర్మితావరణమును దాఁటి, నిరామయమగు లోకమును జొచ్చెను. అందాతఁడు దివ్యతేజోమయమూర్తులు, సమాధినిమగ్నులును నగు సప్తర్షులను గాంచెను. అంత తేజోమండలమున నొక భాగము దివ్యశిశురూపముఁ దాల్చెను. తోడనే యా శిశువు సప్తర్షులలో నొకనిని తన చిన్ని ముద్దు చేతులతో ఆలింగన మొనర్చుకొని మధురస్వరమునఁ బలుకరించుచు, సమాధినిష్ఠమగు నాతని చిత్తమును బహిర్ముఖ మొనర్చుటకై ప్రయత్నింపసాగెను. ఆ దివ్యస్పర్శచే నాతఁడు అతీంద్రియావస్థనుండి వెలువడి, అరనిమీలితలోచనుఁడై ప్రేమ తరంగములను బాలునిపైఁ బ్రసరింపఁజేయ, బాలుఁడు అమందానందపరవశుఁడై, "నేను క్రిందికిఁ బోవుచున్నాను, నీవును నాతో రావలయునుజుమీ!" యని వచించెను. ప్రేమపూరితమగు మహర్షి చూడ్కులే యందుల కాతని యంగీకారము సూచింప, మరల సమాధినిమగ్నుఁడైన యాతని మనశ్శరీరాంశ మొకటి వెనువెంటనే ఉజ్జ్వలతేజోరూపమున భూమండలమున అవతరించుచున్నట్లు శ్రీరామకృష్ణునకు గోచరించెను. "నరేంద్రుని జూచినంతనే ఆ మహర్షియే యాతఁడని గుర్తించితిని" అని శ్రీరామకృష్ణుఁడు వచించెను.[1]

[1] ఆప్తశిష్యులు ప్రశ్నింపఁ దానే యా దివ్యబాలకుఁడ నని మఱియొకప్పుడు శ్రీరామకృష్ణుఁడు తెలిపెను.

మఱియు నాతఁ డిట్లు పలికెను: "ఆ దివ్యతేజము నంతయు భరించుటకు ప్రపంచమునకు శక్తి చాలదు. లోకమున నేఁటి లోపములను దీర్చుటకు ఆ యంశ మొక్కటియే చాలును; తచ్ఛక్తివలన మహాద్భుతములు జరుగఁగలవు."

శ్రీరామకృష్ణుని పాదస్పర్శవలనఁ దనకు అపూర్వ దివ్యానుభవముకలిగినది మొదలుకొని యాతనియెడ నరేంద్రుని మనోభావము మాఱిపోవ నారంభించెను. శ్రీరామకృష్ణుఁడు పిచ్చివాఁడు కాఁడనియు, కామకాంచనాదివిషయవ్యామోహిత లోకమున నాతఁడే సుస్థిరమతి యనియు, ధీరాగ్రేసరుఁ డనియు నరేంద్రుఁడు గ్రహింపసాగెను. ఐనను ప్రథమసమావేశమున శ్రీరామకృష్ణుఁడు తన్నుఁ గూర్చి పల్కిన వాక్కులు నరేంద్రున కింకను అవగతము కాలేదు. బంగారమును గీటుఱాతిపైఁ బరీక్షించునట్లు శ్రీరామకృష్ణుని దివ్యానుభవవర్తనముల నాతఁడు తన తీవ్రవిమర్శనశక్తిచేఁ బరిశోధించిననేకాని తా నాతని శిష్యాగ్రగణ్యుఁడై యొనర్పవలయు మహాకార్యమును జక్కఁగా గ్రహింపలేదు.

నరేంద్రుఁ డెందుచేనైనఁ గొన్నిదినములవఱకు, లేదా, కొన్నివారములవఱకు రాకున్నచో, శ్రీరామకృష్ణుఁడు కాళీమాత తనకుఁ గాన్పింపని సమయమున నెట్లు తల్లడిల్లెనో అట్లు తల్లడిల్లువాఁడు. నరేంద్రుఁడు రాకుండుటచే నాతఁడు కాళీదేవిమూర్తిని సమీపించి, "అమ్మా! ఆతనిఁ జూడనిచోఁ నేను జీవింపఁజాలను. కరుణించి యాతని రప్పింపుము" అని ప్రార్థించిన సమయము లనేకములు కలవు. నరేంద్రునిఁ జూచినంతనే తఱచుగా నాతఁడు భావపరవశుఁడై, మనోహరమైన

యొకించుక నత్తితో, 'న-న-న' యనుచు, "నరేంద్రుఁడు ఇడుగో!" యను వాక్యమును పూర్తి చేయఁగలుగుటకుముందే ఆనందపారవశ్యమున సమాధిస్థితుఁ డగుచుండును. ఆతని యందలి యీ వాత్సల్యాతిశయము చూచి యితరశిష్యులు అబ్బురపడువారు. "నరేంద్రునిపై ఈయన కింతటి పక్షపాత మేల?" యనియుఁ గొందఱు తలంపకపోలేదు. ఏమైన నేమి? ఆదినములలో శ్రీరామకృష్ణుఁడు అప్రయత్నముగా నరేంద్ర నామమును జపించెను. ఆతనికొఱకే తపించెను. అగాధమైన మాతృప్రేమను మించిన శ్రీరామకృష్ణుని ప్రేమానురాగ ముల తత్త్వము నరేంద్రునకు ఊహాతీత మయ్యెను. ఆతని విశుద్ధప్రేమమును మోహముగా నెంచి నరేంద్రుఁ డొకప్పుడు, "నన్నుగూర్చి మీ రింతగాఁ గలవరించుచున్నచో, మీకు జడభరతుని గతి పట్టు" ననెను. ఈ పలుకులకుఁ దన ముగ్ధ హృదయ మెంతయో కలఁత నొంద, నాతఁడు కాళీమాతను ఆశ్రయించి, యా బాలునియందుఁ దనకు భగవంతుఁడు కాన్పించుచుండుటచేతనే తన యనురాగ మని కనుఁగొను వఱకును శాంతి నందలేదు. "అగాధమైన ప్రేమచే న న్నాయన తన దాసుని జేసివేసెను" అని కాలక్రమమున నరేంద్రుఁడే పలుకును.

నరేంద్రుని విశుద్ధతయందును భావిమహోన్నతియందును తన యఖండవిశ్వాసమున శ్రీరామకృష్ణుఁ డాతని యెదుటనే యాతనిని గుఱించి యితరులతో నిట్లు ప్రశంసించును: "ఇచటికివచ్చు ముముక్షువులలో నరేంద్రునకు నరేంద్రుఁడే సాటి. వీరిలో నొకఁడు అష్టదళపద్మము, మఱియొకఁడు

షోడశదళపద్మము నైనచో, నరేంద్రుఁడు సహస్రదళపద్మము.
"ఒక మహాలక్షణముచే కేశవసేను ప్రఖ్యాతుఁడైనచో, అట్టి లక్షణములు నరేంద్రునందు పదునెనిమిది కలవు. కేశవునందును విజయునందును జ్ఞానము దీపమై వెల్గుచుండ, నరేంద్రునం దయ్యది ప్రచండసూర్యబింబమై ప్రజ్వలించుచున్నది."

అసాధారణమైన యీ ప్రశంసలకు ఉబ్బిపోవుటకు బదులు నరేంద్రుఁ డిట్లు ప్రతిఘటించును : "మహాశయా! మీరట్లు పల్కిన, జనులు మీకు మతిపోయిన దని భావింతురు. అఖండయశోధురీణుఁ డగు కేశవచంద్రసే నెక్కడ! అజ్ఞాత విద్యార్థినగు నే నెక్కడ! మహనీయుఁ డగు విజయకృష్ణ గోస్వామి యెక్కడ! అల్పుఁడ నగు నే నెక్కడ! దయయుంచి నన్నిఁక వారితోఁ బోల్పకుఁడు." నరేంద్రుని వినయ సంపదను గాంచి శ్రీరామకృష్ణుఁడు అలరి నెమ్మదిగా నిట్లు వచించును : "నరేన్! నే నట్లు చెప్పక తప్పదు. ఇవి నా మాట లనుకొనుచుంటివా? అమ్మ నాకుఁ దెల్పిన విషయము లివి. అమ్మ నా కెన్నఁడును అసత్యము తెలుపదు." నరేంద్రుఁ డింకను ప్రతిఘటించును.

ఈవిధముగా శ్రీరామకృష్ణుఁడు శిష్యులలో నరేంద్రుని ప్రత్యేకదృష్టితోఁ జూచువాఁడు. నరేంద్రు నెవ్వరైనను నిందించినచో, "శివనిందాపాపమున కొడిగట్టుకొనకు" మని వారించును. శిష్యు లొనర్పవలయు పరిచర్య నాతనివలన గ్రహింపఁడు; "నీమార్గము వేఱు" అని వారించును. ఇతర శిష్యులకు నిషిద్ధమైన యాహారాదికము నరేంద్రుని మాత్రము

కలుషితు నొనర్పఁజాల దనును. దుశ్చరిత్రులు వండినను, తాఁకినను గూడ తనకు అపరిగ్రాహ్య మగు మధురాహారాది కమును నరేంద్రున కిచ్చి భుజింపుమనును. "జాజ్వల్యమాన మగు నాతని జ్ఞానాగ్ని దహింపఁజాలని అపరిశుద్ధాహారమే లేదు" అనును.

బ్రాహ్మసమాజసభ్యుఁ డగు నరేంద్రుఁడు ఆదినము లలో విగ్రహారాధనమును తీవ్రముగా నిరసించువాఁడు. కాళికాది దేవతల నాతఁడు నమ్మఁడు. ఆతని యీధోరణిని జూచి తుదకు శ్రీరామకృష్ణుఁడు, "సరిలే, ఆనందమయి యగు నా జగన్మాతను నీవు నమ్ముటయే కాక, ఆమెను స్మరించి విలపించు దినములు వచ్చితీరును" అని వచించెను. ఈ యమోఘవాక్కు లెట్లు అద్భుతముగా ఫలించెనో చూచెదము.

అద్వైతవేదాంతతత్త్వగ్రహణమునకు నరేంద్రుఁడు ఉత్తమాధికారి యని శ్రీరామకృష్ణుఁడు తొలుతనే గ్రహించి తద్రహస్యముల నాతనికి ఉపదేశింపఁబూనెను. కాని జీవబ్రహ్మైక్యసిద్ధాంతము నరేంద్రునకు విపరీతముగాఁ దోఁచెను. కాలక్రమమున అద్వైతాశ్రమస్థాపనాచార్యుఁ డైన నరేంద్రుఁ డా దినములలో "నేనే బ్రహ్మమను" ('అహం బ్రహ్మాస్మి') యనుకొనుటకంటె మహత్తరపాపము ఉండఁబోదని వాదించును! ఒకప్పుడు నరేంద్రుఁడు తన మిత్రునితో, "ఈ కూజా బ్రహ్మము, ఈ బల్ల బ్రహ్మము, మనముకూడ బ్రహ్మమే! ఎంత అసంగతము! అవివేకము!! —" అని యేమేమో పలుకుచుండ, శ్రీరామకృష్ణుఁ డాతనిని సమీపించి, "నాయనా! ఏ మనుచుంటివి?" అని నవ్వుచు

స్పృశించి సమాధినిమగ్నుఁ డయ్యెను. తత్ఫలితమును నరేంద్రుఁడే యనంతర మిట్లు వెల్లడించెను: "గురుదేవుని యా మహాద్భుతస్పర్శ వెనువెంటనే నా మనస్సున అపూర్వ పరిణామము కల్గించెను. నిజముగా బ్రహ్మేతరవస్తువు ప్రపంచమున లేనేలేదని కనుఁగొని దిగ్భ్రాంతుఁడ నైతిని!...(అట్లు అనేకదినములు గడచిన తరువాత) ప్రపంచము స్వప్నప్రాయముగాఁ గనఁబడసాగెను...శాస్త్రవాక్యులు మిథ్య కావని తోఁచెను. అద్వైతవేదాంతసిద్ధాంతముల నిఁక నిరాకరింపఁ జాలకపోతిని."

పరస్పరపరీక్షల కన్నిఁటికిని తాళి, వేళ్లు పాఱి నిల్చునదే ఉత్తమగురుశిష్యసన్నిహితసంబంధము. తన తత్త్వానుభూతులను పరీక్షింపుఁడని పదేపదే శ్రీరామకృష్ణుఁడు శిష్యులకుఁ జెప్పెను. "వర్తకులు నాణెములను బరీక్షించునట్లు నన్ను బరీక్షింపుము. పూర్తిగాఁ బరీక్షించిననే కాని నామాటలు అంగీకరింపవలదు" అని యాతఁ డొకప్పుడు నరేంద్రునకుఁ దెలిపెను. ఈమాటలు జ్ఞప్తి నుంచుకొని నరేంద్రుఁడు గురువర్యునిఁ బరీక్షింపసమకట్టి, యొకనాఁ డాతఁడు గదిలో లేనప్పు డాతని పాన్పుక్రింద నొక రూపాయ దాఁచియుంచెను. శ్రీరామకృష్ణుఁడు వచ్చి పాన్పుపైఁ గూర్చుండియుఁ గూర్చుండకమునుపే బాధతో అదరిపడి లేచెను! సాధనదశయం దాతఁడు అంతఃకరణము నేకాక, ఇంద్రియములను సైతము నివృత్తివశ మొనర్చుటచే ధనసంపర్కమునైనను సైపఁజాలని యద్భుతస్థితి వాని కబ్బెను. అనంతర మాతఁడు 'నరేన్' తన్నిట్లు పరీక్షించెనని విని మిక్కిలి సంతసించెను.

కఠినపరీక్షలకుఁ దాళనిదే నరేంద్రుఁడు శ్రీరామ కృష్ణుని ప్రియశిష్యుఁడు కాలేదు. ఒకప్పు డాతఁడు నరేంద్రుని అతి కఠినముగాఁ బరీక్షించెను. నరేంద్రుని జూచినంతనే యాతఁ డెట్లు ఆనందపరవశుఁ డగునో చూచియుంటిమి కదా? అట్టి యాతఁడు నరేంద్రుఁడు వచ్చినచో నిఁకఁ బలుకరింపఁ డయ్యెను. ఆతని ప్రస్తావమే పెట్టుకొనక పరిపూర్ణమైన అలక్ష్యభావము చూపును. ఇట్లు అనేక వారములు గడచినను యథాప్రకారము నరేంద్రుఁడు తన్ను సందర్శించుచునేయుండుట చూచి, శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు కారణ మరయ, నరేంద్రుఁ డిట్లు సమాధానించెను: "నేను వచ్చునది మీ వచనములను వినుటకుమాత్రమే యనుకొనుచుంటిరా! మీపై నాకుఁ గల ప్రేమవలన వచ్చుచుందును." శ్రీరామ కృష్ణుఁడు బ్రహ్మానందభరితుఁడై నరేంద్రు నభినందించెను.

మఱియొకప్పు డాతఁడు నరేంద్రుని జేరఁబిలిచి, "తీవ్ర-సాధనలఫలితముగ లభించిన దివ్యశక్తులను—సిద్ధులను—అమ్మ యాజ్ఞను గొని నీకు ఈయఁదలఁచుచున్నాను. ఏమని యెదవు?" అనెను. భగవత్సాక్షాత్కారమే తన అద్వితీయ లక్ష్యముగాఁ గల నరేంద్రుఁడు వానిని నిరాకరించెను. శ్రీరామ కృష్ణుఁడు నరేంద్రుని బరీక్షించియుండవచ్చును. ఏమైనను నరేంద్రుఁ డట్లు సిద్ధులను నిరాకరింపఁగల్గినందులకై శ్రీరామ కృష్ణుఁడు అపరిమితానందభరితుఁ డయ్యెను.

నరేంద్రుఁ డిపుడు ఇరువదియొక్కేండ్ల యువకుఁడు. బి. ఏ. పరీక్ష నిచ్చియుండెను. తండ్రి విశ్వనాథుఁడు హృద్రోగ మువలన హఠాత్తుగ మరణించెను. నరేంద్రునకు కష్టదినములు

సంప్రాప్త మైనవి. తండ్రి సంపాదించిన సిరిసంపదలు ఆతని తోడనే పోయినవి. ఆఱేడుగురతోఁ గూడిన కుటుంబమున కంతకును ఇఁకఁ దన దే పోషణభారము. భోగభాగ్యములతోఁ బుట్టిపెరిగిన యాతఁడు ఘోరదారిద్ర్యము నెదుర్కొనవలసి వచ్చెను. "జ్ఞాతిశ్చేదన లేన కిమ్?" అనునట్లు దాయాదులు సమస్తము హరించుటకు సంసిద్ధులైరి. దీనికిఁ దోడు ఋణదాతల యొత్తిడి. నిరాహారియై, కాలికి జోడైనను లేకుండ, మండుటెండలలో, చేత దరఖాస్తుతో, ఆఫీసుల వెంట నరేంద్రుఁడు ఉద్యోగమునకై తిరుగులాడవలసివచ్చెను. ఎన్నిచోట్లఁ బ్రయత్నించినను 'లే' దనుమాటయే! ఈ కష్టకాలమున నొక్క మిత్రుఁడుమాత్రము అనామకముగా నరేంద్రుని తల్లి పేర అపుడపుడు విరాళములను బంపుచుండెను. స్వల్పకాలము నరేంద్రుఁడు ఉపాధ్యాయుఁ డయ్యెను. ఎంత కష్టించినను కడుపార భుజించుటకు కఱవయ్యెను. కాని యీకష్టపరంపర యను నగ్నిజ్వాలలే నరేంద్రుని జీవితాభరణమునకు వన్నె దెచ్చినవి. ఆతఁ డీకష్టదినముల నెన్నఁడును మఱవలేదు. "ప్రపంచమున స్వార్థరహితమగు సానుభూతిని జూపువారరు దనియు దుర్బలులు, దరిద్రులు, దీనులును అగువారికి లోకమున తావు లే దనియు ఈ మొదటి స్వానుభవమువలన గ్రహించితిని" అని యాతఁడే తెల్పియున్నాఁడు. తన్ను జేపట్టినచో నాతని దారిద్ర్యమును రూపుమాపుదు నని ధనికురాలగు నొక వనిత పలుక, నరేంద్రుఁడు ఆప్రస్తావమును తృణీకరించెను. ఇట్లే మఱియొక యువతి యాతని వ్యామోహితుని జేయఁబ్రయత్నింప, నాతఁడు, "నరకప్రాప్తిహేతువైన

యీ తుచ్ఛవాంఛను విడిచి భగవంతుని స్మరింపుము" అని యుపదేశించి తన విశుద్ధహృదయమును వెల్లడించెను. ఇంతకు రెండుమూఁడేండ్లకు మునుపే యొక బాలవితంతువు సమ్మోహితయై తన్ను సమీపింప, నామె కిట్లె నరేంద్రుఁడు తన మనోనైర్మల్యమును బ్రకటించియున్నాఁడు. జీవితమున నాతఁ డెదుర్కొనిన యిట్టి యగ్నిపరీక్ష లనేకములు కలవు.

విపత్పరంపర లెంతటి భగవద్విశ్వాసవంతులనైనను ఒక్కొక్కప్పుడు ఉద్భూతలూఁపి సంశయాందోళితుల నొనర్చుచుండును. "కలఁడు కలండనెడువాఁడు కలఁడో, లేఁడో?" యను సంశయము మానసము నాక్రమించును. "నిజముగా దేవుఁడు కలఁడా? ఉన్నచో నా మొఱ లేల యాలకింపఁడు? దయామయుఁ డని చెప్పఁబడు నాతని సృష్టి వ్యథామయమై యుండనేల?..." అని నరేంద్రుఁడు భావింపసాగెను. నాఁటి తన మనఃస్థితినిగూర్చి తెలుపుచు నాతఁడే యిట్లు పలుకును:

"చాటుమాటుగా ఏపని యైనను జేయుట నా స్వభావమునకు వ్యతిరేకము. చిన్ననాఁటినుండియు ఏ భయాదులకుఁగాని లోఁబడి నా యభిప్రాయమును బ్రకటింప వెనుదీయువాఁడను గాను. దేవుఁడు లేఁడనియు, ఒకవేళ నిజముగా ఉన్నను, ప్రార్థనాదులు వ్యర్థము లనియు లోకమునకు నిరూపింపఁ బ్రయత్నించుట నాఁడు నా పరిస్థితులలో నాకు సహజము కదా? తోడనే నేను నాస్తికుఁడ నైపోతిననియు, సురాపానవ్యభిచారములకుఁగూడ సంకోచింపకుంటి ననియు పుకారు పుట్టెను....' నరేంద్రుఁ డిట్లు భ్రష్టుఁ డైపోవునని కలనైనను అనుకోలేదు' అని కన్నుల నీరు పెట్టుకొని ఠాకుర్ ప్రియశిష్యులలో నొకరాయనతోఁ జెప్పఁగా, ఠాకుర్ ఆగ్రహపూరితులై యాతనితో, 'ఓ, అవివేకీ! అట్టి ప్రసక్తులు కట్టిపెట్టు. అట్లు ఎన్నఁడును జరుగదని అమ్మ నాకుఁ జెప్పినది. మరల నిట్టి ప్రలాపము లాడితివా, నే నిఁక నీ మొగము చూడఁజాలను' అనిరి."

సంశయధూమము ఎంత కాలము సత్యజ్వాలను మఱుఁగుచేయఁగలదు? అచిరకాలముననే నరేంద్రుని భగవద్విశ్వాసము నిరాచ్ఛాదితమై వెలువడియెను. సన్న్యసింపవలయునను వాంఛ జాజ్వల్యమానమై యాతని హృదయమున భాసించెను. అనతికాలముననే యాతఁడు శ్రీరామకృష్ణుని గలసికొనెను. శిష్యుని హృదయాంతర్గతభావముల నాతఁడొక కీర్తనలో వెలువరించి, పిమ్మట నిట్లు ఉపదేశించెను: "అమ్మ కార్యమును నిర్వహించునిమిత్తమే నీవు ఉద్భవించితివని నే నెఱుఁగుదును. సంసారమున నీ వెన్నఁటికిని ఉండఁజాలవు. ఐనను నేను జీవించియున్నంతవఱకు నాకోసము నీ విచట నుండుము."

ఇఁక నరేంద్రుఁడు దేవిని ఆశ్రయించిన సుస్మరణీయ ఘట్టము. ఎంత ప్రయత్నించినను స్థిరమగు కుటుంబపోషణ మార్గము కాన్పింపకుండెను. దారిద్ర్యబాధ యించుమించుగా నెప్పటివలెనే యుండెను. అత్యంతార్తుఁడై యాతఁడు శ్రీరామకృష్ణుని సందర్శించి, "మీరు కోరినచో దైవానుగ్రహము తప్పక లభించును. వస్తుండవలసివచ్చుచున్న (మా) కుటుంబమునకై మీ రీ ప్రార్థన చేయక తప్పదు" అని పట్టుపట్టెను. నరేంద్రుని కుటుంబస్థితి శ్రీరామకృష్ణుఁ డెఱుఁగును. ఆతఁ డిట్లు పలికెను: "నాయనా! అమ్మతో నే నట్టి మాటలు చెప్పఁజాలనని నీకుఁ దెలియును. నీవే యేల ప్రార్థింపరాదు? అమ్మను (జగదంబను) నమ్మకపోవుటచేతనే నీ వింతగా బాధపడుచున్నావు." కాని నరేంద్రుఁడు తనపట్టు వీడకుండెను. అంతట శ్రీరామకృష్ణుఁడు పరమవాత్సల్య

ముతో నిట్లు వచించెను: "నీ కష్టములను దొలఁగింపుమని అమ్మ నెన్నోసార్లు ప్రార్థించితిని. కాని అమ్మను నీవు నమ్మకుండుటచే నా ప్రార్థన నాలకింపకున్నది. సరి, నేఁడు మంగళవారము—నేఁటిరాత్రి కాళికాలయమునకు వెళ్లి, అమ్మకు ప్రణమిల్లి, నీ కేమి కావలయునో అడుగు: తప్పక (ఆ వరము) ఇచ్చును. ఇచ్ఛామాత్రముననే యీ జగత్తును సృజించిన చిన్మయి—బ్రహ్మశక్తిస్వరూపిణి—గదా నా తల్లి! ఆమెకు అసాధ్య మేమి కలదు?" అపరప్రహ్లాదుఁడగు నరేంద్రుఁడు మాత్రము అట్లు ఐహికవిషయములకై—దారిద్ర్యనివారణకై—ప్రార్థింపఁగలఁడా? దేవిని సమీపించినంతనే నరేంద్రుఁడు తన సంకల్పమును మఱచి, "తల్లీ! వినిర్మలజ్ఞానభక్తివైరాగ్యములను, నీ నిరంతరసందర్శనమును నాకు అనుగ్రహింపుము!" అని ప్రార్థించెను. నరేంద్రుఁడు వచ్చినంతనే శ్రీరామకృష్ణుఁడు, "కుటుంబస్థితిని జక్కఁజేయుమని ప్రార్థించితివా?" యని ప్రశ్నింప, నరేంద్రుఁడు తెల్లవోయి జరిగిన సంగతి తెలిపినంతనే, "మరల ఈసారి వెళ్లి ప్రార్థించి రమ్ము" అని పంపెను. లోకైకమాతను జూచినంతనే నరేంద్రుఁడు మరల తన సంకల్పమును మఱచి, "అమ్మా! కేవలభక్తిజ్ఞానములను నాకు ప్రసాదింపుము" అని ప్రార్థించి వచ్చెను. శ్రీరామకృష్ణుఁ డది విని సంకల్పసిద్ధికై మరల వెళ్లి ప్రార్థింపు మనియెను. నరేంద్రుఁడు దేవిని సందర్శించి, "ఏమీ! ఎట్టి తుచ్ఛవిషయమునకై తల్లిని ప్రార్థింపవచ్చితిని! ప్రసన్నుఁడగు భూమండలాధిపతిని కూరగాయలకై అర్థించిన

ట్లున్నది![1] ఎంతటి అవివేకి'' నని లజ్జావనతవదనుఁడై, మహా భక్తితో, "అమ్మా! విశుద్ధభక్తిజ్ఞానములు దక్క నాకు వేఱొండు వలదు, అనుగ్రహింపుము!" అని ప్రార్థించెను. ఆలయమునుండి వెలువడి, "ఇది యంతయు శ్రీరామకృష్ణుని లీల" యని విశ్వసించి గురుదేవుని సమీపించి, "మహాశయా! మీ ప్రభావమే నన్నిట్లు మఱపించినది. ఇంట నా ఆప్తులకు ఈ దుర్భర దారిద్ర్యబాధ లేకుండునట్లు వరమీయుఁడు" అని పట్టుపట్టెను. ఎట్టకేలకు శ్రీరామకృష్ణుఁడు, "వారి కిఁక సామాన్యమైన అన్నవస్త్రములకు లోటుండదు" అని యానతిచ్చెను.

శ్లో॥ "అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

అని భక్తజనావళికి భగవానుఁడు శాశ్వతాభయప్రదాన మొనర్చియుండఁడే![2]

---

[1] మ. ధనహీనుండు నృపాలుఁ జేరి మిగులన్ ధాటిన్ ఫలీకార మి
మ్మని యర్థించిన రీతి ముక్తిఫలదుం డైనట్టి పంకేజలో
చనుఁడే చాలఁ బ్రసన్నుఁ డైన నతనిన్ సాంసారికం బర్థిఁ గో
రిన నావంటి విమూఢమానసులు ధాత్రిం గల్గిరే యెవ్వరున్!
—శ్రీమదాంధ్రమహాభాగవతము, ధ్రువోపాఖ్యానము.

[2] మ. కలలోనైన దను మన్నెఱుంగని మహాకష్టాత్ముఁ డైనట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁప న్నంతనె మెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్ సుని
శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్ ?
—శ్రీమదాంధ్రమహాభాగవతము, కుచేలోపాఖ్యానము.

భగవంతునియెడ జగన్మాతృభావము కలుగుటకైన నేమి, సాకారోపాసనతత్త్వము, విగ్రహారాధనతత్త్వమును సుబోధమగుటకైన నేమి, నరేంద్రున కిదియే ప్రారంభము. ప్రియశిష్యునియం దీపరిణామమును గాంచి శ్రీరామకృష్ణుఁడు అపరిమితానందభరితుఁ డయ్యెను. మఱునాఁ డాతఁడు తన దివ్యప్రేమానురాగములు పొంగిపొరల నరేంద్రుని యొడిలోనికి జరిగి కూర్చుండి, మొదట తనను, పిదప నాతనిని సూచించి యొక భక్తునితో నిట్లు పలికెను: "ఇదియు నేనే, అదియు నేనే. భేదము నా కేమియుఁ దోఁచుట లేదు. గంగలోఁ దేలుచుండు నొక పుల్లవలన జలము రెండుగా విభజింపఁబడి నట్లు కనఁబడును గాని నిజమున కొక్కటియే కదా! బోధ పడినదా? ఈ సకలమును అమ్మయే."

ఆ గురుశిష్యసంబంధమును వర్ణింప నెవరి తరము? శ్రీరామకృష్ణ సన్నిధిని నరేంద్రుఁ డెట్టి స్వాతంత్ర్యము ననుభవించెనో, ఎట్టి నిరంతర దివ్యప్రేమానురాగతరంగములం దోలలాడెనో, ఆ సద్గురుభాస్కరుఁడు ఆ 'సహస్రదళకమలము' నెట్లు క్రమవికాసము నొందించెనో యెవరు చిత్రింపఁగలరు?

# సుప్రసిద్ధవ్యక్తులతో సమావేశములు

శ్రీరామకృష్ణుని దివ్యకీర్తిచంద్రికలు నల్దిక్కులను వ్యాపించుచుండ, నానాస్థితిగతులలోనివారును ఆతని సన్నిధికి రాసాగిరి. సుప్రసిద్ధదేశసేవకుఁడు, మహనీయుఁడు నగు అశ్వినీకుమారదత్తు 1881-వ సంవత్సరమున తొలిసారి శ్రీరామకృష్ణుని సందర్శించెను. ఆ సమయమున కేశవ చంద్రుఁడును శ్రీరామకృష్ణుని సందర్శింప, ప్రసంగవశమున కేశవచంద్రునితో శ్రీరామకృష్ణుఁ డిట్లు పలికెను: "కేశవా! మీ కలకత్తా బాబులు దేవుఁడు లేఁ డందురఁట—నిజమేనా? అట్టి యొక బాబు ఒకప్పుడు మేడమెట్లు ఎక్కుచుండెను. ఒక మెట్టెక్కి, పైమెట్టుపై కాలు వేయఁబోవునంతలో, 'అయ్యో! నా పక్క! నా పక్క!' అని యఱచుచు, స్మృతి తప్పి పడిపోయెను. 'పిలు, పిలు, డాక్టరును పిలువు' మనుచు, డాక్టరుకోసము పెద్దగోల బయలుదేఱెను. డాక్టరు వచ్చు లోపున బాబు కడతేఱెను. ఇట్టివారా, దేవుఁడు లేఁ డనుట!" ప్రసంగానంతరము జరిగిన నృత్యసంకీర్తనములలో అశ్వినీకుమారుఁడు తాను కన్నులారఁ గాంచిన శ్రీరామ కృష్ణుని దివ్యభావసమాధిదృశ్యములను జన్మజన్మాంతరము లలో నెన్నఁటికిని మఱవఁజాలనని వ్రాసియున్నాఁడు.

"మహాశయా! నేను భగవంతుని సందర్శించు టెట్లు?" అని (కాలక్రమమున) మఱియొక సమావేశమున అశ్వినీ కుమారుఁడు శ్రీరామకృష్ణునిఁ బ్రశ్నింప, నాతఁ డిట్లు సమాధా నించెను: "అయస్కాంతము ఇనుమును ఆకర్షించున

ట్లు

భగవంతుఁడు సదా మనలను ఆకర్షించుచున్నాఁడు. కాని మాలిన్యముచేఁ గప్పఁబడిన యినుము ఆకర్షింపఁబడదు. మనస్సును గప్పియున్న మాలిన్యమును కన్నీరు కడిగివేసి నంతనే మనస్సు భగవంతునివైపునకు ఆకర్షింపఁబడును." అశ్వినీకుమారుఁడు శ్రీరామకృష్ణుని వాక్కులను వ్రాసికొను చుండ, నాతఁ డిట్లు పలికెను: "ఇటు చూడుము. 'గంజాయి' యని యఱచినంతమాత్రమున మత్తు కలుగునా? దానిని దెచ్చి నీటితో నూరి త్రాగవలయును. నీవు సంసారివై యున్నావు, కావున మనస్సు నించుక భగవచ్చింతామత్తత నొందనిమ్ము. పనిచేయుచున్నపుడుకూడ ఆ మత్తతను నిలుపుకొనుము. సంసారివై మనవలసియున్న నీవు భగవంతునకు నీ ముక్త్యారునామా యిచ్చి, సమస్తబాధ్యతలను అప్పగింపుము. భగవంతుని తన చిత్తానుసారము చేయనిమ్ము."

శ్రీరామకృష్ణుని సాన్నిధ్యమునఁ దాను బొందిన యానందము వర్ణనాతీత మని తెలుపుచు అశ్వినీకుమార మహాశయుఁ డిట్లు వ్రాసెను:

"నాలుగైదుసార్లు మాత్రమే తారురును సందర్శింపఁగల్గితిని. కాని యా స్వల్పకాలములోనే, ఆయనయు నేనును సహపాఠులమా యనునంతటి చనవుతో మెలఁగితిమి. ఆయనతో ఎంత స్వేచ్ఛగా మాటలాడువాఁడను! కాని యాయన సన్నిధినుండి యీవలకు వచ్చినంత నే, 'ఎంతటి మహామహునితో అట్లు మాటాడుచుంటిని!' యని వెఱఁగుపడువాఁడను. కాని యా కొలఁదివాళ్లలో ఆయన సాన్నిధ్యమున నే నేమి పొందితినో, కనుఁగొంటినో అయ్యది నాజీవితమును మధుమయ మొనర్చినది. అమృతవర్షము గురిసెడి యా దివ్యమందహాసము—తదీయసంస్మృతి—నా మనస్సున నేఁటికిని నిలిచి నిరంతరానందప్రదాయకమై భాసించుచున్నది."

మహారాజా యతీంద్రమోహన ఠాకురొకనాఁడు శ్రీరామకృష్ణుని సందర్శించెను. ఆ సమావేశమునుగూర్చి శ్రీరామకృష్ణుఁ డిట్లు తెలిపెను: "'మానవుని కర్తవ్య మేమి? భగవచ్చింతయే కదా!' అని యతీంద్రునితో అంటిని. 'సాంసారికులము మేము. మాకిఁక ముక్తి యెక్కడిది? యుధిష్ఠిరమహారాజు సైతము నరకదర్శనము చేయవలసి వచ్చెను' అన్నాఁడు యతీంద్రుఁడు. అందుపై నాకు చాల కోపము వచ్చినది. అతనితో ఇట్లంటిని: 'ఏమి మనిషి వయ్యా నీవు! యుధిష్ఠిరుల జీవితములో ఈ ఒక్క విషయము మాత్రము జ్ఞప్తి నుంచుకొంటివి! యుధిష్ఠిరుని సత్యనిష్ఠ, ఆతని క్షమాశీలము, ఆతని ధైర్యము, ఆతని వివేకవైరాగ్యములు, ఆతని భగవద్భక్తి—ఇవన్నియు మఱచిపోయితివి!'—"

*The Hindu Patriot* (హిందూదేశాభిమాని) పత్రికాధిపతియు జాతీయోద్యమపురోగాములలో నొకఁడును నగు బాబు కృష్ణదాస్ పాల్ శ్రీరామకృష్ణుని సందర్శించి, వైరాగ్యప్రస్తావము వెలువడఁగా నిట్లు పలికెను: "ఈ వెఱ్ఱియే దేశమును నాశనదశకుఁ దెచ్చి దాస్యమునఁ గూల్చినది. పరోపకారము, విద్యాప్రదానము, ముఖ్యముగా దేశీయుల ఐహికస్థితిని బాగుపఱుచుట—ఇవియే యిపుడు మన కర్తవ్య కార్యములు. పరమార్థఘోషయు వైరాగ్యఘోషయు కేవలము మనలను బలహీనులను జేసివేయును. దేశోద్ధరణకు ఆవశ్యకమైన యీ కార్యములందుమాత్రమే ప్రసక్తులు కండని మీరు వంగదేశీయయువకులకు బోధచేయవలయును."

శ్రీరామకృష్ణుఁడు తీవ్రస్వరమున నిట్లు బదులుచెప్పెను

"మందబుద్ధివిగాఁ గనఁబడుచున్నావు. వేదశాస్త్రము లన్నియు మహోన్నత మని కొనియాడుచున్న దానిని నీ విట్లు నిరసింపసాహసింతువా! రెండు ఇంగ్లీషు పుటలను జదివినంతనే ప్రపంచతత్త్వమంతా కరతలామలక మైనదను కొనుచున్నావు. సర్వజ్ఞుఁడ ననుకొనుచున్నట్లున్నావు. వర్షములు ఆరంభ మైనప్పుడు గంగానదిలో అప్పటికప్పుడు పుట్టుచుండు చిన్న చిన్న పీతలను జూచితివా? ఈ మహా విశ్వములో నీ వాయల్పజీవులలో నొకదానికంటెను అల్పుఁడవు. లోకమునకు ఉపకారము చేయవలయునని యెట్లు చెప్పసాహసింతువు? భగవంతుని కార్య మది. లోకమునకు ఉపకారము చేయుటకును లోకము నుద్ధరించుటకును నీ వెవ్వఁడవు?......కొందఱకు భోజనము పెట్టుట, రోగులకు చికిత్స చేయుట, రోడ్లు వేయించుట, బావులు త్రవ్వించుట— ఇంతేకదా లోకోపకార మనఁగా నీ యభిప్రాయము? ఇవి మంచిపనులే, ఎవరును కాదనరు; కాని యీ మహావిశ్వముతోఁ బోల్చి చూచినచో, ఇవి యేపాటివి?! క్షామదేవత నోటినుండి యెందఱను నీవు రక్షింపఁగలవు?...ప్రపంచ యోగక్షేమములను గనుఁగొనఁగలవాఁడు పరమేశ్వరుఁ డొక్కఁడే. మానవుఁడు మొదట తన్ను ఉద్ధరించుకొనుటకై ఈశ్వరసాక్షాత్కారము నొంది, ఆయనయొద్దనుండి యితరులకు మేలుచేయు శక్తిని, అధికారమును పొందవలయును. అహంకారమును పూర్తిగా విడిచిపెట్టినవాఁడుగాని లోక హితము చేయుటకై ఆనందమయి యగు జగదీశ్వరివలన అధికారము నొందఁజాలఁడు."

శ్రీరామకృష్ణుని యీ మహోపదేశము లోకసేవా తత్త్వమును విశదీకరించుచున్నది. మానవసేవ మాధవసేవ యనుట నిక్కమే యైనను, జ్ఞానభక్తి వైరాగ్యావలంబన మున నిరహంకారి యైననేకాని మానవునకు ఆ భావము అభావమే యగును. మఱియు సరియైన భావము లోకసేవ కాని లోకోపకారము కాదు. సేవాభావప్రపూర్ణులై దీనజన సానుభూతితో శ్రీశారదా రామకృష్ణ వివేకానందాదులు మెలపించిరి గదా?

విద్యాసాగరబిరుదాంచితుఁడు, విశ్వమానవసౌహార్ద పూరితుఁడునై వాసికెక్కిన ఈశ్వరచంద్రవిద్యాసాగరుని శ్రీ రామకృష్ణుఁడు 1881-వ సంవత్సరమున సందర్శించెను. ఇరు వురకును జరిగిన అత్యంతమనోహరము, ఆత్మోద్ధారకమును నగు సంభాషణమునుండి కొన్ని ముఖ్యఘట్టములను క్రోడీక రించుచున్నాము.

శ్రీరామకృష్ణుఁడు (మందహాసముతో) : నేఁడు సముద్రుని జేరితిని. ఇంతవఱకుఁ జూచినవి కాలువలు, వాఁగులు, నదులును మాత్రమే.

విద్యాసాగరుఁడు (వినయస్మిత వదనుఁడై): ఐతే కొంచెము ఉప్పునీటిని తీసికొనుఁడు.

శ్రీరామకృష్ణుఁడు: అ దెట్లు? అవిద్యాసాగరుఁడవు కావు నీవు, విద్యాసాగరుఁడవు—క్షీరసాగరుఁడవు....నీవు చేయునవి సాత్త్వికకార్య ములు. సత్త్వముయొక్క రాజసికాంశ మవి. సత్త్వగుణమువలన దయ కలుగును. దయవలనఁ జేయఁబడు కార్యము రాజసిక మైనను, ఈ రజస్సు నకు మూలము సత్త్వము కావున అందు దోషము లేదు. శుకదేవాదులు భగవద్విషయము లోకమునకు బోధించుటకై తమయందు దయ నిలుపు కొనిరి. నీవు విద్యాదానము, అన్నదానమును జేయుచున్నావు. ఇది మంచిదే. నిష్కామముగా ఇవి చేయఁగలిగితివా, వీనిమూలమున నీకు

భగవత్సందర్శనలాభము కలుగఁగలదు. కొందఱు పేరుప్రతిష్ఠలకో, పుణ్యమునకో వీనిని జేయుచుందురు. అట్టివారిది నిష్కామకర్మము కాదు.

"...పండితమాత్రులెన్నఁటికిని పండని తెగులుగొంటుకాయల వంటివారు. అవి యెందుకును కొఱగావు. రాబందు ఎంతో యెత్తుగా ఎగురుచున్నను, దాని దృష్టి దిగువ నున్న యే శవముమీఁదనో లగ్నమై యుండును. అట్టివారు పండితు లను పేరేకాని, కామినీకాంచనములందే వారి ఆసక్తి. దయ, భక్తి, వైరాగ్యము—ఇవన్నియు విద్యావిభూతులు. ...బ్రహ్మము విద్యకును అవిద్యకునుగూడ అతీతము. అది మాయాతీతము, అవాఙ్మానసగోచరము. వేదములు, పురాణములు, తంత్రములు, షడ్దర్శనములు—ఇవన్నియు నోటితో ఉచ్చరింపఁబడుటచే, పఠింపఁబడుటచే, ఉచ్ఛిష్టమైపోయినవి. ఉచ్ఛిష్టము కాని దొక్కటే, అదే బ్రహ్మము! బ్రహ్మమనఁగా ఎట్టిదో ఇంతవఱ కెవ్వరును జెప్పఁజాలినవారు లేరుకదా!"

విద్యాసాగరుఁడు: (తన మిత్రులతో) ఆహా! ఎంతచక్కని మాట! నేఁ డొక నూతనవిషయము నేర్చుకొంటిని.

శ్రీరామకృష్ణుఁడు: శుష్కపాండిత్యము నిరర్థకము. భగవంతుని బొందుమార్గము తెలిసికొనుటకే గ్రంథపఠనము. గీతయొక్క భావ మేమి? గీతా-గీ-తా--గీ—అన్నచో, అది 'తాగీ', అనఁగా 'త్యాగి' యగును. ఇదే గీతాబోధ...'ఓ జీవులారా! సర్వము త్యజించి భగవత్సాక్షాత్కారమునకై ప్రయత్నింపుఁడు.' సన్న్యాసి యగుఁగాక, సంసారి యగుఁగాక,—మనస్సునుంచి ఆసక్తిని (అనఁగా విషయాసక్తిని, కర్మఫలాసక్తిని) విడువవలయును.

"నేలలో బంగారము నిక్షిప్తమై యున్నది; దానినిగూర్చి నీ కింకను ఏమియుఁ దెలియకున్నది. కేవలము పలుచని మట్టిపొర యొకటి దానిని గప్పియున్నది. నీవు దానిని గనుఁగొంటివా, భగవచ్చింతకంటె అన్యమైన కార్యము లన్నియు క్షీణించిపోవును."

విద్యాసాగరుఁడు శ్రీరామకృష్ణుని దివ్యప్రసంగములను ముగ్ధుఁడై యాలకించెను.

సుప్రసిద్ధపండితుఁడు, సనాతనధర్మమహాప్రచారకుఁడు నగు శశధరతర్కచూడామణిని శ్రీరామకృష్ణుఁడు 1884-వ

సంవత్సరమున స్వయముగా వెడలి కలసికొని యిట్లు సంభాషింపసాగెను :

"నీవు దేనినిగూర్చి యుపన్యసించుచుందువు?"

పండితుఁడు: మహాశయా! శాస్త్రవిషయములను బోధింపఁ బ్రయత్నించుచుందును.

శ్రీరామకృష్ణుఁడు: కలియుగమునకు నారదీయభక్తియే సముచితము. శాస్త్రనిర్దిష్టమైన కర్మకలాపముల నన్నిఁటిని యథావిధిగా ఆచరించుట కిప్పటివారికి తీఱిక లేదు.....జ్వరమునకు నేఁడు దశమూలకషాయము వినియోగపడదు. నేఁడు దానికి 'ఫీవర్ మిక్చ్సర్.' దశమూలకషాయము మెల్లఁగాఁ బనిచేయులోపున రోగి కడతేఱును.[1] కావున కర్మకాండను బోధించుచో, అందలి ప్రధానవిషయములను మాత్రమే చెప్పవలెను. మార్జనమంత్రాదులతోఁ గూడిన సంధ్యావందన మంతా చేయు టెట్లని వ్యాకులపడక, మీరు గాయత్రీజపము చేయుచుండినఁ జాలు నని నేను లోకులకు (అనఁగా సామాన్యుల కని భావము) చెప్పుచుందును..... ఈశ్వరసాక్షాత్కారపూర్వము ఎవ్వరును పూర్తిగా కర్మత్యాగము చేయఁ జాలరు....కాయ కాచినంతనే పువ్వు రాలిపోవును. భక్తి కాయ, కర్మములు పువ్వులు....క్రమక్రమముగా లయించు ఘంటానాదమువలె సంధ్య గాయత్రియందును, గాయత్రి ప్రణవమునందును, ప్రణవము సమాధియందును లయ మొందును....

"ఈశ్వరాదేశము నొంది యితరులకు బోధింపఁబూనుచో, అందు దోషము లేదు. అట్టి బోధకుఁడు అజేయుఁడు. దీపముకడకు కీటకములు తమంత తామే చేరును. ఇట్లే ఈశ్వరాదేశము గల ప్రచారకుఁడు తన యుపన్యాసములను వినుటకై లోకుల నాహ్వానింపనక్కఱ లేదు. అయస్కాంతము ఇనుమును ఆహ్వానించునా?..."

---

[1] దీనినిబట్టి శ్రీరామకృష్ణునకు ఆయుర్వేదచికిత్సయెడ నిరసనభావమనియు, అల్లోపతి చికిత్సయెడ గౌరవ మనియు భావింపరాదు. తన జీవితమున ఆవశ్యకమైనపు డెల్ల, ముఖ్యముగా నాతఁడు ఆయుర్వేదచికిత్సనే పొందెననియు, ప్రత్యేకపరిస్థితులలో హోమియోపతిచికిత్సకు ఒడంబడె ననియు గ్రహింపనగును.

కొన్నాళ్లయినపిమ్మట శశధరపండితుఁడు శ్రీరామకృష్ణుని సందర్శింప, నాతఁ డెన్నియో దివ్యకీర్తనలు పాడి, పెక్కు బోధ లొనర్చి, యిట్లుపదేశించెను : "శాస్త్రము లెన్నియో సద్విషయములను బోధించును. కాని భగవత్సాక్షాత్కారము నొందనిదే, భగవత్పాదపద్మములయందు భక్తి నొందనిదే, చిత్తశుద్ధి నొందనిదే సర్వము నిష్ప్రయోజనము. పంచాంగమున ఇన్నిదుక్కుల వాన కురియు నని వ్రాయఁబడియుండును. కాని దానిని మెలిపెట్టి పిండుటచే ఒక్కబొట్టయినను ఓడిగిలదు కదా!"

బాలకస్వభావుఁ డగు శ్రీరామకృష్ణుఁడు పండితుఁడు తన్ను సందర్శింపవచ్చుచున్నాఁ డని విని మిక్కిలి భయపడితి నని తెలుపుచుఁ బలికిన యీక్రిందివాక్కులు గమనార్హములు:

"అమ్మతో నిట్లంటిని: 'అమ్మా! నిన్ను వినా నేను అన్య మెఱుఁగను—ఈ శాస్త్రములు, గీస్త్రములు నా కేమీ తెలియవు. నీవే నన్ను గాపాడవలయును. పిమ్మట ఒకరిద్దఱితో, 'ఆసమయమున ఇట నుండుఁడు' అంటిని—వారిని జూచిన నాకు ధైర్యము కలుగునని.... పండితుఁడు వచ్చినతరువాతకూడ భయము వేయుచునేయుండెను....అతని అంతరంగమును అమ్మ నాకు విప్పిచూపెను : వివేక వైరాగ్యములు లేనిచో పాండిత్యాదులు నిష్ప్రయోజన మని తెలిపెను. (తన శరీరమును జూపుచు) శిరస్సువైపున కేదియో (కుండలినీశక్తి యని భావము) చరచర ప్రాఁకిపోయెను; భయ మంతరించెను; పూర్తిగా వివశుఁడ నైతిని. ముఖ మెత్తితిని, నోటినుండి మాటలు ప్రవహింపసాగెను....ఒకఁడు ధాన్యము కొలుచునపుడు మఱియొకఁడు వెనుకనుండి ముందుకుఁ ద్రోయుచుండును. ఇదియు నట్టిదే. కొంచెము స్మృతి వచ్చినపిమ్మటఁ జూచుసరికి, పండితుఁడు కన్నీటితో శరీరము తడిసిపోవ నేడ్చుచుండెను. అప్పుడప్పుడు (నాకు) ఈస్థితులు గలుగుచుండును....(పండితుని రాకనుగూర్చి విని) మొదట భయముచే పక్కపాదలవైపు (బహిర్భూమి కని భావము) పదేపదే వెళ్లుచుంటిని!"

దివ్యత్వము, మానవత్వమును శ్రీరామకృష్ణునియం దెట్లు అన్యోన్యరీతిని సమ్మేళన మొందియున్నవో ఈ సంఘట నము తెలుపుచున్నది కదా? దివ్యత్వమానవత్వ సమ్మేళన మూరుతే కదా శ్రీరామాదులు? మఱియొకసారి పండితుఁడు తన్ను సందర్శింప, శ్రీరామకృష్ణుఁ డాతనికి ముఖ్యముగా భగవత్ప్రాప్తికై వలయు పరితాపమునుగూర్చి బోధించెను.

ప్రసిద్ధుఁడగు తన నవలలమూలమునను ఇతర గ్రంథముల మూలమునను ఆధునికవంగవాఙ్మయనిర్మాతలలో ప్రధాన గణ్యుఁడై యొప్పిన బంకించంద్ర చటర్జీ (చట్టోపాధ్యాయ) శ్రీరామకృష్ణు నొక భక్తునింట 1884-వ సంవత్సరమున సందర్శించెను. ఇరువురకును ఈక్రింది సంభాషణము జరిగెను.

శ్రీరామకృష్ణుఁడు (బంకించంద్రనామమందలి 'బంకిమ్' (వంగిన) అనుమాటనుగూర్చి చిఱునగవుతో, ఛలోక్తిగా): 'బంకిమ్' ఆ! ఎవరి ప్రభావము నిన్ను వంచినది?

బంకించంద్రుఁడు (చిఱునవ్వుతో): ఆహా! మహాశయా! మన తెల్ల దొరల కాలిజోళ్ల తన్నులు.

శ్రీరామకృష్ణుఁడు: కాదు, కాదు, నా ఉద్దేశ మది కాదు. శ్రీకృష్ణుఁడు తన దివ్యప్రేమవలన వంగెను. రాధయందలి తన ప్రేమవలన శ్రీకృష్ణుఁడు త్రిభంగుఁడు(అనఁగా మూఁడువంపులు తిరిగినవాఁడు)అయ్యె నందురు. శ్రీకృష్ణుఁడు పురుషుఁడు, శ్రీమతి (రాధాదేవి) అతని శక్తి, ఆది శక్తి... సరి, మానవుని విధ్యుక్తధర్మములు ఏ మని నీ యభిప్రాయము?

బంకించంద్రుఁడు (చిఱునవ్వుతో): భోజనము, నిద్ర, కామోప భోగమును.

శ్రీరామకృష్ణుఁడు (జుగుప్సతో): ఇస్సీ! అధికప్రసంగివలె నున్నావు. రేయుంబవళ్లు చేయున దేదో అదే నోటినుండి వెలువడును. తిండి యెట్టిదో త్రేఁపు అట్టిది.... నిరంతరము కామినీకాంచనములనడుమనుండుటచే, అట్టి మాటలే నీ నోటినుండి వెలువడును. లౌకికవిషయములనుగూర్చిన నిరంతర

చింతవలన మానవుఁడు లోభియై, కపటి యైపోవును. భగవచ్చింతవలననో, నిష్కపటి యగును.... ధ్యానము, వివేకవైరాగ్యములును లేనిచో, కేవల పాండిత్యమువలన ఏమి లాభము?... భగవంతునివైపు తన మనస్సు మఱల్పనివాఁడు పండితుఁ డనఁదగఁడు.

"భగవద్భక్తులనుగూర్చి కొందఱు, 'వీరి కెంతసేపు ఇదే గొడవ—దేవుని గొడవ; వీరు మతిభ్రష్టులు! మన మెంత తెలివైనవారమో! సంపదను, కీర్తిని, ఇంద్రియసుఖములను ఎట్లు అనుభవించుచున్నామో!' అనుకొను చుందురు. కాకిగూడ తానెంతో తెలివైనదాన ననుకొనుచుండును; కాని తెల్లవాఱి లేచినది లగాయతు అశుద్ధముకొఱకే దాని దేవులాట!—భక్తుఁడు హంసవంటివాఁడు. పాలను, నీటిని గలిపి హంసముందుంచిన యెడల,అది నీటిని విడిచి పాలనే గ్రోలును....(బంకించంద్రుని జూచి, ప్రేమపూర్వకముగా) దయయుంచి నామాటలకు కోపగించుకొనవలదు.

బంకించంద్రుఁడు: మహాశయా! నేను తియ్యనిమాటలను మాత్రమే విన నిచ్చగించువాఁడను గాను.

శ్రీరామకృష్ణుఁడు: కావున భగవంతు నాశ్రయించి సాక్షాత్కారమునకై పరితాపముతో ప్రార్థించుటయే మానవుని ధర్మము.... మొదట భగవంతుఁడు, పిమ్మట ప్రపంచమును.[1] ఒకటి తెలిసిన, సర్వము మీకుఁ దెలిసినట్లే.[2] ఒకటి తర్వాత నేఁబది సున్నలుంచినచో, పెద్దమొత్తమగును. ఒకటి తీసివేసిన, ఇఁక సున్నల విలువ సున్నయే కదా?

ప్రసంగానంతరము జరిగిన దివ్యసంకీర్తనమున శ్రీరామకృష్ణుని సమాధిస్థితిని గాంచి బంకించంద్రుఁడు ముగ్ధుఁ డయ్యెను.

[1] "Seek ye first the Kingdom of Heaven and all other things shall be added unto you."—Jesus Christ. (మొదట ఈశ్వర సామ్రాజ్యమును అన్వేషింపుము, పిమ్మట నీకు సర్వము లభింపఁ గలదు."—ఏసుక్రీస్తు.)

[2] "కస్మిన్ను విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి." (దేనిని దెలిసికొనినచో, ఈసర్వము తెలిసికొనఁబడుచున్నది?) ముండకోపనిషత్తు, 1-1-3.

ఈవిధముగా శ్రీరామకృష్ణుని జీవితోపదేశములు ప్రాచీనసంప్రదాయసిద్ధమయ్యు, ఆధునిక దేశకాలయోగ్యము, అన్యమతసమ్మతమునై, అత్యంతసరళమయ్యు, గంభీరము, దివ్యసుందరమునై, పాండితీవిరహితమయ్యు, కావ్యకళాసారభూతము, పండితులకు మహాశ్చర్యకరమునై వెల్గొందసాగెను. సమన్వయసూత్రమున అనుసంధానింపఁబడి నానామతములును నానాధర్మములును శ్రీరామకృష్ణజీవితరత్నహారమై విలసిల్లినవి. కాలాంతరమున విశ్వకవి రవీంద్రుఁడు శ్రీరామకృష్ణజీవిత మహాసౌందర్యముగ్ధుఁడై, "పరిపూర్ణతాప్రాప్తి సాధనము లగు వివిధోపాసనావాహినులు నీ ధ్యానసాగరమున లీనమై యున్నవి. బ్రహ్మానందతేజము నానావిధములఁ బ్రకాశితమై నీ దివ్యజీవితమున ఐక్యమందిరమును నిర్మించి యున్నది. సర్వజనవంద్యమైన యీ మందిరమున కివే నా నమోవాకములు" అని జోహారు లర్పించియున్నాఁడుగదా? శ్రీపరమహంససందర్శన దివ్యప్రసంగశ్రవణాసక్తచిత్తులై యెందఱెందఱో మహాపురుషులును భక్తులును జిజ్ఞాసువులును ముముక్షువులును ఆతని సాన్నిధ్యము నొందుచుండ, వారలతో నాతఁ డొనరించిన అమూల్యప్రసంగములే దేశదేశాంతరభాషలలోనికి పరివర్తన మందుచు, ఎందఱెందఱి హృదయములనో పరివర్తన మొందించుచు, జగత్ప్రసిద్ధమై యున్న "శ్రీరామకృష్ణకథామృత"[1] రూపమును దాల్చియున్నవి.

---

1 ఈ వంగగ్రంథమునకు ఆంగ్లానువాదము 'The Gospel of Sri Ramakrishna.'

శ్రీ రామకృష్ణ నిర్యాణానంతరము శరీరసన్నిధిని నిలిచియున్న శిష్యభక్తబృందము



(1) మహేంద్ర ('మ') (3) కాళి (5) శరత్ (7) గంగాధర్ (11) తారక్ (13) బుడాగోపాల్ (15) వైకుంఠ (18) హరీశ్ (19) నారాయణ్ (21) శశి (22) లాటూ (24) బాబురాం (25) నిరంజన్ (26) నరేంద్ర (27) రామచంద్రదత్త (28) బలరాం (29) రాఖాల్ (30) నిత్యగోపాల్ (31) జోగీంద్ర

# శిష్యభక్తకోటి: శిష్యశిక్షణము

శిష్యవిత్తాపహారకులగు 'బాధగురువులు' ఎందఱో యుందురు కాని శిష్యహృత్తాపహారకు లగు 'బోధగురువులు' అత్యంత దుర్లభులు గదా! మనుష్యత్వము, ముముక్షుత్వము, మహాపురుషసంశ్రయము నను నీ మూఁడును సమకూడు టెంతయు దుర్లభమని శ్రీశంకరాచార్యుఁడు వక్కాణించును. బోధగురువరేణ్యుఁ డగు శ్రీరామకృష్ణుఁడు తన శిష్యులకును తన్ను ఆశ్రయించిన పలువురు భక్తులకును మహోపదేశము లొనర్చుచు, దివ్యానుభవము లొనగూర్చుచు, భగవత్ప్రాప్తి మార్గమున వారల నెట్లు పురోగమింపఁజేసెనో యీ ప్రకరణమున సంగ్రహముగా ముచ్చటింతుము.

సర్వవిధములను అర్హులని తోఁచిననేకాని శ్రీరామకృష్ణుఁ డెవ్వరికిని పరమార్థము నుపదేశించువాఁడు కాఁడు. సుప్రసిద్ధుఁ డగు నొక ధర్మప్రచారకునితో నివ్విషయమై యాతఁ డొకప్పు డిట్లు పలికెను: "పాత్రత చూచి ఉపదేశింపవలయును. మీరు పాత్రత చూచి ఉపదేశింపరు. నా యొద్దకు ఏ కుఱ్ఱవాఁడు (యువకుఁడు) ఐనను వచ్చినయెడల, ముందు వాని ఆత్మీయులనుగూర్చి వానిని అడుగుదును. వానికి తండ్రి లేఁడనుకొనుము; లేదా, తండ్రియొక్క ఋణభారము వానిపై నున్నదనుకొనుము. అట్టివాఁడు మనసు నెట్లు భగవంతునిపై నిలుపఁగలుగును?"

తన బాలశిష్యుల యోగ్యతనుగూర్చి కొందఱు భక్తులకు శ్రీరామకృష్ణుఁ డొకప్పు డిట్లు తెలిపెను: "ఈ

కుఱ్ఱల ఆంతరంగికలక్షణములు ధ్యానావస్థలో నాకు గోచరించు చుండును. ఇంటిని, ఆస్తిని సంపాదింపవలయు నను తలఁపే వారికి లేదు. కామోపభోగములు వారు కాంక్షించుట లేదు. ఈ యువకులలో వివాహితులై యున్నవారు భార్యతోఁ బరుండరు. రజోగుణము తొలఁగించుకొని మానవుఁడు సత్త్వము సముపార్జించిన కేకాని భగవంతునియందు స్థిరముగా మనసు నిలుపఁజాలఁడు, భగవదనురక్తుఁడై సాక్షాత్కారము నొందఁ జాలఁడు—ఇదియే కీలకము." "మహాశయా! మీసన్నిధికి వచ్చు బాలురను సంసారము పరిత్యజించి సాధువులు కండని ప్రోత్సహించుచు, మీరు వారికి వైరాగ్యము బోధించు చుందురే—ఇది న్యాయ్యమా!"అని యొకరు తన్నొకప్పుడు ప్రశ్నింప, శ్రీరామకృష్ణుఁ డిట్లు సమాధానించెను: "ఇచటికి వచ్చు బాలురు విశుద్ధహృదయులు, చిన్ననాఁటినుండియు భగవదాసక్తచిత్తులు. వీరిలోఁ గొందఱు త్రికాలస్నానము చేయుచు, స్వయంపాక మొనర్చుకొని హవిష్యాన్నము భుజించుచు, అధ్యయనాదులలో నిమగ్నులైయున్నారు. ఐహికజీవనమునకై ఆరాటపడవలసిన కుఱ్ఱలు త్యాగవైరాగ్యములను కాంక్షించుచున్నారు! ఒక్క జన్మములో ఇది సాధ్యమా? చిన్ననాఁటినుండియు నివృత్తిపరమైన యిట్టి చిత్తవృత్తి నొందుటకు పూర్వజన్మములలో వీ రెన్ని తపోనిష్ఠలను, సాధనలను అవలంబించియుండవలయునో కదా! పరమార్థమునుగూర్చి వీరితోఁగాని-చో, మఱెవ్వరితోఁ బ్రసంగింపుచుందు వోయి!"

కాలక్రమమున శ్రీరామకృష్ణమఠ సేవాశ్రమప్రదీపకు

లైన యీ బాలశిష్యుల పారమార్థికాశయములకు మఱికొన్ని నిదర్శనములు. పసితనముననే తన్మయుఁడై దేవతావిగ్రహములను ఆరాధించుచు, తదారాధనతో క్రీడించుచుండిన పారమార్థికుఁడు రాఖాల్ (రాఖాల్ చంద్రఘోష్) అను బాలశిష్యుఁడు. అఖండవైరాగ్యముతో ఏకాంతప్రదేశమున నొక కుటీరమున మఱియొక సాధువుతో తపోధ్యాననిమగ్నుఁడై యుండుటయే తన లక్ష్యముగా ఎనిమిదేండ్ల లేఁబ్రాయముననే భావించుచుండిన భగవదనురక్తుఁడు బాబురామ్ (బాబురాం ఘోష్) అను మఱియొక బాలశిష్యుఁడు. చిన్ననాఁడు ఆటలనడుమ, అకస్మాత్తుగా గంభీరవదనుఁడై, యొకమూలకుఁ బోయి, ఆకసమువంకఁ జూచుచు, "అందుండు నక్షత్రములలో ఒకదానినుండి వచ్చితినేమో. వీరు కారు నా జతపిల్లలు—వారు వేఱుగా ఉన్నారు" అని యీ విధముగా భావించుచుండెడి అంతరవలోకనపరుఁడు జోగిన్ (యోగీంద్రనాథరాయ్ చౌధురి) అను నింకొక బాలశిష్యుఁడు. శ్రీరామకృష్ణుని ప్రియబాలశిష్యబృందమున గంగాధర్ (గంగాధర ఘటక్), హరి (హరినాథ చట్టోపాధ్యాయ) యను బాలురు త్రిసంధ్యాస్నానముచేయుచు, స్వహస్తపాక మొనర్చుకొనుచు, భగవద్గీతను నిత్యము పారాయణమొనర్చుచు—హరి కది కంఠస్థము—బాల్యమునుండియు తపోధ్యాననిష్ఠాపరులైయుండిన మహనీయులు. వీరే కాలక్రమమున (వరుసగా) అఖండానంద తురీయానంద స్వాములైరి. "నీవు పూర్వజన్మమున యోగివి. అందుచేతనే యింత చిన్నతనముననే యోగాసక్తుఁడవై యున్నావు" అని స్వయముగా

శ్రీరామకృష్ణుని యభినుతి నందిన ధన్యాత్ముఁడు కాళి (కాళీ ప్రసాదచంద్ర—కాలక్రమమున నీతఁడే అభేదానందస్వామి) యను మఱియొక బాలశిష్యుఁడు. ఈవిధముగా శ్రీరామకృష్ణుని ప్రియశిష్యులలో అనేకులు బాల్యమునుండియు పరమార్థా సక్తచిత్తులై యుండిన పావనాత్ములు. ఈ యనుభూతుల నన్నిఁటిని బట్టి చూచినచో, పూర్వజన్మము, లేదా, పునర్జన్మ మనునది భ్రాంతి కా దని భావింపవచ్చునుగదా!

శ్రీరామకృష్ణుఁడు తన శిష్యకోటిలో ఐదాఱుగురను ఉత్తమోత్తములుగా గణించుచు, వారలను ఈశ్వరకోటి లోనివా రనియు నిత్యసిద్ధు లనియు వచించును. వారినిగూర్చి యిట్లు పలుకును : "సాక్షాద్భగవదవతారమూర్తులుగాని, అవతారలక్షణములలోఁ గొన్నిఁటితో ఆవిర్భవించియున్న వారు కాని యీశ్వరకోటి యనఁబడుదురు. ఒకించుక ప్రయత్నము వారియందు అంతర్గతమై యున్న పారమార్థికతను వికసింపఁజేయును. ముందు పిందెలు పెట్టి తరువాత పువ్వులు పూచు సొర, గుమ్మడి తీఁగలవంటివారు వీరు. వీరు మొదట భగవత్సాక్షాత్కారము నొంది పిమ్మట సాధన చేయు ప్రత్యేకవర్గములోనివారు. అవతారమూర్తికి అనుచరులై జన్మించువారే నిత్యసిద్ధులు (జన్మమునుండియు సిద్ధులు); వారిలోఁ గొందఱ కదియే తుదిజన్మము. నిత్యసిద్ధులు అల్ప సాధనచేతనే, ఒక్కొక్కప్పుడు ఏసాధనయుఁ జేయకుండఁగనే కూడ భగవల్లాభము నొందుచుందురు. కాని తదనంతరము వారు సాధనచేయుదురు." నరేంద్రనాథదత్త (వివేకానంద స్వామి), రాఖాల్‌చంద్ర ఘోష్ (బ్రహ్మానందస్వామి),

బాబురాం ఘోష్ (ప్రేమానందస్వామి), నిత్యనిరంజన ఘోష్ (నిరంజనానందస్వామి), యోగీంద్రనాథరాయ్ చౌధురి (యోగానందస్వామి), పూర్ణచంద్ర ఘోష్ అను వారు ఈశ్వరకోటిలోనివా రనియు నిత్యసిద్ధు లనియుఁ బేర్కొనఁబడిన మహనీయులు. ఇందు తుదివ్యక్తి తక్క మిగిలినవారును మఱియాఱుగురు శిష్యరత్నములును శ్రీ రామకృష్ణునిచేఁ దన "అంతరంగికులు" అని పేరొందిరి. వారినిగూర్చి సందర్భానుసారముగా ముచ్చటింతుము.

శ్రీరామకృష్ణుఁడు శిష్యుల పారమార్థికచిత్తవృత్తిని అద్భుతరీతుల నుద్దీపింపఁజేయును. కొందఱకు పరమార్థము నుపదేశించును; కొందఱకు వ్రేలితో నాలుకపై మంత్ర బీజాక్షరములను వ్రాయును; నాభినుండి కంఠమువఱకును నిమురుచు, 'అమ్మా, మేలుకో'మని కుండలినీశక్తిని మేల్కొల్పును; అతీంద్రియస్థితిలోఁ గొందఱపై కేవలము తన కటాక్షవీక్షణముఁ బఱపుచు; కొందఱను స్పృశించును; ఒకొక్కరి వక్షమున, లేదా, శిరమునఁ దన పాదము నుంచును; కాలిబొటనవ్రేలితో నొకానొకరి ఱొమ్మునో, తలనో, తాఁకును. వీనిలో వారివారి అర్హత ననుసరించి దేనిని బడసినవారైనను అపూర్వహృదయవికాసమును, దివ్యానుభూతులను బొందుచుండువారు. ఏకొలఁదిమందికి మాత్రమో స్వయముగా నాతఁడు మంత్రోపదేశము నొనర్చును. కొంద ఱాతనివలన స్వప్నమున మంత్రదీక్ష నొందియున్నారు. వివిధములైన యీ ఆత్మప్రబోధమునకు రెండుమూఁడు ఉదాహరణములు. కాలక్రమమున శ్రీ

రామకృష్ణమఠ సేవాసంఘాధ్యక్షుఁడు, సద్గురువరేణ్యుఁడునై యొప్పిన తారకనాథ ఘోషాల్ (శివానందస్వామి)నాలుకపై శ్రీరామకృష్ణుఁ డేదియో వ్రాయఁగా, వెంటనే యాతఁడు అపూర్వానుభవము నొంది, బాహ్యస్మృతిరహితుఁడై ధ్యాననిమగ్నుఁ డయ్యెను. గురుసాన్నిధ్యమునఁ దనకుఁ గల్గిన మహానుభూతులనుగూర్చి యాతఁ డిట్లు తెలిపెను: "ఠాకుర్ సన్నిధిని తఱచు నాకు ఏడుపు వచ్చెడిది....ఆయన చూపు నాపై సోఁకఁగనే విలపింపనారంభించితిని. ఠాకుర్ మౌనముగా నిలుచుండిరి. నాయొడలు జలదరించి వణఁక నారంభించెను. నా కట్టి స్థితి లభించినందుల కాయన హర్షించి యది దివ్యభావావేశఫలిత మనిరి....సాధకుని యందలి ఆధ్యాత్మికశక్తులను తమ కటాక్షవీక్షణమాత్రముననే ఠాకురు మేల్కొల్పఁగలరు." కాలక్రమమున సుబోధానందస్వామి యను యతివర్యుఁడైన సుబోధ్ (సుబోధచంద్ర ఘోష్) అను బాలశిష్యునకు శ్రీరామకృష్ణుఁడు నాలుకపై నేమియో వ్రాసి, కుండలినీశక్తి నుద్దేశించి, 'మేలుకో, అమ్మా! మేలుకో' మని నాభినుండి కంఠమువఱకును నిమిరి, పిమ్మట ధ్యానింపఁబనుపఁగా, నాతఁడు ధ్యానారంభముననే కంపితగాత్రుఁడై, ఆనందపరవశుఁడై, తనలో దివ్యతేజమున స్త్రీపురుష దేవతాస్వరూపములను గాంచెను.[1] కాలక్రమమున నాగమహాశయనామమున విఖ్యాతుఁడైన దుర్గాచరణ

---

[1] క్షీరోద్ అను బాలునకు శ్రీరామకృష్ణుఁ డిట్లే యొనర్ప, నాతనికే దివ్యానుభూతియుఁ గలుగకపోఁగా, కాలక్రమమునఁ గలుగునని తెలిపెను.

నాగ్ అను గృహస్థశిష్యుని యురమున శ్రీరామకృష్ణుఁడు తన కుడిపాదము నుంచినంతనే యాతఁడు విశ్వ మంతయు అనంతదివ్యానందసాగరమునఁ దేలియాడుచున్నట్లు దివ్య దర్శనము నొందెను.

శ్రీరామకృష్ణుని శిష్యవాత్సల్యము, భక్తప్రేమాను రాగములును అపారము లనుటకు అనేకనిదర్శనములను జూచియున్నాము. ప్రీతిపాత్రు లగు బాలశిష్యులచే నాతఁడు స్వహస్తములతో మధురాహారములను దినిపించును. అట్టి యేశిష్యుని, లేదా, భక్తుని రాకకైనను ఏదేని అభ్యంతరము కలిగినచో, లేదా, ఆలస్యమైనచో, నాతఁడు పొందు పరి తాపము ఇంతింత కాదు. "కేవలము నీ విచటికి వచ్చు చుండినఁ జాలును, నీ జీవితలక్ష్యము సిద్ధించును" అని యాతఁడు అనేకభక్తులకును శిష్యులకును దెల్పెను. ఉత్తమ సంస్కారసంపన్నులగు తన బాలశిష్యులయెడ శ్రీరామకృష్ణుని వాత్సల్యము వర్ణనాతీతము. నిరంజన్ (నిత్యనిరంజన ఘోష్) అను బాలశిష్యు నొకనాఁ డాతఁడు గాఢప్రేమతో ఆలింగన మొనర్చుకొని, "నాయనా! నిరంజనా! దినములు గడచి పోవుచున్నవి....నీ వెపుడు ఈశ్వరాన్వేషణపరాయణుఁడ వగుదువో యి? నీవిషయమై నాకెంతో ఆందోళనగా నున్నది" యని పలికెను. నరేంద్రుని కాతఁ డొకప్పుడు, "నరేన్! నీకొఱకు ఇంటింటికిఁ దిరిగి బిచ్చమెత్తుటకైనను సంసిద్ధుఁడ" నని తెలిపెను. ఇట్టిదికదా వినిర్మలప్రేమ! అవ్యాజానురాగము! మానవమానసమును మహోన్నతాదర్శసాధములకుఁ గొని పోవు దివ్యాందోళిక!

శిష్యభక్తకోటికథనమున నిదివఱకుఁ బేర్కొనఁబడిన శ్రీనివాసుఁడు, మథురానాథుఁడు, వైష్ణవచరణుఁడు మున్నగు భక్తులును, ప్రసన్నమయి, హేమాంగినీదేవి మున్నగు భక్తురాండ్రును, నారాయణశాస్త్రి, గౌరీపండితుఁడు మున్నగు శిష్యులును, శిష్యప్రాయులగు ననేకులును మన కియ్యెడ సంస్మరణీయులు.

స్వయముగా శాస్త్రపండితుఁడు గాకపోయినను శ్రీరామకృష్ణుని శాస్త్రతత్త్వజ్ఞానము శిష్యులకు ఆశ్చర్యము గొల్పెడిది. "మహాశయా! చదువుటయు వ్రాయుటయు మీ రెన్నఁడును అంతగా నేర్వకున్నను, ఇవన్నియు ఎక్కడ గ్రహించితిరి?" అని చనవుతోఁ గొందఱు శిష్యులు ప్రశ్నింప, చిఱునగవుతో నాతఁ డిట్లు సమాధానించును: "ఔను, స్వయముగాఁ జదువకపోయినను, ఎంతో వినియుంటినిగదా! అదంతా నాకు జ్ఞప్తి నున్నది. వేదవేదాంతములను, దర్శన శాస్త్రములను, పురాణములను మంచిమంచి పండితులవలన వినియుంటిని. విని యందలి విషయములను గ్రహించి, వాని నన్నిఁటిని మాలగా నొనర్చి, గళమున ధరించి, 'అమ్మా! ఇవిగో, నీ శాస్త్రపురాణములు; వీనిని స్వీకరించి నాకు శుద్ధ భక్తిని అనుగ్రహింపుము' అనుచు, వానిని అమ్మ పాద పద్మములకు సమర్పించితిని."

ఇఁక శ్రీరామకృష్ణుని శిష్యశిక్షణవిధానము. తన దివ్యసాధనానుభవ ప్రకృతిపరిశీలనములవలననే మానవ మనస్తత్త్వవేత్తలలో మేటియై యొప్పిన యాతఁడు శిష్య మనస్తత్త్వానుగుణముగా బోధించుచు, సాధనలను గఱపుచు,

వారికి ఆత్మవికాసము నొనగూర్చును. సాధకుల శారీరలక్షణములను బరిశీలించి వారల స్వభావాదులను గనుఁగొనుటలో శ్రీరామకృష్ణుని కౌశలము అత్యద్భుతము. ముకురు, మెడను జూచి పరమహంసను గుర్తింతు ననియు, ఒకనికేసి చూచినంతమాత్రముననే వాని స్వభావాదులు తనకు విదితమగుననియు నాతఁడే తెలిపియున్నాఁడు.[1] అద్దాలబీరువాలోని వస్తువులు గాన్పించునట్లు ఆతని మనోనేత్రమునకు ఒరుల మనోభావములు కనఁబడుచుండెడివఁట.

శ్రీరామకృష్ణుని బోధన నవరసభరితము. భక్తిగానిండు, వేదాంతము గానిండు, లోకవర్తనము గానిండు —దేనినిగూర్చి బోధించినను, ఆతని బోధనలు హాస్యచమత్కారములతో, మనోహరదృష్టాంతములతో, నీతికథారత్నములతో వంగీయ జానపదసంభాషణాశైలిలో మృదుమధురస్వరమున ప్రాణప్రదీప్తములై యలరారుచుండెడివి. బాలశిష్యులకుఁ దన శిక్షణ నుద్దేశించి యాతఁడే కొందఱు భక్తులతో నొకప్పుడు, "ఈ కుఱ్ఱలకు వట్టి శాకాహారపు చప్పిడిపథ్యము పెట్టను, (వారికి ఇష్టమైన) యే చేఁపలవాసన నీరో, చారో అప్పుడప్పుడు కొంచెము పోయుచుందును; లేనిచో వా రెందుకు వత్తురు?" అని వ్యంగ్యముగాఁ బలికెను. శ్రీరామకృష్ణుని వ్యక్తిత్వము ఎట్లు సర్వజనమనోరంజకమై యొప్పెనో రోమే రోలా (Romain

[1] మెల్లకన్ను, పిల్లికన్నులు, తుట్టెపెదవులు మున్నగునవి అవలక్షణము లనియు, అట్టివి కలవారు పరమార్థజ్ఞానము నొందుటకుఁ జాలకాలము పట్టునవియు శ్రీరామకృష్ణుఁడు తెలుపును.

Rolland) మహాశయుఁడు తన శ్రీరామకృష్ణచరిత్రలో వ్రాసిన యీ క్రిందివాక్యములు మనోహరముగాఁ దెలుపుచున్నవి: "స్వభావవర్తనములందు బాలకుఁడు, విషయవిమర్శనమున ఋషియుఁ గాఁగల్గియుండిన మహనీయుఁడాతఁడు. నవ్వుచు, ప్రేమించుచు, పరిశీలించుచు, మానవస్వభావమునకు లోప మెంతమాత్రమును లేనట్టి యాతని యీ పరిపూర్ణస్వచ్ఛందతయే యాతనియందలి మనోరంజకత్వమునకు ముఖ్య కీలకము. నిజముగా అట్టి ఋషి మన క్రైస్తవ ప్రపంచపు ఋషులకంటె కేవలము భిన్నుఁడు! ఒరుల దుఃఖమును వెదకి కనుఁగొని స్వయముగా దాని నాతఁడు భరించె నన్నచో, అది యాతనియందు అంతర్ధానమైపోయెను...."

తన సర్వతోముఖవ్యక్తిత్వమును, సర్వతోముఖదివ్యానుభూతినిగూర్చి గంభీరార్థబంధురముగా నరేంద్రాదిశిష్యులతో శ్రీరామకృష్ణుఁ డొకప్పు డిట్లు పలికెను: "ఇచట (ఈయంగడిలో) మీకు సర్వము—సాధారణమైన కందులు, చింతపండు కూడ—దొరకును." మఱియొకప్పు డాతఁడు, "అయ్యో! చచ్చు మినుపపప్పుబేరగాండ్రే కాని మంచి బేరగాండ్రు దొరకకున్నారే!" యనెను.

శిష్యులకు శ్రీరామకృష్ణుఁడు ఆప్తబంధువు, ప్రాణమిత్రుఁడు. బాలశిష్యులతో నొక్కొక్కప్పు డాతఁడు వినోదముగా కుస్తీ పట్టును.[1] ఆటలతో, పాటలతో, హాస్యోక్తులతో

[1] శ్రీరామకృష్ణుఁడు తనతో నొకప్పు డిట్లు కుస్తీపట్టఁగా, తా నాయన నొకగోడకుఁ ద్రోసివేసితిననియు, అంతట ఆయన, "నే నొకప్పుడు బలాఢ్యుఁడనై యుంటిని; కాని యిప్పుడు బలహీనుఁడనై

నాతఁడు మహోన్నతాధ్యాత్మికతత్త్వములను బోధించును. ఇంతలో ప్రక్కలు పడునట్లు శిష్యులను నవ్వించును; అంతలో శ్వాసలు కట్టువడ నిశ్చేష్టుల నొనర్చును; మఱియొకప్పుడు ఏదివ్యానుభూతినో యొనగూర్చి యానందబాష్పము లొలికించును! శిష్యుల మానసముపై శ్రీరామకృష్ణుని ప్రభావమునుగూర్చి వివేకానందస్వామి పలికిన యీ క్రిందివాక్కులు గమనార్హములు: "భౌతికశక్తులను వశపఱుచుకొని యే అద్భుతక్రియనో ప్రదర్శించుట అంత దుర్లభమైన పని కాదు: కాని మంటిముద్దలనువలె ఎట్లు అవలీలగా మానవమానసములను ఈ 'పిచ్చి బ్రాహ్మణుఁడు' (శ్రీరామకృష్ణుఁడు) గైకొని యే పరిణామము నైనను బొందించుచు, స్పర్శమాత్రముననే నూతనభావములతో నింపెడివాఁడో, దానికంటె మహత్తర మైన అద్భుతము నాకుఁ గానరాకున్నది."

"నన్నుగూర్చి నీ వేమని తలఁచెదవు?" అని శ్రీరామకృష్ణుఁడు తనకు ప్రీతిపాత్రులైనవారల నడుగును. ఇందులకు మహాగౌరవపూర్వకమైన తమ అభిప్రాయమును అనేకు లనేకవిధములుగాఁ దెలుపఁ, గొందఱు తమ యిష్టదైవమును బేర్కొని "ఆమూర్తియే మీరు" అనియో, "తదవతార" మనియో సమాధానించువారు. సాధకుని పారమార్థికదృక్పథమును గనుఁగొనుటకు శ్రీరామకృష్ణున కిదియొక సాధారణమార్గము.

---

యుండుటచే గోడకుఁ ద్రోసివేయఁబడితిని!" అని పలికి రనియు శ్రీవిజ్ఞానానందస్వామి (మా గురువర్యులు) ఒక ప్రసంగమున మాకుఁ జెప్పిరి. ఏమైనను, ఈ క్రీడారూపమున శ్రీరామకృష్ణుఁడు తన ప్రియశిష్యునియందు ఆధ్యాత్మికశక్తిని ఉద్దీపింపఁజేసెనఁట.

శిష్యుల నాతఁ డొండొరులతోఁ జర్చించుకొనఁ బ్రోత్సాహించును. ఇతరశిష్యులను నరేంద్రునితో సంసర్గము చేయఁ బ్రేరేపించును. తన బోధనలను శిష్యులు అవలంబించు విషయమున శ్రీరామకృష్ణుఁడు అఖండశ్రద్ధ వహించును. అజాగరూకులై యున్నతటి వారల ప్రవర్తనమును అతిజాగరూకతతోఁ బరిశీలించును; దైనందినజీవిత చర్యలలో క్రమవిరహితమగు నెట్టి స్వల్పవిషయమునుగూర్చి యైనను సదుపదేశముల నొనర్చును.

"నావిరతో దుశ్చరితాత్ నాశాన్తో నాసమాహితః,
నాశాన్తమానసోవాఽపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్."

(ఎవ్వఁడు దుర్మార్గములు వీడఁడో, ఎవ్వఁడు ఇంద్రియములను నిగ్రహింపఁడో, ఎవ్వఁడు ఏకాగ్రచిత్తుఁడు గాకుండునో, చిత్తశాంతిని బొందకుండునో, అట్టివాఁడు విశేషజ్ఞానముచే నైతము ఆత్మను బొందఁజాలఁడు) అను కఠోపనిషద్బోధయే శ్రీరామకృష్ణుని శిష్యశిక్షణమందలి మూలసూత్ర మని చెప్పవచ్చును. త్రికరణశుద్ధి పరమార్థప్రాప్తికి మొదటిమెట్టు అని యాతని ముఖ్యోపదేశము. ఆతఁ డిట్లు వక్కాణించును: "హృదయము శుద్ధమైననే కాని భగవంతుఁడు ఉన్నాఁ డను విశ్వాసముకూడ కలుగఁజాలదు." "శుద్ధమనస్సు, శుద్ధబుద్ధి, శుద్ధాత్మ—ఈమూఁడు నొక్కటియే." "ఎవ్వఁడైనను ఉదారహృదయుఁడు, నిష్కపటచిత్తుఁడు నైయున్నచో, అది మహాతపఃఫల మని భావింపవలయును. నిష్కపటి యైననేకాని నరుఁడు నారాయణుని గనఁజాలఁడు." తనకు అత్యంతప్రీతిపాత్రుఁ డగు

రాఖాల్ అను శిష్యుఁ డొకనాఁడు తన సన్నిధికి వచ్చియుండ, శ్రీరామకృష్ణుఁ డాతనిఁ జూచి యిట్లు పలికెను : "నీకేసి చూడఁజాలకున్నాను. నీమోమున నొకవిధమైన మాలిన్యము ఆవరించియున్నట్లు కనిపించుచున్నది. ఏమైనను తప్పు చేసితివా, చెప్పు." రాఖాల్ స్తబ్ధుఁ డయ్యెను; ఆతని కేమియు స్ఫురింపలేదు. అంతట శ్రీరామకృష్ణుఁడు, "ఎవరితోనైనను అసత్యము చెప్పితివా?" యని, యాతని సమాధానము విని, "ఇఁక నెన్నఁడును అట్లు అసత్యము చెప్పకు. నిజము చెప్పుటయే ముఖ్యసాధన" యని మందలించెను.

సత్యనిష్ఠను గూర్చి శ్రీరామకృష్ణుఁ డిట్లు బోధించును : "కలియుగమున సత్యనిష్ఠయే తపస్సు. సత్యవ్రతమే ముఖ్యమైన వ్రతము. సదా సత్యసంధుఁడై యుండునట్టివాఁడు (సత్యస్వరూపుఁడగు) భగవానుని (సత్యనారాయణుని) గనఁజాలును. పుష్పాంజలినై అమ్మ నిట్లు ప్రార్థించితిని : 'అమ్మా, ఇదిగో, నీ జ్ఞానము; ఇదిగో, నీ అజ్ఞానము—రెంటిని గైకొని నీయందు నిర్మలభక్తిని నాకు అనుగ్రహింపుము. ఇదిగో, నీ శౌచము; ఇదిగో, నీ అశౌచము—రెంటిని స్వీకరించి నీయందు నాకు విశుద్ధభక్తి నిమ్ము....ఇదిగో, నీ శుభము; ఇదిగో నీ అశుభము—రెంటిని గ్రహించి నీ పాదపద్మములయందు వినిర్మలభక్తిని ప్రసాదింపుము.' కాని నేను, 'ఇదిగో, నీ సత్యము; ఇదిగో, నీ అసత్యము—రెంటిని స్వీకరింపుము' అని చెప్పఁజాలనైతిని."

శ్రీరామకృష్ణుని సత్యనిష్ఠ శ్రీరామ సత్యహరిశ్చంద్రాదులను తలఁపునకుఁ దెచ్చును. అత్యంతవిషమపరిస్థితు

లలో సైత మాతఁడు సత్యవ్రతమును బరిపాలించు టటుండ, ఒకానొక దినమున నొకానొక చోటికిఁ బోవుదు నను వాగ్దానమును గాని, యొకనియొద్దనుండి యొక వస్తువును గైకొందు నను మాటనుగాని యెన్నఁడును జవదాఁటి యెఱుఁగఁడు. ఒకవేళఁ దన వాగ్దానమును మఱచినను, తద్వ్యతిరిక్తముగా వర్తింప నాతని మనశ్శరీరములే—సత్య నిష్ఠాపరిపూరితములై యున్న యా మనశ్శరీరములే—నిరాక రించి విషయమును జ్ఞప్తికిఁ దెచ్చెడివి. దివ్యజీవితమునకు ఇట్టి సముజ్జ్వలసజీవనిదర్శనము కన్నెదుట నుండుటకంటె సాధకు నకు వలయు మహత్తరశిక్షణ మేమి? ఇదియేకదా ప్రాచీ నార్య గురుకులవాసమందలి ప్రధానోద్దేశము?

రాఖాలునెడ శ్రీరామకృష్ణుని అసాధారణ వాత్సల్య మునుగూర్చి యొకటిరెండు ముఖ్యవిషయములు తెలుప వలసియున్నది. "అమ్మా! సదా నాకొకఁడు తోడునీడయై యుండఁగోరెదను. నిర్మలహృదయుఁడు, సదా నీ పాదపద్మ ములనే నమ్ముకొనియుండువాఁడును నగు నొక బాలుని దెచ్చియిమ్ము" అని శ్రీరామకృష్ణుఁడు దేవిని ప్రార్థించి యుండెను. కొన్నాళ్లకొక దివ్యదర్శనమున దేవి యొక బాలుని అతని యొడిలో నుంచి, 'ఇదుగో, నీ పుత్త్రుఁడు' అనెను. శ్రీరామకృష్ణుఁడు ఉలికిపడి, "నా కేమి! పుత్త్రుఁ డేమి!" అని యాశ్చర్యచకితుఁడై దేవి నడుగ నామె, "నీ మానసపుత్త్రుఁడు, ఆధ్యాత్మికపుత్త్రుఁడు లెమ్ము" అని యూఱడించెను. మఱియొక దివ్యదృశ్యమున గంగాజలముపై పూర్ణవికసితశత పత్త్రకమలమధ్యమున శ్రీకృష్ణుఁడు తన చెలి

కాఁడగు మఱియొక బాలునితో మనోహరనృత్య మొనర్చు చున్నటులు కాన్పించెను. రాఖాల్ తన యొద్దకు వచ్చినంతనే దివ్యదృశ్యములలోఁ గాన్పించిన బాలుఁ డీతఁడే యని శ్రీ రామకృష్ణుఁడు గుర్తించెను. ఈవిధముగాఁ దనకు కాళీవర ప్రసాదలబ్ధమానసపుత్త్రుఁడైన రాఖాలును ఆతఁడు ప్రేమించి, లాలించి, పాలించుచు, అనన్యసామాన్య మగు చనవున బుజములపై కెక్కించుకొనువాఁ డన్నచో, రాఖా లాతని కెంతటి ప్రీతిపాత్రుఁడై యుప్పెనో తెలియఁగలదు.

ఆగర్భశ్రీమంతుఁ డగు రాఖాల్ బాల్యముననే వివాహితుఁడైనను, కాలక్రమమున నొకబిడ్డను గనినను, శ్రీరామకృష్ణుని చెంత నుండి సేవించుచు, అచిరకాలముననే సాంసారికచింత నతిక్రమించి సమాధ్యనుభవము నందెను. బాలశిష్యబృందమున నరేంద్రునికంటెఁ గొలఁదినెలలు ముందుఁగా రాఖాల్ శ్రీరామకృష్ణుని ఆశ్రయించెను. సమవయస్కులు, ఇదివఱకే సహాధ్యాయులు, మిత్రులునై యుండిన నరేంద్రరాఖాలులు సోదరశిష్యులు, యావజ్జీవితము ప్రాణమిత్రులునై, శ్రీరామకృష్ణసంఘము (వరుసగా) స్థాపకులు, వ్యాపకులు నై వివేకానంద బ్రహ్మానంద నామముల జగద్విఖ్యాతులై వెలసిరి.

తన ఆంతరంగికశిష్యవర్గమునకుఁ జెందిన కాళీప్రసాద చంద్రుఁడు గాలమువేసి చేపలు పట్టసాగెనని శ్రీరామ కృష్ణుఁడు విని, యట్టి క్రూరకార్యము నెందుకుఁ జేయుచుంటి వని యడుగఁగా, నాతఁడు సమస్తజీవులును మరణరహితాత్మ స్వరూపులే కావున నిజముగాఁ దాను చేఁపలను జంపినవాఁ

డనుగాననియు, తన కార్యము నిర్దోషము కదా యనియు సమాధానించెను! అంతట శ్రీరామకృష్ణుఁ డాతని కిట్లు బోధించెను : "నాయనా! నీవు పొరపడుచున్నావు. ఆత్మానుభూతి నొందియున్నవాఁ డెన్నఁడును ఇతరులను హింసింపఁజాలఁడు—అది వాని స్వభావమునకే విరుద్ధము. అట్టివాఁడు తప్పటడుగు వేయఁజాలఁడు. వాని బుద్ధి యెన్నఁడును తప్పుత్రోవను జరింపదు. దీనినిగూర్చి ఆలోచింపుము." గురువాక్కులనుగూర్చి మూఁడుదినములు పర్యాలోచించి కాళీప్రసాదుఁ డవి యథార్థ మని గ్రహించెను.

ధర్మతత్త్వము అతిసూక్ష్మము. వ్యక్తుల మనోవికాస స్థితిగతుల ననుసరించి ధర్మము నుపదేశించుచు, శ్రీరామకృష్ణుఁడు వారిని బురోగమింపఁజేయును. బలరాం బోస్ (బలరామ వసు) అను గృహస్థశిష్యుఁడు దోమలబాధచేఁ దన ధ్యానము సాగకుండుట గని, వానిని జంపవచ్చునా, కూడదా యను ధర్మసందేహముచే మఱింత బాధితుఁడై, తన్నివారణార్థము శ్రీరామకృష్ణుని సమీపించుసరికి—విచిత్రము—ఆతఁడు తన తలగడ నున్న నల్లులను దీసి యొకటొకటిగాఁ జంపుచు నిట్లు పలికెను : "ఈతలగడ కెన్నో నల్లులు పట్టినవి. ఇవి కట్టి చిత్తవిక్షేపము కలిగించును. అందుచే వీనిని జంపుచున్నాను." జనమనస్సంవేది యగు శ్రీరామకృష్ణుఁ డిట్లు శిష్యుల సంశయములను యథోచితముగా నివారించుచుండును. బలరాం బోస్ శ్రీరామకృష్ణునిచేఁ దనకై దేవీనియుక్తులైన రసద్దారులలో నొకఁడుగా భావింపఁబడి, అఖండశ్రద్ధాభక్తులతో నాతనిని సేవింపసాగిన ధన్యాత్ముఁడు.

బాలశిష్యుఁ డగు యోగీంద్రుఁడు (జోగీన్) మితి మీఱిన మెత్తని మనసు గలవాఁడు. శ్రీరామకృష్ణుఁ డొకనాఁ డాతనిఁ దనబట్టలలోని కెక్కియున్న బరిణెపురుగును జంపిరమ్మని చెప్పఁగా, నాతఁడు దానిని వదలిపెట్టి వచ్చెను. అంతట శ్రీరామకృష్ణుఁడు, "దానిని జంపుమనఁగా వదలి పెట్టితివి. నా మాటలను నీవు అక్షరాల నెఱవేర్పవలయును. లేనిచో ఇంతకంటె ముఖ్యవిషయములలోఁ బశ్చాత్తాపపడ వలసివచ్చును" అని మందలించెను. మఱియొకనాఁడు యోగీంద్రుఁడు పడవ నెక్కి వచ్చుచుండ, అం దొకఁడు శ్రీరామ కృష్ణుని దూషింపసాగెను. అజ్ఞతచే ఆతఁ డట్లు మాటాడు చున్నాఁ డని యోగీంద్రుఁడు చల్లఁగా నూరకుండెను. శ్రీ రామకృష్ణుఁ డీసంగతి విని శిష్యున కిట్లు ఉద్బోధించెను : "గురునిందాలాపములను విని కిక్కురుమనకుండ నూరకుంటివి. ఈసందర్భమున శాస్త్రము లేమని చెప్పుచున్నవో తెలియునా? గురునిందకునకు శిరశ్ఛేదన మైనను జేయవలయును, లేదా, వెంటనే ఆతావు వీడనైనను వీడవలయును : కాని నీవు గురు నిందను చల్లఁగా సహించితివి!"

మఱియొక బాలశిష్యుఁ డగు నిరంజనుఁ డొకనాఁడు పడవపై దక్షిణేశ్వరము వచ్చుచుండ, పైని దెల్పిన రీతినే తోడి ప్రయాణికు లకొందఱు శ్రీరామకృష్ణునిగూర్చి నిందా లాపము లాడసాగిరి. ఉద్రేకపూరితస్వభావోపేతుఁడు, ఆజానుబాహువు, మహాబలిష్ఠకాయుఁడు నగు నిరంజనుఁ డందులకు ఖండితముగాఁ దన యసమ్మతి తెలిపినను, వారు వినకుండుటచే, నట్టేట మిమ్మందఱను ముంచివేసెద నని

గర్జించుచు, రౌద్రమూర్తియై లేచి, భీకరముగా పడవ నట్టూఁత లూఁపివేయసాగెను. భయభ్రాంతులై వారు క్షమాపణ కోరుకొనిరి. శ్రీరామకృష్ణుఁడు ఈసంగతి విని, నిరంజనుని తీవ్రముగా మందలించి యిట్లు ప్రబోధించెను : "కోపము మహాపాపిష్ఠిది. సజ్జనుని కోపము నీటిపై గీచిన గీఁత వంటిది—క్షణికము. అవివేకు లేమేమో వాఁగుదురు. నీ వా వాఁగుడు నెన్నఁడును పాటింపఁగూడదు."

అహింసనుగూర్చియు అప్రతీకారమునుగూర్చియు వివిధ వ్యక్తుల ఆంతరంగికస్థితిగతులను బురస్కరించుకొని శ్రీరామకృష్ణుఁడు విభిన్నోపదేశములు చేసియుండుట గమనింపఁదగి యున్నది. ఒకే సంఘటనవిషయమున యోగీంద్రున కొక విధముగను నిరంజనునకు దానికి కేవలము వ్యతిరేకముగను ఆతఁడు ఉపదేశించె నన్నచో, వ్యక్తిగతమనఃపరిపాకము నందలి భేదమే కారణ మని గ్రహింపనగును. భక్తుఁ డయ్యు, దుడుకుఁదనము గల నిరంజనునకు అలవడఁ జేయవలసినవి సహనశాంతతాగుణములు ; మితిమీఱిన మెత్తనివాఁ డగు యోగీంద్రునకు నేర్పవలసినది ఒకించుక కటుకుఁదనము. ఎవని దౌర్బల్యము నేచికిత్సచే నివారింపవలయునో ఆ భవరోగ వైద్యుఁ డెఱుఁగును.[1]

---

[1] అహింసాతత్త్వమును విశదీకరించుచు శ్రీరామకృష్ణుఁ డీ క్రింది నీతికథ చెప్పెను :—'ఎవ్వరిని హింసింపకు' మని యొక యోగి తన కొసఁగిన యుపదేశము ననుసరించి యొకపాము పరమవినమ్రమై వర్తించు చుండ, కొందఱు దానిని లోఁకువచేసి నానావిధములను పీడింపసాగిరి. కొన్నాళ్లకు ఆయోగి యా దారిని వచ్చుచు, పాము దురవస్థను గని,

శ్రీరామకృష్ణుని సర్వభూతప్రేమను అద్భుతరీతిని జాటు కొన్ని సంఘటనము లీ సందర్భమున గమనింపఁదగి యున్నవి. కాళికాలయవనమందలి లేలేఁత పచ్చికపై నొకప్పు డొకఁడు నడచుచుండ, శ్రీరామకృష్ణుఁ డాపచ్చికతోఁ ఐక్య భావము నొంది దుర్భరబాధ పడసాగెను. తనయనుభూతిని గూర్చి యనంతర మాతఁ డిట్లు తెలిపెను : "(ఆపచ్చికపై నాతఁడు నడచుచుండ) ఎవ్వరో నాగుండెలపై నెక్కి తొక్కుచున్నట్లు బాధ కలుగసాగెను. ఆవిధమైన భావసమాధి మహాబాధాకరము. అది నాకు రెండుజాములసేపు ఉండెను. ఆ బాధ భరింపఁజాలకపోతిని."

మఱియొక ఐక్యానుభూతినిగూర్చి శ్రీరామకృష్ణుఁ డిట్లు తెలిపెను : "పూజకై యొకనాఁడు మారేడుదళములు కోయఁబోవ, ఒకదళముతోఁ గొంత పట్టకూడ ఊడివచ్చెను. చెట్టు చైతన్యమయమై యున్నట్లు కనుఁగొంటిని. చెట్టుకు బాధ కలిగించినందులకై దుఃఖపడితిని." మఱియొకనాఁడు ఆతఁడు భావపరవశుఁడై గంగానదిని అవలోకించుచుండ, పడవ నడుపువాఁ డొకఁడు మఱియొకనితో జగడమునకు దిగి వానివీఁపుపై ఫెడేలుమని చఱచెను. అది గని శ్రీరామ

---

సంగతి సందర్భములను విని యిట్లు ఉపదేశించెను : 'అయ్యో ! నిన్ను నే నెవ్వరిని కఱవవద్దంటిని గాని బుసకొట్టి భయపెట్టవలదంటినా ? బుసకొట్టి నీ వెవరిని నీ దరికి రాకుండఁజేయవచ్చునుగదా?' (సంక్షిప్తము.)

తా మెవ్వరిని హింసింపకున్నను, తమయెడ లోకులు భయభక్తులు గలిగి మెలఁగునట్లు సంసారులు వర్తింపవలయునని యిందలి నీతి. (చూ. 'శ్రీరామకృష్ణ బోధామృతము,' పు. 437-8.)

కృష్ణుఁడు వెంటనే దుర్భరబాధతో అఱచెను. ఆతని యార్త నాదము విని హృదయుఁడు పరుగెత్తుకొని వచ్చిచూడ— అత్యాశ్చర్యము—శ్రీరామకృష్ణుని వీఁపు ఎఱ్ఱవాఱి, తట్టు తేఱి వాచియుండెను! శ్రీరామకృష్ణుని సర్వజీవైక్యభావము —అద్వైతభావము—ఎట్టిదో పరికింపుఁడు.

ఆధ్యాత్మికానుభవశిఖరముల నధిరోహించి తఱచు సమాధినిమగ్నుఁడగుచుండు శ్రీరామకృష్ణుఁడు శిష్యులకు వ్యవహారవిషయములందు సైతము చక్కని బోధలొనర్చువాఁడనుట కొక్క నిదర్శనము. బాలశిష్యుఁడగు యోగీంద్రుఁడొకనాఁడు వర్తకుని పారమార్థికతను నమ్మి యొక యోటి బూరెలమూఁకుడు కొనితేఁగా, శ్రీరామకృష్ణుఁడు శిష్యు నిట్లు మందలించెను : "భక్తుఁడు వెఱ్ఱివెంగళప్ప కారాదు. పరమార్థసాధనకై యావర్తకుఁడు దుకాణము పెట్టెనను కొంటివా? వాని పారమార్థికతను నమ్మి మూఁకుడు నొక్కసారి యైనను బరీక్షింపకుండ తెచ్చుటయా! వస్తువులు కొనఁదలఁచినయెడల, ముందుఁగా నాలుగు దుకాణములలోను ధరలు విచారించి, పరిశీలించి మఱి కొనవలయును. మామూలుగా వచ్చు కొసరులుకూడ తీసికోవలయును."

తన కెంతమాత్రము వివాహేచ్ఛ లేకున్నను, కన్నీటితోఁ దన్ను బతిమాలసాగిన తల్లిని తృప్తిపఱుచుటకై యోగీంద్రుఁడు పెండ్లిచేసికొని, పిమ్మట శ్రీరామకృష్ణుని సమక్షమునకుఁ బోవుట కెంతయో సిగ్గుపడి వెనుదీసెను. కాని శిష్యవాత్సల్యప్రపూర్ణుఁడగు శ్రీరామకృష్ణుఁడు ఊరకుండునా? యోగీంద్రు నెట్లో రావించి, వాత్సల్యము పొంగి

పారలిపాఱ. అలౌకికశక్తిసంజనిత తేజము మోమునఁ దాండవింప, శిష్యుని చేయి పట్టుకొని యిట్లు అతఁడు అభయ ప్రదానమొనర్చెను : "వివాహము చేసికొంటివి. ఐన నేమి? భయమేమి? (తన్ను ఉద్దేశించుచు) దీని యనుగ్రహము మున్న పక్షమున 'లక్ష పెండ్లిండ్లైనను' నిన్నేమియుఁ జేయఁజాలవు. సంసారము చేయుచు, ఈశ్వరప్రాప్తి నొందఁగోరెదవా, నీ భార్య నొకసారి యిచటికిఁ దీసికొనిరమ్ము,—ఆమెను, నిన్ను అందులకు అర్హులను జేయుదును; సంసారము త్యజించి యీశ్వరలాభము నందఁగోరెదవా, అదియు నీకు సాధ్యమగునట్లు జేయుదును." దివ్యభావోత్తేజితుఁడై యాతఁడు మహోజ్జ్వలమూర్తియై భాసించుచుండెను.

నిరాశాంధకారమునుండి ధైర్యతేజోలోకమునకుఁ గొంపోఁబడినట్లు యోగీంద్రునకుఁ దోఁచెను. ఆహా! గురుదేవునకుఁ దనపై నెంతటి మహావాత్సల్యమో! యోగీంద్రునకు దివ్యజీవనమార్గము దొరకెను.

తన్ను నమ్ముటకుముందుఁ బరీక్షింపుఁడని శ్రీరామకృష్ణుఁడు శిష్యులను ప్రోత్సాహించుచుండును గదా! యోగీంద్రుఁ డొకనాఁడు పరీక్ష చేయుట తటస్థించెను. ఆతఁడు గురువర్యునిగదిలోఁ బరుండియుండెను. నడిరేయిని మెలకువ వచ్చిచూడఁగా, శ్రీరామకృష్ణుఁ డచట లేఁడు. "ఈయన రహస్యముగాఁ దన భార్యకడకుఁ బోయియుండునా?" అను సంశయము కలుగ, ఆమె పరుండు నహబత్ఖానా చెంతకుఁ బోయి కనుపెట్టియుండెను. ఇంతలో శ్రీరామకృష్ణుఁడు పంచవటివైపునుండి వచ్చి ప్రియశిష్యుని జూచి, "ఏమిరా,

ఇక్కడ నిలువఁబడియున్నావు?" అనెను. యోగీంద్రుఁడు తెల్లవోయి సిగ్గుతో తల వంచుకొనెను. సంగతి గ్రహించి శ్రీరామకృష్ణుఁడు శిష్యుని మెచ్చుకొనెను.

"మహాశయా! కామవిముక్తి నొందు టెట్లు?" అని యోగీంద్రుఁడు గురుసాన్నిధ్యప్రారంభదశలో నొకనాఁడు శ్రీరామకృష్ణు నడుగ, నాతఁ డిట్లు ఉపదేశించెను: "హరినామస్మరణ చేయుచుండుము, కామము అంతరించి పోవును—మఱేమియు అవసరము లేదు."[1]

శ్రీరామకృష్ణునకు యోగీంద్రుఁడు ఆత్మసమర్పణ మొనర్చుకొని యాతని శిక్షణమున కామవిజేతయై, సార్థకనాముఁడై యొప్పెను. "కామమును సర్వవిధములను జయించినవారు మాలో నెవ్వరైనను ఉన్నచో, ఆతఁడు జోగీన్" అని స్వయముగా వివేకానందస్వామి ప్రశంసించెనన్నచో, యోగీంద్రుని మహనీయత యెట్టిదో తెలియఁగలదు.

కామదమనమునుగూర్చి శ్రీరామకృష్ణుఁడు శిష్యుల కొనర్చిన యుపదేశములు గమనార్హములు. హరి యను ప్రియశిష్యునకు బాల్యమునుండియు స్త్రీ లనిన అసహ్యము. చిన్నపిల్లలనుగూడ దగ్గఱకు రానీయఁడు. "అబ్బా! స్త్రీలనిన నేను సహింపఁజాలను" అని యాతఁ డొకనాఁడు గురుదేవునితోఁ బలుక, నాతఁడు మందలించుచు నిట్లు ఉద్బోధించెను: "అవివేకివలె మాటలాడుచున్నావు! స్త్రీలను నిరసించుటయా!

[1] ఏ యాసనములో వేయుమనియో, కరక్కాయలు తినుచుండుమనియో ఠాకుర్ చెప్పుననుకొంటిననియు, కాని యాయన యుపదేశము ననుసరించి తత్ఫలితము నొందసాగితిననియు యోగీంద్రుఁడు తెలుపును.

ఎందుకు? వారు దేవీమూర్తులు. నీతల్లికివలెనే వారికి నమస్కరించుచుండుము. వారియెడ గౌరవము కలిగియుండుము. స్త్రీమోహాంధుఁడవు గాకుండ తప్పించుకొను మార్గ మిదియే. వారిని ద్వేషించుకొలఁదియు మోహజాలమునఁ బడిపోవుదువు." ఈప్రబోధముచే హరిదృక్పథము పూర్తిగా మారిపోయెను. కాలక్రమమున నాతఁడు మహాయోగి యయ్యెను. హరిప్రసన్న[1] యను ప్రియబాలశిష్యునకు శ్రీరామకృష్ణుఁడిట్లు ఉపదేశించెను: "మేలిమిబంగారమువంటి శీలము గలదై భగవత్ప్రేమచే నేలపైఁ బొరలునట్టి దైనను, స్త్రీని కన్నెత్తి చూచుట హానికరము."

సాధకులకు శ్రీరామకృష్ణుఁ డిట్లు ఉపదేశించును: "తోఁటమాలి చిన్న మొక్కను పెంచు విషయమున నేమి చేయును? దాని చుట్టును కంచె వేసి, పశువులు మేయకుండ సంరక్షింపఁడా? అది యెదిగి పెద్ద చెట్టయి, పశువులవలన దానికిఁక అపాయ మనునది లేకుండునపుడుకదా కంచె తీసివేసి యథేచ్ఛముగాఁ బెరుగనిచ్చును? నీ ఆధ్యాత్మికజీవితవిషయమునఁగూడ అట్లే చేయుము; తత్ప్రారంభమున స్త్రీలకు దూరముగాఁ దొలఁగి మెలఁగుచుండుము. బలవంతుఁడవై తగినంత వికాసము నొందినపిమ్మట వారి సాహచర్యము నపేక్షింపవచ్చును." "సాధనకాలమున పురుషుఁడు స్త్రీని

[1] శ్రీరామకృష్ణునివలన నాలుక పై మహోపదేశాత్మకమగు మంత్రాక్షరలేఖనమునను ఇతర విధములను ఆధ్యాత్మికశక్తిని, ప్రబోధమును బొందిన హరిప్రసన్న చట్టోపాధ్యాయ యను నితఁడు కాలక్రమమున విజ్ఞానానందస్వామి యను యతివరేణ్యుఁ డయ్యెను.

దావానల మనియో, నల్లత్రాఁచనియో భావింపవలయును. సిదావస్థలో స్త్రీ నీకు జగజ్జననీస్వరూపిణిగాఁ గాన్పించును.'' స్త్రీలకు శ్రీరామకృష్ణుఁ డిదే విధముగా నుపదేశించువాఁడు. గృహస్థుల కాతఁ డిట్లు బోధించును: "ఒకరిద్దఱు బిడ్డలు పుట్టిన పిమ్మట భార్యాభర్తలు సోదరీసోదరులవలె జీవించుచు, భగవంతునిగూర్చియే ప్రసంగించుచుండవలయును అపు డిద్దఱును భగవదాసక్తు లగుదురు. అప్పుడు భార్య భర్తకు ఆధ్యాత్మికమార్గమునఁ దోడ్పడును. కామమును త్యజింపక, దివ్యానందము ననుభవించుట అసాధ్యము.[1] కామవిముక్తికై మనఃపూర్వకముగా భగవంతుని ప్రార్థింపవలయును."

"భగవత్సాక్షాత్కారము సంభోగసుఖముకంటె కోటిరెట్లు విశేషానందము నొసఁగూర్చును.''

బ్రహ్మచర్యమహత్త్వమును గూర్చి శ్రీరామకృష్ణుఁడు ముఖ్యముగాఁ దన బాలశిష్యుల కిట్లు ప్రబోధించును: "భగవత్సాక్షాత్కారము నొందఁగోరుటకై అఖండబ్రహ్మచర్య మవలంబింపవలయును. తన్మూలమున నే కాని ఆధ్యాత్మిక

---

[1] "నాయనా! కామినీకాంచనములను త్యజింపనిదే నీ వెన్నఁటికిని ఈశ్వరసాక్షాత్కారము నొందఁజాలవు" అని శ్రీరామకృష్ణుఁడు నరేంద్రునకు బోధించెను. (Gospel, p. 637.) సాధకలోకమున కాతఁ డిట్లు ఉపదేశించును: "మాయ యనఁగా నేమి? ఆధ్యాత్మికసాధనకు—ఆత్మవికాసమునకు—అడ్డు వచ్చుచుండు కామమే మాయ." "సర్వము ధ్వంసము చేయుదానిని మాయ యనవలయునా, మదనాగ్ని యనవలయునా?"

రహస్యముల నెవ్వరును గ్రహింపఁజాలరు. అస్ఖలితబ్రహ్మచర్యమూలమునఁ దన శక్తిసామర్థ్యములను, పవిత్రతను గాపాడుకొనువాని నిర్మలహృదయమున పరమేశ్వరుని దివ్యమంగళస్వరూపము అద్దమున ముఖమువలె ప్రతిబింబించును. పంద్రెండేండ్లు 'ధైర్యరేతస్కుఁడై'[1] బ్రహ్మచర్యమును బరిపాలించువాఁడు అసాధారణశక్తిని బొందును. వానియందు అంతర్గతమైన 'మేధానాడి' యను నొక క్రొత్తనాడి బయలుదేఱును. తన్మూలమున నాతఁడు సమస్తము జ్ఞప్తికిఁ దెచ్చుకొనఁగల్గును, సమస్తము గ్రహింపఁగల్గును." సంసారబంధమున కంతకును పెండ్లియే మూలకారణమని తెలుపుచు, సాధారణముగా బాలశిష్యుల కాతఁడు పెండ్లి చేసికొనవలదని యుపదేశించును. బైబిల్‌నుండి యీయంశముల కనుగుణమగు నుపదేశములను శశి (శశిభూషణ చక్రవర్తి), శరత్ (శరచ్చంద్ర చక్రవర్తి) అను నిరువురు ప్రియబాలశిష్యులచేఁ జదివించెను.[2] కాలక్రమమున వీరే (వరుసగా) రామకృష్ణానంద శారదానందస్వాములై

[1] పూర్వము కామసుఖము నొందియున్నను, అటుపై అఖండబ్రహ్మచర్యము నవలంబించియుండువాఁడే 'ధైర్యరేతస్కుఁ' డని శ్రీరామకృష్ణుఁడు తెల్పెను.

[2] అవి యివి.—"కొందఱు నపుంసకులై జన్మించుచున్నారు; కొందఱు నపుంసకులొనర్పఁబడుచున్నారు; మఱికొందఱు ఈశ్వరసామ్రాజ్యప్రాప్తికై స్వయముగా నపుంసకు లగుచున్నారు. ఇట్టి యేకాంక జీవితము నవలంబింపఁగలవారు అటు లొనర్పవచ్చును." (St. Matthew, 19-12.) ఇవ్విషయమై పాల్‌ఋషి యిట్లనును : "అవివాహితులును వితంతువులును నావలెనే జీవించుచో, (అనఁగా బ్రహ్మ

త్యాగవైరాగ్యములనుగూర్చి బోధించుచు, సన్న్యాస జీవననియమములు అతికఠినము లని శ్రీరామకృష్ణుఁ డిట్లు వక్కాణించును: "ఎవ్వఁడు మఱునాఁడు తా నేమి తిందునో, ఏమి ధరింతునో యను చింత లేశమును లేక సాంసారిక విషయములను పూర్తిగా విడిచిపెట్టునో, అట్టివాఁడే నిజముగా సన్న్యాసము స్వీకరింప నర్హుఁడు. సన్న్యాసి కామకాంచనములను పరిత్యజింపవలెను; వానిని మరల ఆసించుట కక్కిన కూటిని ఆసించుటే. సన్న్యాసి స్త్రీపటమునైనను జూడరాదు. అది వానికి హానికరము. సన్న్యాసజీవనము ఏకాదశీనిర్జలోపవాసము వంటిది. తా నెంత విరక్తుఁడై యింద్రియనిగ్రహము కలిగియున్నను, లోకమునకు మార్గదర్శకుఁడై యుండుటకై సన్న్యాసి కామినీకాంచనములను పూర్తిగా విసర్జింపవలయును. సన్న్యాసి జగద్గురుడు."

రామచంద్రదత్త యను ప్రియగృహస్థశిష్యుఁడు సన్న్యాసదీక్షకై కోరఁగా, శ్రీరామకృష్ణుఁడు అతని కిట్లు బోధించెను: "గృహస్థజీవనము కోటవంటిది. శత్రువుతో జయమునుండికంటె కోటలోనుండి పోరాడుట సులభము. మనస్సునను మూఁడుపాళ్లు ఎపుడు భగవంతునిపై నుంచఁగల్గుదువో, అపుడు సంసారము త్యజించు స్థితి నొందుదువు—అంతకుముందుమాత్రము కాదు." శ్రీరామకృష్ణుని గృహస్థ

---

చర్యము నవలంబించుచో) అది వారికి శ్రేయస్కర మందును. కాని యిందుకుఁ దగిన నిగ్రహశక్తి లేనివారు పెండ్లిచేసికొందురుగాక : ఏలన, కామాగ్నిసంతప్తులై కుమిలిపోవుటకంటె పెండ్లిచేసికొనుటయే మేలు." (1. Corinthians, 7-8, 9.)

శిష్యులలో అగ్రగణ్యుఁడు, నాగమహాశయనామమున జగద్విఖ్యాతుఁడును నగు దుర్గాచరణనాగ్ తాను సన్న్యాసము స్వీకరింప శ్రీరామకృష్ణు ననుజ్ఞ వేఁడ, నాతఁ డిట్లు సమాధానించెను : "జనకమహారాజువలె సంసారమునం దుండుము. గృహస్థుఁడు ఎట్లు జీవింపవలెనో నీ జీవితము లోకమునకు దార్శనికము కాఁగలదు." మఱియొకప్పు డాతని కిట్లు తెలిపెను : "సాధువులను వెదకుటకై నీవు గడప దాఁటనక్కఱలేదు. ఇంటనే యుండుము ; నిజమైన సాధువులు నిన్ను గౌరవించుటకై నీకడకు వత్తురు." కామ కాంచనములపై నాగమహాశయుఁడు సాధించిన విజయము అద్భుతావహము. అహింసకును వినయమునకును ఔదార్యమునకును అతఁడు పెన్నిధి.

వంగదేశమున సుప్రసిద్ధనాటకకర్త, నాటకప్రదర్శకుఁడు, స్వయముగా మహానటుఁడునై యుండిన గిరీశచంద్రఘోష్ శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యులలో ప్రధానగణ్యుఁడు. నవనాగరికతాప్రభావమునకు ఎరయై, అంతరంతరాళములలో మినుకుమినుకుమనుచున్న పరమార్థకాంక్ష నొక మూలకు నెట్టి, లేనిపోని యాధ్యాత్మికసాధనసంపదకై ప్రాఁకులాడుట కంటె అనాయాసముగా లభించు నింద్రియసుఖములను యథేచ్ఛముగా ననుభవించుటయే మేలని యెంచి, నానావిధ వ్యసనములలోఁ దగుల్కొనియుండిన యీతఁడు శ్రీరామకృష్ణసాన్నిధ్యమునఁ బొందసాగిన పరిణామము లోకమున కొక గొప్ప నీతిపాఠము. నాలుగైదుసమావేశములైన పిమ్మటఁగాని, ఎంతయో పరిశీలించిన పిమ్మటఁగాని, గిరీశు

లైనవి. గిరీశునకువలెనే సురేంద్రునకును త్రాగుడు ఒక మహావ్యసనము. శ్రీరామకృష్ణుఁడు నిషేధించినచో దానిని మానుదు నని తన మిత్రుఁడగు రామచంద్ర దత్తుతోఁ జెప్పి యాతనితో సన్నిధికి రాఁగా, శ్రీరామకృష్ణుఁడు ఇట్లు పలికెను: "సురేశా! నీవు సారాయి సారాయిగా ఏల త్రాగెదవు? కాళికి అర్పించి యామె ప్రసాదముగాఁ బుచ్చుకొనుచుండుము. కాని మైకము కలుగఁగూడదుసుమీ. నడక తడఁబడగూడదు, తలఁపులు చంచలింపఁగూడదు. మొదట నెప్పటివలెనే ఉద్రేకము కలుగునుగాని, త్వరలోనే దివ్యానందమునకు దారితీయును." ఈ హితోపదేశము ననుసరించి యాతఁడు అచిరకాలముననే ఉత్తమభక్తుఁడయ్యెను. పెద్ద యుద్యోగి యగు సురేంద్రుఁడు శ్రీరామకృష్ణుని సేవించుచు, ఆతనిచేఁ దనకై దేవీనియమితులైన రసద్దారులలో నొకఁడుగాఁ బరిగణింపఁబడిన ధన్యాత్ముఁడు.

సురేంద్రునివలెనే గిరీశుఁడును శ్రీరామకృష్ణుని శిక్షణమున మహత్తర ప్రబోధము నొందసాగెను. నిత్యము ఉదయసాయంకాలములం దైనను భగవంతుని స్మరింపవలయు నని శ్రీరామకృష్ణుఁడు గిరీశునకుఁ జెప్పి, సమాధానమునకై యాతనికేసి చూచెను. "ఇది చాల సులభమే కాని, నాకెన్నో పనులుండును. నిద్రాహారములకుఁగూడ నాకు ప్రత్యేకమైన వేళయనునది లేదు. అట్టి స్థితిలో మఱవవచ్చును. వాగ్దానము ఎట్లు చేయఁగలను?" అని గిరీశుఁడు భావించుచుండెను. ఆతని భావములను గనుఁగొని శ్రీరామకృష్ణుఁడు, "సరి, అది నీకు సాధ్యముకానియెడల, నీ ముక్త్యారునామా నాకిమ్ము. ఇంతటి

నుండి నీకై బాధ్యత వహింతును. నీవు ఏమియుఁ జేయ నక్కఱ లేదు'' అని మహోన్నతభావావస్థలో వచించెను. ఈ వాక్యములు విని గిరీశుఁడు, ''బ్రతుకు జీవుఁడా!'' యని నిట్టూర్పు నిగిడ్చెను. తనకింతకంటెఁ గావలసిన దే మున్న దనుకొనెను. తన స్వాతంత్ర్యమును శ్రీరామకృష్ణునకు అర్పించి తా నాతని కింకరుఁడ నైతినని మొదట ఆతనికి స్ఫురింపలేదు. ఇందలి గంభీరమైన ఆత్మసమర్పణము తొలుత నాతనికి ద్యోతకము కాలేదు. కర్తృత్వభావమును విడిచి యాతఁడు సర్వవిషయములందును భగవదిచ్ఛను—అందులకుఁ దనకు ప్రత్యామ్నాయముగా భాసింపసాగిన శ్రీరామకృష్ణుని యిచ్ఛను—అనుసరించి నడచుకొనఁబూనెను. ఇఁక నాతనికి నిరంతరము శ్రీరామకృష్ణచింతయే! గిరీశుని ఆత్మసమర్పణము పరిపూర్ణమై, లోకాదర్శమై యొప్పెను.

శ్రీరామకృష్ణుని పావనసంసర్గప్రభావమున పునీతులైన పతితు లెందఱో కలరు. ఆతఁ డొకప్పుడు జోగీన్ మా యను శిష్యురాలి యింటికిఁ గొందఱు అనుచరులతో వెడలఁగా, అందఱను ఎదరఁగొట్టి పంపివేయుటకై యామె సోదరునిచే నచటికి రావింపఁబడియుండిన మన్మథ్ అను పైలుమాను—దుండగీఁడు—శ్రీరామకృష్ణుని జూచి, యాతని వాక్కు లొకటిరెండు వినుటతోడనే, పాదములపై వ్రాలి, ''ప్రభూ! ఈ యపరాధిని క్షమింపుఁడు!'' అని విలపింపసాగెను. శ్రీరామకృష్ణుఁ డతని నొకసారి దక్షిణేశ్వరము రమ్మనెను. రెండుమూఁడు సందర్శనములతో మన్మథుని జీవితమే మాఱి పోయెను. లోకకంటకుఁడగు నాతడు సాధకుఁడై, పరమ

సాధువై, "ప్రియనాథా! ప్రియనాథా!" యని జీవితాంత పర్యంతము తలఁచు శ్రీరామకృష్ణుని స్మరించుకొనుచుండు వాఁడు. పరమదుర్మార్గుని పరమసన్మార్గునిగా నొనర్పఁగల్గుట కంటె మహత్తరమైన అద్భుతకృత్యమే మున్నది?

భగవంతుని శరణుచొచ్చినచో, కర్మక్షయమగునని శ్రీరామకృష్ణుఁడు తెల్పును. భగవత్ప్రార్థనావశ్యకతను గూర్చియు ప్రార్థన ప్రభావమునుగూర్చియు నాతఁడు శిష్యులకుఁ బదేపదే నొక్కి వక్కాణించును. కామకాంచన మోహత్యాగమునకు వలయు శక్తి నిమ్మని భగవంతుని వేఁడుకొమ్మని యుపదేశించును.[1] స్వయముగా ఇష్టదైవము నాతఁడు ప్రార్థించు సమయములందు సన్నిధి నున్నవారలకు పులకలు, కన్నీరు మున్నగు వానితో అపూర్వ భావావేశము గలుగుచుండెడిది.

---

[1] శ్రీరామకృష్ణుఁడు స్వయముగా దేవి నిట్లు ప్రార్థించెను: "అమ్మా! నేను నీ శరణాగతుఁడను, శరణాగతుఁడను. దేహసుఖము నాకక్కఱలేదు; పేరుప్రతిష్ఠలను (నేను) కోరుటలేదు; అష్టసిద్ధులను కోరుటలేదు; నీ శ్రీపాదపద్మములందు శుద్ధభక్తిని—నిష్కామము, అమలము, అహేతుకము నగు భక్తిని మాత్రము—నాకు అనుగ్రహింపుము! మఱియు భువనమోహన మగు నీమాయచే ముగ్ధుఁడను గాకుండునట్లును, నీమాయాకల్పితమగు కామినీకాంచనములపై నెన్నఁడును ప్రీతి నొందకుండునట్లును అనుగ్రహింపుము! అమ్మా! నీకంటె నాకు దిక్కెవ్వరు?—'నావారు' అనుకొనఁదగువా రెవ్వరు? భజనహీనుఁడను, సాధనహీనుఁడను, భక్తిహీనుఁడను నేను—నన్ను కటాక్షించి, నీ శ్రీపాదపద్మములందు నాకు భక్తి నిమ్మా!" (Refer 'The Gospel of Sri Ramakrishna,' p. 658.)

శిష్యభక్తకోటిలో ముఖ్యులగు మఱికొందఱితో శ్రీ రామకృష్ణుని సంబంధమును దిఙ్మాత్రముగాఁ దెలిపెదము. 'మ' యను సాంకేతికనామముచ 'శ్రీ శ్రీరామకృష్ణకథామృత' సంకలనకర్తయు, అనేకబాలశిష్యరత్నములు శ్రీరామకృష్ణు నాశ్రయింప సాధనభూతుఁడైన మహాసుకృతాత్ముఁడును నగు మహేంద్రనాథగుప్త యను గృహస్థశిష్యునకు ఆతఁడు, "నీవు నాకు స్వకీయుఁడవు, తండ్రీకొడుకులవంటివారము మనము" అని తెలిపెను. వాదప్రవృత్తి కలవాఁడగు నాతనివలన వాదింపనని వాగ్దానము గైకొనెను. అక్షయ కుమారసేన్ అను శిష్యుఁడు శ్రీరామకృష్ణునివలన మంత్రోపదేశము నొంది కాలక్రమమున శ్రీరామకృష్ణుని జీవిత చరిత్రను వంగభాషలో సుప్రసిద్ధపద్యకావ్యముగా రచించిన సత్కవి. నిత్యగోపాల్ అను బాలభక్తుఁడు శ్రీరామకృష్ణునిచే పరమహంసస్థితి నొందినవాఁడని ప్రశంసింపఁబడి యాతనితో

---

మఱియొకప్పుడు పుష్పాంజలియై దేవినాతఁ డిట్లు ప్రార్థించెను: "అమ్మా! ఇదిగో, నీపాపము, గైకొనుము, ఇదిగో, నీధర్మము, గైకొనుము; నాకీ ధర్మాధర్మము లెంతమాత్రము అక్కఱలేదు; శుద్ధ భక్తి నిమ్ము. ఇదిగో, జ్ఞానము, స్వీకరింపుము; ఇదిగో, నీ అజ్ఞానము, స్వీకరింపుము; నాకీ జ్ఞానాజ్ఞానములేవియు ఇసుమంతైనను అక్కఱలేదు; నాకు శుద్ధ భక్తి నిమ్ము...." (See The Gospel, p. 746.)

శుభాశుభములను, శౌచాశౌచములను తా నిట్లే దేవికి అర్పించినను, సత్యాసత్యములనుమాత్రము అర్పింపఁజాలనైతి ననియు, అట్టిచో, తన సమర్పణమే అసత్యమైపోవుననియు శ్రీరామకృష్ణుఁడు తెల్పెను. (చూ. ఈగ్రంథము, పు. 34[illegible]; మఱియు 'శ్రీరామకృష్ణ బోధామృతము', పు. 488-9.)

తన్మయనృత్యము సలుపఁగలుఁగుచుండెడి పానవాత్ముఁడు. అటులయ్యును, ఒకభక్తురాలితనితో వాత్సల్యభావమున మిక్కిలి చనవుగా నుండుట గని శ్రీరామకృష్ణుఁడు, "ఓ సాధూ! జాగ్రత్త!" యని సన్న్యాసనియమములనుగూర్చి హెచ్చరించెను. కాలక్రమమున నీతఁడు సన్న్యసించి జ్ఞానానందావధూత యయ్యెను. పాణిహాటి యను పుణ్యక్షేత్రమున శ్రీరామకృష్ణుని స్పర్శచే అద్భుత మనఃపరిణామము నొంది, సంసారత్యాగియై, గంగాతీరమున ధ్యానప్రార్థనలతో, దివ్యానుభవములతో జీవితశేషమును గడపసాగిన ధన్యుఁడు నవాయిచైతన్య యను భక్తుఁడు.[1] సంసారత్యాగియు, శ్రీరామకృష్ణునిచే నిత్యసిద్ధుఁ డని పేర్కొనఁబడిన మహనీయుఁడును నగు భవనాథ చట్టోపాధ్యాయ, అధరచంద్ర సేన్, మనోమోహనమిత్ర, ఈశానచంద్ర ముఖోపాధ్యాయ, పండిత శ్యామాపద భట్టాచార్య, శ్రీరామకృష్ణసందేశవ్యాప్తి చేయసాగిన కేదారనాథ చట్టోపాధ్యాయ మున్నగు ప్రియ గృహస్థశిష్యులను, ప్రియభక్తులనుగూర్చి వ్రాయఁబూనుచో, అదియే యొక ఉద్గ్రంథ మగును.

'నేనే బ్రహ్మమను' ('అహం బ్రహ్మాస్మి', 'సోఽహమ్') అను నద్వైతభావమును, నిర్గుణోపాసనమును దుస్సాధ్య

[1] శ్రీరామకృష్ణుని శరీరము అనిర్వచనీయమైన యొకానొక దివ్య విద్యుచ్ఛక్తితో సంభరితమై యుండెడిదనియు, ఆయన పాదస్పర్శాదిక ప్రభావవిషయ మటుండ, సాన్నిధ్యముననే భక్తులు అపూర్వానందానుభూతి నొందువా రనియు శ్రీవిజ్ఞానానందస్వామివలన మేము విని యున్నాము.

మనియు, కావున ముఖ్యముగా గృహస్థులకు ఉచితముకావ నియు శ్రీరామకృష్ణుఁడు బోధించును.[2] మఱియు నాతఁడు వారి కిట్లు ఉపదేశించును : "చేతులకు ముందుగా నూనె రాచుకొని పిమ్మట పనసపండు ఒలువవలయును ; లేనిచో దాని బంక అంటుకొనును. ముందుగా భగవద్భక్తి యను తైలము సంపాదించి పిమ్మట నీసంసారకృత్యములలో చేయి పెట్టుము. (అపుడు సంసారమాలిన్యము నిన్ను అంటదు.)"

"పడవ నీటిలో నుండవచ్చును, గాని నీరు పడవలోఁ జేరరాదు. సాధకుఁడు సంసారములో నుండవచ్చును, కాని సంసారము వానిలో నెలకొనరాదు."

'సత్సాంగత్యము ఆత్మవికాసమునకు ముఖ్యాంగము.'

తనయొద్దకు వచ్చునపుడు వట్టిచేతులతో రాక, యే ఉపహారలేశమో, తుదకు ఏ వక్క పలుకో కైకొనిరమ్మని మహేంద్రనాథగుప్తవంటి ప్రియగృహస్థశిష్యుల కాతఁడు తెల్పును. "రిక్తహస్తేన నోపేయాత్ రాజానం దైవతం గురుమ్" అని కదా శాస్త్రవచనము.

---

[2] శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించును: "సంసారులై యుండువారికిని, దేహబుద్ధి (అనగా శరీర మే 'నే' నను కొను భావము) కలిగియుండువారికిని 'సోఽహంభావము' (అనఁగా నేనే బ్రహ్మము నను భావము) మంచిది కాదు. (అద్వైత) వేదాంతముకాని, యోగవాసిష్ఠముకాని చదువుట సంసారులకు మంచిది కాదు. అట్టి గ్రంథములు చదువుట వారికి చాల హానికరము, భగవంతుఁడు తమ ప్రభు వనియు, తా మాతని సేవకుల మనియు వారు సేవ్యసేవకభావమును అవలంబించియుండవలయును." (Refer 'The Gospel of Sri Ramakrishna,' p. 520. See also pp. 105, 198, 279, 294-5.)

భగవత్సాక్షాత్కారమును గూర్చి శ్రీరామకృష్ణుం డిట్లు బోధించును: "నిజముగా, నిశ్చయముగాం, జెప్పు చున్నాను, వినుండు: భగవంతునికై పరితపించువాండు వానిని గనుంగొనును. ఇందలి సత్యమును స్వయముగా మీ జీవిత ముననే పరీక్షించుకొనుండు. పోయి త్రికరణశుద్ధిగా మూండు దినములు ప్రయత్నింపుండు, తప్పక విజయము నందుదురు."

శ్రీరామకృష్ణునకు విశేష ప్రీతిపాత్రు లైన బాల భక్తులలో పూర్ణచంద్ర ఘోష్, నారాయణ, నరేంద్రనాథ మిత్ర యనువారు సుస్మరణీయులు. కాలక్రమమున యతి వరేణ్యులై లోకమునకు అపారసేవల నొనర్చిన బాల శిష్యులలో నికనొకరు బేర్కొనంబడిన నరేంద్రరాఖాలాదులే కాక, లాటూ (రక్తురామ్ అను నీతండు తొలుత రామ చంద్రదత్తు నింట పరిచారకుండు. కాలక్రమమున నీతండే అద్భుతానందస్వామి), శారదాప్రసన్న మిత్ర (త్రిగుణా తీతానందస్వామి), తులసీచరణ దత్త (నిర్మలానందస్వామి) యనువారును శ్రీ రామకృష్ణునకు పరమప్రేమాస్పదులై యొప్పిరి. గోపాలసుర్ (బుడా గోపాల్, అనంగా పెద్ద గోపా లుండు) అను ప్రియగృహస్థ శిష్యుండు కాలక్రమమున అద్వై తానందస్వామి యను యతివతంస మయ్యెను.

బాలశిష్యులయెడ శ్రీ రామకృష్ణుని వాత్సల్య మెట్టిదో చూచియున్నాము దక్షిణేశ్వర కాళికాలయమునకడ నివసింప సాగిన ప్రతాపచంద్ర హాజ్రా యను నాతం డొకనాండు బాబురామ్ మున్నగు బాలశిష్యులను, "శ్రీ రామకృష్ణు

నడిగి యోగసిద్ధులను బొందుఁడు'' అని హెచ్చరింపసాగెను. ఆతని లౌకికధోరణిని జూచి శ్రీరామకృష్ణుఁడు బాబురామును బిలిచి యిట్లు పలికెను: "సరి, మీరు నన్ను అడుగఁ గలిగిన దేమి? నా సర్వస్వము మీదే కదా? ఔను, దివ్యానుభూతుల రూపమున నేను బొందిన దంతయు మీ యందఱనిమిత్తమే. కావున ఈ యాచకభావము విడిచి పెట్టుఁడు,—దీనివలన మనము అన్యోన్యము దూరుల మైపోవుదుము. మీతో నాకుఁ గల ఆప్తతను గ్రహించి యీ భాగ్యమున కంతకును కీలకము మీ వశము చేసికొనుఁడు'' ఇట్టి పరమాదర్శశిక్షణమున శిష్యులు సర్వవిధములను శ్రేయోభివృద్ధి నందసాగిరి.

శిష్యభక్తకోటిలో ప్రశంసనీయ లగు మహిళామతల్లు లెందఱో గలరు. తా మాయన నొక పురుషుఁడుగాఁ గాక, తమలో నొకరుగనే భావించుచుంటి మనియు, ఆయనతోఁ దెలుపని రహస్యమే లేదనియు నించుమించుగా భక్తురాండ్రు అందఱును దెలుపువారు. రుచ్యమగు నేభక్ష్యము చేసినను, ముందుఁగా అందుఁ గొంత శ్రీరామకృష్ణునికై దాఁచి యుంతురు. అంతఃపురనివాసమునకు అలవడినవారు సైతము ఆచారదాస్యమును అభిమానమును వీడి యాతనికై బజారునకుఁ బోయి వస్తువులను గొనితెత్తురు. సందర్శనార్థము ఎంత దూరమునుండియైనను నడచి వత్తురు. క్రమముగా శరీరాభిమానమును, మితిమీఱిన లజ్జను అతిక్రమింపఁ జేయుటకై శ్రీరామకృష్ణుఁడే వారల కిట్టిశిక్షణ గఱపువాఁడు. పాతివ్రత్యము నాతఁడు గొనియాడును.

మహాపతివ్రతయు, తన యల్లుఁడగు రాఖాల్ (బ్రహ్మానందస్వామి) వైరాగి యైపోవునని యిరుగుపొరుగమ్మ లక్కలు గుసగుసలాడుచుండ, "ఈశ్వరాన్వేషణకై నా యల్లుఁడు సంసారము త్యజించి, సాధుసేవలో, మహాపురుష సేవలో, నిమగ్నుఁడైనయెడల, నిజముగా అది నా జీవితమున పరమశుభముహూర్త మనుకొందును" అని పలుకఁగల్గిన శ్యామసుందరీదేవి శ్రీరామకృష్ణుని విశేషాదరాభిమానములను బడసిన మహనీయురాలు. జోగీన్‌మా (యోగీంద్ర మోహినీదేవి) యనునామె శ్రీరామకృష్ణునివలన మంత్రోపదేశమునొంది, "యీమె అసాధారణమైన ఆధ్యాత్మిక శక్తి కలది. క్రమముగా ఈమె పొందు నానాసిద్ధులనుజూచి జనులు అబ్బురపడుదురు" అని స్వయముగా నాతనిచేతనే ప్రశంసింపఁబడిన యొక ముఖ్య శిష్యురాలు. శ్రీ శారదాదేవికి ఈమె సహచరురాలై యుపచరింపసాగెను. శ్రీ రామకృష్ణునిచే స్వజనమున నొకతెగా భావింపఁబడి, ఆత్మవికాసము నొంది, శ్రీ శారదాదేవికి తోడునీడయై మెలఁగసాగిన గోలాప్‌మా (గోలాం సుందరీదేవి) స్త్రీ భక్తకోటిలో ప్రధానగణ్యురాలు. అసమాన త్యాగ వైరాగ్యములతో యౌవనారంభముననే సన్న్యసించి, యెన్నియో సాధనలనొనర్చి, పిమ్మట శ్రీ రామకృష్ణుని సాన్నిధ్యమునొంది ధన్యతగాంచి తఱచు శ్రీ శారదాదేవితో నివసించుచుండెడి గౌరీమా (మృడానీ చట్టోపాధ్యాయ) మఱియొక మహాభక్తురాలు. కాలక్రమమున శ్రీ శారదాదేవి పేర 'శ్రీ శారదేశ్వరీ ఆశ్రమము' అను నొక

ప్రసిద్ధమైన జాతీయాదర్శవిద్యాసంస్థను కలకత్తాలో బాలి కలకై నెలకొల్పిన విదుషీమణి యీమె.

బ్రాహ్మసామాజికభక్తుఁడగు మణిలాల్ మల్లిక్ అను నాతని కుమార్తె ధ్యానమునఁ దనకు మనసు నిలువకున్నదని శ్రీరామకృష్ణునితో మొఱపెట్టుకొనఁగా, "నీవు ఎవరిని ఎక్కువగా ప్రేమింతువు?" అని యాతఁ డడిగెను. ఆమె తన సోదరుని బిడ్డను జేర్కొనెను. "సరి, ఆబాలునే బాల కృష్ణుఁ డని భావింపుము. నీవు వానిని సంరక్షించుచుండు నపుడు గోపాలునకే యీ యుపచారము లన్నియుఁ జేయు చున్నానని తలపోయుచుండుము. నీ మనోభావమునుబట్టియే సిద్ధి కలుగును" అని యాతఁడు ఉపదేశించెను. ఈ యుప దేశము ననుసరించి యామె అచిరకాలముననే అనేకదివ్యాను భూతుల నందఁగలెను.

"శ్రీరామకృష్ణ హృదయోద్యాన మందలి యీ మృదులతాకుసుమము నా కెంతటి మనోహరము! ఇదెంతటి గంభీరార్థబంధురము! మనలో ప్రతివ్యక్తియు—వాని హృద యము రాత్రియంతటి అంధకారమయమై యున్నను— యథార్థప్రేమ మనెడి దివ్యతేజఃకణము అందు ఏమూలనో మినుకమినుకుమనుచు నుండకపోదు. తన మార్గమును ప్రకా శిత మొనర్పఁజాలునంతటి దీపిక లేనివాఁ డెవ్వఁడును లేఁడు. ...కావున మానవుఁడా! ఆత్మవిశ్వాసము కలిగి నీ మార్గ మునఁ బురోగమింపుము!" అని రోమే రోలా (Romain Rolland) తన శ్రీరామకృష్ణచరిత్రలో ఈ సందర్భమున వ్రాసిన వాక్కు లెంతయు హృదయోత్తేజకమై యున్నవి.

నిజముగాఁ బరితపించినచో, ఎంతటి పాపులైనను ఆత్మోద్ధారణనొందితీరుదు రని తెలుపుచు శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించును: "ఒకానొక మల్లికునితల్లి—చాల గొప్ప కుటుంబమునకుఁ జెందిన యామె—'వేశ్య లెన్నఁటికైనను ఉద్ధారణ నొందుదురా?' యని న న్నడిగెను. ఇదివఱలోఁ దా నట్టి జీవితము గడపియుండెనుగదా!—అందుచేత నే అట్లు అడిగినది. అందుకు నే నిట్లంటిని : 'ఔను, ఆంతరంగిక వ్యాకులముతో విలపించి, 'ప్రభూ! ఇఁక నట్లు చేయను'అని భగవంతునకు వాగ్దానము చేసినయెడల, అట్టివారును తప్పక ఉద్ధారణనొందుదురు.'వట్టి హరినామోచ్చారణచే నేమగును? —హృదయపూర్వకమైన ఆర్తితో విలపింపవలయును."[1]

అఘోరమణీదేవి యనునామె స్త్రీభక్తకోటిలో అగ్రగణ్యురాలు. ఈమె కడు పేదరాలు. ఱుువదేండ్ల బ్రాహ్మణ వితంతువు. దక్షిణేశ్వరమునకు అనతిదూరమున, ఒకానొక రాధాకృష్ణాలయమునకుఁ జెందిన యొకగదిలో నివసించుచు, బాలకృష్ణునిఁ దన యిష్టదైవముగా నుపాసించుచు, ముప్పదేండ్లుగా జపతపము లొనర్చుచుండిన యీమె 1884-వ సంవత్సరమున నొకనాఁడు శ్రీరామకృష్ణుని సందర్శించి, నాఁటినుండియు నాతనియెడ గాఢాసక్తచిత్తురా లయ్యెను.

---

[1] శ్రీరామకృష్ణుఁ డొకప్పు డిట్లు పలికెను : "జనులకు భోజన మిడుట ఒకవిధమైన ఈశ్వరసేవకాదా? కాని యట్లని దుర్మార్గులకు—వ్యభిచారాది మహాపాతకములు చేసియున్న ఘోరవిషయాసక్తులకు—అన్నదానము చేయరాదు. వా రెచటఁ గూర్చుండియుందురో, అచట ఏడుమూరలలోఁతువఱకును మట్టి అపవిత్ర మైపోవును." (Refer 'The Gospel of Sri Ramakrishna,' p. 376.)

ఈమె వండి తెచ్చు కూరలను శ్రీరామకృష్ణుఁడు అపరిమిత ప్రీతితో ఆరగించును. మఱిమఱి తెమ్మనును. తన యశక్తత నెంచి, "ఇదేమిరా, గోపాలా! తుదకు నన్నిట్టి సాధువు కడకుఁ దెచ్చినావు! 'పాటిమీఁది దేవతకు కూటిమీఁదనే ధ్యానము' అన్నట్లున్నది ఈతని కథ!" అని యామె యొక్కొక్కప్పుడు విసుగుకొనును! కాని మఱుక్షణముననే అనిర్వచనీయాకర్షణ! పిమ్మట నొకనాఁటి వేగుజామునఁ దన వాడుకచొప్పున జపమొనర్చి, తత్ఫలమును ఇష్టదైవమునకు అర్పింపఁబోవుచుండ, అకస్మాత్తుగాఁ దన యెడమ ప్రక్కను శ్రీరామకృష్ణుఁడు కూర్చుండియున్నట్లు ఆమె కాంచెను. ఆమె యద్భుతదివ్యానుభూతిని ఆమె వాక్కుల లోనే తెలిపెదము : "ఈయన ఇపుడిచటి కెట్లు వచ్చెనా యని యబ్బురపడుచు, ఆయనవైపు చూచుచుండ, ఆయన చిఱునవ్వు నవ్వుచుండెను. ధైర్యము పూని యాయన యెడమ చేతిని బట్టుకొంటిని. హఠాత్తుగా ఆమూర్తి మాయమై, ఆ తావున, (చేతితోఁ జూపుచు) ఇంత పరిమాణముగల నిజమైన గోపాలుఁడు ప్రత్యక్షమయ్యెను. అతఁడు నావైపు ప్రాఁకి వచ్చి, నాపై దృష్టి నిగిడ్చి, ఒక చేయిచాఁపి, (ఆహా! ఆదివ్య రూపసౌందర్యము నే నేమని చెప్పుదును!) 'అమ్మా! నాకు వెన్న పెట్టు'మని వచ్చీరాని మాటలతో నన్ను అడిగెను...." ఇఁక నామెతో బాలగోపాలుని క్రీడావినోదములు వర్ణనాతీతములు. అయ్యవి శ్రీరామకృష్ణుని వాత్సల్య భావదివ్యానుభవములలో రామలాలావృత్తాంతముతోఁ దులఁదూఁగు నని చెప్పినఁ జాలును.

శ్రీరామకృష్ణుఁడు ఆమెను జూచినంతనే తఱచు దివ్యభావపరవశుఁ డగును. ఒకనాఁ డామెను గని యాతఁడు స్వయముగా గోపాలహావభావముల నొందెను. గోపాలుని యీ అవిచ్ఛిన్న సాక్షాత్కారమును అఘోరమణీదేవి రెండు నెలలపర్యంతము పడసెను. "ఇంతటి మహోత్తమానుభూతి యింతకంటె విశేషకాలము ఉన్నచో, ఈ కలియుగమున శరీరము ఆ ధాటికి ఆఁగలేక పతన మొందును" అని శ్రీరామకృష్ణుఁ డామె నూఱడించి "అసాధ్యమును సాధించితివి" అని యభినందించెను. ఇంతటినుండి ధ్యానసమయముననే యీ మెకు సాక్షాత్కారము, తనకుఁ గలుగసాగిన దివ్యానుభూతివలన నామె శ్రీరామకృష్ణుఁడును గోపాలుఁడును అభిన్ను లని దృఢవిశ్వాసము నందెను. కొందఱిచే స్వార్థ కాంక్షలతోఁ దనకు అర్పింపఁబడు ఫలాహారాదులను—స్వయముగాఁ దాను గ్రహింపనట్టివానిని సైతము—శ్రీరామకృష్ణుఁడు నరేంద్రుని, అఘోరమణిని మాత్రము నిరభ్యంతరముగాఁ దిననిచ్చువాఁ డన్నచో, శిష్యభక్తకోటిలో ఈయిరువురియెడలను నాతని కమరియున్న ప్రేమతాత్పర్యము లెట్టివో యూహింపనగును. శ్రీరామకృష్ణుఁడు ఈమెచే నామె గోపాలదివ్యానుభూతులను నరేంద్రునకుఁ జెప్పింప, నాతఁడు ఆనందబాష్పములతో ఆలకించి, యందలి ప్రత్యక్షరము విశ్వసనీయ మనియు యథార్థ మనియు వక్కాణించెను. ఆమె పొందిన యద్భుతానుభూతిని బట్టి యీమెకు 'గోపాలుని తల్లి' (గోపాలేర్ మా) యను పేరు వచ్చెను.

శిష్యులును భక్తులును దక్షిణేశ్వరమున గురుదేవ జన్మ

దినోత్సవము జరుపువారు. అందనేకులు—కలకత్తానివాసులు —(ఇతరసముయములలో) శ్రీరామకృష్ణుని దమ యిండ్లకు ఆహ్వానించి, సంకీర్తనాదుల నేర్పఱిచి యుత్సవములు జరుపువారు. స్వాయముగా శిష్టాచారపరుఁడయ్యు, నాతఁడు బలరాముని వంటి కొలఁదిమంది బ్రాహ్మణేతరులగు భక్తులయిండ్లలో ప్రీతితో భుజించును. కలకత్తాలోని భక్తుల యిండ్లకాతఁడు విచ్చేయునపుడు పలువు రచట గురుదేవుని సందర్శించి దివ్యప్రసంగములను వినుటకే కాక, దక్షిణేశ్వరమున గురుదేవసన్నిధి నేర్పడిన ఆధ్యాత్మికసోదర బృందము పెంపొందుటకును ఈయుత్సవములు సాధనభూతములు కాఁజొచ్చెను.

> "ఇను మయస్కాంతసన్నిధి నెట్లు భ్రాంత
> మగు హృషీకేశు సన్నిధి నావిధమునఁ
> గరఁగుచున్నది దైవయోగమునఁ జేసి
> బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంత మగుచు"

అని భక్తావతంసమగు ప్రహ్లాదుఁడు వచించిన చందమున జిజ్ఞాసువులు, ముముక్షువులును అగువారెల్లరును శ్రీరామకృష్ణుని దెసకు ఆకర్షింపఁబడసాగిరి.

నిరంతర భగవచ్చింతామృతపాన పరితృప్తి, సత్యధర్మపరాయణత్వము. లోకకల్యాణకాంక్ష—ఇవియే శ్రీరామకృష్ణ జీవితోపదేశ సౌరభ సౌందర్య మాధుర్యములు. శిష్యశిక్షణమునను ఆతఁడు లక్షించిన మూలసూత్రము లివియే.

ఈ మహనీయజీవితమునకు ముగ్ధుఁడై కాలక్రమమున గాంధిమహాత్ముఁడు సమర్పించిన యీ క్రింది ప్రశంసానుస

ఘూంజలిని పాఠకులు పరికింతురుగాక.—"ఆచరణరూపక ధర్మకథయే రామకృష్ణపరమహంస జీవితకథ. భగవత్సా క్షాత్కారభాగ్యము నొందుటకు ఈయన జీవితము మనకుఁ దోడ్పడఁగలదు. రామకృష్ణుఁడు సజీవాకృతిని దాల్చిన దివ్యత్వము. ఈయన యుపదేశములు ఒక పండితమాత్రుని వాక్కులు కావు, అవి జీవిత మను గ్రంథములోని పుటలు, స్వానుభవప్రకాశకములు. కావుననే వానిని జదువునప్పుడు పాఠకునికి అనివార్యమైన చిత్తసంస్కారము గల్గుచుండును.[1]

1 "ఠాకుర్ (శ్రీరామకృష్ణుఁడు) వచించిన ప్రతివాక్యమును గూర్చియు పెట్టెలకొలఁది వేదాంతగ్రంథములను వ్రాయవచ్చును" అని శ్రీవివేకానందస్వామి వచించును. (Sri Ramakrishna The Great Master, p. 3$1.)

శ్రీరామకృష్ణ సుభాషితములనుగూర్చి మాక్స్ మ్యులర్ (F. Max Muller) పండితుఁ డిట్లు వ్రాసెను: "ప్రకృతియందును మానవాత్మయందును నిక్కముగా భాసించు దివ్యత్వము భారతదేశము నందు అనుభూతమైనంతటి గాఢముగను సార్వజనీనముగను ప్రపంచ మున మఱెచ్చటను అనుభూతమై యుండలేదనియు, ఉజ్జ్వలమైన భగవద్భావము—భగవత్తత్త్వమున పరిపూర్ణైకానుభూతి—రామకృష్ణుని ప్రవచనములందు వ్యక్తమైనంతటి పాటవముతో మఱెచ్చటను వ్యక్తము కాలేదనియు అతని (యీ) యుపదేశములను గమనించుచో మనకుఁ దెలియఁగలదు: ఐనను దైవత్వమునకును మానవత్వమునకును గల విభేద మాతనికి పూర్తిగాఁ దెలియుననియు గ్రహింపనగును....దైవత్వమాన వత్వములు రామకృష్ణునియందు అద్భుతరీతిని సమ్మేళన మొంది యున్నవి" (See 'Ramakrishna—His Life And Sayings' by Prof. F. Max Muller, pp. ix & 58.)

పారమార్థికవిషయములయెడ విశ్వాసహీనమైన యీయుగ మున సజీవమై, ఉజ్జ్వలమై దీపించు విశ్వాసమునకు రామ కృష్ణుని జీవితము ఉత్కృష్టనిదర్శనము. ఇదే కనుక లభించి యుండనిచో, వేలకొలఁది స్త్రీపురుషులు మనశ్శాంతి రహితులై, ఆధ్యాత్మికవికాసవిరహితులై యుండెడివారు. అహింసావిషయమున రామకృష్ణుని జీవితము లోకమునకు గుణపాఠము. దేశకాలవర్ణాదులచేఁ గట్టువడక అపారమై ప్రవహించినది ఈమహనీయుని ప్రేమప్రవాహము. . .''[1]

అగుచో, శ్రీరామకృష్ణుని ముఖ్యోపదేశము లెవ్వి? ఆతఁడే (శ్రీరామకృష్ణుఁడే) పదేపదే యిట్లు వక్కాణించి యున్నాఁడు :

"మొదట నీహృదయదేవాలయమున భగవంతునిఁ బ్రతిష్ఠించుకొనుము; మొదట వాని సాక్షాత్కారము నొందుము. ప్రసంగములు, ఉపన్యాసములు—ఇవన్నియు దాని తరువాతిమాట—అంతకుముందు మాత్రము కాదు.''

---

1 జగత్ప్రసిద్ధ రచయితయైన రోమే రోలా (Romain Rolland) మహాశయుఁడు కాలక్రమమున శ్రీ రామకృష్ణునిగూర్చి యొనరించిన యీ క్రింది దివ్యాభినుతి యీ సందర్భమున పఠనీయము :

"...నవ్యశరత్ఫలరాజము, పరమాత్మ నవీనసందేశము, భారత వర్షీయ నానామత మహాస్వర సమ్మేళనము, సుశ్రావ్యరాగమాలిక శ్రీ రామకృష్ణుఁడు. తన విజయపతాకతో నాతఁడు నవయుగ ప్రవర్తకుఁడై వెల్గొందుచున్నాఁడు. రెండువేల యేండ్లలో ముప్పదికోట్ల జనుల ఆధ్యాత్మిక జీవనపర్యవసానమే......యీ మహనీయమూర్తి. ఈతఁడు గతించి అరశతాబ్దము పైఁగాఁ గడచినను, ఈతని యాత్మ నవీనభారత దేశమును పునరుజ్జీవింపఁ జేయుచున్నది.'' (See 'The Life of Ramakrishna' by Romain Rolland pp. 13, 14.)

"ఇతరులకు బోధించుటకు బదులు ఎవరైనను సదా భగవంతుని ఉపాసించుచున్నచో, అదియే కావలసినంత బోధ—ప్రచారము. స్వయముగాఁ దాను ముక్తుఁడు కాఁబూనువాఁడే నిజమైన ప్రచారకుఁడు. ముక్తుఁడైనవానికడకు వందలకొలఁది—వేలకొలఁది—జనులు నానాదిక్కుల నుండియు వత్తురు, వచ్చి వానిబోధల నొందుదురు. పువ్వు వికసించినంతనే తేనెటీఁగలు తమంతఁ దామే దానికడకు వచ్చును."

"సంఘసంస్కారణమునుగూర్చియా మాటలాడుచున్నారు? మంచిది, భగవత్సాక్షాత్కారము నొందినపిమ్మట మీ రది చేయవచ్చును. భగవత్ప్రాప్తికై ప్రాచీనఋషులు సంసారము పరిత్యజించిరని జ్ఞప్తి నుంచుకొనుఁడు. కావలసినది అది ఒక్కటే. మిగిలినవన్నియు, నిజముగా మీకుఁ గావలసినచో, లబ్ధమగును. మొదట భగవద్దర్శనము నొంది యటుపిమ్మట ఉపన్యాసములనుగూర్చియు సంఘసంస్కారణములను గూర్చియు మాటాడుఁడు."

"విద్యాధిదైవతమగు నా జగన్మాతయొక్క కటాక్షవీక్షణ మొక్కటి ప్రసరించినఁ జాలును—ఉద్దండపండితుని సైతము నేలపైఁ బ్రాఁకు కీటకమువలెఁ గాన్పింపఁజేయుటకు."

అట్టిజగన్మాతృకటాక్షవీక్షణ మొక్కటియైనను ప్రాప్తింపఁజేసికొనుటకు శ్రీరామకృష్ణుఁ డేమని యుపదేశించును? ముఖ్యముగా ఆత్మసమర్పణము, ఏకాంతమైన ధ్యానప్రార్థనలు అవలంబింపుమనియే.

సాధనానుష్ఠానములనుగూర్చి శిష్యులతో శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించువాఁడు: "నేను విధించు నియమములను పరిపూర్ణముగా మీరు పరిపాలింపఁగల్గుదురా? అందు పదునాఱవవంతు మీరు అనుష్ఠించినయెడల మోక్షప్రాప్తి—భగవత్ప్రాప్తి—మీకు నిశ్చయ మని నమ్ముఁడు. సాక్షాత్కారము కావలయునన్నచో, సాధనలను ఆచరించితీరవలయును.

కాని పరిపూర్ణశ్రద్ధ యున్నచో, స్వల్ప సాధనయైనను జాలును.'' పట్టుదలలేని సాధకులనుగూర్చి యాతఁడు, ''వారి విషయమున సంవత్సరమునకు పదునెనిమిది మాసములున్నవా యనిపించును!'' అనును.[1] పురుషప్రయత్నమును దైవానుగ్రహముతో సమన్వయించుచు నాతఁ డిట్లు వచించును: ''ఈశ్వరానుగ్రహ మను గాలి సర్వదా వీచుచునేయున్నది. సోమరులై సంసారసాగరమునఁ బడి యుండువారు దానిలాభమును బొందరు. కాని కార్యదక్షులు, బలాఢ్యులు నగువారు తమ మనస్సను తెరచాఁపను నిండార విప్పుకొని, ఆ యనుకూలవాయువును గ్రహించి శీఘ్రముగా పరమావధిని బొందుదురు.''

[1] సాధనదీక్షనుగూర్చి యాతఁ డిట్లు బోధించును: '' 'భగవత్సాక్షాత్కారము ఈ జన్మమున సాధ్యము కానిచో మఱుజన్మమునఁ గలును' అను నిట్టి మందబుద్ధి యేల? శ్రద్ధాభక్తులవిషయమున నిట్టి మాంద్యము కూడదు. ఈజన్మముననే—ఏల?—ఈక్షణముననే వాని సాక్షాత్కారము నొందవలయునను దృఢనిశ్చయముతో భల్లూకపుఁబట్టు పట్టిననేకాని పరమపురుషార్థమగు మోక్షము సిద్ధింపఁజాలదు. పల్లెటూళ్లలో వ్యవసాయులు గిత్తలను గొనఁబోవునపుడు వానితోఁక నట్టె తాఁకుదురు. అందులకుఁ గొన్ని యేమియుఁ గదలవు, మెదలవు, సరికదా, అవయవముల నన్నిఁటిని చాచుకొని నేలపైఁ బరుండియుండును. వ్యవసాయులు అవి యెందుకును బనికిరావని వెంటనే తెలిసికొందురు. కాని మఱికొన్ని వాని తోఁకను దాఁకినంతనే రొంగిరి గంతులువేయును. రైతులు అవి చాల ఉపయోగకరమైనవని వెంటనే గ్రహింతురు. 'ఈ విధమైన చుఱుకుగల గిత్తలనే వారెన్నుకొందురు. మాంద్యమెన్నఁటికిని తగదు. బలాఢ్యుఁడవు కమ్ము, దృఢవిశ్వాసముఁ బూనుము. 'ఈ క్షణముననే నేను వాని సాక్షాత్కారము నొందవలయు'నని పలుకుము. అపుడు నీకు తప్పక విజయము సిద్ధించును.''(చూ. 'శ్రీరామకృష్ణబోధామృతము,' సాధనయందు దీక్ష.)

"కామక్రోధాదులను వశపఱుచుకొను టెట్లు? వానిని భగవంతుని వైపు మఱల్పుము.[1] ఆత్మసంయోగము నందఁ గోరుటలో కామము కలిగియుండుము. భగవత్ప్రాప్తి మార్గమున నీకు అడ్డువచ్చు వారిపై కోపింపుము. భగవంతుని బొందవలయునను కాంక్షయందు నీ లోభము చూపుము. 'నేను, నాది' యని చెప్పవలసివచ్చుచో, 'నా రాముఁడు, నా కృష్ణుఁడు' అని యిట్లు అభిమానింపుము. గర్వముండెనా, 'ప్రణామమున రాము నెదుట వంచిన యీ శిరస్సు మఱియొకరియెదుట వంచను!' అనిన విభీషణునివలె గర్వింపుము."

'నేను పాపిని, బద్ధుఁడను' అని సదా తలపోయుచుండు నట్టి నిర్భాగ్యుఁడు తుదకు పాపియు, బద్ధుఁడునే యైపోవు ననియు, సుస్థిరవిశ్వాసముతో నొనర్పఁబడిన భగవన్నామ స్మరణముననే సమస్తపాపరాసులును భస్మపటల మైపోవు ననియు శ్రీరామకృష్ణుఁడు బోధించును. సంధ్యాకాలము ధ్యానమునకు అత్యంతానుకూలమని వచించును.[2] ఆహారము

[1] ఇదే భావము "తదర్పితాఖిలాచారస్సన్ కామక్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్" అను సూత్రమున 'నారదభక్తి సూత్రములు' తెల్పును.

[2] తన ధ్యానసాధనలనుగూర్చి తెలుపుచు శ్రీరామకృష్ణుఁడు శిష్యుల కిట్లుబోధించును: "ఇష్టదేవతాధ్యానము చేయుటకుముందు ఆదినములలో అంతరంగమును ప్రక్షాళనచేయుచున్నటు భావించువాఁడను. మనస్సున బహురీతులమాలిన్యము (దుశ్చింతాదులు) ఉండునుగదా! వానినికడిగివేసి, ఇష్టదేవతను మనస్సున ప్రతిష్ఠించుకొనునట్లు భావించువాఁడను. మీరును

భగవంతునకు—ఇష్టదైవమునకు—నివేదన మొనర్చి భుజింపు మనును. ఉపవాసము, ఏకాంతవాసము, సాధుసేవ మున్నగు నవి ఆత్మవికాసమునకుఁ దోడ్పడు నని తెల్పును. మన ధర్మ శాస్త్రములందలి విధులలో, ఆచారములలో, కాలక్రమమున వచ్చిపడినవానికి స్వస్తి చెప్పి, ధర్మశాస్త్రములను ప్రస్తుత కాలమునకు అక్కఱకు వచ్చునట్లు ఒనరింపవలయుననును. 'సనాతనధర్మము' శాశ్వతముగా నిలిచియుండుననివచించును.

ధర్మసమన్వయాత్మకమైన తన దృష్టితో, అలౌకిక ప్రేమపూరితమైన తన హృదయముతో, యోగశక్తిసంభరితమైన తన హస్తములతో శ్రీరామకృష్ణుఁ డీవిధముగా వివిధ మనస్తత్త్వములు గల వ్యక్తులను అవలీలగా వశ మొనర్చుకొని పరమార్థప్రాప్తిమార్గమునఁ బురోగమింపఁ జేయసాగెను.

---

అట్లే చేయుఁడు." "నా సాధనకాలమున ధ్యానించునపుడు గాలి లేని తావున నిశ్చలముగా నుండు దీపశిఖనుగూర్చి చింతించువాఁడను." (భగవద్గీత, 6-19 చూడుఁడు.)

# అంత్యదశ: నిర్యాణము

మహోదారచరిత్రు లగువారికి ప్రపంచమే తమ కుటుంబము. లోకకల్యాణమే వారల జీవిత లక్ష్యము. జ్ఞాని మౌనియై నిరంతరసమాధినిమగ్నుఁడై యున్నచో, లోకులకు పరమార్థము నుపదేశించువా రెవ్వరని శ్రీరామకృష్ణుఁడు ప్రశ్నించును. లోకకల్యాణసాధనార్థము లక్షలకొలఁది పర్యాయములైనను తాను జన్మించి శరీరయాతనల ననుభవింప వెనుదీయనని యాతఁడు అనేక పర్యాయములు శిష్యులకుఁ జెప్పెనన్నచో, శ్రీరామకృష్ణుని విశ్వమానవప్రేమ సానుభూతు లెట్టివో యూహింపనగును.

శిష్యవర్గమునకుఁ జాలకాలము ముందే శ్రీరామకృష్ణుని సందర్శింపసాగినవారిలో మహిమాచరణచక్రవర్తి యనునాతఁ డొకవిచిత్రవ్యక్తి. సంసారము నెడ 'పురాణవైరాగ్యము' నొందినయీతనికి పేరుప్రతిష్ఠలయందు విపరీతమైనఆశ. అందునకై లేనిపోని ఆడంబరము. ఒక పాఠశాలను స్థాపించి దాని కీతఁడు 'ప్రాచ్య-ఆర్య-శిక్షా కాండ-పరిషత్' అని పేరు పెట్టెను. తన గురువు 'ఆగమాచార్యడమరువల్లభుఁ' డనును. తోతాపురి తన్ను జ్ఞానమార్గమును, శ్రీరామకృష్ణుని భక్తిమార్గమును అవలంబింపుమని చెప్పెననును! ఎన్ని లోపము లున్నను, పాటింపక, ఆధ్యాత్మికచింత లవలేశ మున్నను మెచ్చుకొను శ్రీరామకృష్ణుఁ డీతనికి ఆదరపూర్వకముగా అనేకసదుపదేశము లొనర్చువాఁడు.

ఇదివఱకే పేర్కొనఁబడిన ప్రతాపచంద్ర హాజ్రా యను మఱియొక ఆడంబరస్వభావుఁడు తాత్కాలిక వైరాగ్యముతో వచ్చి, కొన్ని సంవత్సరములుగా కాళి కాలయావరణమున నివసించుచుండెను. తనకుఁ దెలిసియుఁ దెలియనివేదాంతతత్త్వములనుగూర్చి సదా సిద్ధాంతరాద్ధాంత ములను జేయుచు, వేదాంతి నని లోకులను భ్రమపెట్టుచు, సాధకుల నీతఁడు కలవరపఱుచుచుండువాఁడు. నరేంద్రుఁ డెట్లో యీతనియెడల సౌహార్దము నొంది, యతనికి మరణ కాలమున మోక్షము నొసగూర్పుఁ డని శ్రీరామకృష్ణుని వేఁడుకొని వాగ్దానము నొందెను. ఏమైనను, "హాజ్రా బూటకుఁ డైనచో, అతని నిచటినుండి తొలఁగింపు" మని శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు దేవిని ప్రార్థించెను. కొలఁది దినములలోనే హాజ్రా దక్షిణేశ్వరము విడిచి వెళ్లెను.

శ్రీరామకృష్ణునకు ఉపచరించుచుండిన హృదయుఁడు క్రమముగా దురాశాపరుఁడై, సందర్శనార్థులకు శ్రీరామ కృష్ణునితో సమావేశముల నేర్పఱుచుపట్ల వారియొద్దనుండి వీలైనంతవఱకు కానుకలను గుంజుకొనసాగెను. లక్ష్మీ నారాయణుని పదివేలరూపాయల విరాళమును శ్రీరామ కృష్ణుఁడు నిరాకరించె నని హృదయుఁ డాతనిపై కారాలు, మిరియాలును నూఱిపోయుచుండెను. అసహ్యమగు మాట లతో నాతనిని ఎత్తిపొడుచును. ఆతని కీర్తనలను, తన్మయ నృత్యమును అనుకరించుచుఁ దాను నొక పరమహంస వలె నటించును! దురాశాహంకారపిశాచగ్రస్తుఁ డైన నరుఁడు ఏ వెంగలిపనులు చేయఁడు! హృదయుఁ డొకనాఁడు తన్ను

ఎందులకో తీవ్రముగా గద్దిం శ్రీరామకృష్ణుఁడు విలపించుచు జగజ్జనని కిట్లు మొఱలిడెను: "అమ్మా! నా ఐహికబంధముల నన్నిఁటిని తొలఁగించితివి. నన్ను సమస్తబంధవిముక్తుని జేసితివి. కాని హృదయునివలన ఈయవమానమును నాకు మిగిల్చితివి!" అకస్మాత్తుగా నాతని విషాదభావము మాఱిపోవ, చిఱునవ్వుతో నాతఁ డిట్లు పలికెను: "నన్నాతఁ డెంతో ప్రేమించును, అందుచే మందలించును. కేవలము కఱ్ఱవాఁడతఁడు. తా నేమి చేయుచున్నాఁడో అతనికిఁ దెలియదు. అమ్మా! వానిపై నీవు కోపింపరాదు." ఇట్లని యాతఁడు సమాధిస్థితి నొందెను.

హృదయుఁడు త న్నొకప్పుడు పీడింపఁగా, తాను కాశి వెడలిపోఁదలఁచితి ననియు, కాని, ధనము తీసికొనిపోఁ జాలకుండుటచే మానుకొంటి ననియు శ్రీ రామకృష్ణుఁ డొకప్పుడు తెలిపెను. మఱియొకప్పు డాతఁ డిట్లు పలికెను: "హృదయుఁడు నా కెంతో చేసెను—అనేక సేవలు చేసెను—జబ్బుపడినప్పుడు చేతితో మలమూత్రములు తీయువాఁడు. కాని చివరకు న న్నట్లే పీడించెను. ఒకప్పుడు గంగానదిగట్టు మీఁదినుండి నదిలోనికి దుమికి దేహత్యాగము చేసికొనుటకై వెళ్లినాను—అంతటి దుర్భర బాధ పెట్టెను."

సహృదయత కోల్పోయిన హృదయునకు—శ్రీరామకృష్ణుని సదుపదేశములను పాటింపకుండిన యాతనికి—తుదకు ప్రాయశ్చిత్తసమయము వచ్చెను. ఆతఁ డొకనాఁడు మథురుని కుమారుఁ డగు త్రైలోక్యనాథుని బాలకుమార్తెను తాంత్రికపద్ధతిని పూజింపఁగా, బ్రాహ్మణుఁడు శూద్రబాలిక

నట్లు పూజించుట ఆచారవ్యతిరిక్త మనియు బాలికకు అమంగళకర మనియు భావింపఁబడుటచే, త్రైలోక్యనాథునిచే వెంటనే దేవాలయావరణము వీడిపోవ నాజ్ఞాపితుఁ డయ్యెను. హృదయుఁడు వెళ్లినపిమ్మటఁ గొంచెముసేపటిలోనే యెవ్వరో వచ్చి, "మీరును ఆలయవనమును వీడిపోవలయును" అని శ్రీరామకృష్ణునకుఁ జెప్పఁగా, నాతఁడు పల్లెత్తుమాట యైనను అనక, లేచి, ద్వారమువైపునకు నడువసాగెను. త్రైలోక్య నాథుఁ డది గని పరుగున వచ్చి, "దయతో మీ రిచటనే యుండుఁ"డని ప్రార్థింప, శ్రీరామకృష్ణుఁడు శాంతముగాఁ దనగదికి మఱలెను. ఆతని దంతటి నిర్లిప్తత. హృదయునకుఁ బిమ్మట శ్రీరామకృష్ణుని సన్నిధి నుండి సేవించినవారిలో హారీశ్ అను సంసారత్యాగి యగు భక్తుఁడు గణనీయుఁడు.

తనకు అత్యంతప్రేమపాత్రులైన ధన్యజీవులలో నొకఁ డగు కేశవచంద్రసేను తీవ్రవ్యాధిగ్రస్తుఁడై యుండ, (1883-వ సం॥ నవంబరు నెలలో) శ్రీరామకృష్ణుఁడు వెడలి యాతనిఁ గలసికొనెను. ఆసమయమున అనేకదివ్యబోధ లొనర్చి, కేశవునెడఁ దన యపారప్రేమను దెలుపుచు నిట్లు పలికెను: "నీ వెప్పుడు జబ్బుపడినను నా కెంతో వ్యాకులముగా నుండును. ఇటీవల నీవు జబ్బుపడ్డప్పుడు నేను వేకువ జామున విలపించుచు, 'కేశవున కేమైనను సంభవించెనా, నే నిం కెవరితో మాటలాడుదును!' అని అమ్మతో మొఱపెట్టుకొనువాఁడను. కలకత్తా వచ్చినప్పుడు అమ్మను అర్చించి నీ క్షేమమునకై ప్రార్థించినాను."

పిమ్మట అచిరకాలముననే కేశవచంద్రుఁడు గతించెను.

అది విని శ్రీరామకృష్ణుఁ డెంతయో విలపించి యా దుఃఖముతో మూఁడునాళ్లు మంచముపట్టెను. అనంతర మాతఁడు, "నా అవయవములలో నొకటి పడిపోయినట్లు అనిపించినది" అని తెలిపెను.

1884-వ సంవత్సరమున జనవరి నెలలో శ్రీరామకృష్ణుఁడు దేవాలయవనమున నొంటరిగా నడచుచు, సమాధిస్థితుఁడై క్రిందఁబడుట తటస్థింప, ప్రబలఘాతమున నెడమముంజేయి బెణఁకెను, అందలి యెముకలు కీలు తప్పెను. వైద్యుఁడు చికిత్స చేయసాగెను. శ్రీరామకృష్ణుఁడు తన్మాలమున నొక్కొక్కప్పుడు దుర్భర బాధపడుచుండినను, మఱుక్షణమున నే నవ్వుచు, భక్తులతో దివ్యప్రసంగముల నొనర్చును. మఱియొకప్పుడు దేవితో సంభాషించును. చేయి యథాస్థితి నొందుటకు నాలుగైదునెలలు పట్టెను.

సహజ సరళ సుందర రీతులలో దివ్యత్వస్థాయి నందుకొనిన మానవత్వమునకు శ్రీరామకృష్ణుని జీవితము అపూర్వనిదర్శనము. గిరీశచంద్రుని నాటకప్రదర్శనశాలకు వెడలి శ్రీచైతన్య ప్రహ్లాదనాటకములను గాంచి శ్రీరామకృష్ణుఁడు దివ్యానంద పరవశుఁ డయ్యెను. సాక్షాన్నారాయణుఁడే ఆయాపాత్రల రూపమున నటించినట్లు కనుఁగొంటినని యాతఁడు తెలిపెను. కొంతకాలమునకుముం దొకనాఁ డిట్లే 'సర్కస్' ప్రదర్శనమును బాలకోత్సాహముతోఁ జూచెను. ప్రకృతివైచిత్ర్యములను, సుందర ప్రకృతిదృశ్యములను ఆతఁ డెప్పుడును అత్యంత కుతూహలముతోఁ దిలకించువాఁడు. విశేషమైన పోటు వచ్చునపుడు గంగానదియందలి వెల్లువ నాతఁడు

బాలశిష్యులను బిలుచుచు, పరుగెత్తుకొనివెళ్లి తన్మయ నృత్యముచేయుచుండుట జూచిన సమయము లనేకములు కలవు. ఒకానొకప్పు డాతఁడు చిత్రవస్తుప్రదర్శనశాల (Museum) చూచి యనంతర మిట్లు పలికెను : "వారు నా కచట రాయి యైపోయిన అస్థిపంజరములను జూపిరి. ఒక జంతువు యావత్తు రాయి యైపోయినది! సంగ ప్రభావము ఎట్టిదో చూడుఁడు! అట్లే నిరంతరము సాధుసంగము చేయుచున్నచో మానవుఁడు నిశ్చయముగా సాధు వగును." ఒకప్పు డాతఁడు కలకత్తా లోని జంతుప్రదర్శనవనమునకు వెడలి, సింహమును గాంచి నంతనే సింహవాహినీదేవి—దుర్గాదేవి—స్ఫురింప సమాధి స్థితుఁ డయ్యెను. (1881-వ సంవత్సరాంతమున) శ్రీరామ కృష్ణుఁడు ఛాయాపటముల నెట్లు తీయుదురో (Photography) అవలోకించి యెంతయో ఆనందించితి నని తెల్పెను. రసా యనములు పూయఁబడిన అద్దముపై నెట్లు ఛాయాచిత్రము పడునో, అట్లే భగవద్భక్తి యను రసాయనము పూయఁ బడిన అంతరంగమున ఆధ్యాత్మికబోధలు హత్తుకొనునని యాతఁడు ఉపదేశించును. లోకులు గమనింపని చిన్నచిన్న సంఘటనలు శ్రీరామకృష్ణుని గంభీరార్థ బంధురమైన సుభాషి తములకును మనోహరమైన ఉపమానములకును ఈవిధముగా ఆలవాల మగుచుండెడివి.

శ్రీరామకృష్ణున కపుడపుడు విపరీతమైన ఆఁకలి కలుగుచుండినట్లు కనుఁగొంటిమి. ప్రస్తావనకాలమున నిట్టి యొకానొక సందర్భమున, దివ్యావస్థలో నాతఁడు అనేకులకుఁ జాలునట్టి హల్వా భుజించుచు, తదేకదృష్టితోఁ దన్ను అవలో

కింపసాగిన యొక భక్తురాలిని గని, "ఈ తినుచున్న దెవరను కొందువు? నేనా, మఱియొక రెవరైననా?" యని యడిగెను. "మీలో మఱెవరో ఉండి తినుచున్నట్లు అగపడుచున్నది" అని యామె సమాధానింప, నాతఁడు, "సరిగాఁ జెప్పితివి" అని చిఱునవ్వుతోఁ బలికెను.

దివ్యానందపారవశ్యస్థితులు అతివిచిత్రమైనవి. శ్రీ డొకనాఁడు కాళికాలయమునుండి దివ్యానంద పరవశుఁడై, యెఱ్ఱవాఱిన మోముతో, తడఁబడుచుండిన యడుగులతో, వెలువడుచు, శ్రీశారదాదేవిని గని, "నేను త్రాగియున్నానా?" అనెను. ఆమె, "లేదు! లేదు!" అన నాతఁడు, "ఐతే యిట్లేల ప్రవర్తించుచున్నాను?" అని యడిగెను. అందులకామె, "మీరు కేవలము శ్రీకాళి కానందామృతమును ఆస్వాదించియున్నారు!" అని సమాధానింప, నాతఁడు మిక్కిలిసంతసించి, "బాగుగాఁ జెప్పితివి" అనెను. ఆ పరమపావనదంపతుల సల్లాపము లిట్టివి.

తన భావపారవశ్యమునుగూర్చి శ్రీరామకృష్ణుఁడు ఈకాలమున నొకనాఁడు విజయకృష్ణాదిభక్తులతో ప్రసంగ వశమున నిట్లు తెలిపెను: "భగవద్భావమున సహజానంద మున నే (నాకు) మైకము కలుగును—మద్యము పుచ్చుకొన నక్కఱలేదు. చరణామృతము (దేవీపాదతీర్థము) చూచి నంతనే మత్తత—ఐదుబుడ్ల సారా త్రాగినంత మత్తత— కలుగును. ఈ యవస్థ నొందునపుడు మానవుఁడు ఆహార విషయమున విచక్షణచేయకుండ నుండఁజాలఁడు." తన నిరంతర భగవదాయత్తచిత్తమునుగూర్చి మఱియొకనాఁ డొక

భక్తున కిట్లు చెప్పెను: "జపతపములుకూడ నాకు రుచించుట లేదు. ఐనను సర్వదా స్మరణమననములు కలవు." తన మనస్సు సహజముగా నిర్వికల్పసమాధినిమగ్నమగుటకు ఉన్ముఖమై యుండుననియు, ఫలాని పదార్థము తిందుననియో, ఫలాని చోటకు వెళ్లుదు ననియో,—ఏవియో యిట్టి చిన్న చిన్న కోర్కెలు కల్పించుకొని శిష్యశిక్షణాదులకై ప్రబల ప్రయత్నపూర్వకముగా మనస్సును నిరోధించియుంతు ననియు మఱియొకప్పుడు శిష్యులకుఁ దెల్పెను. "ఎవ్వరైనను మనస్సు అంతయుఁ గూడగట్టుకొని నాపై నిల్పినచో, నిశ్చయముగా సర్వము సాధింతురు" అని యొకఁడు (ఒకప్పుడు) వచించెను. సమాధిస్థితిలో శరీరమును త్యజించుట తనకు సాధ్యమే యని యొకానొకప్పుడు వెల్లడించెను.

శ్రీరామకృష్ణుని వ్యక్తిత్వము అత్యంతము అసాధారణము. కఠోరనిష్ఠాపరుఁడగు జ్ఞానియు ప్రేమప్రపూర్ణుఁడగు భక్తుఁడును ఆతఁడే. శిష్యశిక్షణాదులలో చండశాసనుఁడయ్యు, తోడ్తోడనే వారల యోగక్షేమములనుగూర్చి పరితపించు దయానిధి, ప్రేమామృతమయమాతృహృదయుఁడు. స్త్రీపురుషస్వభావములును, స్త్రీపురుష మనోభావములును ఆతనియందు అత్యద్భుతరీతిని సమ్మేళన మొందినవి. ఈ వైచిత్ర్యమును గాంచి గిరీశచంద్రుఁ డొకనాఁడు చనవుతో, "మహాశయా! మీరు పురుషులా, స్త్రీలా?" యని ప్రశ్నింప శ్రీరామకృష్ణుఁడు చిఱునవ్వుతో, "అది నాకుఁ దెలియదోయి!" అని సమాధానించెను. నిజమే, స్వయముగా ఈశ్వరుఁడే అర్ధనారీశ్వరుఁడు గదా!

సామాన్యమానసికావస్థలో శ్రీరామకృష్ణుఁడు ప్రతి విషయమునుగూర్చియు అత్యంతజాగరూకుఁడై యుండును. ఆతని నిద్ర చాల తేలికగాను, అల్పముగాను ఉండెడిది.

లోకమునకు ఇహపర శ్రేయోమార్గప్రదీపక మైన శ్రీరామకృష్ణ జీవనజ్యోతి తిరోహిత మగు కాలము ఆసన్న మైనది.

1885–వ సంవత్సరమున వేసవి దుస్సహముకాఁగా నిత్యము భక్తులు అర్పించు పాలమంచుగడ్డ (Ice cream)ను, మంచుగడ్డతోఁ గూడిన పానీయములను గైకొని శ్రీరామకృష్ణుఁడు కొంత యుపశాంతి నందసాగెను. కాని తఱచు మంచుగడ్డ నుపయోగించుచుండుటచే గొంతులోఁ గొంచెము నొప్పి బయలుదేఱెను. అదియొక నెలలోనే యెక్కువై విశేషముగా మాటాడినపుడును, సమాధ్యనంతరమునను చాల బాధ కలిగించుచుండెను. భక్తురా లగు గోలాప్‌మా ప్రేరణపై శ్రీరామకృష్ణుఁ డొకనాఁ డామెతోడను, ఇరువురు బాలశిష్యులతోడను ఒక వైద్యునికడ కేఁగి, తిరిగి పడవపై వచ్చుచుండ, శ్రీరామకృష్ణుని అద్భుతయోగ శక్తిని ప్రకటించు నొక సంఘటనము జరిగెను. తామందఱును క్షుత్పీడితులై యుండ, గోలాప్‌మాయొద్ద నున్న ఒక అణా పెట్టి యొక శిష్యునిచే మిఠాయి కొని తెప్పించి శ్రీరామకృష్ణుఁడు భుజించి, గంగాజలము త్రాగి, "ఆహా! సంతృప్తుఁడ నైతిని" అని వచించెను. తోడనే, అత్యాశ్చర్యము, మిగిలిన ముప్పురి యాఁకలియుఁ దీఱిపోయెను!

ఇది యిట్లుండ, శ్రీరామకృష్ణుని గొంతునొప్పి క్రమ

ముగా అధిక మగుచుండెను. ప్రసిద్ధుఁడైన యొక డాక్టరు వచ్చి, ఔషధములను నిర్ణయించి, యెక్కువగా మాటాడుటను తఱచు సమాధిస్థితి నొందుచుండుటను నిషేధించెను. కాని సంసారదుఃఖసంతప్తు లగు లోకులకు జగద్గురూత్తముని కరుణా ప్రేరితప్రబోధ ప్రసంగములను, సహజసిద్ధ మైన యాతని దివ్యభావపారవశ్యస్థితులను ఎవ్వరు అరికట్టఁగలరు ? ఆ మహా మాతృప్రేమవికాసము నెవ్వరు బంధింపఁగలరు ?

వైష్ణవతీర్థ మగు పాణిహాటియందు భగవన్నామ సంకీర్తనానందవైభవముతో జరుగు సాంవత్సరికమహోత్సవ మును ముఖ్యముగాఁ దన బాలశిష్యబృందమునకుఁ జూప నెంచి యీ సమయముననే శ్రీ రామకృష్ణుఁడు శిష్యభక్త సమూహముతో బయలుదేఱెను. దివ్యభావపారవశ్యమున —తన యనారోగ్యస్థితి నిసుమంతయుఁ బాటింపక—యొక సంకీర్తన బృందమునడుమకుఁ జెంగున వెడలి నాఁడాతఁడు వెలువరించిన నృత్యసమాధిస్థితివైభవము వర్ణనాతీతము. కౌశేయ కాషాయాంబరసంశోభిత మైన యాతని మూర్తియు, దివ్యదరహాసభాసురము, దయాశాంత్యానందాదివిలసితము, అలౌకిక తేజోమయమునై వెల్గొందసాగిన యాతని ముఖ మండలమును సర్వజనసమ్మోహనమై యొప్పుచుండెను. ఇంతలో భక్త్యావేశపారవశ్యము నొందినట్లు నటింపసాగిన యొక కపటవైష్ణవుఁడు అకస్మాత్తుగా వచ్చి, యొక భక్తురాలు శ్రీరామకృష్ణునకు అర్పించుటకై తెచ్చిన ప్రసాదపుపాత్రను ఆమెయొద్దనుండి లాగికొని యందలి ప్రసాదమును సమాధి స్థితుఁడై యుండిన యా మహనీయుని నోటఁ బెట్టెను. ఈ

యపవిత్రస్పర్శచే శ్రీరామకృష్ణుని శరీరము కంపింప, సమాధి భంగమైపోవ, నాతఁ డా యాహారము నుమిసి, నోరు కడిగికొని, మఱియొక పాత్రలోని ప్రసాదము నొక లేశము గైకొని మిగిలినదానిని భక్తులకుఁ బంచిపెట్టించెను. కపటవైష్ణవుఁ డీలోపున జనసమూహములోనికిఁ జల్లఁగా జాఱెను!

దేవమందిరాదులను దర్శించి, యనుచరులతో శ్రీరామకృష్ణుఁడు దక్షిణేశ్వరమునకుఁ దిరిగి వచ్చి, రాత్రి భోజన సమయమున, శ్రీశారదాదేవి నుద్దేశించుచు, "ఉత్సవమునకు ఆమె మనలను అనుగమింపక మంచిపని చేసినది. ఆమె నాతో నుండుట జనులు చూచినచో, 'అదిగో, హంసయు హంసియు వచ్చినారోయి!' అని చెప్పుకొనియుందురు. ఆమె యెంతో వివేకవతి" యని కొనియాడెను. అంత నాతఁడు లక్ష్మీనారాయణుని పదివేలరూపాయల విరాళము నామె యెట్లు నిరాకరించెనో పరమప్రీతిపూర్వకముగా ముచ్చటించెను.

పాణిహాటికి వెడలిననాఁటినుండియు గొంతునొప్పి మఱింత యెక్కువయ్యెను. పూర్ణిమ, అమావాస్యలందది తీవ్రమగును. ఘనాహారమును దినుట అసాధ్య మయ్యెను. వ్యాధి 'Clergyman's sore throat' (మతబోధకుల కంఠవ్రణము) అని డాక్టర్లు నిర్ణయించిరి. కాని శ్రీరామకృష్ణుని సందర్శింపవచ్చువారల సంఖ్య నానాఁటికిఁ బెరుగుచుండెను. సంసారార్తులగువారలతో ఆదయామయుఁడు ప్రసంగింపకుండ నుండఁగలఁడా? ఒకనాఁ డాతఁడు తన యనారోగ్యస్థితి నెంచి, దేవి నుద్దేశించి, "ఇంత గుంపు నెందుకుఁ దీసికొనివచ్చుచున్నావు అమ్మా! స్నానపానాదులకైనను నాకు వ్యవధి

లేకున్నది. అహర్నిశము నీవు ఈ ఓటిమద్దెలను వాయించు చున్నచో, ఇది యెన్నాళ్లుండును!'' అని మొఱలిడెను. వ్యాధికి ముందే యొకప్పు డాతఁడు, క్రొత్తగాఁ దనకడకు వచ్చువారలను మొదటఁ గొంత దారిలోఁ బెట్టు శక్తిని గిరీశ కేదార మహేంద్ర రామచంద్ర విజయకృష్ణుల కిమ్మని దేవిని ప్రార్థించియుండెను.

దక్షిణేశ్వరము వీడి కలకత్తాలో నివసించుచు చికిత్స నొందుటకై భక్తుల కోరిక సంగీకరించి శ్రీరామకృష్ణుఁ డచటికి వెడలెను. కలకత్తాలోని సుప్రసిద్ధాయుర్వేద వైద్యులు పరీక్షించి వ్యాధి 'రోహిణి' (Cancer) అని నిర్ణయించిరి. శ్రీరామకృష్ణుఁడు తాత్కాలికముగా బలరాము నింట నివసించుచుండ, పరమహంస వచ్చెనను వార్త నల్దిక్కులను దివ్యసౌరభము వలె వ్యాపింప, జను లెడతెఱపి లేకుండ సందర్శనార్థమై రాసాగిరి. తాపత్రయపరిపీడితలోకము నెడఁ దన దయారసము నెల్లివిరియ, శ్రీరామకృష్ణుఁడు వైద్యుల నిషేధములనుగాని, శిష్యభక్తబృందపు మొఱలనుగాని, తన యస్వస్థతనుగాని పాటింపక, మహోత్సాహముతో మాటాడుచు, జిజ్ఞాసువుల సందేహములను దీర్పసాగెను. దక్షిణేశ్వరము రాఁజాలని జనసమూహములకుఁ దన సందేశము నందఁ జేయుటకై అస్వస్థత యను మిష కల్పించుకొని యాతఁడు కలకత్తా వచ్చెనా యనిపించెను. ఏకోలఁదిగంటల విరామ సమయమో తక్క నిరంతరము దివ్యప్రసంగము లే! మల్లె పొదల యాకుగుముల నడుమ వెల్గొందు పూవుల వలె తత్ప్రసంగముల నడుమ నాతఁడు పొందు దివ్యభావసమాధి

స్థితులు శ్రోతలను అద్భుతరీతిని ఆకర్షించుచుండెను. అపు డాతఁడచట నుండిన దొక వారమే యైనను, అసంఖ్యాకులైన జనులకు ఆధ్యాత్మిక ప్రబోధ మొదవించెను.

1885–వ సం॥ సెప్టెంబరు మాసారంభమున శ్రీరామ కృష్ణుఁడు శ్యామపుకుర్ అను పేటలో నొక చిన్న మేడలోఁ బ్రవేశించెను. సుప్రసిద్ధహోమియోపతిచికిత్సకుఁడగు డాక్టర్ మహేంద్రలాల్ సర్కార్ పరమ ప్రేమతో ఉచితముగా చికిత్స చేయనారంభించెను. శ్రీశారదాదేవి వచ్చి, యీనూతన నివాసము తన నిద్రాస్నానాదుల కెంత యసదుపాయముగా నుండినను, ఎన్ని యిబ్బందుల కైనను ఓర్చి, పథ్యపానీయ ములను యథాయోగ్యముగా సిద్ధ మొనర్చుచు, అఖండ శ్రద్ధాభక్తులతో ప్రాణేశ్వరుని సేవించుచుండెను.

రాత్రిసేవాభారమును వహింప నరేంద్రుఁడు ముందంజ వైచి శ్యామపుకుర్ననే రాత్రు లుండనారంభించెను. ఇది చూచి కాళి, శశి మున్నగు యువకులును తమ సంరక్షకుల యధిక్షేపములను, ఆటంకములను లక్ష్యింపక, గురుసంసేవన మున నరేంద్రు ననుసరించిరి. ఇట్టి సేవకులు మొదట నలుగు రైదుగురే యైనను తుదకు వారిసంఖ్య నాలుగురె ట్లయ్యెను.

గృహస్థభక్తులలో సురేంద్రుఁడు ఇంటియద్దెను, గిరీశ మహేంద్ర బలరామ రామచంద్రాదులు మిగిలిన వ్యయమును భరించుచుండ, శ్రీరామకృష్ణభక్త సోదరబృందము ఈ రీతిని గురుసేవాపరాయణమై దృఢతరప్రేమబద్ధము కాఁజొచ్చెను. భక్తబృందమున గిరీశునివంటివారితోఁ గూడిన యొక వర్గము శ్రీరామకృష్ణునివ్యాధి లీలామాత్ర మని విశ్వసింప, లోక

కల్యాణమొనఁగూర్చు తన మేనిగూఢకార్యము నిమిత్తమో జగజ్జనని తాత్కాలికముగా ఆయన కీస్థితి కల్పించె నని మఱి యొక వర్గము భావింప, నరేంద్రునివంటివారితోఁ గూడిన మూఁడవ వర్గము ఇది కేవలము సహజశారీరకసంఘటన మనియు గురుదేవుని పునరారోగ్యసిద్ధికై సర్వవిధములను బ్రయత్నించుచు, ఆయన చూపిన మహోన్నతాదర్శములను శక్తి కొలఁదియు అనుసరించుచు సాధనచేయుటయే తమ పరమధర్మ మనియు విశ్వసించెను.

మహేంద్రలాలుతోఁ బ్రసంగించుచు శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు తన బాలశిష్యులను జూపి, "'నెచ్చెలీ! జీవించి యున్నన్నాళ్లు నేర్చుకొనుచునేయుందును' అని వీరితోఁ జెప్పు చుందును" అని వచించెను. శ్రీరామకృష్ణసంసర్గభాగ్యము మహేంద్రలాలు నానాఁటికి విశేషముగా గ్రహించుచు, గాఢాసక్తుఁడై ప్రతిదినము ప్రసంగాదులలో ఆతనితో గంటల కొలఁది గడపువాఁడు. నరేంద్రుని ప్రసంగములను, దివ్యగాన మును విని ముగ్ధుఁడై మహేంద్రలాలు ఆతనిగూర్చి శ్రీరామ కృష్ణునితో మహోత్కర్షతోఁ బ్రసంగింప, శ్రీరామకృష్ణుఁడు హర్షముతో నరేంద్రు నవలోకించి యిట్లు పలికెను: "అద్వైత గోస్వామి హుంకారములచే (ప్రబలప్రార్థనలచే నని భావము) నవద్వీపమున గౌరాంగుఁడు అవతరించెనందురు. అట్లే యిదంతా ఆతని (నరేంద్రుని) మూలముననే సుమా!"

శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు గాఢసమాధినిమగ్నుఁ డైయుండ, మహేంద్రలాలును మఱియొక డాక్టరును హృదయ పరీక్షాసాధనము (Stethoscope)తో నాతని హృదయమును

బరీక్షించిరి. గుండె కొట్టుకొనుట లేదు. కంటిగ్రుడ్డుపై వే లుంచినను చలనము లేదు. భౌతికశాస్త్రము (Science) న కివి యందని విషయము లని యిరువురును ఒప్పుకొనవలసి వచ్చెను. 'సైన్స్' మూలమున ఇంద్రియగ్రాహ్యవిషయజ్ఞానమే కాని, ఇంద్రియాతీతమైన బ్రహ్మజ్ఞానము కలుగఁజాల దని శ్రీరామకృష్ణుఁడే యొకప్పుడు విశదీకరించెను. ప్రస్తుతసమయమునఁ దన సమాధ్యవస్థలో నాతఁడు దివ్యతేజోమయమార్గమున సురేంద్రనాథమిత్ర యను భక్తునింట దుర్గాపూజాసన్నివేశమును, తాను (శ్రీరామకృష్ణుఁడు) రాలేదని విలపించుచున్న సురేంద్రునిఁ గని, పిమ్మటఁ గొంతసేపటికి బాహ్యప్రజ్ఞ నొంది, "మీరు వెళ్లిన, అతఁడు శాంతినొందు" నని నరేంద్రాదులను బంపెను.

నెలలు గడచుచుండెను, కాని వ్యాధి తగ్గకుండెను. శరీర మెంత దుర్బలముగా నున్నను, ఆతఁ డెప్పటివలెనే దివ్యోల్లాససంశోభితుఁడై యుండెను. శ్రీరామకృష్ణునకు అత్యంతప్రీతికర మగు కాళీపూజాదినమున, పూజాద్రవ్యము లన్నియు సంసిద్ధ మొనర్పఁబడియుండ, చాలసేపు ఆతఁడు మౌనముగాఁ దన శయ్యపైఁ గూర్చుండియుండ, "జయ! మాతా!" యని బిగ్గఱగా నుచ్చరించుచు, గిరీశచంద్రుఁడు చందనలిప్తకుసుమములను కాళీపూజాభావముతో గురుపాదములకు సమర్పించెను. మహేంద్రరాఖాలాదిశిష్యులును భక్తులును ఆతని ననుసరింపసాగిరి. ఈలోపున సమాధినిమగ్నుఁడైన శ్రీరామకృష్ణుని వదనము దివ్యమందహాసముతోఁ బ్రకాశించుచుండ, హస్తములు అప్రయత్నముగా వరదా

భయహస్తముల తీరు నొంది స్వయముగా కాళీదేవి యాతని యందు ఆవిర్భవించియున్నట్లు భాసింపసాగెను. ఎల్లరును తన్మయులై యుండిరి. బాహ్యప్రజ్ఞ నొందినపిమ్మట శ్రీ రామకృష్ణుఁడు నైవేద్యముల నొకించుక యారగించి, సన్నిధి నున్న వారల నందఱను పరమభక్తిజ్ఞానముల నొందుదురు గాత మని యాశీర్వదించెను.

ఒకవైపున శ్రీరామకృష్ణుని వ్యాధియు మఱియొక వైపున సందర్శనార్థుల సంఖ్యయు నానాఁటికి హెచ్చు చుండెను. వ్యాధిని, బాధలను ఎంతమాత్రము లక్షింపక వారి కాతఁడు దివ్యబోధ లొనర్చుచుండెను. ప్రభుదయాల్ మిశ్రయను నొక దొడ్డ క్రైస్తవభక్తుఁ డొకనాఁడు శ్రీరామ కృష్ణుని సందర్శించెను. ఏసుక్రీస్తునకును, శ్రీరామకృష్ణున కును సంబంధించిన తన దివ్యదర్శనములను, వారల యభిన్న తనుగూర్చి తన గాఢవిశ్వాసమును దెలిపి, యాతఁడు బద్ధాం జలియై, "నాఁటినుండియు మీకు నా మనస్సును, శరీరమును, ఆత్మను సమర్పించుకొంటిని" అని విన్నవించెను. పరమ ప్రేమతో శ్రీరామకృష్ణుఁ డాతనితో కరచాలన మొనర్చి, "నీ వాంఛ నెఱవేఱును" అని యనుగ్రహించెను. విలియమ్స్ అను మఱియొక క్రైస్తవభక్తుఁడు ఒకప్పుడు శ్రీరామ కృష్ణు నాశ్రయించి, యిష్టసిద్ధి నొంది, యాతని పనుపున హిమాలయములకు తప మొనర్ప నేఁగినట్లు తెలియవచ్చు చున్నది.

శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు అతీంద్రియావస్థలోఁ దన పాదములను మహేంద్రలాల్ ఒడిలో నుంచి, యనంతర

మాతనితో, "నీవు పరిశుద్ధుఁడవు, కానిచో నిన్నుఁ దాఁకఁ జాలకపోయియుందును" అని పలికెను.

శ్యామపుకుర్ నందుండఁగా శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు తన సూక్ష్మశరీరము స్థూలశరీరమునుండి వెలువడి గదిలో సంచరించుచున్నట్లు గాంచెను. దానివీఁపున, ముఖ్యముగా వీఁపు మెడను గలియు భాగమున, అనేక వ్రణములు గోచరింప, నివి యేల కలిగెనో యని యాతఁడు నివ్వెఱ పడసాగెను. దుశ్చరిత్రుల స్పర్శచే నవి కలిగెననియు, వారా స్పర్శచే స్వయముగా నిర్మలులైనను, వారి పాపము లాతని నావరించినందున వ్రణము లేర్పడెననియు దేవి విశదపఱిచెను. లక్షుపర్యాయములైనను లోకకల్యాణసాధనకై జన్మించి శరీరయాతనల ననుభవింప నెనుదీయ నని యా దయాసముద్రుఁడు వచించియుండెఁగదా! ఈ దృశ్యమును గూర్చి విని శిష్యులును భక్తులును గురుదేవుని యపారకారుణ్యమునకు విస్మితులై, తమ పాపభారమును ఆ మహానీయుఁడీరూపమున వహించుచుండెనేయని పరితప్తులైరి. ఒరులను ఆయనపాదములను దాఁకనీయకుండుటకై జాగరూకులమై యుండవలయు నని వారు నిశ్చయించుకొనిరి. వారిలోఁ దమ మహాపాపములను స్మరించిన కొందఱు వ్యాధినివారణపర్యంతము ఆయన పాదములను దాఁకఁబోమని శపథము దాల్చిరి.

శ్రీరామకృష్ణసాన్నిధ్యము శిష్యులయు భక్తులయు భగవద్భక్తివిశ్వాసముల నినుమడించుచుండెను. ఒకవైపున గిరీశరామచంద్రాదులు శ్రీరామకృష్ణుఁడు సాక్షాద్భగవదవతార మని ప్రకటింప, మఱియొకవైపున విజయకృష్ణ

గోస్వామి తన శ్రీరామకృష్ణదివ్యదర్శనస్పర్శనానుభవములను వెల్లడింప, శిష్యు లనేకులు గురుదేవుని మహిమములను గనుంగొనుటకై నిరీక్షించుచుండిరి. గిరీశచంద్రుని చిత్తశుద్ధి తమకు లేకపోయినను, కొందఱు తమ "ముక్త్యారునామా" శ్రీరామకృష్ణున కిచ్చివేసితిమనియుం దమ కిఁక సాధనావశ్యకత లేదనియుం బ్రకటింపసాగిరి! ఈ భావోద్రిక్తస్థితిగతులలో నామసంకీర్తన మనినంతనే వణఁకిపోవుట, నేలపైఁ బడి దొరలుట, మూర్ఛ నొందుట మున్నగునవి ముఖ్యముగా ఐదాఱుగురకు సామాన్యము లయ్యెను. ఈధోరణి యంతయు ప్రమాదసంజనితము, ప్రమాదసంజనకము ననియు గ్రహించి నరేంద్రుఁడు వారల కిట్లు ఉద్బోధింపసాగెను : "ఎయ్యది తాత్కాలికభక్త్యావేశము పురికొల్పినను, మనస్సున సుస్థిరసంస్కారము గల్గింపఁజాలదో—ఎయ్యది కామకాంచనాది విషయవ్యామోహముల నెదుర్కొని నిర్జించుటకు వలయు మనోబలము నొసగూర్పఁజాలదో, తదనుగుణమగు శీలపరివర్తనము గల్గింపఁజాలదో—అట్టి భావోద్రేకము నిస్సారమనియు నిష్ప్రయోజన మనియు గ్రహింపుఁడు. అయ్యది అశ్రుపాతము, పులకాంకురము మున్నగువానిని లేదా, తాత్కాలికమైన శరీరవిస్మృతిని గల్గించుఁగాక—కాని యవి కేవలము నాడీదౌర్బల్యముచేఁ గలుగునట్టి ఉద్రేకలక్షణము లని నా నిశ్చితాభిప్రాయము. దృఢప్రయత్నముచే, సంకల్పశక్తిచే, వీనిని నిరోధింపఁజాలకుండినచో, బలకరమైన ఆహారము తినవలయును, మఱియు వైద్యసాహాయ్యము నొందవలయును. విశేషము, జను లీ యావేశములను దెచ్చిపెట్టు

కొనుచుందురు, చాలవఱకు నటించుచుందురు. ఆత్మసంయమము దృఢమైనకొలఁదియు మనోభావములు గంభీర మగుచుండును.... పామరులగు లోకు లిది గ్రహింపక, యీ వికృతావేశములను జూచి, 'ఆహా! ఏమి భక్తియో!' యని నివ్వెఱపడుచుందురు....(పూనికతో మనస్సంయమము నవలంబింపకుండ) పరమార్థమును సాధింపఁబూనువారిలో నూటికి ఎనుబదిమంది కపటసన్న్యాసులుగనో, కృత్రిమ యోగులుగనో, డాంబిక భక్తులుగనో పరిణమించుచుందురు. పదునైదుగురకు గమ్యస్థానము పిచ్చియాసుపత్రి. ఇఁక మిగిలిన యైదుగురకు తత్త్వజ్ఞానము లభించుచో, వారు మహాదృష్టవంతులని భావింపనగును. కావున మెలఁకువగలిగి వర్తింపుఁడు.''

జ్ఞానఖడ్గసందీపితుఁ డగు నరేంద్రునిగూర్చి ''యాతఁడు ఒఱనుండి తీసిన ఖడ్గ''మని శ్రీరామకృష్ణుఁడు ప్రశంసించి యుండెఁగదా!

నరేంద్రు నభిప్రాయము సత్యసమ్మత మని శీఘ్రకాలముననే రుజు వయ్యెను. అట్టి భావోద్రిక్తులలోఁ గొందఱింటిమొద్ద ప్రయత్నపూర్వకముగా భావావేశముల నలవఱచుకొనుచుండిరనియు, కేవల మవి యనుకరణము లనియు తెల్ల మైనది. సామాన్యపద్ధతులకు లొంగనిచో, నరేంద్రుఁడట్టివారిని గేలిచేసియైనను దారిలోనికిఁ దీసికొనిరాఁబూనును. తన ప్రేమపూరితప్రేరణలచే, తన మనోహరకీర్తనలచే, తన సముజ్జ్వలప్రసంగములచే సోదరశిష్యుల కాతఁడు శ్రీరామకృష్ణదివ్యజీవితలక్ష్యములను మనఃఫలకమున ముద్రిత మగునట్లు ప్రదర్శించును.

ఇది యిట్లుండ శ్రీరామకృష్ణుని వ్యాధి నానాఁటికి ప్రబలుచుండెను. నగరమునకు బయట, విశాలమగు నొక యారామభవనమున నివాసము ఆరోగ్యమునకు అనుకూలించు నను డాక్టరు హితోపదేశము ననుసరించి కాశీపుర మను పేఁటయందట్టి యొక మేడ నద్దెకుఁ దీసికొని, యించుమించు 1885-వ సంవత్సరాంతమున శ్రీరామకృష్ణుని బస నచటికి మార్చిరి. ఫలపుష్పవృక్షములతో రమ్యము, ఐదెకరముల విస్తీర్ణమున సువిశాలము, ప్రశాంతము నైన యీ వనప్రదేశము శ్రీరామకృష్ణున కెంతయో యింపిత మయ్యెను.

మానవహృదయక్షేత్రములను భక్తిజ్ఞానాప్లావిత మొనర్చుచు, లోకశాంతిమార్గదర్శకమై ప్రవహింపసాగిన యీ దివ్యజీవననది పరబ్రహ్మసాగరమున అంతర్ధాన మగుటకిఁకఁ గొలఁదినెలలు మాత్రమే మిగిలియున్నవి. "వెళ్లుటకు ముందు కుండ బద్దలుకొట్టివేయుదును" (విషయ మంతయు బహిరంగపఱతునని భావము); (తన శరీరమును జూపుచు) "దీని ననేకులెపుడు తెలిసికొని గుసగుసలాడుకొనుచుందురో, అపుడీకోశ మిఁక నిలువదు, అమ్మ సంకల్పముచే అంతరించును"; "భక్తగణమున ఎవరు అంతరంగకోటిలోనివారో, ఎవరు బహిరంగకోటిలోనివారో ఆ సమయమున (తన చరమావస్థలో) నిరూపిత మగును"—ఈవిధముగాఁ దన నిర్యాణసమయాదికములనుగూర్చి శ్రీరామకృష్ణుఁడు పల్కిన వాక్కుల యాథార్థ్యమును, ఆతని దివ్యమహిమాతిశయమును శిష్యభక్తకోటికిచటనే—కాశీపురవనముననే—ప్రత్యక్షమైనవి. తన మహోద్యమమును గొనసాగించుటకై నరేంద్రాది

శిష్యులను సమర్థులను జేయు టొక్కటే శ్రీరామకృష్ణున కీఁక మిగిలియున్న మహాకార్యము. అవసానశయ్యయం దుండియు నాతఁ డొనర్చుచుండిన దివ్యకార్యమిదియే. అట్టి సద్గురూత్తముని సేవించుటే భగవదారాధన మని నమ్మి, నిద్రాహారములను లక్షింపక, నరేంద్రుని నాయకత్వమున బాలశిష్యు లేకరీతిని సేవించుచుండిరి.

శ్రీరామకృష్ణుని సూచనపై ఆతని సొంత వ్యయము నంతయు బలరాముఁడును, (నెల కెనుబదిరూప్యముల) యింటి యద్దెను సురేంద్రుఁడును భరింపసాగిరి. భక్తురాలును, శ్రీ రామకృష్ణుని చిన్నన్నకొమార్తెయునగు లక్ష్మీదేవి శ్రీశారదా దేవికి ఆమె చేయుసేవలలో తోడునీడయై యుండెను.

శశధరమహాపండితుఁ డీసమయమున నొకనాఁడు శ్రీరామకృష్ణుని సందర్శించి యిట్లుపలికెను: "మహాశయా! సంకల్పబలముననే మీవంటి సిద్ధపురుషు లెట్టి వ్యాధి నైనను నివారించుకొనఁగలరని శాస్త్రములు చెప్పుచున్నవి. బాధిత భాగముపై మీ మనస్సు నిలిపి కుదురవలెనని నిశ్చయించి నచో వ్యాధి కుదురును. మీరట్లు ఏల చేయరాదు?" శ్రీ రామకృష్ణుఁడు వెంటనే యిట్లు సమాధానించెను: "పండితుఁ డవై యుండియు నీ విట్టి అనాలోచితప్రసంగము చేయు చున్నావే! భగవదర్పిత మైన యీ మనస్సును ఈ తుచ్ఛ కళేబరముపై కెట్లు మఱల్పఁగలను?" పండితుఁడు నివ్వెఱ పడి యూరకుండెను. ఆతఁడు వెడలిన వెనుక నరేంద్రుఁడును మఱికొందఱు శిష్యులును తమకొఱకై నను వ్యాధి మాన్పు కొనుఁడని గురుదేవుని వేఁడుకొనిరి. అంతయు అమ్మసంకల్ప

మని యాతఁ డందుల కెంత ప్రతిఘటించినను నరేంద్రుఁడు వినమిచే తుదకు వారల యభీష్టమును తల్లికి నివేదింపనంగీకరించెను. కొంతసేపటికి శ్రీరామకృష్ణుఁడు నరేంద్రునితో నిట్లు వచించెను : "ఈబాధవలన ఏమియుఁ దినఁజాలకున్నాననియుఁ గొంచెము తినునట్లు ఏర్పఱుపుమనియు అమ్మతోఁ జెప్పినాను. ఆమె మి మ్మందఱను జూపి, 'ఏల? అన్నిముఖములమూలమున నీవు తినుచుంటివి గదా!' యనెను. లజ్జచే నిఁక మాటాడఁజాలకపోతిని." గురువచనములను విని నరేంద్రాదులు నిశ్చేష్టులైరి. 'ఆహా! ఏమి శరీరవిస్మృతి ఏమి అద్వైతతత్త్వానుభవము!' భక్తిమార్గమునను అద్వైతవేదాంతశిఖరము నధిరోహింపవచ్చుననుట కిదియే కదా పరమనిదర్శనము?

హోమియోపతిచికిత్సకులలో మఱియొక సుప్రసిద్ధుఁడగు రాజేంద్రలాల్ దత్తు శ్రీరామకృష్ణుని వ్యాధినిగూర్చి విని తన మిత్రుఁ డగు మహేంద్రలాల్ అనుమతితో చికిత్సచేయసాగెను. తాత్కాలికముగా దానివలన గుణము కనఁబడెను.

ఈ సమయమున నొకనాఁడు (23-12-1885 న) దివ్యానందస్థితిలో శ్రీరామకృష్ణుఁడు కొందఱు భక్తులపై దన అవ్యాజానుగ్రహము వర్షించెను. నాఁటి సాయంకాలము మహేంద్రునితో నిట్లు పలికెను : "లోకశిక్ష అంతము కావచ్చుచున్నది—జనుల కిఁక బోధింపఁజాలను. సర్వము రామమయముగాఁ గనఁబడుచున్నది. ఎవరికి బోధింతు ననియొక్కొక్కప్పుడు తోఁచుచుండును." మఱికొంతసేపటికిట్లు తెలిపెను : "ఎవరు అంతరంగకోటిలోనివారో, ఎవరు

బహిరంగకోటిలోనివారో ఈ వ్యాధి తెలుపుచున్నది. సంసారము త్యజించి యిచట నివసించుచున్నవారు మొదటి వర్గమునకును, అప్పుడప్పుడు వచ్చుచు, 'ఎలా గున్నారు మహాశయా?' అని యడుగుచుండునట్టివారు రెండవవర్గము నకును జెందుదురు."[1]

క్రీ. శ. 1886-వ సంవత్సరప్రారంభదినము శిష్యభక్త కోటికి చిరస్మరణీయ మైన సుదినము. శ్రీరామకృష్ణుని అఖండాధ్యాత్మికశక్తియు అపారవాత్సల్యమును నాఁడు వారికి అపూర్వరీతిని సువ్యక్త మైనవి. చాల గుణముగా నున్నట్లు తోఁప, నాఁ డాతఁడు క్రిందికి దిగి తోఁటలో మెల్లగా విహ రింపఁబోయెను. అటఁ గూర్చుండియుండిన గిరీశరామచంద్రా దులు వచ్చి ప్రణమిల్ల, నాతఁడు, "గిరీశా! (నన్నుగూర్చి) నీ వేమి చూచి, యేమి గ్రహించి, యందఱితోను అంతగా ('నేను అవతారపురుషుఁడనని' యని భావము) చాటు చున్నావు?" అనెను. గిరీశుఁడు భక్తివినమ్రుఁడై మోఁక రించి బద్ధాంజలియై గద్గదకంఠమున నిట్లు పలికెను: "వ్యాస వాల్మీకులు ఎవని మహిమాతిశయమును వర్ణింపఁజాలకుండిరో, అట్టి మహనీయునిగూర్చి విశేషము నే నేమి చెప్పఁగలను?" గిరీశుని హృదయాంతరాళమునుండి వెలువడిన యీ వాక్కులకు శ్రీరామకృష్ణుఁడు పరమకరుణాప్రపూర్ణుఁడై, "ఇఁక నే నేమందును! మీ కెల్లందఱను ఆశీర్వదించుచున్నాను! జ్ఞాన

---

[1] నరేంద్రనాథ్, రాఖాల్, బాబురామ్, నిరంజన్, జోగీన్, లాటూ, తారక్, బుడా (పెద్ద) గోపాల్ (లేక గోపాల్ సుర్), కాళి, శశి, శరత్, గోపాల్ అనువారు అంతరంగికు లని గ్రహింపనగును.

వికాసము నొందుదురుగాక !" యని పలికి అర్ధబాహ్యప్రజ్ఞా వస్థ నొందెను. ఈ గంభీరవచనములను విని వారు హర్షోన్మత్తు లైరి. ఆయన నంటరాదను తమ నియమమును మఱచి, పాద ధూళిని గైకొనుటకై భావపరవశులై ముందునకు వచ్చి యొకరివెంబడినొకరుగఁ బ్రణమిల్లసాగిరి. అపారకృపాసింధువై శ్రీరామకృష్ణుఁడు వారిని దాఁకుచు, సముచితరీతి నాశీర్వ దించుచుండఁ, గొందఱు నవ్వుచుండిరి; కొందఱు ఏడ్చుచుం డిరి; మఱికొందఱు ధ్యానావస్థితు లగుచుండ, నింకఁ గొందఱు దూరమున నున్నవారిని వచ్చి యాశీస్సుల నొందుఁ డని కేక లిడుచుండిరి. గతరాత్రి సేవాదికనిమగ్నులై యిపుడు నిద్రితు లైయున్న నరేంద్రాదులు లేచి రయమున వచ్చిరి. లాటూ శరచ్చంద్రులు సేవాకార్యనిమగ్నులై యుండిరి. బాలశిష్యులు సమీపించునరికి శ్రీరామకృష్ణుఁడు పూర్ణబాహ్యస్మృతి నొంది తనగదికి మఱలెను.

అనుగ్రహము నొందినవా రెల్లరును దివ్యానందమునే కాక, తమకు అపూర్వము, మహత్తరము నైన ఆధ్యాత్మి కానుభూతుల నొందినట్లు పిమ్మటఁ దెలియవచ్చెను. శ్రీరామ కృష్ణుని చిన్నన్నకుమారుఁ డగు రామలాల్ తన యిష్టదైవ సంపూర్ణదర్శనము నొందితి నని తెలిపెను. వైకుంఠనాథ సాన్యాల్ అను శిష్యుఁడు సమస్తవస్తుజాలముననుశ్రీరామ కృష్ణుని పరమానందమయస్వరూపమును గాంచ నారంభించితి ననియుఁ, గొన్నాళ్లకు తదీయతీవ్రతను భరింపఁజాలక మంద గింపఁజేయఁ బ్రార్థింప, నంతటినుండి యది ప్రతిదినము కొలఁది సార్లుమాత్ర మే ప్రత్యక్షము కాసాగెననియుఁ దెలిపియున్నాఁడు.

ఈ నానాజనస్పర్శఫలితముగా—పరపాపగ్రహణ ఫలితముగా—శ్రీరామకృష్ణునకు నాఁడు శరీర మంతయు మంటలెత్తెను. గంగాజలప్రోక్షణమున ఆ బాధ యుపశమించెను. పరమహంసస్పర్శయు గంగాజలస్పర్శయు పాపహరము, తాపహరమును గదా? కావుననే తన్మాహాత్మ్యమును వేదశాస్త్రములు ఉద్ఘోషించుచున్నవి.

నరేంద్రుఁ డీసమయమున సాక్షాత్కారమునకై పరితపించుచుండెను. ఒకనాఁ డాతఁడు గురుదేవుని సమీపించి, ఆహారనిమిత్తము మాత్రమే సమాధిస్థితినుండి బహిర్ముఖుఁడ నగుచు, మూఁడునాలుగుదినముల పర్యంతము సమాధి నిమగ్నుఁడ నగుచుండఁగోరెద నని పలుక, శ్రీరామకృష్ణుఁ డిట్లు సమాధానించెను: "వెఱ్ఱివాఁడా! అంతకంటెను ఉన్నతస్థితి కలదని గ్రహింపుము. 'చరాచరప్రపంచ మీవే పరాత్పరా!' అని నీవు పాడుచుందువే. సరి, మీ కుటుంబమునకుఁ గొంత జీవనాధారము కల్పించిరమ్ము, సమాధి కంటెను ఉన్నతస్థితి నీకు లభించును."

శ్రీరామకృష్ణుఁడు తన ప్రధానశిష్యుఁ డగు నరేంద్రునకు భావిమహాకార్యనిర్వహణమునకు వలయు శిక్షణ గఱపుచుండెను. నరేంద్రు నొకనాఁ డాతఁడు తనప్రక్కకుఁ బిలిచి యిట్లు వచించెను: "ఈ బాలుర నందఱను నీ యధీనముచేయుచున్నాను. వీరు సాధనలను సాగించుచుండునట్లును, ఇఁకఁ దిరిగి యిండ్లకు మఱలకుండునట్లును జూడు."

భావిసన్న్యాసజీవితమునకై బాలశిష్యులను శ్రీరామకృష్ణుఁడు సంసిద్ధులను జేయుచుండెను. గురుదేవుని పనుపున

వా రొకనాఁడు భిక్షాటన మొనర్చి బియ్యము మున్నగు వానిని దెచ్చి వండి యాతనికి సమర్పించిరి. ఆతఁ డొకటి రెండు మెతుకులు భుజించి పరమానందముతో, "బాపురే! ఇది పరమపవిత్రమైన యాహారము" అని వచించెను.

కంఠవ్రణమువలని దారుణబాధల ననుభవించుచుండియు, శ్రీరామకృష్ణుఁడు చిఱునగవుతో, "మనసా! దేహము, దాని బాధయు ఒండొంటిని జూచుకొననీ ; నీవు మాత్రము సదా ఆనందనిమగ్నమైయుండు!" మని పలుకును. భక్తబృందము నుద్దేశించుచు, నొకనాఁ డాతఁడు, "మీరు విలపింతు రని యీబాధనంతయు సహించుచున్నాను. ఈ దారుణయాతన ననుభవించుటకంటె శరీరము గతించుటయే మే లని మీరందఱును అందురా, అందులకు సంసిద్ధుఁడ"అని మెల్లమెల్లఁగా అతికష్టముతో మహేంద్రునితోఁ జెప్పెను.

తన యనంత ప్రేమవిలసిత వీక్షణములను సన్నిధి నున్నవారిపైఁ బఱుపుచు, శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు దేవీ సంకల్పమునుగూర్చి ప్రసంగించుచుండెను. తల్లి పిల్లలను బుజ్జగించురీతిని రాఖాలును, నరేంద్రుని బుజ్జగించుచు, మహేంద్రునితో నాతఁ డిట్లు వచించెను : "ఈ శరీరమును మఱికొన్నాళ్లు నిలువనిచ్చినచో, ఇంకా అనేకులు ప్రబోధము నొందియుందురు." క్షణ మూరకుండి మరల నిట్లు పలికెను : "కాని యది అమ్మ సంకల్పము కాదు. నా అమాయికత్వమును, విద్యావిహీనతను జూచి, జనులు నన్ను వశపఱుచుకొని దుర్లభ మగు దివ్యానుభూతులను బొందకుండుటకై అమ్మ నన్ను ఈ లోకమునుండి కైకొనిపోవును. ఈ కలి

యుగమున జపధ్యానము లెంతయో వెనుకఁబడియున్నవి సుమీ!" మరలఁ దన ప్రియశిష్యులతో నిట్లు వచించెను : "శరీర మున్నంతవఱకు బాధపడుట తప్పదు....కాని (భగవానుని) యీ శరీరధారణము భక్తులనిమిత్తమే.—సర్వము ఇందుండియే వెలువడెనని నా కిప్పుడు కనఁబడుచున్నది. (నరేంద్రుని జూచి, సంజ్ఞతో) తెలిసినదా?" "సమస్తసృష్టిజాతమును మీయందుండియే ఉద్భవించినది" అని నరేంద్రుఁడు పలుక, శ్రీరామకృష్ణుని దివ్యమందహాసము తత్సమాధానమై తేజరిల్లెను—ఆ చిఱునగవులో నాతని యథార్థవ్యక్తిత్వ సూచనలు పొంగిపొరలెను.

చికిత్స యంతయు విఫలమగుట గని శ్రీశారదాదేవి తారకేశ్వరమునందలి శివాలయమునకు వెడలి శివానుగ్రహమునకై ప్రాయోపవేశమును బూనెను. రెండవ రాత్రి యొక పెద్దధ్వని—'యెవ్వరో కుండలదొంతరను బగులఁగొట్టినట్లు'—ఫెళఫెళమను ధ్వని—విని, "ఐహికసంబంధములు స్వప్నప్రాయములు గదా!" యని యామె మహావైరాగ్యము నొందెను. మఱునాఁడు కాశీపురమునకు వచ్చి జరిగిన వృత్తాంతమును శ్రీరామకృష్ణునకుఁ దెలుపఁగా, అట్లు జరుగునని యాతనికి ముందే విదితమైయున్నట్లు కాన్పించెను.[1]

సాక్షాత్కారమందలి తీవ్రకాంక్షచే నరేంద్రుఁ డొకనాఁడు సోదరశిష్యు లగు కాళీతారకులతో బుద్ధగయకు

---

1 ఈసమయమున నొక యేనుఁగు తనకై మందు తీసికొని వచ్చుటకై వెళ్లినట్లును, అందులకై యది నేలను త్రవ్వుచున్నట్లును ఆతఁడు కలఁగనెనఁట.

యాత్రగావించి, యట మహాధ్యాన మొనర్చి కొలఁదిదినము లలోనే తిరిగి వచ్చెను.

విశేషశ్రద్ధాభక్తులతో శ్రీ రామకృష్ణుని సేవించుచుండిన బాలశిష్యబృందమున శశి గురుసేవాతత్పరత గురుభక్తుల కెల్లరకును మేలుబంతి. గురుసేవయే యాతని సాధన, ఆతని తపస్సు. పరమార్థప్రాప్తికి సద్గురుసేవయే మహోత్తమ సాధన మని యాతని గాఢవిశ్వాసము. ఆతని నిరంతర సేవాదీక్షను, ఆతని యకుంఠితసహనశక్తిని, ఆతని యపారగురుభక్తిప్రేమానురాగములను గని యెల్లరును అబ్బురపడువారు. వేయేల, గురుసేవామూర్తిభావమే యాతఁడు.

ఒకనాఁడు పెదగోపాలుఁడు కాషాయవస్త్రములను, రుద్రాక్షమాలలను సన్న్యాసులకుఁ బంచిపెట్టవలయునను తన యభిలాషను గురుదేవునకు విన్నవింప నాతఁడు తన బాలశిష్యులను జూపుచు నిట్లు పలికెను: "వీరిని మించిన ఉత్తమ సాధువులు నీకు మఱెచ్చటను దొరకరు. వానిని వీరి కిమ్ము." అంతఁ దనయెదుట నుంపఁబడిన కాషాయవస్త్రములను శ్రీరామకృష్ణుఁడు స్వయముగా బాలశిష్యులకుఁ బంచిపెట్టెను. ఒకటి మిగులఁగా దానిని వైరాగ్యసంపదలో మఱెవ్వరికిని దీసిపోని గిరీశునికై భద్రపఱుపఁజేసెను. ఒకనాఁటి సాయంకాలము బాలశిష్యులచే నొక క్రియ జరిపించి, జాతిభేదము లేకుండ నెల్లర యిండ్లనుండియు భిక్షాన్నము గ్రహింపననుమతించెను. ఈవిధముగా శ్రీరామకృష్ణునివలననే వారు సన్న్యాసదీక్ష నొంది కాలక్రమమున శ్రీరామకృష్ణసంఘప్రదీపములై ప్రకాశించిరి.

అనేకజన్మార్జితతపఃఫల మగు నిర్వికల్పసమాధి నరేంద్రున కీసమయముననే లభించెను. ధ్యానస్థితుఁడై యుండ, నాతఁ డొకనాఁడు అకస్మాత్తుగాఁ దన శిరస్సునకు వెనుక తట్టున నొక దివ్యజ్యోతిని గాంచెను. అయ్యది క్రమముగా విజృంభింపసాగెను. నరేంద్రుఁ డాకాంతిపుంజమున మునిఁగెను. ద్వైతప్రపంచాతీతమై తన మానసము అఖండ సచ్చిదానందబ్రహ్మమున లీనముకా నాతఁడు మహోన్నత నిర్వికల్పసమాధిస్థితి నొందెను! కొంతసేపటికి తలయేకాని శరీర మున్నట్లు తోఁపకుండెను. అంతట, "అయ్యో, నా శరీర మేమైనది?" అను నరేంద్రుని కేక విని, పెదగోపాలుఁడు ఆ గదిలోనికి వచ్చి, "నరేన్! ఏమది? ఇదిగో, ఇచ్చటనే యున్నదికదా!" యని చెప్పినను, నరేంద్రునకు నమ్మకము కలుగమిచే గోపాలుఁడు భయభ్రాంతుఁడై గురుదేవునికడ కేఁగుసరికి, ప్రశాంతముగా నాతఁ డిట్లు పలికెను: "అతనిని గొంతసేపు అట్లుండనిండు. అందులకై చాలకాలము న న్నాతఁడు వేధించియున్నాఁడు."

చాలసే పైనపిమ్మట నరేంద్రుఁడు బాహ్యప్రజ్ఞ నొందెను. ఆతని వదనము అనిర్వచనీయానందమును విరజిమ్ముచుండ, నేత్రకమలములు ప్రశాంతిలక్ష్మీనిలయములై భాసించుచుండెను. గురుసన్నిధి కేఁగినంతనే యాతని ముఖశ్రీ నవలోకించి యాతఁ డిట్లు పలికెను: "అమ్మ నీకిప్పుడు సర్వము చూపినదికదా! నీ యీ దివ్యానుభూతి ప్రస్తుతము తాళమువేయఁబడి, యా తాళపుఁజెవి నాయొద్ద నుండును. అమ్మపనిని పూర్తిచేసినపిమ్మట ఈ నిధి మరల నీవశ

మగును.'' కొన్నాళ్ళవఱకు ఆరోగ్యవిషయమై జాగరూకుఁడవై యుండుమనియు, ఆహారవిషయమున విశేషవిచక్షణతో మెలఁగుమనియు నరేంద్రున కాతఁడు ఉపదేశించెను.

తన యిష్టమంత్ర మగు రామమంత్రమును శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు నరేంద్రునకు ఉపదేశింప, రామభక్త్యానందప్రమత్తత నొందెను.

సింధురాష్ట్రమున పత్రికాద్వయ సంపాదకుఁడును, తనకు అత్యంతప్రేమపాత్రులలో నొకఁడును, తన్ను సందర్శింపవచ్చిన భక్తుఁడును నగు హీరానందుఁడు, "భక్తుఁడేల బాధపడును?'' అని ప్రశ్నింప, బాధపడునది శరీరమే యనియు, లోకులకు ప్రబోధము గల్గించుచు, వారల పాపభారమును తాను భరించుచుండుటయే తన బాధలకు కారణమనియు శ్రీరామకృష్ణుఁడు విశదీకరించెను.

తన్ను సందర్శింపవచ్చిన నాగమహాశయుని శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు గాఢాలింగన మొనర్చుకొనెను. మఱియొకనాఁడు గురుదేవుని ప్రశ్నకు సమాధానముగా నాగమహాశయుఁడు, "ఆహా! బాబా! నేను మీ వ్యాధి నివారణ చేయఁగలను. మీ కృపవలన ఇప్పుడే చేయుదును'' అనుచు, మహోజ్జ్వలభక్తి విశ్వాసములతో, గురుదేవుని వ్యాధిని తనలోనికి మార్చుకొనవలయునను మహాసంకల్పముతో సమీపించెను. శ్రీరామకృష్ణుఁడు ఆతని యుద్దేశము గ్రహించి, "ఔను, నీ వది చేయఁగలవని నాకుఁ దెలియును'' అనుచు నాతనిని వెనుకకుఁ ద్రోసివేసెను. ఏ నిగూఢభావముతో నాతఁ డటు లొనరించెనో యెవరి కెఱుక?

మఱియొకనాఁడు నాగమహాశయుఁడు గురుదేవుని గదిలోఁ బ్రవేశింపఁబోవుచు, ఆతఁ డొక యుసిరికకాయ తినఁగోరుచుండుట విని, అకాలమైనను వెంటనే వెళ్లి, రెండు నాళ్లు తదేకదీక్షతో తోఁటలెల్ల వెదకి, మూఁడవనాఁటికి ఎట్లో రెండుమూఁడు కాయలు లంకించుకొనివచ్చి గురుదేవునకు సమర్పించి యాతని నపరిమితానందభరితు నొనర్చెను.

నిర్యాణమున కెనిమిదితొమ్మిదినాళ్లు ఉన్నవనఁగా శ్రీరామకృష్ణుఁడు యోగీంద్రునిచే పంచాంగముఁదీసికొని ఆగస్టు తొమ్మిదవ తేదీకి సరియగు తిథినుండి తదనంతరతిథులను జదివించుచు, సౌరమాన శ్రావణమాసాంతమునకు వచ్చుసరికి, "చాలు"నని సంజ్ఞ యొనర్చెను. ఆ నిలుపుమనిన తిథియే నిర్యాణదిన మగునని యెవ్వ రెఱుంగుదురు!

శ్రీరామకృష్ణుని మహాసమాధి కిఁక మూఁడునాలుగు దినములు మాత్రమే మిగిలియున్నవి. నరేంద్రు నాతఁడు తన యొద్దకుఁ బిలిచి, యెదుటఁ గూర్చుండఁబెట్టుకొని తదేక దృష్టితో నాతనిఁ జూచుచు సమాధినిమగ్నుఁ డయ్యెను. ఇంతలో విద్యుత్కంపనమువలె నేదియో సూక్ష్మశక్తి తనలోఁ బ్రవేశించుచున్నట్లు నరేంద్రునకుఁ దోఁచెను. క్రమముగా నాతఁడును బాహ్యస్మృతిని గోల్పోయెను. స్మృతి వచ్చిన పిమ్మట నాతఁడు శ్రీరామకృష్ణుఁడు విలపించుచుండుట గని, ఆశ్చర్యచకితుఁడై కారణమరయ, నాతఁ డిట్లు పలికెను: "నాయనా! నేఁడు నా సర్వస్వము నీకు ధారపోసి పకీరు నైతిని! ఈ శక్తిచే నీవు లోకమునకు అపారమైన మేలు చేయుదువు; అటుపిమ్మటనే నీ నిర్గమనము." ఎవ్వారైన నొక

పుష్పము నిచ్చునట్లు, కానుక నొసఁగునట్లు, శ్రీరామకృష్ణుఁడు తన శిష్యాగ్రగణ్యునకుఁ దన సర్వస్వమును లోకకల్యాణమునకై ధారపోసెను. త్యాగమున కింతకంటె పరమావధి యెద్ది? శ్రీరామకృష్ణ నరేంద్రనాథు లీ మహాక్రియమూలమున అపూర్వైక్యము నొంద, తదీయవ్యక్తిద్వయవాహినీ సంయోగసంజనిత దివ్యప్రభావమే సనాతనధర్మసముద్ధరణ భారతదేశోద్ధరణముల కేకాక, మానవకోటి పునరుద్ధారణమునకును మహోత్తమసాధనభూతమై అచిరకాలముననే వివేకానందస్వరూపమున జగద్విలసిత మయ్యెను.

విశ్వాసము స్థిరపడుటకుముం దెంతవారికైనను అనేక శంకలు గలుగుచుండును. శ్రీరామకృష్ణుఁడు తాను అవతారమూర్తి నని తెలుపుచుండుటనుగూర్చి పై సంఘటనానంతరము రెండునాళ్లకు నరేంద్రుఁడు తనలోఁ దా నిట్లనుకొనెను : "ఈ దారుణశరీరయాతనలలోఁగూడ ఈయన తాను అవతారమూర్తి నని చెప్పఁగల్గినచో నమ్మెదను." అతివిచిత్రము, నరేంద్రుఁడు తన కీ భావము తోఁచినంతనే శ్రీరామకృష్ణుఁడు తన్ను (అనఁగా నరేంద్రుని) తిలకించి యిట్లు పలికెనని తెలిపియున్నాఁడు : "ఎవ్వఁడు రాముఁడో, ఎవ్వఁడు కృష్ణుఁడో, ఆతఁడే యీ శరీరమున నిపుడు రామకృష్ణుఁడు — మఱి యిది వేదాంతప్రకారము మాత్రమే గాదు సుమీ."[1]

---

[1] సర్వము బ్రహ్మమే, లేక బ్రహ్మస్వరూపమే యను సాధారణ అద్వైత వేదాంతతత్త్వము ననుసరించి మాత్రమేకాక లోకకల్యాణార్థము భగవంతుఁడు నిక్కముగా రామాద్యవతారములను దాల్చుచున్నాఁడను విశేషార్థమునఁగూడ నని భావము. (Refer 'Complete works of Swami Vivekananda,' Vol. 6, pp. 434-5.)

గురుదేవుని వాక్కులు అమోఘము లనుట కెన్నియో నిదర్శనములు కన్నులారఁ గాంచియు నిట్లు సందేహించినందు లకై నరేంద్రుఁ డెంతయో సిగ్గుపడి పశ్చాత్తాపము నొందెను.

అంత్యదినము — శిష్యభక్తకోటికే కాక లోకమున కంతకును అతిదుఃఖకరమైన దినము—పరుగెత్తుకొని వచ్చెను. బాధ తీవ్రతమ మయ్యెను. నాడి క్రమగతి తప్పెను. సూర్యాస్తమయమునకుఁ గొంచెము ముందు ఊఁపిరియాడుట కష్టముగా నుండెను. దుఃఖపరవశులై భక్తులు విలపించిరి. గురుదేవుని శయ్యాప్రక్కను వారు నిలుచుండిరి. సాయంకాలము ఆఁకలి కాఁగా, జావ నాతఁడు మిక్కిలి కొంచెము మ్రింగఁ గలైను. ఇరువురు గురుదేవునకు విసరుచుండిరి. అకస్మాత్తుగా నాతఁడు సమాధిస్థితుఁ డయ్యెను. శరీరము కొయ్యవాఱెను. నడిరేయి దాఁటిన పిమ్మట శ్రీరామకృష్ణుఁడు స్మృతి నొంది, చాల ఆఁకలి యగుచున్నదని, పరిచారకుల సాయమున లేచి కూర్చుండి, గిన్నెఁడు జావను అనాయాసముగాఁ ద్రాగెను. త్రాణ వచ్చినదనెను. ఇంత సులభముగా నాతఁడు ఆహారము గైకొని యెన్నియో నాళ్లైనది. నరేంద్రుఁడు నిద్రింపుఁడనెను. ఇటీవల లేని విస్పష్టస్వరమున శ్రీరామకృష్ణుఁడు అంతట ముమ్మాఱు కాళీనామము నుచ్చరించి మెల్లఁగాఁ బరుండెను.

ఆరాత్రి ఒంటిగంటపై రెండునిమిషములకు శరీరము జలదరింప, రోమములు నిక్కపొడుచుకొన, నాసాగ్రమున దృష్టి నిలువ, ముఖమండలము దివ్యమందహాసమున దీపింప, శ్రీరామకృష్ణజీవనజ్యోతి పరంజ్యోతితో ఐక్య మొందెను. యుగసంప్రదాయప్రవర్తకుఁడు, సర్వధర్మసమన్వయమూర్తి,

లోకాదర్శస్వరూపుఁడు శరీరము విడనాడి సచ్చిదానందపర బ్రహ్మైక్యము నొందెను. లోకమున కంతకును తీరనిలోపము సంభవించిన యానాఁడు వ్యయనామసంవత్సర (చాంద్రమాన) భాద్రపద బహుళద్వితీయా సోమవారము—1886-వ సం॥ ఆగస్టు, 16-వ తేది.

కాశీపురారామభవనము దుఃఖనిలయ మయ్యెను. ఆ వన మంతయు నాఁటిరాత్రి చంద్రకాంతిమయమై యుండినను, శిష్యభక్తహృదయసీమలను వెల్గొందఁజేసిన శ్రీరామకృష్ణచంద్రుఁడు అస్తమింప, నాఁడు వారికి సర్వము అంధకారమయమై తోఁచెను. గురుదేవునివలెఁ దమ్మెంకఁ బ్రేమించువా రెవ్వరు? పరమార్థమును అరఁటిపండొలిచినట్లు విప్పిచెప్పువా రెవ్వరు? తమ ముఖ్యప్రాణమిత్రము, తమ పరమాప్తబంధువు, తమ గురుదేవుఁడు తమ్ము వీడిపోవ, నిఁక మాకు దిక్కెవ్వరని వారు పొందిన దుఃఖము అపారము. "అమ్మా! కాళీ! ఏయపరాధముచేసితినని నన్ను నీవు విడనాడి పోతివి?" అని శ్రీశారదాదేవి యాతావునకు వచ్చి బోరన విలపించెను. సాక్షాజ్జగజ్జననియే శ్రీరామకృష్ణుఁ డను నామె భావము ఈ వాక్కులలో మాఱుమ్రోఁగుచున్నదికదా!

గిరీశరామచంద్రాదులు అనతికాలముననే వచ్చిరి. పరమహంస గతించెనను దుఃఖవార్త కలకత్తాపట్టణమం దంతటను కార్చిచ్చువలె వ్యాపింప, కడసారి పరమహంసదేవ ముఖావలోకనమునకై నానాదిక్కులనుండియు రాసాగిన జనులతో ఆ భవనప్రదేశమంతయు ఉదయముననే నిండిపోయెను. దివ్యకాషాయాంబరములతో, పుష్పచందనాదు

లతో శరీరము నలంకరించి సాయంకాల మైదుగంటలకుఁ గ్రిందికిఁ దెచ్చిరి. గురుదేవశరీరసన్నిధిని శిష్యభక్తబృందము నిలిచియుండ ఛాయాపటము తీయఁబడెను. భజనచేయుచు సద్గురుదేవశరీరమును సమీపమున నున్న బరా (వరాహ) నగరమందలి శ్మశానమునకుఁ గొనిపోయిరి. ఆ భక్తజనసమ్మేళనమున హిందూ బౌద్ధ క్రైస్తవ మహమ్మదీయాది మత పతాకలు వెలయుచుండె నన్నచో, శ్రీరామకృష్ణుని జీవితమున సర్వమతసామరస్యము ఎట్లు రూపు దాల్చెనో యూహింప నగును. గురుభక్తు లందఱును వచ్చి సాష్టాంగ వందనములు సల్పిరి. అంతట శరీరమును చితిపై నుంచిరి. త్రైలోక్యనాథ సాన్న్యాల్ సమయోచిత కీర్తనలు పాడెను. పరమపావనమైన యా శరీరమును దన కడుపున నిడుకొని పావకుఁడు ప్రజ్వలించెను. కొలఁది గడియలలో దహనకర్మము ముగిసెను.

పవిత్రసార్థకనామముచే, పవిత్రపరమాదర్శజీవితముచే, పవిత్రమహిమాన్వితవ్యక్తిత్వముచే అమృతాత్ముఁడైన యాతఁడు మరణించెననుకొనఁజెల్లునా? సశరీరుఁడై యున్నను, అశరీరియై యున్నను ఆ పరమపావనాత్ముఁడే కదా తమ జీవననౌకాధ్రువతార? లోచూపుచేఁ గనుఁగొనఁదగినదే కాని వెలిచూపునకు అందనిది కదా యాతని వ్యక్తిత్వము? రుద్రభూమినుండి మఱలునపుడు వారల యంతరంగమున నిట్టి భావపరంపరచే ప్రశాంతమైన ఆత్మసమర్పణభావము పాదుకొనెను. అవశిష్టపావనాస్థికలను ఒక తామ్రపాత్రలోఁ జేర్చి, "రామకృష్ణ భగవానునకు జయ!" యని జయజయ నినాదము లొనర్చుచు, వారు కాశీపురవనభవనమునకు మఱలిరి.

# శ్రీరామకృష్ణమఠ సేవాసంఘోదయము

గతించినది శ్రీరామకృష్ణుని భౌతికశరీరమే కాని యాతని లోకకల్యాణసాధనమహోద్యమము కాదు. దానిని బలు తెఱంగులఁ గొనసాగించు మహాశిష్యబృందము నాతఁడు లోకమున కొసంగియుండెఁగదా?

గురుస్మారకచిహ్నములైన అస్థికలను సముచితరీతిని భద్రపఱుచువిషయమున బాలశిష్యులకును గృహస్థభక్తులకును భేదాభిప్రాయములు కలిగెను. అందలి విశేషభాగము నిత్యపూజార్థము బాలశిష్యులు బలరామునింటికిఁ బంపిరి. సాధ్యమైనంత త్వరలో వానిని గంగాతీరమున నొక తావున సమాధి చేయవలయునని వారి సంకల్పము. స్మారకాస్థికలలో మిగిలిన భాగము కలకత్తాసమీపమందలి కాఁకురుగాచి యను పేఁటలో రామచంద్రునకుఁ జెందిన యొక తోఁటలో శ్రీకృష్ణజన్మాష్టమినాఁడు గృహస్థభక్తులు సమాధి గావింప, రామచంద్రుఁడు ఆ సమాధికి నిత్యపూజాదికము నెలకొల్పెను. బాలశిష్యులును ఈ సమాధికార్యమున విశేషశ్రద్ధాభక్తులతోఁ బాల్గొనిరి. శ్రీరామకృష్ణయోగోద్యాన మను నొక చక్కని శ్రీరామకృష్ణాశ్రమము శ్రీరామకృష్ణాలయసహితముగా కాలక్రమమున నిచట వెలసియున్నది.

శ్రీరామకృష్ణనిర్యాణానంతరము శ్రీశారదా దేవి కొందఱు శిష్యులును భక్తురాండ్రును తన్ననుగమింప, బృందావనమునకు యాత్ర నొనర్చి, తన దుర్భరదుఃఖము నచట

తీవ్రతపస్సాధనలలో మఱవఁబూనెను. శ్రీరామకృష్ణుఁడామెకు ప్రత్యక్షమై యిట్లు పలికెను: "ఎందు కింతగా విలపించుచున్నావు? ఎచటికిఁ బోతినని నీ యభిప్రాయము? ఒకగదినుండి మఱియొక గదికి—అంతే." ఒక సంవత్సరమైనపిమ్మట నామె కామార్పుకుర్ నకు మఱలెను. శ్రీరామకృష్ణుఁడు తన లోకశ్రేయస్సాధనమహోద్యమమున శ్రీశారదాదేవి నిర్వహింపవలయు పాత్రను గుర్తించి, "చుట్టు నున్న జనులు చీఁకటిలో నివసించు కీటకములవంటివారు, వారిని నీవు రక్షింపవలయును" అనియు, "లోకమునకై నీవు చేయవలసియున్న దెంతయో కలదు" అనియు నామెకుఁ దెలిపియుండెను. జన్మగ్రామమునను, కలకత్తాలోను ఆమె గడప సాగిన మహనీయజీవితము ఈ దివ్య వాక్య సాఫల్యమై దీపించెను. "భగవన్మాతృత్వమును లోకమునకు నిరూపించుటకై ఆయన నన్ను ఈ యిలలో దిగవిడిచిరి" అని యామెయే యొకప్పుడు తెలిపెను.[1] వేలకొలఁది జనులు

[1] నారీమణుల నవీన ప్రాచీనాదర్శములు శ్రీశారదాదేవియందు అద్భుతసమన్వయము నొందుట గాంచి, "శ్రీశారదాదేవి పురాణయుగమునకు భరతవాక్యమా, లేక నవీనయుగమునకు నాందియా?" యని సోదరి నివేదిత (Sister Nivedita) భావగర్భితముగాఁ బ్రశ్నించును. "భారతనారీత్వాదర్శమునుగూర్చి శ్రీరామకృష్ణుని పరమసిద్ధాంతమే శ్రీశారదాదేవి" యని యామెయే మఱియొకప్పుడు వక్కాణించెను. శ్రీ వివేకానందస్వామి తన సోదరశిష్యులలో నొకనికి, "అద్భుతమగు మాతృదేవి జీవితార్థము, జీవిత ప్రాముఖ్యము నీకు—నీకననేల—మీలో నెవ్వరికిని ఇంకను బోధపడలేదు; కాని క్రమముగాఁ దెలియఁగలదు....ఆమెను మూలాధారముగాఁ జేసికొని గార్గులును మైత్రేయు

—అందు పలువురు స్త్రీలు—ఆమెవలన ఉపదేశప్రబోధముల నొంది ధన్యత నొందిరి. శ్రీరామకృష్ణమఠసేవాసంఘో దయమునకు ఆమె యెట్లు మూలసాధనభూతురా లయ్యెనో, ఆమె మహోదారమాతృహృదయము ఎట్టిదో, ప్రసంగ వశమున నామె యొకప్పుడు పల్కిన యీ క్రిందివాక్కులు వేనోళ్లఁ జాటుచున్నవి:

(తన సన్న్యాసపుత్త్రుల యసౌకర్యము నుద్దేశించుచు) "అహా! నా బిడ్డలనుగూర్చి నేనెంతగా ప్రార్థించి కన్నీరు గార్చితినో కదా! అందుచేతనే, ఆయన యనుగ్రహమున, నేడు మఠము (శ్రీరామకృష్ణ మఠసంస్థ) వెలసియున్నది.... అపరిమితపరితాపముతో ఠాకురు నిట్లు ప్రార్థించితిని: 'ప్రభూ! మీరు ఆవిర్భవించి యీ కొలఁదిమంది సన్న్యాసశిష్యులతో మీ లీలలను నెఱపి తిరోహితులైతిరి; అంతటి తోడనే సర్వము చెల్లిపోయెనా? ఐతే, మీరు అవతరించి యంతటి మహావ్యథల ననుభవింపనేల? ఒక చెట్టు నీడనుండి మఱియొక చెట్టు నీడకు తమ 'నివాసము'ను మార్చుకొనుచు, ఆహారమునకై బిచ్చమెత్తు కొను సాధువులను కాశీబృందావనములలో ఎందఱినో చూచితిని. అట్టి సాధువులకు లోపము లేదు. ఇల్లు, వాకిలి మీ పేర విడనాడి, పిడికెఁడు అన్నమునకై యిందందుఁ దిరుగాడు నా బిడ్డలను జూచి సహింపఁజాలను —ఆదృశ్యమును భరింపఁజాలను. మీ పేర సంసారమును త్యజించువారి కెన్నఁటికిని అత్యావశ్యకమైన అన్నవస్త్రములకు లోపము లేకుండుఁ

---

లును లోకమున మరల ప్రభవింతురు....అందుచే నాకు మొట్టమొదటఁ గావలయునది ఆమె మఠము" అని వ్రాసెను. స్వామిమహాసంకల్ప సాఫల్యముగా శ్రీరామకృష్ణమఠసేవాసంఘసంస్థయందు నేఁడు ప్రత్యేక ముగా స్త్రీలశాఖ వెలసియున్నది. శ్రీశారదాదేవి మహత్త్వమును దెలుపుచు శ్రీవివేకానందస్వామి, "శ్రీరామకృష్ణునిఁ దెలిసికొనుట కంటె మాతృదేవినిఁ దెలిసికొనుట వేయిరెట్లు ఎక్కువ కష్టము" అనును. స్వయముగా శ్రీరామకృష్ణుఁడే యామె మహనీయతను బహురీతులఁ దెల్పును.

గాక యని నా ప్రార్థన. మీ ఆశయములను, ఆదర్శములను అవలంబించుచు, వా రందఱును గలసి నివసించుచుండ, తాపత్రయ పరిపీడితు లగు లోకులు వారిని ఆశ్రయించి మిమ్ముఁగూర్చి వినుచు, శాంతి నొందుదురుగాక! ఇందునిమిత్తమేకదా మీరు ఆవిర్భవించితిరి? వారట్లు తిరుగాడుచుండుట నా కెంతో బాధగా నున్నది.' అటుపిమ్మట నరేన్ (వివేకానందస్వామి) క్రమముగా వీనిని (మఠములను, సేవాశ్రమములను) అన్నిఁటిని నెలకొల్ప నారంభించెను.''

శ్రీరామకృష్ణుని బాలసన్న్యాసశిష్యుల యునికికై సురేంద్రనాథ మిత్ర మహోదారహృదయుఁడై వరాహనగరమున నొకయింటి నద్దెకుఁ దీసికొన, కాశీపురవనగృహము నుండి గురుశయ్యాదికము నచటికిఁ గైకొనివచ్చి, బాలశిష్యు లచట క్రమక్రమముగా నివసింపసాగిరి. బలరామునింటి నుండి పావనాస్థిసంచయమును దెచ్చి, గురుదేవుని ఛాయాపటముతో దాని నొకతావున నెలకొల్పి, వారు నిత్యపూజాసంకీర్తనాదు లొనర్చుచుండిరి. ఇండ్లకును, తమచదువులకును మఱలిన సోదరశిష్యులను నరేంద్రుఁడు గుర్వాజ్ఞ ననుసరించి తన మహాకార్యదీక్షతో, మహత్తరప్రబోధప్రసంగాదులతో, త్యాగాశయపూరితుల నొనర్చి వరాహనగరమఠమునకుఁ దోడ్కొనిరాసాగెను. ఈ సమయమునఁ ద న్నెట్లయినను ఇంటికిఁ దీసికొనిపోఁబూని వచ్చిన తన తండ్రితో రాఖాల్, ''మీరిచటి కెందుకు ఆయాసపడి వత్తురు? నే నిచట హాయిగా ఉన్నాను. నన్ను ఆశీర్వదించి పూర్తిగా నావిషయమై మఱచిపొండు. మిమ్ము గుఱించి నన్నును మఱచిపోనిండు'' అని పలికిన పలుకులు సామదానాదులచేఁ దమ్ము ఇంటికి లాగఁబూనిన తమ సంరక్షకులయెడ బాల

సన్న్యాసుల ధోరణికి మచ్చుతునకలు. ఈ విధముగా గురూప దేశముల నుపలక్షించి, సాక్షాత్కారమే పరమావధిగా నిడుకొని, సర్వసంగపరిత్యాగచిహ్నము లగు కాషాయాంబరములఁదాల్చి, యొండొరులయెడ మాతృప్రేమను మించిన ప్రేమతో మెలఁగుచు, నరేంద్రుని నాయకత్వమున వారు తపోధ్యాన సంకీర్తన సద్గ్రంథపఠనాదులతో కాలము గడపుచుండిరి. గిరీశ మహేంద్ర బలరామాదులును అప్పుడప్పుడు మఠమునకు వచ్చుచు బాలసాధుసోదరులకుఁ దోడ్పడసాగిరి.

వరాహనగరమఠమున బాలసన్న్యాసు లొనర్చిన మహోత్తమ తపశ్చర్యలనుగూర్చి నరేంద్రుని యీ క్రింది వచనములు మననీయములు: "ఆ కాలమున మఱుసటి దినమునుగూర్చి మే మెన్నఁడును స్మరించియెఱుఁగము.[1] అయాచితముగా భగవంతుఁడేమి ప్రాప్తింపఁజేయునో అదియే మా కాహారము. అనేక దినములు నిరాహారులమై గడపితిమి. అన్న ముండినచో ఉప్పు లేకుండెడిది. ఉడుకఁబెట్టిన దొండయాకులు, ఉప్పు, అన్నము—నెలలకొలఁది యివియే మాకు ఆహారము! నిరంతర తపోధ్యానాదికములచే భగవదావేశపూరితులమై గడపిన యా పుణ్యదినముల నేమని స్మరింతును! బ్రాహ్మముహూర్తమున లేచి, కాల్యములను దీర్చికొని పూజామందిరమున జపము ఆరంభించినచో, ఒక్కొక్కప్పుడు సాయంకాల మగుచుండెడిది. అంతవఱకును శశి మా భోజనమునకై కనిపెట్టుకొని యుండువాఁడు. ఆవశ్యకమగుచో

---

[1] "Think not of the morrow" అని యేసుక్రీస్తు మహాశయుఁడు బోధించును.

బలవంతముగా మ మ్మాతఁడు ధ్యానస్థితినుండి యీవలకు లాగుచుండెడివాఁడు! జగ త్తుండెనో, లేదో, అప్పు డెవరికి లక్ష్యము!"

శ్రీరామకృష్ణమఠ సేవాసంఘ మూలపురుషులగు వారల తపోధ్యానాదికము లెట్టివో వివేకానందస్వామి పలికిన యీ వాక్కులు ప్రకటించుచున్నవిక దా? **తపోధ్యానములే సనాతన భారతీయసంస్కృతిని గన్న తల్లులు; అఖండాత్మ** ప్రశాంతిదాయకమగు వేదవేదాంతములకు ఆలవాలములు; ఎన్నఁటికైనను విశ్వకల్యాణ మహాసాధనభూతమై యొప్పు భారతీయవిజ్ఞానమునకు పట్టుకొమ్మలు. స్వార్థరహితులగు మహాత్ములు తపోధ్యానముల నాశ్రయించి త్యాగాగ్నికీలలలో దుమికిననే వారిని గని లోకులు నిజమైన పారమార్థికచింత నొందుచుందురు. ఐహికభోగకాంక్షలను రేకెత్తించునట్టిది కాక, పరమార్థచింతను బురికొల్పునట్టి విద్యావిధానము—ఆత్మమోక్షజగత్కల్యాణ సాధనభూతమగునట్టి విద్యావిధానము—సోదరభారతీయులకు నేఁడు అత్యావశ్యకమైయున్నది. **నైతికధార్మిక శిక్షావిరహితమైన విద్యావిధానము అవిద్యావిధానమని భారతీయులు గుర్తింతురుగాక!**

అఖండ శ్రద్ధాభక్తులతో గురుపూజను నిర్వహించుచు, పరమప్రేమానురాగములతో సోదరశిష్యులను సేవించుచు ఎల్లరకును తల్లివలె నుండిన శశిభూషణునిగూర్చి, "మఠమునకు శశి మూలస్తంభము" అనియు, "తల్లి" యనియు, "ఆతఁడు లేనిచో మఠజీవనము అసాధ్యమైయుండెడిది" అనియు వివేకానందస్వామి ప్రశంసించును.

నేఁడు జగద్వ్యాప్తమై యలరారు శ్రీరామకృష్ణమఠ సేవాశ్రమములకు ఈ బరా(వరాహ)నగరమఠమే బీజము.

శ్రీరామకృష్ణనామక మహాశమంతకమణి లోకమున కొసఁగిన బంగారురాసు లనఁదగు ఆ బాలసాధువులు కాల క్రమమున శాస్త్రోక్తవిరజాహోమపూర్వకముగా సన్న్యసించినను, ఇప్పటికే సముజ్జ్వలత్యాగవైరాగ్యాదుల ఆదర్శసన్న్యాసులై విరాజిల్లుచుండిరి. శ్రీరామకృష్ణజీవిత నందనవనమందలి నానాకల్యాణగుణప్రసూనములలో ఈ బాలయతిశిష్యబృందమునఁ గొందఱు ఒక్కొక్కదానిని, మఱికొందఱు కొన్నిఁటిని తమ మహనీయజీవితములచే లోకమునకుఁ బ్రదర్శించిరని చెప్పనొప్పును. త్యాగవైరాగ్య సందీపితులగు వారికి సహజముగా పరివ్రాజకజీవితేచ్ఛ ప్రబలము కాఁజొచ్చెను. అంత నొకరి వెంబడి నొకరుగా మఠము వీడి, భారతపుణ్యక్షేత్రములను, మహాయోగులను దర్శించుచు, మహోత్తమనియమములతో, మహత్తర దివ్యానుభవములతో ఆసేతుహిమాచలము వారు యాత్రల నొనర్పసాగిరి. ఆదర్శగురుసేవానిరతుఁడగు శశి మాత్రము గురుపూజానిమగ్నుఁడై యుండి మఠమును వీడలేదు.

ఈ సమయమున (1893-వ సం॥న) అమెరికాయందలి చికాగోలో జరిగిన విశ్వమతమహాసభ (Parliament of Religions) కు వివేకానందస్వామి హిందూమత (సనాతనధర్మ) ప్రతినిధియై వెడలి, అఖండవిజయోపేతుఁడై, అశేష జనపూజితుఁడై, ఇంగ్లండ్, అమెరికా దేశములలోఁ దన మహోపన్యాస జైత్రయాత్రానంతరము భారతదేశమునకు

విచ్చేసి, ఆసేతుహిమాచలము సార్వభౌమసముచిత స్వాగతములను, యతిసార్వభౌమసముచిత పూజలను బొందుచు తన యశశ్చంద్రికలు ప్రాక్పశ్చిమఖండములం దంతటను అఖండవ్యాప్తి గాంచియున్న యా సమయమునఁ దన గురువరేణ్యుని మహత్త్వమునుగూర్చి పల్కిన యీ క్రింది వాక్కుల నరయుఁడు: "భావములచేఁగాని, వాక్కులచేఁగాని, క్రియలచేఁగాని నే నేమైనను సాధించియున్నచో, ప్రపంచమున ఏ యొక్కరికైనను ఉపకరించిన ఒక్క వాక్కు నా నోటినుండి వెలువడియున్నచో, అది నాదని నేను జెప్పుకోఁజాలను. ఆయనదే అది. కాని నా నోటినుండి యెన్నఁడైనను శాపాలాపములు వెలువడియున్నచో, నాయందుండి యెన్నఁడైనను ద్వేషము బయల్వెడలియున్నచో, అదంతయు నాదే, ఆయనది కాదు. దుర్బలమైన దంతయు నాదే; బలకరము, ఉజ్జీవనకరము, పరిశుద్ధము, పావనమునైయున్నదంతయు ఆయన దివ్యప్రేరణయే; అట్టివన్నియు ఆయన వాక్కులే, స్వయముగా ఆయనయే. ఔను, మిత్రులారా! లోక మింకను ఆ మానవోత్తముని దెలిసికోవలసియున్నది."

సాధుసోదరు లందఱును ఈలోపున ఆలంబజా అను పేటలోనికి మార్పఁబడియున్న మఠముఁ జేరుకొనిరి. అట నుండి మఠము మరల స్థలపరివర్తనము నొంది తుదకు 1899-వ సం॥న, కలకత్తాకు ఎగువ నించుమించు నాలుగుమైళ్లదూరమున నున్న బేలూర్ అను నుపనగరమున, సరిగా గంగాతీరమున, సువిశాలప్రదేశమున, వివేకానందస్వామిచే సుప్ర

శిక్షితమై, శ్రీరామకృష్ణసంస్థ కంతకును ప్రధానకేంద్రమై యలరారుచున్నది.[1] రెండేండ్లకు ముందే (1897–వ సం॥న) స్వామి విశ్వమానవసేవాలోకకల్యాణార్థము శ్రీరామకృష్ణ సేవాసంఘము (The Ramakrishna Mission) స్థాపించెను. ఆ సమయమున సోదరశిష్యులకు ఆతఁ డిట్లు ఉద్బోధించెను: "శ్రీరామకృష్ణుని శిష్యుల మగు మనము మన మోక్షము నకై ప్రాఁకులాడుట అత్యంత శోచనీయము. 'ఒక్క జీవికి సాయము చేయఁగల్గుచో, సహస్రపర్యాయములు కుక్కనై పుట్టుటకైనను సంసిద్ధుఁడను' అని గురుదేవుఁడు వక్కాణింప

1 బేలూర్ మఠప్రదేశమున నొకటియు కామార్పుకుర్ నందలి నివాసస్థలమున మఱొకటియు కాలక్రమమున నిర్మితమైయున్న శ్రీరామకృష్ణ దేవాలయములు దివ్యసుందరమై దీపించుచున్నవి. ఇందు బేలూర్ నందలి శ్రీరామకృష్ణాలయనిర్మాణమున కించుమించు ఎనిమిదిలక్షల రూప్యములైనవి. ఇందు విశేషభాగము ఇరువురు అమెరికాదేశీయ భక్తురాండ్రు ఒసఁగియున్నారు. ఈ దేవాలయ గర్భాలయమున నొకటిన్నర రెట్ల నిలువున చలువఱాతితో నిర్మితమై యున్న శ్రీరామకృష్ణవిగ్రహము జీవకళాప్రదీప్తమై సమున్నతమగు మంటపముపై–భావసమాధిస్థితిలోఁ–గూర్చుండియున్నట్లు ఒప్పుచుండును. ఈయాలయము శ్రీవిజ్ఞానానందస్వామి పర్యవేక్షణమున నిర్మితమై యున్నది. ఇందలి శిల్పసౌందర్యము వర్ణనాతీతము.

పావనప్రశాంతగంగాతీరమున, పుష్పవనసమీపమున వెలయు నీ శ్రీరామకృష్ణాలయమును సాయంసంధ్యాకాలమున, ఆరాత్రికసేవాసమయమున, పవిత్రతతో స్పందించు వాతావరణమున, తాళమృదంగాదులతో మనోహరసంకీర్తన జరుగుచుండునపుడు సందర్శించు పుణ్యాత్ములు అప్రయత్నముగాఁ దమ మనోభావములు ఆ సన్నివేశమున లయమొంద, మైమఱచి, లోకాతీతమగు నేదియో దేవలోకమున నుంటిమా యనిపించు ననుభూతి నొందుచుందురు.

లేదా? ఆ మహనీయునకు ప్రీతిపాత్రులమై యుండుటయే మోక్షము మనకు కరతలామలక మనుటకు నిదర్శనము. మీలో ప్రతి వ్యక్తియు ఆధ్యాత్మికసింహమని గుర్తింపుఁడు. మతధర్మముల నుద్ధరించునే మన ధర్మమని గ్రహింపుఁడు. ప్రతి జీవియు సాక్షాద్భగవత్స్వరూపమని గ్రహించి దరిద్రనారాయణులను, ఆర్తనారాయణులను అర్చించు విధానము లోకమునకు మనము చూపవలసియున్నది. భారతదేశమున నూతన సన్న్యాససంప్రదాయమును స్థాపించుటయే నా జీవితోద్దేశ్యము. జనసామాన్యము నుద్ధరించుటకై జీవితములను ధారపోయుటే యీ సన్న్యాసుల యాదర్శము." శ్రీరామకృష్ణదివ్యవాణియే వివేకానందవాణి యని గ్రహించి సోదర శిష్యులు వినమితశిరస్కులై స్వామి యాజ్ఞ లెట్టివైనఁ బరిపాలింప బద్ధకంకణు లైరి. లోకోద్ధరణార్థమేకదా శ్రీరామకృష్ణుఁడు తన యఖండాధ్యాత్మికశక్తిని నరేంద్రునకు ధారపోసియుండెను?

కాలక్రమమున సుప్రసిద్ధ శ్రీరామకృష్ణసేవాశ్రమములలో నొకటగు 'కాశీసేవాసదనము'ను జూచి, "స్వయముగా ఠాకుర్ ఇచట వెలసియున్నట్లు నాకు గోచరించినది: ఆయన వెలసియుండుటచేతనే యీ సేవాకార్యము లిచట జరుగుచున్నవి. ఇవన్నియు ఆయన కార్యములే — ఆయన సేవాకార్యములే"[1] యని స్వయముగా శ్రీశారదాదేవి వక్కాణించెనన్నచో, మానవసేవ—మాధవసేవ యను

[1] ఇచట సేవించుమించు రెండువందల పడుకలతో, సమస్తాధునిక పరికరములతోఁ గూడిన ధర్మచికిత్సాలయమున శ్రీరామకృష్ణ

శ్రద్ధాభక్తులతోఁ గూడిన మానవసేవ[1]—శ్రీరామకృష్ణమత సేవాశ్రమములలో నెంతటిప్రధానస్థానము వహించియున్నదో తెలియఁగలదు. 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ' యను సూత్రమే శ్రీరామకృష్ణమఠ సేవాసంఘు మూలసూత్రము.

నానావిధవిద్యాలయములు, అనాథబాలబాలికాశరణాలయములు, శ్రామికజనసేవాశ్రమములు, వైద్యశాలలు, మున్నగు సేవాసంస్థలమూలమునను, నానాదేశభాషలలో మత-వేదాంత-వైజ్ఞానిక-గ్రంథ-పత్రికా-ప్రచురణ మూలమునను, మత-ధర్మప్రచారమూలమునను—సర్వవిధములను-మానవసేవ—జాతిమతాదిభేదములను పాటింపక విశ్వమానవ

---

సేవాశ్రమ సన్న్యాసులు, బ్రహ్మచారులును దీనులు, ఆర్తులు నగు రోగులకు నానావిధసేవలను జేయుచుందురు. హరిద్వారసమీపనగరమగు కన్‌ఖల్, బృందావనము, ఢిల్లీ, రంగూన్ మున్నగు తావులలో నిట్టి శ్రీరామకృష్ణ సేవాసదనములు కలవు.

[1] శ్రీరామకృష్ణుఁ డిట్లు బోధించును: "కర్మమూలమున భగవదనుసంధానమే కర్మయోగము." "మొదట భక్తిని అలవఱుచుకొనుము. అటుపిమ్మట నీకు ఇష్టమైనయెడల మిగిలినవన్నియు, అనఁగా పాఠశాలలు, ఆసుపత్రులు మొదలైన వన్నియు నీవు ప్రారంభింపవచ్చును. మొదట భక్తి, తరువాత కర్మము. భగవద్భక్తి లేని కర్మము పునాది లేని గోడ, అది నిలువఁజాలదు." "ఔదార్యము, దయాళుత్వము, ఒరులయెడ సానుభూతి మున్నగువానిని నిష్కామముగా అవలంబించిన యెడల మంచిదే. వానితోఁబాటు భగవద్భక్తి యున్నచో, అవి నిన్ను భగవంతుని బొందించును." (చూ. 'శ్రీరామకృష్ణబోధామృతము'—భక్తి కర్మము నెట్లు పరిరక్షించును?) "మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ" ఇత్యాద్యుపనిషద్వాక్యములకు ఇదియే తాత్పర్యమని గ్రహింపనగును.

సేవ—చేయుటకై శ్రీరామకృష్ణసేవాశ్రమములు దేశ దేశాంతరములలో నెలకొల్పఁబడియుండుట జగద్విదితము.[1] మఱియు భూకంపములు, తుపానులు, వఱదలు, అగ్ని ప్రమాదములు, ఈతిబాధలు, సాంక్రామిక వ్యాధులు మున్నగు వానిచే జనులు పరిపీడితు లగునపుడు—తినఁ దిండియుఁ, గట్ట బట్టయు, నివసింపఁ గొంపయు లేక దీనజనసహస్రములు అల్లాడుచుండునపుడు—'వారి ప్రారబ్ధమునకు మన మేమి చేయుదుము!' అను మెట్టవేదాంతము చెప్పక, 'ఆత్మవ త్సర్వభూతాని' యను అనుష్ఠానవేదాంతము నవలంబించి శ్రీరామకృష్ణమఠసేవాశ్రమ సాధువులు శక్తికొలఁదియు వారిబాధలను నివారింపఁ బూనుచు, దీనార్తనారాయణసేవ చేయఁబూనుచుండుటయు లోకవిదితము. లోకోద్ధారకుఁడైన శ్రీరామకృష్ణుని దివ్యవ్యక్తిత్వమూర్తిమత్త్వములకు శ్రీరామ కృష్ణమఠసేవాసంఘుసంస్థలకంటె సుస్థిర-పావన-సజీవోజ్జ్వల-స్మృతిచిహ్నములు—స్థిరతర - పావన - సజీవోజ్జ్వల - భాష్య ములు—మఱేమి వెలయఁగలవు?

స్వీయమోక్షజగత్కల్యాణసాధన కెల్లరకును శ్రీరామ కృష్ణుని జీవితోపదేశములే దివ్యమార్గదర్శకములు. "రామ కృష్ణుఁడు సజీవాకృతిని దాల్చిన దివ్యత్వము....భగవ

[1] శ్రీరామకృష్ణమఠసేవాశ్రమ మహావృక్షము నేఁడు భారతదేశ మున మొత్త మించుమించు శతశాఖలతోడను, పాకిస్థాన్, బర్మా, సిలోన్, మారీషియస్, సింగపుర్, ఇంగ్లండ్, ఫ్రాన్స్, అర్జంటైన్, అమెరికా దేశములలో ఇంచుమించు నలుబది శాఖలతోడను వ్యాప్తి గాంచి శాఖోపశాఖలతో దినదినప్రవర్ధమాన మగుచున్నది.

త్సాక్షాత్కారభాగ్యము నొందుటకు ఈయన జీవితము మనకుc దోడ్పడcగలదు" అని గాంధీమహాత్మునివంటి మహాత్ములును, "మనకు ఆధారభూతమై యున్న శక్తికిని భావిభాగ్యోదయమునకును అతcడే (శ్రీరామకృష్ణుcడే) దివ్య నిదర్శనభూతుcడు: అంతటి మహనీయుని జననము మహా సంఘటనములకు నాంది"యని శ్రీఅరవిందయోగివంటి యోగు లును "పారమార్థికులకు రామకృష్ణపరమహంస-సందేశము హృదయోత్తేజకమై భాసించును...." అని శ్రీజవహర్ లాల్ నెహ్రూవంటి దేశనాయకులును వక్కాణింపలేదా?[1] వేయేల, సకలదేశస్థులకును సకల మతస్థులకును ఇహపర శ్రేయోమార్గ ప్రదీపకమై భారతీయ విజ్ఞానవియత్తలమున వెల్గొందు దివ్యతేజోమయధ్రువతార గదా శ్రీ రామకృష్ణ పరమహంస?

"భారతదేశపు గాలి నా మహాభాగ్యము, భారత దేశపు ధూళి నాకు పరమపవిత్రము, భారత దేశము ఇపుడు నాకు పావనతమపుణ్యక్షేత్రము....భారతవర్షము నా బాల్యడోలిక, యౌవననందనవనము, వార్ధక వారణాసి.... భారతవర్షము నశించెనా, ప్రపంచమందలి పారమార్థికత

[1] పరమహంసనుగూర్చి అరవిందయోగి యింకను నిట్లు ప్రశంసిం చెను: "ఇcక నైదువందల సంవత్సరములలోపున రామకృష్ణపరమ హంసవంటి మఱియొక లోకోత్తరపురుషుcడు ఆవిర్భవించుచో, ఆభార మును ఈలోకము భరింపcజాలదు. అతcడు మన కొసంగియున్న భావ రాశిని అనుభూతిగాc బరిణమింపcజేసికొనవలసియున్నది; ఆధ్యాత్మిక శక్తిని సిద్ధిరూపము నొందించుకోవలసియున్నది......సర్వసంగ్రహము రామకృష్ణపరమహంస.

యంతయు నశించును; నైతికధార్మికసంపద యంతయు నశించును; దివ్యానందదాయకమగు మతసానుభూతి యంతయు నశించును ఆదర్శజీవన మంతయు నశించును; వానితావున ధనమను పురోహితునితో, స్పర్ధావంచనా బలాత్కారములను నుపచారములతో, మానవాత్మయను బలితో, కామభోగముల నెడి స్త్రీపురుష దేవతలు ఏలుబడి సాగింతురు. కాని యట్టి దెన్నఁడును జరుగఁజాలదు.[1]... ద్వేషశక్తికంటె ప్రేమశక్తి కోటిరెట్లు ఘనతరము.[2]... నమ్ముఁడు నామాట—భారతదేశము ఉద్ధారణ నొందితీరును, జనసామాన్యమును, పేదలును సుఖవంతు లొనర్పఁబడి తీరెదరు—ఇది విధాయకము, ఈశ్వరాజ్ఞ, ఆనందింపుఁడు.... ఆధ్యాత్మికవాహిని బయల్వెడలినది. అపారము, అప్రతిహతము, సర్వావ్లావనమునై యా దివ్యవాహిని మన మాతృభూమిపైఁ బ్రవహించుట నాకు ప్రత్యక్షమై భాసించుచున్నది....మన భారతమాత మరల నిదురపోఁబోవదు; ఏ బాహ్యశక్తియు నామె నిఁక నిరోధింపఁజాలదు. అఖండ భారతశక్తి విజృంభించుచున్నది....భారతదేశపునరుద్ధారణము నకే శ్రీరామకృష్ణపరమహంస యాగమనము.... ఆతని జీవితము దివ్యజ్యోతి....ఆతఁడు శాంతిదూత.... ఆతఁడు ఆవిర్భవించిననాఁడే సత్యయుగము ఆరంభమై

[1] 'సనాతనధర్మము శాశ్వతముగా నిలిచియుండును' అని శ్రీరామకృష్ణుఁడు వక్కాణించును

[2] ప్రేమద్వారమగు అహింసచేత నేకదా భారతదేశము స్వరాజ్యము సాధించినది!

యున్నది....'' అను శ్రీరామకృష్ణ శిష్యాగ్రగణ్యవాణి—ధీర - వీర - గంభీర-సుస్థిరోదార-వివేకానందవాణి—ఘోషించుచున్నదిగదా! శ్రీరామకృష్ణాలయములలోను, జన్మదినోత్సవాదులలోను ఆతని స్తుతిపూజాదులతో మన కర్తవ్యము చెల్లిపోయిన దనుకొనక, మనఃపూర్వకముగా ధృత్యుత్సాహములతో శ్రీరామకృష్ణ మహోపదేశములను అవలంబించి ధన్యులమగుదముగాక!

ఓం తత్ సత్

శ్రీరామకృష్ణార్పణ మస్తు!

# అనుబంధము

## జాతకము

| | | | |
|---|---|---|---|
| శు 26 | | రా 3 | గు 6 |
| ల 3°-24<br>ర 24, చ 25<br>బు 24 | రాశి | | |
| కు 22 | | | |
| | కే 3 | శ 15 | |

స్వస్తిశ్రీ మన్మథ నామ సం॥ ఫాల్గున శుక్ల ద్వితీయా బుధవారమున (క్రీ.శ. 1836-వ సం॥ ఫెబ్రువరి 18-వ తేది) ఉదయము పూర్వాభాద్రపద నక్షత్రయుక్త కుంభ లగ్న శుక్రనవాంశమున, ఇంచు మించుగా గం. 5 ని. 15 లకు (సూర్యోదయమునకు పూర్వము ని. 12 లకు) వంగదేశమున కామార్పుకుర్ అను గ్రామమున శ్రీరామకృష్ణుఁడు జన్మించెను.[1]

| | | | |
|---|---|---|---|
| | | శ<br>రా | లగ్న |
| | రాశి | | |
| శు | | | కు<br>చం |
| ర<br>గు | బు<br>కే | | |

[1] శ్రీరామకృష్ణుని సహధర్మిణియగు శ్రీ శారదామణీదేవి ప్రమాదీచ నామ సం॥ మార్గశిర బహుళ సప్తమీ గురువారము (క్రీ.శ. 1853-వ సం॥ డిసెంబరు 22-వ తేది) సాయంకాలము ఉత్తరఫల్గునీ నక్షత్రయుక్త మిథునలగ్నమున గం. 6 ని. 52 లకు వంగదేశమున జయరాంబాటీ (జయరామవాటి) యను గ్రామమున జన్మించెను. జననకాలరవిమహాదశా శేషము 5 సం॥ 11 నెలలు 19 దినములు.

(అయనాంశ ఇంచుమించు 20°-34[1]) జననకాల గురుమహాదశాశేషము 13 సం॥ల 10 నెలల 12 దినములు.

ఈయన జననకాల గ్రహసంయోగమును సూచించుచు, అట్టి యోగమునఁ బుట్టిన వ్యక్తి యుగసంప్రదాయప్రవర్తకుఁడును, ధర్మజ్ఞుఁడును, మాననీయుఁడును, సదా పుణ్యకర్మనిరతుఁడును, దేవమందిరవాసియు, బహుశిష్యసమన్వితుఁడును, మహాపురుషసంజ్ఞితుఁడును, నారాయణాంశసంభవుఁడునై సర్వత్ర జనపూజ్యుఁ డగుట సునిశ్చయమని భృగుసంహితలో వ్రాయఁబడియున్నది.[1]

(పైనఁ దెలుపఁబడిన విషయములలో అధికభాగము శ్రీశారదానందస్వామి రచిత 'శ్రీ శ్రీరామకృష్ణలీలాప్రసంగ'(ము)నుండి క్రోడీకరింపఁబడినది. శ్రీరామకృష్ణుని జాతకము శ్రీనారాయణచంద్ర జ్యోతిర్భూషణ్ అను సుప్రసిద్ధ జ్యోతిషికునిచే గణింపఁబడినది.)

ఆత్మకారకుఁడగు సూర్యుని హోర, వేదాంతవిజ్ఞానకారకుఁడగు శని ద్రేక్కాణము, లలితకళాకారకుఁడగు శుక్రుని నవాంశ, సమస్త విద్యాకారకుఁడగు గురుని ద్వాదశాంశ — ఇత్యాదిశుభషడ్వర్గములను బొందిన కేవలమోక్షజ్ఞానహేతుభూతమగు కుంభలగ్నమున శ్రీపరమహంస జననము. ఇట్టి లగ్నకేంద్రమున ఆత్మమనోబుద్ధికారకులగు రవి చంద్ర బుధులు ఇంచుమించుగా ఒకే కళయందు (24 లేక 25 అంశలలో) లీనమై, బుద్ధిస్థానమం దున్న దేవగురుని విశేష

[1] "ధర్మస్థానాధిపే తుంగే ధర్మస్థే తుంగ ఖేచరే,
గురుణాదృష్టి సంయోగే లగ్నేశే ధర్మసంస్థితే.
కేన్ద్రస్థానగతే సౌమ్యే గురౌచైవ తు కోణభే,
స్థిరలగ్నే యదా జన్మ సంప్రదాయప్రభుః హి సః.
ధర్మవిన్మాననీయస్తు పుణ్యకర్మరతః సదా,
దేవమందిరవాసీ చ బహుశిష్యసమన్వితః.
మహాపురుషసంజ్ఞోఽయం నారాయణాంశసంభవః,
సర్వత్ర జనపూజ్యశ్చ భవిష్యతి న సంశయః."

వీక్షణము నొందుట శ్రీరామకృష్ణుని మనోనైర్మల్యనిశ్చలత్వములకును నిరుపమానబుద్ధివికాసమునకును అఖండ బ్రహ్మసాక్షాత్కారమునకును తార్కాణము. మఱియు వాక్స్థానమగు బృహస్పతిక్షేత్రమున శుక్రుఁడు ఉచ్చయందుండుట శ్రీరామకృష్ణుని దివ్యప్రేమమయ వాఙ్మాధుర్యమును, తత్త్వబోధనాశక్తిసంపన్నతను, దివ్యకంఠస్వరమును సూచించుచున్నది.

కళత్రస్థానాధిపతి యగు రవి లగ్నకేంద్రమున మిత్రులగు బుధ చంద్రుల సంయోగమున గురువీక్షణము నొందుటయు కళత్రకారకుఁ డగు శుక్రుఁడు ఉచ్చయందుండుటయు శ్రీ పరమహంస-సతీమణి యగు శ్రీశారదామణీదేవి పారమార్థికసంపద్వైభవమును ప్రకటించుచున్నవి.

లగ్నకర్మాధిపతులు ఉచ్చబలములను బొందియున్నను, ఆయుఃస్థానాధిపతియగు బుధుని స్థితి యనుకూలముగ నున్నను, పాపగ్రహములు కేంద్రగతములై తత్కేంద్రములు శుభవర్జితములై యుండుటచేతను అష్టకవర్గున గ్రహములు మధ్యమాయుర్బిందువులను బొందియుండుటచేతను జాతకుని ఆయుర్దాయము సుమారు ఏఁబదియేండ్లని విదితమగుచున్నది.

'కుజవత్ కేతుః' అను న్యాయమునను, స్వయముగా కేతువు వ్రణకారకుఁ డగు కుజునిక్షేత్రమం దుండుటచేతను కేతుదశాప్రారంభము నుండియు కంఠమున వ్రణము సూచితము.

తపఃకర్మమోక్షస్థానములందు గ్రహములు ఉచ్చయందుండుటయు మిగిలిన స్థానములందలి గ్రహములును దివ్యబలవీక్షణములతో భాసించుచుండుటయు కళత్రగ్రహస్థితియు తత్తుల్యమై యొప్పుచుండుటయు శ్రీ రామకృష్ణపరమహంస యుగసంప్రదాయప్రవర్తకుఁడై, ధర్మసమన్వయాచార్యశేఖరుఁడై, జగద్గురువరేణ్యుఁడై యవతరించిన దివ్యతేజోమూర్తి యని విశదీకరించుచున్నవి.

(సుప్రసిద్ధపండితులు, కీర్తిశేషులును అగు శ్రీ నూకల కృష్ణశాస్త్రిగారి పుత్రుఁడును శిష్యుఁడును, బరంపురము 'స్టేట్ బ్యాంక్'న ఒక ఉన్నతోద్యోగియు, మాకు ఆప్తుఁడును అగు శ్రీ నూకల సూర్యభగవానులు, బి.కామ్. గారు వ్రాసియున్న యీజాతకఫలములకు ఇది మా సంగ్రహకథనము.)

శ్రీరామకృష్ణుని జీవితము ఆతని జననమునకు చాలకాలము పూర్వమే సుప్రసిద్ధ కౌమార నాడీశాస్త్రమున [1] యథాతథముగా వ్రాయఁబడియున్నది. అందుండి ముఖ్యఘట్టములను మూల తమిళ పద్యములతోడను తదనువాదముతోడను దిగువఁ బొందుపఱుచుచున్నాము.

## తమిళపద్యానువాదము

ఈతఁడు (శ్రీ రామకృష్ణుఁడు) త్రికరణశుద్ధిగా సత్యనిష్ఠాపరుఁడై, సర్వజనులకును పరమపూజ్యుఁడై యొప్పును; లోకకల్యాణార్థమై జీవించును. తల్లికి నాలవకాన్పున, కామార్పుకుర్ అను నొక చిన్న గ్రామమున, ఉత్తర దక్షిణ దిశగా నుండు వీథిలో పూర్వాభిముఖ సింహద్వారముగల స్వగృహమున జన్మించును....

తన గయాయాత్రా సంస్మరణార్థము తండ్రి యీతనికి 'గదాధర్' అని పేరిడును.

...గొప్ప జ్యోతిషపండితులు ఆయింట సమావేశమై బాలకుని జ్ఞానమార్గ సంబంధమైన ఉజ్జ్వల భవిష్యత్తును గనుఁగొని తెల్పుదురు. 'ఈతఁడు లోకుల దుఃఖములను బాపును' అని వారు చెప్పఁగా, తల్లిదండ్రులు బ్రహ్మానందము నొందుదురు. బాలకుఁడు బాలచంద్రునివలె దినదిన ప్రవర్ధమానుఁ డగును.

ఇతరుల మాట వినక స్వబుద్ధితో ఈతఁడు తన అంతరాత్మకుఁ దోఁచినట్లు చేయును; ఐనను ధర్మమార్గమునే అనుసరించును. ఎవ్వరైనను ప్రేమతోఁ జెప్పినచో, విని వారియెడ వినయవిధేయతలు చూపును.

... (పది పండ్రెండేండ్ల బాల్యముననే) ఈతఁడు జ్ఞానజ్యోతిర్దర్శనము నొందును.

---

[1] ఇది కౌమార నాడీ జ్యోతిషనిలయము, 2, రాయపేఁట హైరోడ్, రాయపేఁట, మద్రాసున నివసించుచున్న శ్రీ T. చంద్రశేఖరన్ యొద్దఁ గలదు. హస్తరేఖా మూలమునఁగాని, జాతకమూలమునఁగాని యిందుండి యెవ్వరి జాతకమునైనను గ్రహింపనగును.

ఈ సమయమున (ఇరువది రెండేండ్ల ప్రాంతమున) ఈతఁడు తఱచుగా దేవీసాక్షాత్కారమును తన్మూలమున బ్రహ్మానందమును బొందుచుండును. దివ్యోన్మత్తస్థితిలో ఈతనికి దివ్యదర్శనములు లభించును. తద్దర్శనానందమున నీతఁడు ఆడుచు, పాడుచు నుండును. ప్రార్థనాదులలో తన్మయత్వము నొందుచుండును; ఉద్యోగము మానివేయును. ఈ సమయమున వివాహము జరుగును. ఈ మహనీయుఁడు ప్రపంచ దుఃఖస్థితి గ్రహించును.

ఈతని భార్యపేరు శారద. భర్తవలన ఈమె తత్త్వోపదేశము నొంది, శాస్త్రోక్త ధర్మనిష్ఠాపరురాలై యొప్పును. భర్తతో నివసించుచున్నను, ఈమె బ్రహ్మచర్యమును బరిపాలించుచు, కాళీ భక్తురాలై యుండును. తన పతి-పారమార్థికోద్యమమును ఈమె కొనసాగించును.

స్వభావసిద్ధముగా నీతఁడు ధనమును పెంటవలెఁ జూచును.

...ఉత్తమయోగ్యతగల శిష్యునికొఱకై ఈతఁడు అన్వేషించును. దానిని నరేంద్రుఁడు అను శిష్యునియందుఁ గాంచి యాతనికి సాధనా మూలతత్త్వ రహస్యములను ఉపదేశించును.

...(ఏఁబదియేండ్ల వయసున శ్రీరామకృష్ణుఁడు) శిష్యపరివేష్టితుఁడై తనువు చాలించి పరబ్రహ్మైక్యము నొందును.

# మూల తమిళపద్యములు

... ఇచ్చేయ్ ఉన్మైదన్నై,

మది త్తల్ సొల్ సెయలోడాహ మనక్కరుత్తుం నలవళియిల్
వదితల్ సిట్రూరిల్ తోట్రం వళంగుదల్ కామర్పుకుర్ ఎన్రై
ఆదిల్ అన్నైక్కీరర్ నూలిల్ అత్తనిన్ అహత్తిల్ తోట్రం.

తెన్ వడ దిశయాం వీధి దినకరన్ ఎదురుక్కుం వాయల్.

... తన్నై గదాధరనే యాహ వందిడల్ గయ్యై నినైప్పాల్.

... పెరుం వానరిజ్ఞర్ కూడి పిళ్ళైయిన్ జ్ఞానవళియిన్
మూరత్తు శాక్షియై నోక్కి 'తొలైందదు మక్కళ్ తున్బం'
పేరిన్బం పెట్రోర్ పాల్ పెరలివర్ ఇళ మదిపోల్
వరుదల్ ఇరండరై ఆన్డుళ్ మహాన్ సార్క్కలాద
మురణ్ బాడు ఉడయోనాహ మొళి ఇనుం అన్బుక్కిడంగుం.

... అద్వైదల్ మెయ్ నలియుమాహ ఆహుదల్ జ్ఞాన వెళిచ్చం.

పెరుగుదల్ అమ్మయిన్ శాక్షి పేరిన్బం వీణ్ నినైవినాలుం
శరవర ఆడిప్పాడి వణక్కం మదిమయక్కత్తాల్
పురి పని నీక్కముండాం పుగలుం ఇరండరై ఆన్డుళ్
తెరియుం ఉలగ వాణ్వీన్ తీంగుం మనమూదల్ ఇత్తుళ్.

శారదయాం అవళ్ పేర్ సాట్రల్ జ్ఞాన వళి మురై
తెరిదల్ అర నూల్ పట్రు తొడరల్ కనవరొత్తు
ఇరుందాలుం శాళి అన్బు ఇయక్కం వన్నియే యాహ
పురిందు అయింబాన్ వయదెన భువిమీ దిరుప్పాన్ ముట్రె.

పొన్నై కళిక్కడయాయ్ కరుదుం పొలివు.

... వలర్ నిలై అనుసరణాల్
నరేందిర నాహక్కాగ్గుం నవిలల్ సమయక్కురికోల్.

... తన్ ఉట్రార్ అరుహిలాంగాల్
తళువుం తన్ సిద్ధి ఆదల్.

# విషయానుక్రమణిక

(శ్రీరా. = శ్రీరామకృష్ణ లేక శ్రీరామకృష్ణుఁడు)

The Liberty Press, Madras-1

# కవిపండితవరేణ్యుల శుభాశయములు

...నిర్దుష్ట మృదుమధుర భాషా శైలీ విరాజమానమైనవి ఈ గ్రంథ కర్తగారి రచనానువాదములు... —శ్రీ కాశీ కృష్ణాచార్య

...విమర్శకచక్రవర్తి...కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారి శ్లాఘామోదముల నందిన మీ పూర్వ గ్రంథముల నిది రచనావైదగ్ధ్యమున...మించియున్నది. విషయౌదాత్త్యము రచనౌదాత్త్యముగా పరిణమించుట స్వాభావికమే కదా సిద్ధహస్తుల చేతులలో!

మీ గ్రంథము లన్నియు ఎన్నో పునర్ముద్రణము లందుచు ఆంధ్ర పాఠకుల పూర్ణాదరాభిమానముల నందియుండుట సర్వవిదితమే. ఇప్పటి ఈ గ్రంథము—మీ యీ స్వతంత్ర రచన—కూడ వానివలెనే—వాని కన్న నధికముగాగూడ—ఆంధ్ర పాఠకుల పరమాదరము నంది వారి జీవితములను ధన్యముల నొనర్చుగాక!

—శ్రీ క. మల్లికార్జునం

(మైలాపూరు, మద్రాసు శ్రీరామకృష్ణమఠ ప్రకటిత 'శ్రీరామకృష్ణలీలామృత' రచయితలలో ముఖ్యులు)

...splendid...most beautiful work of art...standard book on the subject...a classic of Telugu literature. ..

**—Sri D. S. Sarma**

...masterly biography of a Great Master...a unique religious classic...crowning glory....

**—Sri T. M. P. Mahadevan**

...ఈయన తెలుగు వచన రచన అత్యద్భుతం... ఆంధ్రప్రభ

...ఆదర్శవివరణ...సరళ సమగ్ర రచనాకౌశలం...ఆంధ్రపత్రిక

...a great service to Telugu literature...sweet, flowing yet dignified style...Telugu prose of surpassing beauty...emphasises the human aspect with admirable simplicity and grace...

**–Sri K. Ramakotiswara Rao–Editorial–Triveni, Oct.'57**

(ఇట్టి ప్రశంస లింకను ఎన్నియో కలవు.)